# రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు

(1981 ఏప్రిల్ 14 నుండి 19 వరకు)

మలేసియా ఆంధ్ర సంఘ రజతోత్సవం

## విశేష సంచిక

ప్రధాన సంపాదకులు
బీసెట్టి సూరయ్య
వేమూరి కామేశ్వరశర్మ




ప్రచురణ
అంతర్జాతీయ తెలుగు సంస్థ
బర్కత్‌పురా, హైదరాబాదు
ఆంధ్రప్రదేశ్

Rs. 15-00

# మా తెలుగు తల్లి

మా తెలుగు తల్లికి మల్లె పూదండ
మా కన్న తల్లికి మంగళారతులు

కడుపులో బంగారు కనుచూపులో కరుణ
చిరు నవ్వులో సిరులు దొరలించు మా తల్లి

గలగలా గోదారి కదలి పోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగు లిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపేల ముత్యాలు దొర్లుతాయి

అమరావతీ నగర అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై నిఖిలమై నిలచియుండేదాక
రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి కృష్ణరాయని కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగేదాక
నీ ఆటలే ఆడుతాం నీ పాటలే పాడుతాం
జై తెలుగు తల్లి! జై తెలుగు తల్లి!!



## విశేష సంచిక సంపాదక మండలి

శ్రీ బీసెట్టి నూకయ్య
శ్రీ వేమూరి కామేశ్వరశర్మ
శ్రీ ఎస్. బి. రెడ్డి
శ్రీ అచ్యుతరామయ్య
శ్రీ దాడి శ్రీరాములు
శ్రీ మండే లక్ష్మణ
శ్రీ నూకనాయుడు

# సంపాదకీయం

రెండవ ప్రపంచ తెలుగు మహాసభలకు ప్రపంచం నాలుగు మూలలనుంచి వచ్చిన ప్రతినిధులకు స్వాగతం. సుస్వాగతం. భారతదేశం బయట తెలుగువాళ్ళు ఎక్కువ సంఖ్యలో వున్న దేశాల్లో మలేసియాను పేర్కొనాలి. మలేసియాలో తెలుగు మహాసభలు జరగటం, దేశ దేశాల నుంచి ప్రతినిధులు ఇక్కడకు ఈ మహాసభలో పాల్గొనటంకోసం రావటం మలేసియా ఆంధ్రులకు గర్వకారణం.

తెలుగుభాష వివిధ దేశాలకు చెందిన ఆంధ్రులందరిని కలుపుతోంది. దేశం మారినా పౌరసత్వం వేరైనా భాషాపౌరసత్వాన్ని కాపాడుకుంటూ తమ తమ ప్రత్యేకతను నిలుపుకోవటం ఈ ఆధునిక యుగంలో ఒక ముఖ్యమయిన అభ్యుదయం. మెట్టిన దేశప్రజలతో కలిసిపోయి, సాంఘికంగా ఆర్థికంగా సాంస్కృతికంగా వారిలో ఒక భాగమైపోయి వుంటూనే తమ మాతృభాషనూ సంప్రదాయాలను విలువలను ఆంధ్రులు ఎలా నిలుపుకుంటున్నారో ఈ సందర్భంలో వెలువడుతున్న ఈ విశేష సంచికలో యీ దేశంలో వుంటున్న ఆంధ్రులు తమ ఈ ప్రయత్నాలు ఎలా చేసుకొన్నారో ఈ సందర్భంలో ఎదుర్కొన్న కష్టాలను ఎలా ఎదుర్కొన్నారో వివరించటానికి ప్రయత్నించారు. అదికాక, తెలుగు చరిత్రకు, సంప్రదాయాలకు చెందిన అనేక విషయాలపై ప్రముఖులు వ్రాసిన వ్యాసాలు పొందు పరిచాము.

ప్రపంచ తెలుగు మహాసభలతో పాటు మలేసియా ఆంధ్రసంఘం తమ రజతోత్సవం కూడ జరుపుకుంటున్నది. మలేసియా ఆంధ్ర సంఘానికి దేశమంతటా 15 శాఖలు వున్నాయి. ఈ రజతోత్సవ సందర్భాన్ని పురస్కరించుకుని, మలేసియా ఆంధ్రసంఘచరిత్ర, ప్రస్తుత కార్యకలాపాలతో పాటు యీ 15 శాఖల ప్రతినిధులు పంపించిన, ప్రత్యేక నివేదికలను కలిపి ఒక అనుబంధంగా చేర్చి ఈ విశేష సంచికలో ప్రకటిస్తున్నాము. మలేసియా దేశంలో ఉడుతా భక్తిగా ఆంధ్రభాషకు సంస్కృతికి మలేసియా ఆంధ్రులు చేసిన సేవ మిగిలిన దేశాల్లోనూ, భారతదేశంలో పలు ప్రాంతాల్లోనూ వున్న విదేశాంధ్రులకు, ప్రవాసాంధ్రులకు ఉత్తేజం ఇవ్వగలదని మా విశ్వాసం...

ఈ దేశంలో భాషా సాంస్కృతిక రంగాల్లో మాకు వున్న వనరులు పరిమితమైనప్పటికీ సాహసించి ఈ విశేషసంచిక ప్రచురణకు పూనుకొన్నాము. సహృదయతతో మా యీ ప్రయత్నాన్ని ఆదరిస్తారని ఆశిస్తున్నాము.

వేమూరి కామేశ్వరశర్మ
ప్రధాన సంపాదకుడు.

# విశేషసంచికను గూర్చి

అంతర్జాతీయ తెలుగు జనావళికి వందనములు.

1975–లో తొలి ప్రపంచ తెలుగు మహాసభలు ఆంధ్రప్రదేశ్ రాజధానియగు హైదరాబాద్ నగరంలో అతి వైభవంగా జరిగిన మహోన్నత దృశ్యము యింకా మన కనుల ముందు కనిపిస్తూనే వుంది.

ఆ శృంగార దృశ్యమునకు మెరుగు పెట్టించే విధంగా 14-4-1981 నుండి 19–4-1981 వరకు జరుగుతున్న రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు మలేసియా రాజధానియగు కౌలాలంపూర్‌లో ఏర్పాట్లు జరుగుచున్నవి.

ఈ చారిత్రాత్మక రోజులను పురస్కరించుకొని మేము వెలువడిస్తున్న ఈ విశేష సంచిక, (1) శుభాశీస్సులు, (2) వివిధ కమిటీల నిర్వాహకుల పట్టీలు, (3) వ్యాసములు, (4) మలేసియా ఆంధ్రసంఘ రజతోత్సవ విభాగము, (5) మలేసియా తెలుగువారి పరిచయ విభాగము-తో వెలువరించుటకు మేమెంతో ముదమొందుచున్నాము.

ఈ విశేష సంచికకు కావలసిన వ్యాసాలు, రచనలు, గేయాలు, తదితర విషయములన్నీ సకాలములో పంపించి మాతో అన్నివిధాల సహకరించిన మలేసియా తెలుగు మిత్రులకు, అంతర్జాతీయ తెలుగు సంస్థకు, శుభాశీస్సులు పంపించిన ప్రముఖులందరికీ విశేష కృతజ్ఞతాభివందనలు తెల్పుకొంటున్నాము.

మానవుని జీవితముతో జరిగే పలు విశేషాలు సంఘటనలు, నిత్యము, నిఖిలమై నిలిచిపోవుటకు తోడ్పడేవి వ్రాతపూర్వకమైన కాగితాలే. కాబట్టి తెలుగుజాతి చరిత్ర నిత్యజ్యోతిలా ప్రకాశించుటకు అంతర్జాతీయ తెలుగుజాతి, ఇటువంటి సంచికలు వెలువడించుట ద్వారా మన కీర్తిని చిరస్మరణీయం చేయగలదని ఆశిస్తున్నాను.

ఈ సంచిక ప్రచురణను చేపట్టి మనలను ప్రోత్సహించిన అంతర్జాతీయ తెలుగు సంస్థ వారికీ, ప్రత్యేకించి సంస్థ ఛైర్మన్ శ్రీ మండలి వెంకటకృష్ణరావు గారికీ, సంచిక ముద్రణను పర్యవేక్షించి సహకరించిన మిత్రులు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం (రీడర్, హైదరాబాదు విశ్వవిద్యాలయం) గారికి, ముచ్చటగా సంచికను ముద్రించిన నాగార్జున ప్రింటింగ్ వర్క్స్ వారికి ముఖ పత్రాన్ని ముద్రించిన ఉదయా ఎంటర్‌ప్రైజెస్ వారికి, ముఖపత్ర రచన చేసిన శ్రీ శీలా వీర్రాజుగారికి కృతజ్ఞతాభివందనములు.

మరోమారు అన్నివిధాలా సహకరించిన అందరికీ విశేష కృతజ్ఞతలు.

ఎందరో మహానుభావులు !

అందరికీ మా వందనములు !!

బీసెట్టి నూకయ్య

ప్రధాన సంపాదకుడు.




राष्ट्रपति भवन नई दिल्ली भारत

RASHTRAPATI BHAVAN NEW DELHI INDIA

January 6, 1981

I am glad to know that the Second World Telugu Conference will be held at Kuala Lumpur during April 1981.

There are many Telugu people living in many parts of the world and it is good to know that efforts are being made by Andhra Pradesh to maintain and strengthen cultural bonds with them. A continuous interaction between Telugu people living in India and abroad will contribute for the enrichment of Telugu language. The affection and love of Telugu speaking people living abroad, must be fully reciprocated by us.

I convey my greetings and good wishes for the success of the Second World Telugu Conference.

( N. SANJIVA REDDY )




VICE-PRESIDENT
INDIA
NEW DELHI

February 16, 1981

I send my best wishes for the success of the Second World Telugu Conference to be held at Kuala Lumpur, Malaysia from 14th to 19th April, 1981.

Sd/-

(M. Hidayatullah)

*Telegraphic Address:* PERDANA
*Telephone* No · K.L. 701198.



Kuala Lumpur

TIMBALAN PERDANA MENTERI MALAYSIA
*DEPUTY PRIME MINISTER MALAYSIA*

MESSAGE

First and foremost I would like to extend a warm welcome to all participants attending the Second World Telugu Conference which is to be held in Malaysia this time. I am indeed very happy that Kuala Lumpur has been chosen as a venue for this conference. This is a great honour to our country.

The theme selected for the conference, namely, 'Cultural Linkages Amongst the People of South and South East Asia' is a very appropriate one. I hope that the conference will bring about a better understanding of the close connection and unity of the cultures of South and South East Asia. Among other things, the objective of the conference should be to create greater appreciation for the cultural unity of the region.

I am delighted to learn that the five-day conference will feature a cultural exhibition as well as cultural events. It is my hope that these will add to the success of the conference.

I take this opportunity to invite all foreign participants to take time during the conference to see as much of our beautiful country as possible, especially the capital city, Kuala Lumpur.

Once again I take this opportunity to congratulate the Persatuan Andhra Malaysia for organizing the conference and wish the conference every success.

14th. March, 1981.

(DATO' SERI DR. MAHATHIR BIN MOHAMAD)

MENTERI KERJARAYA DAN KEMUDAHAN AWAM MALAYSIA
MINISTER FOR WORKS AND UTILITIES MALAYSIA



JALAN SWETTENHAM, KUALA LUMPUR 10-02 MALAYSIA • TEL: 03-984354 • TELEX: MA30415

MESSAGE FROM Y.B. DATO S. SAMY VELLU, MINISTER FOR WORKS AND UTILITIES MALAYSIA TO THE SECOND WORLD TELEGU CONFERENCE SOUVENIR PROGRAMME

It is with very great pleasure that I send this message to the Second World Telugu Conference Souvenir Programme to wish the conference all success. The conference hosts the Andhra Association of Malaysia, and the Conference Organising Committee under the Chairmanship of Dr. C. Appa Rao, are to be congratulated for undertaking such a major conference. I wish to congratulate all those who have devoted many weeks and months making preparations for this conference.

I believe that a conference of this nature will bring about a greater understanding of the rich cultural diversity of our part of the world, especially of our own country.

To allthose artists, scholars, writers and others who have come from foreign countries I extend a warm welcome to Malaysia. I hope your stay in Malaysia will be enjoyable and fruitful.

To the Andhra Association of Malaysia and the Conference Organising Committee I extend my good wishes.

I hope that the Conference will be a grand success and bring good name to Malaysia.

(DATO S. SAMY VELLU)
Minister
Works And Public Utilities
Malaysia



**DATO' SERI DR. MAHATHIR BIN MOHAMAD**
Hon'ble Prime Minister (Acting), Malaysia.



**DATO S. SAMY VELLU**
Hon'ble Minister for Works and Utilities,



DATO K. PATHMANABAN KMN, DSNS
Deputy Minister of Labour and Man Power, Malaysia.



DR. C. APPA RAO
President, Andhra Association of Malaysia



అమరజీవి
శ్రీపొట్టి శ్రీరాములు



ఆంధ్రకేసరి
శ్రీటంగుటూరి ప్రకాశం పంతులు



యుగకర్త
శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు



యుగకర్త
శ్రీ గురజాడ అప్పారావు



ఆం.ప్ర. మాజీ ముఖ్యమంత్రి
శ్రీ జలగం వెంగళరావు



ఆం.ప్ర. ముఖ్యమంత్రి
శ్రీ టంగుటూరి అంజయ్య



ఆం.ప్ర. సాంస్కృతిక శాఖామాత్యులు
శ్రీ భాట్టం శ్రీరామమూర్తి



అంతర్జాతీయ తెలుగు సంస్థ ఛైర్మన్
శ్రీ మండలి వెంకట కృష్ణారావు




**TIMBALAN MENTERI BURUH DAN TENAGA RAKYAT, MALAYSIA**

DEPUTY MINISTER OF LABOUR AND MANPOWER, MALAYSIA

*Telephones: K. L. 427777/424088*

*Telegrams: "MINLAB"*

250

TINGKAT 7, WISMA M P I.
JALAN RAJA CHULAN
KUALA LUMPUR 05-10


11hb Mac, 1981.

MESSAGE

*It is a singular honour forme to write this message for the Andhra Association of Malaysia in connection with its Silver Jubilee celebrations and the Second World Telugu Conference.*

*The fact that Malaysia has been given the distinction of hosting this World Assembly is an honour not only to our distinguished Telugu Community, but also to all Malaysians. That it coincides with the Andhra Associations Silver Jubilee is a tribute to the eminent work of the Association all these years. I congratulate the Association heartily. Southeast Asia has through the centuries, been the melting pot of the world's peoples and cultures. It continues to be an area of influence much sought after among the socalled big powers. The result has been that we have here a rich diversity of language, religion and culture and people, quite unknown elsewhere. In this process of the enrichment of Southeast Asia, the Indians have made perhaps the strongest contribution - evidence of which is manifest in the stone-sculptored splendour of Angkor Wat and Borobadur and the living language, religions and culture of the entire Southeast Asia.*

*In this process, the people of Andhra have had their fair share. Those of Andhra origin are to-day found in most walks of life in Malaysia, all proud of their traditions and richly deserving of their success. For that success has been buoyed by their rich origins and by dint of hard work.*

*The Telugu language and music has a distinctive sweetness and reputation. Their contribution to carnatic music is one that has endured over centuries. That it will continue to endure is shown, for instance, by the raving success of the movie "sangaraparanam" among Indian audiences, though its entire dialogue and music is in Telegu!*

*Problems and challenges, however, remain. The commitment to education and the will and capacity of the Telegus here to involve themselves in the mainstream of modern economic growth need to be considerably enhanced. I am sure the holding of the Conference here and the Silver Jubilee celebrations of the Association will help us focus on these issues as well.*

*I wish the Conference all success and our friends from overseas attending it a happy stay in our beloved Malaysia. I hope that they will carry with them something of the vibrance and visions of this multi-racial country, striving as one to provide a happier home to all. To the Andhra Association of Malaysia, I wish them a joyous Silver Jubilee and many more years of continued success.*

*(DATO K. PATHMANADAN KMN, DSNS)*

**Alladi Kuppuswami**
Chief Justice




Hyderabad.
February 16, 1981.

I am glad to learn that the Second World Telugu Conference is proposed to be held at Kuala Lumpur Malaysia in April 1981 and that the International Telugu Institute will be the co-sponsor of the Conference which is being hosted by the Andhra Association of Malaysia. I am also glad to learn that it is proposed to bring out a special number which will carry articles written by eminent scholars on various aspects of literary and cultural activities of the Telugus all over the world.

The Telugu language has had a very glorious history and there have been monumental works in that language. The language is growing and even to-day there are innumerable writers in Telugu language who can be compared favourably with eminent writers in other languages. In the field of arts and science also we, Telugus, have made significant contributions. I am very happy that it has been decided to conduct a conference in Malaysia of the Telugus spread over all the countries. The conference will enable Telugus who are bound by a common language and culture to get together and devise ways and means to strengthen this bond. I have no doubt that the conference will consider and discuss not only matters pertaining to Telugu language and culture, but will concentrate on how best we can serve mankind of which we are an integral part.

I am sure that the conference will be a success and will have the way for a glorious future for the Telugus all over the World.

Sd. Alladi Kuppuswami

పెండేకంటి వెంకట సుబ్బయ్య
పార్లమెంటరీ, దేశీయాంగ శాఖ ఉపమంత్రి



న్యూఢిల్లీ
ది. 11-2-1981.

మిత్రుడు శ్రీ కృష్ణారావుగారికి,

నమస్కారములు.

కోలాలంపూర్‌లో జరుగనున్న ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ఒక ప్రత్యేక సంచికను విడుదల చేస్తున్నందులకు మీకు నా హృదయపూర్వక ధన్యవాదములు. ఈ మహాసభ జయప్రదమగుటకు మీరు చేయుచున్న నిర్విరామకృషి శ్లాఘనీయము. మీ ఈ సేవను తెలుగు ప్రజలు సర్వదా జ్ఞప్తియందుంచుకొంటారని నా విశ్వాసము.

మన దేశములోని జాతీయ భాషలలో తెలుగు తృతీయశ్రేణిలో ఉన్నది. తెలుగు జాతి యశశ్చంద్రికలు మన దేశములోనే కాకుండా ఇతర దేశాల్లో కూడ వ్యాపించి ఉన్నదనుట చారిత్రక సత్యము. తెలుగు భాష మృదుమధురమైన భాష. 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అని ప్రఖ్యాతి గాంచినది. 'దేశభాషలందు తెలుగు లెస్స' అని ఆంధ్రభోజుడు శ్రీకృష్ణ రాయలు అభివర్ణించిన భాష. ఆదికవి నన్నయభట్టు, తిక్కన సోమయాజి, ఎఱ్ఱాప్రగడ ఆంధ్రీకరించిన మహాభారతము అన్ని భాషలలో అనువదింపబడిన మహాభారతమునకు తలమానికమైనది. త్యాగరాజు. శ్యామ్‌శాస్త్రి లాంటి మహాపురుషులు ఈ భాషకు అమరత్వము కలిగించినారు. తెలుగు ప్రజలు ఎన్నడు కూడ పరభాషయందు అసహనము చూపలేదు. తెలుగు భాష, సంస్కృతి భారతదేశ భాషకు, సంస్కృతికి దోహదము చేయుటకు ఎంతో తోడ్పడినది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ఈ కార్యక్రమానికి ఇతోధికమైన సహకారము అందజేయుచున్నందులకు చాల సంతోషము.

(సం) పెండేకంటి వెంకటసుబ్బయ్య

టంగుటూరి అంజయ్య
ముఖ్యమంత్రి
ఆంధ్రప్రదేశ్




హైదరాబాదు
5-4-1981

రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు మలేసియాలో జరగటం తెలుగువారంతా సంతోషింప దగిన విషయం.

మలేషియా ఆంధ్ర సంఘ రజతోత్సవాలను పురస్కరించుకొని అంతర్జాతీయ తెలుగు సంస్థతో కలిసి ఆంధ్రసంఘం సంయుక్త ఆధ్వర్యంలో ఈ మహాసభలను కోలాలంపూరులో నిర్వహించటం తెలుగువారి సహకార సహాయాలకు చక్కని నిదర్శనం.

ప్రపంచ మంతటా వ్యాపించియున్న తెలుగువారి ప్రతినిధులందరూ ఒకచోట కలిసి సాంస్కృతిక, సాంఘిక, భాషాసాహిత్య సమస్యలను గూర్చి చర్చించుకొని తెలుగువారి సర్వతోముఖమైన అభివృద్ధి వికాసాలకు పాటుపడటం ఎంతైనా అవసరం. ఆ లక్ష్యాన్ని ఈ మహాసభలు సాధిస్తాయని విశ్వసిస్తున్నాను.

రజతోత్సవం జరుపుకుంటున్న మలేసియా ఆంధ్ర సంఘం అచ్చటి తెలుగువారికి చేసిన సేవ ప్రశంసనీయం. మలేసియా తెలుగువారి అచంచల దీక్షకు, సేవా భావానికి, సాంస్కృతిక వికాసాభిరుచికి, మాతృ దేశ భాషాభిమానాలకు ఆంధ్రసంఘం ప్రతినిధిగా నిలుస్తుంది. రజతోత్సవ సందర్భంగా మలేసియా తెలుగు సోదరులకు ప్రపంచ తెలుగుప్రజల పక్షాన హృదయ పూర్వక అభినందనలను తెలియ పరుస్తున్నాను.

రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు తెలుగువారిమధ్య సమైక్య భావాన్ని, పరస్పర సహకారశీలాన్ని, అవగాహన శక్తిని, భాషా సంస్కృతులమీద అభిమానాన్ని పెంపొందించి, తెలుగు వెలుగును ప్రపంచ సంస్కృతులకు పంచిపెడుతుం దని గాఢంగా నమ్ముతున్నాను.

విశేష సంచికకు నా శుభాకాంక్ష లందజేస్తున్నాను.

నా పక్షానా, ప్రభుత్వ పక్షానా, ప్రజలపక్షానా మలేసియా తెలుగు సోదర సోదరీ మణులకు రజతోత్సవ అభినందలను అందిస్తున్నాను. తెలుగుతల్లి దీవెనలతో తెలుగువా రెక్కడ ఉన్నా వెలుగుబాటలో ముందజవేస్తూ అభ్యుదయ పరంపరలను సాధించాలని కోరుతున్నాను.

(సం) టంగుటూరి అంజయ్య.

**B. Venkatarama Reddy**

Minister for Education




Hyderabad

Date 14-2-1981

The rich heritage of Telugu people, their contribution to Indian thought, their creative participation in the evolution of its culture and their adventurous involvement in the expansion of its socio-economic dimentions form a significant part of the great Indian heritage, which has been influencing many shores overseas spiritually, culturally and technologically, from an ancient period. Evidently, Telugu people moved into South-East from the pre-Buddhistic times carrying the torch of our culture. The dawn of modern industrial civilisation widened still the avenues for their migration to several parts of the globe. Wherever they stay and to whatever land they dedicate their strength, Telugu brotheren never gave up their zealous efforts to retain their cultural identity and promote the image of their heritage. During my associaiton with the world-wide Telugu community for a period of over two years as the Chairman of the International Telugu Institute, I was thrilled and moved with joy by the amount of enthusiasm and devotion, they have towards their mother tongue, culture and state of origin.

I wish that this Second World Telugu Conference being held for thc first time outside the country, at Kuala Lumpur, Malaysia would provide an effective forum to discuss their educational, cultural and social needs and problems and strengthen their cultural linkages with all of us, the Telugu speaking people. I wish the Conference a grand success.

Sd-

(B. Venkatrama Reddy)

**Bhattam Srirama Murty**
Minister for Cultural Affairs




Hyderabad.
Dt. 14-2-1981.

MESSAGE

It is a matter of great satisfaction and pride for every lover of Telugu language and culture that the Second World Telugu Conference is being held at Kuala Lampur, Malaysia, a land to where we had carried the torch of our culture during the early Buddhist period.

India - in general and the land of Telugus in particular have had historical relations with South-East Asian Region; we introduced the cult of Ramayana, we conveyed the sagacious message of the Buddha's social awakening philosophy, we extended the art and handicraft technology through the adventurous maritime trade undertakings. The land of Trikalinga, a former synonym to Telugu region, was the radiating centre for the cultural and commercial expansion of 'Great India' and the South East Asian belt was the first fraternal receiver with a transforming experience. The shines of Kalingaandhra reflected in the waters of Indonesia. The sunkissed coastal belt was bridged up with South East through the techno-cultural enterprises.

This is indeed a privileged occasion, not only to visit our brothern who parted with us a century back, but also to review the traditional cultural linkages and draw inspiration from the past and shape our future in worthy of our great heritage. Let us hold aloft the melliflous image of our language and culture and make it endeared to the International brotherhood.

Sd. Bhattam Srirama Murthy

**M. V. Krishna Rao**
Chairman
International Telugu Institute.

Hyderabad.
March 5, 1981.

Dear Dr. Appa Rao,

I cannot express how happy I am at the long awaited Second World Telugu Conference now firmly set to be held from the 14th of April, 1981. This Conference though, belated has restored our faith that given the will and determination, there is nothing that we cannot achieve. While the present Conference is the Second in the series this is the first Conference being held outside India. You will, therefore, agree that the Telugus of Malaysia have secured for themselves the greatest honour of hosting the first World Telugu Conference outside India.

The Telugus in India are particularly pleased that though the Malaysia Telugus are economically not very well of compared to the Telugus in other more prosperous countries they have displayed a rare sense of sacrifice in undertaking this huge responsibility. In fact many in India wonder how the Malaysian Telugus would bear this strain. But having seen myself the spirit of the Malaysian Telugus I have always been of the view that they will do everything to see that the Conference is a great success.

This is going to be our second effort at revewing the cultural linkages with the country of origin and I am sure this will be followed by other Conferences where these links would become stronger. I am looking forward to this Conference to give direction for strengthening the cultural links particularly with the Telugus of South-east Asian countries. On behalf of the Telugus in India, on behalf of the International Telugu Institute which has a signal honour of co-sponsoring this Conference and on my own behalf I extend to you, the members of your Association and the Telugus of Malaysia my warm greetings and best wishes for the success of the Conference.

With kind regards,

Yours sincerely
Sd.
(M. V Krishna Rao)

**Dr. C. Appa Rao**
President, Andhra Association of Malaysia,
and Chairman, Conference Organising Committee.

## MESSAGE

The First World Telugu Conference was held in Hyderabad, India on a grand scale, and with great success. Encouraged by what we saw at the first conference, The Andhra Association of Malaysia offered to host the Second World Telugu Conference in Malaysia. After three postponements the long awaited conference is now a reality.

As a Chairman of the conference organising committee, and as President of the Andhra Association of Malaysia, I like to take this opportunity to thank the International Telugu Institutc for co-sponsoring this conference. My sincere thanks also to the Government of Andhra Pradesh, especially to Chief Minister Sri Anjaiah garu for all the support given to the conference.

I hope that the conference will prove to be worthwhile for the promotion of cultural understanding between the people of South and South-east Asia. I also hope that the conference will enhance the appreciation for cultural activities such as dance and music.

I extend a warm welcome to all our foreign guests and wish them a happy stay in our country. I hope you will come back again to visit our beautiful country many times.

I wish the conferenee and all the participants an interesting and enjoyable week.

Sd/-
(C. Appa Rao)

MESSAGES

A. Appanna / A. A. Naidu,
Secretary, Organising Committee
Second World Telugu Conference

10th, March 1981

On behalf of the Organising Committee I wish to thank The International Telugu Institute, Hyderabad for deciding to have the Second World Telugu Conference in Malaysia. The Chairman Dr. C. Apparao and the Sub-committee have toiled a couple of months to look into every aspect to make the Conference a success. Significant amount of assistance and support was also received from International Telugu Institute, The Andhra Association of Malaysia and other generous organisations in Malaysia. Having spent so much of valuable time and funds for this Conference I sincerely hope the aim of the Conference to share with orhers the fineness of the Telugu culture and heritage and to create a closer integration amongst the Telugus living throughout the World will be realised. Let us also hope our relationship and our interchange of ideas do not end with the Conference.

With this message of mine I wlsh a very warm 'Selamat Datang' to the Guests, Delegates, Artistes and Observers who are coming for the Conference and I hope their stay at Kuala Lumpur will be a memorable one.



Nethety Durgaiah,
Adviser,
Andhra Association of Malaysia.

I am honoured to be given this opportunity to send a message to the Souvenir Programme of the Second World Telugu Conference. I am proud to be one of the founder members of the Andhra Association of Malaysia. It was started in a small way back in 1955 with the aim of instilling a sense of cultural identity and importance of Education to the people of Telugu origin.

I am greatly impressed by the progress made by the Association over the last few years. Much of this credit goes to the younger generation who should be encouraged and given more responsibility.

I sincerly hope and pray the Andhra Association can achieve the goals which we dreamt of in those days.

I wish the Second World Telugu Conference all success.

మదిని సోమునాయుడు
గౌరవ ప్రధాన కార్యదర్శి
మలేసియా ఆంధ్ర సంఘము

8-3-1981

## శుభ సందేశము

మలేసియా ఆంధ్ర సంఘము తన రజతోత్సవమును మలేసియాలో రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు జరుగు శుభ సమయాన చేసుకొనుట ఎంతయో పొగడదగ్గదగును.

ఈ సంఘం పుట్టి ఎన్నో సాహసమైన కార్యాలు చేసింది. నెలకు యాభై కాసులు చందా వసూలు చేసిన సంఘం నేడు యాభై లక్షల వెండి విలువగల ఆస్తికి అధిపతిగా ఉందంటే ఆశ్చర్యం కాదా ? దీనికి కారణం తెలుగుజాతి పట్టుదల, ఐక్యం, నిస్వార్థ సేవయే యగును.

పుట్టింది మొదలు బాగాన్ దత్తో ప్రధాన కార్యాలయంగా యుండిన ఈ సంఘం, త్వరలో ఆఱు లక్షలు విలువైన తన క్రొత్త భవనానికి ప్రధాన కార్యాలయం మార్చుకోనున్న దని తెల్పుట కెంతో సంతోషపడుచున్నాను.

ప్రపంచ మున్నంత కాలం మలేసియా ఆంధ్రసంఘం ఉండి, ప్రపంచ ఆంధ్రులకూ, ముఖ్యంగా మలేసియా ఆంధ్రులకు చక్కని సేవ చేయాలని ఆశిస్తూ, నా తరపున, నా కుటుంబం తరపున శుభాకాంక్ష లందిస్తున్నాము.



R. P. Ramulu,
Hon. General Treasurer,
Andhra Association of Malaysia.

It gives me a great pleasure and honour to give this message on the occasion of the Second World Telugu Conferenee.

As is well known to the Andhras all over the world that the First World Telugu Conference was held in 1975 in Hyderabad, Andhra Pradesh with all pomp and gaiety. Many delegates from all over the world attented the said Conference, including 25 delegates from Malaysia. I wish to emphasise here that of all the foreign delegations, ours was the largest.

My impression of the First Telugu Conference was that the arrangements and its magnitude was never precedented in the history of Andhras. It vindicated the oneness of the Andhras living all over the world, apart from providing an opportunity in meeting at a common venue, to discuss and resolve the cultural, literary and educational problems confronting the Andhras.

Arising out of the successful conclusion of the First Telugu Conference, we, the Malaysian Andhras, were greatly encouraged to organise the Second World Telugu Conference in Malaysia. Though we were bestowed with the honour of organising it by the International Telugu Institute in 1978, we were very reluctantly compelled to postpone it a number of times owing to natural calamities. However, the conference is now a reality, and it is hoped that many local and foreign Andhras actively participate and make the conference a success.

Wishing all the participants a happy and enjoyable meet.

# రెండవ ప్రపంచ తెలుగు మహాసభ

## కార్యనిర్వాహక సంఘము

| | | |
|---|---|---|
| అధ్యక్షులు | : | డాక్టర్ ఆడారి అప్పారావు |
| కార్యదర్శి | : | శ్రీ ఎ. అప్పారావు (అప్పన్న) |
| ఆర్థికము | : | డాక్టర్ దయానంద |
| | | డాక్టర్ విజయన్ |
| | | శ్రీ ఆర్. పి. రాములు |
| ఆతిథ్యము | : | డాక్టర్ ఆడారి కృష్ణమూర్తి |
| బస-వసతి | : | శ్రీ వి. ఎన్. రామచంద్రన్ |
| ప్రచురణలు | : | శ్రీ బీసెట్టి నూకయ్య |
| రవాణా-యాత్ర | : | శ్రీ పి. ఎం. సుందరం |
| భోజనము | : | డాక్టర్ విజయన్ |
| | | డాక్టర్ దయానంద |
| | | శ్రీ కాళ్ళ పైడినాయుడు |
| వస్తుప్రదర్శనము | : | శ్రీ వి. ఎన్. రామచంద్రన్ |
| వైద్యము | : | డాక్టర్ కృష్ణమూర్తి |
| ప్రసారము-ప్రకటన | : | శ్రీ బాలకృష్ణ |
| ఛాయాచిత్రము | : | శ్రీ సూర్యనారాయణ |
| అతిథుల పట్టిక | : | శ్రీ ఎన్. బి. లక్ష్మణ |
| నమోదు | : | శ్రీ సూర్యనారాయణ |
| | | శ్రీ అప్పలస్వామి |
| అకడమిక్ కమిటీ | : | శ్రీ గంగాధరం |
| చలనచిత్రముల ప్రదర్శన | : | శ్రీ జె. యస్. మణియం |
| రక్షణ | : | శ్రీ ఆర్. లక్ష్మణ |
| అలంకరణ | : | శ్రీ నారాయణసామి |
| మలేసియా రాత్రి | : | శ్రీ బీసెట్టి నూకయ్య |
| చట్ట ఆలోచకులు | : | శ్రీ వి. ఎన్. హరికృష్ణ |
| మహాసభల కార్యాలయము | : | శ్రీ ఎ. అప్పారావు |

# రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు

## ప్రధాన పాలక వర్గము

| | | |
|---|---|---|
| అధ్యక్షులు | : | డాక్టర్ ఆదారి అప్పారావు |
| ఉపాధ్యక్షులు | : | డాక్టర్ మురిపిండి విజయన్ |
| సహాయ అధ్యక్షులు | : | డాక్టర్ నేతేటి దయానంద |
| | | శ్రీ పి. ఎం. సుందరం |
| | | శ్రీ ఎన్. అప్పలసామి |
| గౌరవ ప్రధాన కార్యదర్శి | : | శ్రీ మదిని సోమునాయుడు |
| సహాయ గౌరవ ప్రధాన కార్యదర్శులు | : | శ్రీ బీసెట్టి నూకయ్య |
| | | శ్రీ ఎ. సుబ్రమణ్యం |
| గౌరవ ప్రధాన కోశాధికారి | : | శ్రీ ఆర్. పి. రాములు |
| నిర్వాహక సభ్యులు | : | శ్రీ మహాలక్ష్మణ |
| | | శ్రీ రాజప్ప నాయుడు |
| | | డాక్టర్ ఎ. కృష్ణమూర్తి |
| | | శ్రీ ఎస్. అబ్దుల్ రహ్మాన్ |
| | | శ్రీ వై. ఆర్. నారాయణ |
| | | శ్రీ కె. ఎస్. అబ్రహాం |
| | | శ్రీ ఎ. కృష్ణమూర్తి |
| | | శ్రీ ఎం. ఎస్. మణియం |
| | | శ్రీ ఆర్. విశ్వనాథం |
| | | శ్రీ బి. అప్పలనాయుడు |
| | | శ్రీ ఎస్. రామునాయుడు |
| | | శ్రీ కురుములు నాయుడు |
| | | శ్రీ పెంటప్పుడు |
| | | శ్రీ ఎస్. ఇ. ఆర్. రెడ్డి |
| | | శ్రీ సీతారామ |
| | | శ్రీ సముద్రము |

రెండవ భాగం

# రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు

# కార్యనిర్వాహక కమిటీలు

# రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు

## కార్యాలయ కమిటీ

శ్రీ ఎ. అప్పారావు (అప్పన్న)-కార్యదర్శి
డాక్టర్ కృష్ణమూర్తి
శ్రీ బీసెట్టి నూకయ్య
శ్రీ ఆర్.పి. నాయుడు
శ్రీ సి. లక్ష్మణ
శ్రీ దాడి శ్రీరాములు
శ్రీ కొల్లి అబ్రహాం
శ్రీ నూకునాయుడు
శ్రీ అబ్దుల్ రహ్మాన్
శ్రీ కామేశ్వరశర్మ

## ఆర్థిక కమిటీ

డాక్టర్ దయానంద
డాక్టర్ విజయన్
శ్రీ అర్.పి. రాములు
శ్రీ బి.ఎ. నాయుడు
డాక్టర్ ఎ. కృష్ణమూర్తి

## ఆతిథ్య కమిటీ

డాక్టర్ ఆడారి కృష్ణమూర్తి
శ్రీ ఆర్.పి. నాయుడు
శ్రీ సూర్యనారాయణ (SEA)
కుమారి బృందాలత
శ్రీ తరిణి వరహాలు
బీసెట్టి నూకయ్య
శ్రీ ఎ. అప్పారావు (అప్పన్న)
డాక్టర్ మోహన్‌దాసు
శ్రీ అలీఖాన్
డాక్టర్ (శ్రీమతి) కృష్ణమూర్తి
శ్రీమతి దయానంద
డాక్టర్ (శ్రీమతి) విజయన్
శ్రీమతి అప్పారావు
శ్రీమతి రామచంద్రన్

## జన-వసతి సౌకర్యాల కమిటీ

శ్రీ వి.ఎన్. రామచంద్రన్ (అధ్యక్షులు)
డాక్టర్ సి. అప్పారావు
ప్రొఫెసర్ టి. మారిముత్తు
శ్రీ వి.ఎన్. హరికృష్ణ
శ్రీ ఎస్.సి. వడివేలు A.M.N.
శ్రీ జోసఫ్ సెల్వదురై (జయపురి
డాక్టర్ M.S. సుబ్రమణ్యం

## ప్రచురణల కమిటీ

శ్రీ వీసెట్టి నూకయ్య (అధ్యక్షులు)
శ్రీ బిత్తుమల
శ్రీ అచ్యుతరామయ్య
శ్రీ మదిని రామునాయుడు
శ్రీ సూర్యనారాయణ
శ్రీ వేమూరి కామేశ్వరశర్మ
శ్రీ ఎస్.బి. రెడ్డి
శ్రీ ఎ. అప్పారావు (అప్పన్న)

## రవాణా - యాత్రా కమిటీ

శ్రీ పి.ఎం. సుందరం (అధ్యక్షులు)
శ్రీ ఎస్.ఎస్. రామునాయుడు
శ్రీ ఎ.ఎ. అప్పలనాయుడు
శ్రీ ఎస్. శ్రీరాములు
శ్రీ ఎ. కృష్ణ
శ్రీ కె. సత్యనారాయణ
శ్రీ జి. అప్పలసామి
శ్రీ పి.ఎం. మార్కయ్య
శ్రీ ఎ. రాములు
శ్రీ ఎమ్.ఎస్. మణియం
శ్రీ తరిణి వర్రహాలు

## భోజన కమిటీ

డాక్టర్ విజయన్ (అధ్యక్షులు)
డాక్టర్ దయానంద
శ్రీ ఆర్.పి. నాయుడు
శ్రీ ఎస్.బి. రెడ్డి
శ్రీ ఒ.ఎస్. నాయుడు
శ్రీ కె.ఎ. రామునాయుడు
శ్రీ నారాయణరావు
శ్రీ ఈశ్వరుడు
శ్రీ పెంటినాయుడు
శ్రీ సన్యాసినాయుడు

శ్రీ అప్పారావు

## వస్తు ప్రదర్శనల కమిటీ

శ్రీ వి.ఎన్. రామచంద్రన్ (అధ్యక్షులు)
శ్రీ ఇన్చే షరుం బిన్ యుబ్(ఆలోచనకర్త)
(డైరెక్టరు-మ్యూజియం నెగారా-మలేసియా)
శ్రీ లిమ్ తౌంగ్ జువాన్
(కురేటర్ ఆఫ్ ఎగ్జిబిషన్-మ్యూజియం నిగారా -మలేసియా)
డాక్టర్ సి. అప్పారావు
ప్రొఫెసర్ కూ కేకిమ్
డాక్టర్ దండాయుధం
శ్రీ మదిని సోమునాయుడు
శ్రీ వై. ఆంజనేయులు (ఇండియా)

## వైద్య సలహా – సహాయాల కమిటీ

డాక్టర్ ఎ. కృష్ణమూర్తి (అధ్యక్షులు)
డాక్టర్ దయానంద
డాక్టర్ విజయన్
డాక్టర్ (శ్రీమతి) కృష్ణ
డాక్టర్ (శ్రీమతి) విజయన్
డాక్టర్ జయరామన్

శ్రీమతి (డాక్టర్) జయరామన్

## ప్రసారము - ప్రకటనల కమిటీ

శ్రీ వాలకృష్ణ

శ్రీ సూర్యనారాయణ

శ్రీ లక్ష్మణ

## ఛాయాచిత్రముల కమిటీ

శ్రీ సూర్యనారాయణ

శ్రీ అప్పలనాయుడు

శ్రీ రాజారాం

శ్రీ నరసింహరావు

శ్రీ ఆరుముగం

శ్రీ నడరాజా

శ్రీమతి లక్ష్మీరాజారాం

## అతిథుల పట్టిక నిర్వాహము

శ్రీ ఎస్. బి. లక్ష్మణ

శ్రీ శ్రీ బాల (అప్పలనాయుడు)

శ్రీ అప్పలనాయుడు

## ప్రతినిధుల నమోదు కమిటీ

శ్రీ సూర్యనారాయణ (అధ్యక్షులు)

శ్రీ టి. ఎమ్. అప్పలసామి

శ్రీ ఎస్. ఎమ్. బత్తి

శ్రీ ఎస్. మార్షయ్య

శ్రీ చంద్రారావు

శ్రీ సోమునాయుడు

కుమారి నాగమ్మ

కుమారి నరసమ్మ

కుమారి సుందరి

కుమారి జయంతి

కుమారి దేవి

కుమారి సుబ్బమ్మ

## సాహిత్య - కళాచార కార్యక్రమాల నిర్వాహము

శ్రీ బీసెట్టి నూకయ్య
శ్రీ బైరోజి నారాయణ
శ్రీ అచ్యుత రామయ్య
శ్రీ కొనతాల రామునాయుడు
శ్రీమతి వేమూరి హేమలతా కామేశ్వరశర్మ
శ్రీ పి. ఎస్. రామునాయుడు
శ్రీ వై. కృష్ణమూర్తి
కళావాహిని బృందం సభ్యులు

శ్రీ ఆడారి మార్రయ్య రావు

## అలంకరణ కమిటీ

శ్రీ నారాయణసామిరెడ్డియార్(అధ్యక్షులు)
శ్రీమతి రాధా అప్పారావు
శ్రీ కె. రామచంద్ర రాజు
శ్రీ కె. సి. ఆరుముగం P.J.K.
శ్రీ ఆర్. బాలసామి రెడ్డియార్
శ్రీ బీసెట్టి నూకయ్య

## సినిమా వైభవ కమిటీ

శ్రీ జె. యస్. మణియం
శ్రీ కె. ఎ. అప్పన్న
శ్రీ ఎ. దాలినాయుడు
శ్రీ ఎమ్. సుబ్రమణ్యం
శ్రీ వి. సుబ్రమణ్యం
శ్రీ వెంకట రమణ

కుమారి విమలాదేవి

## రక్షణ కమిటీ

శ్రీ లక్ష్మణ (పోలీసు ఇన్స్పెక్టర్)
శ్రీ వి. భరదన్

## ఎకడెమిక్ కమిటీ

శ్రీ ఇ. వి. గంగాధరం
శ్రీ వేమూరి కామేశ్వర శర్మ
డా॥ సి. అప్పారావు
డా॥ దండాయుధం
డా॥ ఎమ్. ఎస్. సుబ్రమణ్యం

## రజతోత్సవ నిర్వాహము

శ్రీ మదిని సోమునాయుడు
శ్రీ డాడి శ్రీరాములు
శ్రీ నేతేటి దుర్గయ్య
శ్రీ వి. కృష్ణమూర్తి
శ్రీ మండే లక్ష్మణ
శ్రీ కె. ఎన్. అబ్రహాం
శ్రీ గుమ్మడి అప్పల నాయుడు
శ్రీ బీసెట్టి నూకయ్య

# లెమ్మొ లెమ్మొ ఆంధ్రుడా!

**అల్లు సింహాచలరావు.** కెడా

లెమ్మొ లెమ్మొ ఆంధ్రుడా లెమ్మొ ఆంధ్రుడా!
మిన్ను విరిగి మీద పడినను ముందు సాగు ఆంధ్రుడా!
కన్నతల్లి తెలుగుతల్లిని ఎపుడు మరువబోకురా!
తేనెలొలుకు తెలుగుభాషను ధరణికంత చాటరా!

వీరజాతి ఆంధ్రజాతి అన్న పేరు నిలుపరా!
వీరవనిత రుద్రమాంబ పౌరుషాన్ని తెలుపరా!
కృష్ణరాయబాలరాజుల గన్న జాతి తెలుగురా!
తేనెలొలుకు తెలుగుభాషను ధరణికంత చాటరా!

తొల్లి తెలుగు వీరగాధలు తనివి తీరపాడరా!
ఆంధ్రజాతి ఆశయాలు అవనికంత చాటరా!
తెలుగుకీర్తి తెలుగుతేజం తనివితీర పాడరా!
తేనె లొలుకు తెలుగుభాషను ధతణికంత చాటరా!

దేశభాషలందు తెలుగుభాష లెస్స తెలుపరా!
గురజాడవారి తెలుగుజాడ ఇలకు నీవు తెలుపరా!
గుండుకు తన గుండె జూపె టంగుటూరి నీ వాడురా!
తేనె లొలుకు తెలుగుభాషను ఇలకు నీవు చాటరా!

# ‘దేశభాషలందు తెలుగు లెస్స’

## బి. గౌరీశంకర్

“దేశభాషలందు తెలుగు లెస్స” అని ఇటు ప్రాచ్యులచేత, “ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్” అని అటు పాశ్చాత్యులచేత సమాదరింపబడిన తెలుగు భాష ప్రపంచ భాషలలోని ఉన్నత భాషల సరసన చేర్చ దగినది.

భారతదేశంలో హిందీమాట్లాడేవారి తరువాత తెలుగు మాట్లాడే ప్రజల సంఖ్యే ఎక్కువగా ఉంది. అంటే భారతదేశంలోని భాషల్లో తెలుగు భాష రెండవస్థానాన్ని కలిగిఉందని చెప్పవచ్చు.

మానవజాతి తన మనోభావాలను, ఆలోచనలను, అవగాహనలను ఎదుటివారికి వ్యక్తపరచుకోడానికి భాష ఒక వాహికగా ఏర్పడింది. ప్రతిజాతికి తమదంటూ ఒక భాష ఉంటుంది. ఇది బాహ్యాకారంలో భిన్నంగా ఇవ్వేళ కనిపించినప్పటికీ, ఆదిలో భాషలన్నింటికీ మూలం ఒక్కటే అయి ఉంటుంది.

మానవుడు తన జీవనోపాధి కోసం పలుదేశాలు, ఖండాంతరాలు తిరుగుతూ తనకు అనువైన చోట స్థిరపడిపోతూ ఉంటాడు. ఇలా స్థిరపడిన మానవజాతి సమూహం ఒక సమాజంగా ఏర్పడుతుంది. ప్రపంచం లోని పలు ప్రదేశాలలో ఏర్పడిన ఈ సమాజాలు కొంతకాలానికి ప్రత్యేక దేశాలుగా ఏర్పడినప్పుడు, ఆ ప్రజలమధ్య రాకపోకలు, ఆదాన ప్రదానాలు స్తంభించినప్పుడు వారు మాట్లాడే భాషలో వైవిధ్యాలు ఏర్పడుతాయి. కొంతకాలానికి ఒకరు మాట్లాడే భాష, మరో ప్రదేశం వారికి అర్థం కానంతగా మార్పుచెంది. అవీ ఒక ప్రత్యేక భాషగా రూపొందుతాయి.

భారతదేశంలో ప్రధానంగా రెండు భాషాకుటుంబాలు కనిపిస్తాయి. ఒకటి ఆర్య భాషా కుటుంబం, రెండు ద్రావిడ భాషా కుటుంబం. తెలుగు భాష ఆర్యభాషా కుటుంబానికి చెందినది. ద్రావిడ భాషా కుటుంబానికి సంబంధించినదనే రెండు వాదా లున్నాయి. కాని, ఇటీవలి కాలంలోని పరిశోధనల వల్ల తెలుగుభాష ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన దనే అభిప్రాయమే బలపడింది.

ప్రతిభాషకు తనదంటూ ఒక ప్రత్యేకత ఉంటుంది. అదేవిధంగా మన తెలుగు భాష ఒక విలక్షణమైన, విశిష్టమైన ఒరవడిని కలిగి ఉంది. అయితే తెలుగు భాషకు ఆంధ్రి, తెలుగు, తెనుగు అనే పర్యాయ పదాలుకూడా వాడుకలో ఉన్నాయి. ఆంధ్రి, తెలుగు, తెనుగు అన్నవి నేడు జాతిపరంగా, భాషాపరంగా వాడబడుతున్నాయి.

క్రీ. శ. 10వ శతాబ్దానికి పూర్వం తెలుగు అనేమాట వాఙ్మయంలోగానీ, శాసనాలలోగానీ ఎక్కడా కని పించడంలేదు. బౌద్ధ, పాళీ వాఙ్మయాలలో ‘ఆంధ్ర’ అనే పదం కనిపిస్తుం దనీ, ఇదే క్రమంగా ‘ఆంధ్రి’ గా మారి ఉండవచ్చు నని పరిశోధక పండితుల అభిప్రాయం.

తెలుగులో ఆది కావ్యమయిన మహాభారతావత రణకు పూర్వం ఆంధ్ర అనే పేరుతో ఉన్నపదానికి తరువాతి కాలంలో తెలుగు, అనే పర్యాయపదాలు విరి విగా కనిపిస్తూ, క్రమేణా అవి ప్రాచుర్యంలోకి వచ్చాయి.

తెలుగు అనేపదం ఏర్పడడానికి, ఈ దేశం ఓంకార రూపంగా, దాక్షారామం, శ్రీశైలం, కాళేశ్వరం అనే మూడు పుణ్యక్షేత్రాలలోని త్రిలింగాలతో కూడి ఉన్నందున ఇది త్రిలింగదేశమనీ, క్రమేణ ఇది తెలుగు

దేశంగా రూపాంతరం చెందిందనీ; పూర్వం తెలాంగులు అనే జాతి వారు ఈ ప్రదేశాన్ని పరిపాలించినందున దీనికి తెలుగుదేశ మనే పేరు ఏర్పడిందనీ భాషాశాస్త్రజ్ఞు లభిప్రాయపడుతున్నారు. ఇక తెనుగు అనేమాట-తేనె అగు తెనుగు అనీ; అంటే ఈభాష తేనెలాంటి తియ్యదనాన్ని కలిగి ఉంది కాబట్టి తెనుగు అనబడిందనీ కొందరు అభిప్రాయపడుతున్నారు. ఏది ఎలా ఉన్నప్పటికీ మన తెలుగు భాష అజంత భాష కావడంవల్ల-అంటే అచ్చులతో అంతమయ్యే భాష- కాబట్టి, అది మధురంగా, కర్ణపేయంగా ఉంటుం దన్న విషయం అందరూ ఒప్పుకోవలసిందే.

అయితే తెలుగు భాష ఈనాడు ఇంతటి ఉత్కృష్ట దశకు చేరుకోవడానికి దీని వెనుక ఎందరో మహనీయుల కృషి ఉంది. తెలుగు దేశం అనేక వంశాల రాజుల ఏలుబడిలో అభివృద్ధి చెంది తేజరిల్లింది. తెలుగు దేశాన్ని మొట్టమొదట శాతవాహనులు పరిపాలించారు. తరువాత ఇక్ష్వాకులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు, ఆనందగోత్రీకులు, బృహత్పలాయనులు, పల్లవులు, చాళుక్యులు, కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగరరాజులు, నాయకరాజులు, బహమనీ సుల్తానులు, గోలకొండ నవాబులు, నిజాం ప్రభువులు, బ్రిటీషువారు వరుసగా పరిపాలించారు.

11వ శతాబ్దిలో చాళుక్య రాజైన రాజరాజ నరేంద్రుని ఆస్థానంలో ఉన్న నన్నయ భట్టారకుడు తెలుగు భాషకు మొట్టమొదట కావ్యత్వ గౌరవాన్ని ఆపాదించిన ఆదికవి. అప్పటికి ఒక మహాకావ్యానికి కావలసినంత పదజాలం, భాషా సామగ్రి లేని దశలో ఈ తెలుగు భాషను చేపట్టి, దాని కొక సమగ్రతను, సామగ్రిని ఏర్పరచి, ఆ భాషలో ఒక మహాకావ్య నిర్మాణాన్ని కొనసాగించాడు నన్నయ.అంతకు ముందు సంస్కృతం, ప్రాకృతం చెలామణిలో ఉన్న దశలో తెలుగులో ఒక కావ్యం వెలువడలేదు; ఎడనెడ శాసన పద్యాలు మాత్రం మిణుకు మిణుకు మంటూ ఉండేవి. భారతావతరణ నాటికి తెలుగు భాష ఒక గొప్ప తేజాన్ని, స్వయం ప్రకాశాన్ని పుణికిపుచ్చుకుంది.

తెలుగు భాష శక్తిమంతమై, సాహిత్యాన్ని పుష్టిమంతం చేయసాగింది. తెలుగు భాషలో ఎక్కువగా సంస్కృత పదజాలం కలిసి ఉండటంవల్ల ఇది సంస్కృత వాఙ్మయగతిలోనే, గీతిలోనే, రీతిలోనే తన నడకను సాగించింది. 'అలతి అలతి పదాల కావ్యశ్రీ సంధించిన రీతి! మందార మకరంద తియ్యందనాలను' కలిగి, తిక్కన, ఎర్రన, పోతన వంటి వారల చేతిలో, శ్రీనాథుని సీసాలతో తెలుగు భాషా సాహిత్యం అనేక సొగసులు తీరింది. సొబగుల వెలార్చింది.

ఆంధ్ర వాఙ్మయంలో స్వర్ణయుగంగా పేర్కొనదగిన శ్రీకృష్ణదేవరాయల కాలంలో తెలుగు సాహిత్యం ఛేచ్ఛటలు దిగ్దిగంతాల వ్యాపించాయి. రాయల కొలువులోని అష్టదిగ్గజ కవులు తెలుగు సాహిత్యంలో ప్రబంధ ప్రక్రియను పరిపుష్టం చేశారు. కర్ణాటక చక్రవర్తి, స్వయంగా కన్నడిగుడైన శ్రీకృష్ణదేవరాయలు తెలుగు భాషా సౌందర్యానికి ముగ్ధుడై 'దేశ భాషలందు తెలుగు లెస్స" అని చాటడమే కాకుండా తెలుగులో 'ఆముక్త మాల్యద' అనే ప్రౌఢ కావ్యాన్ని విరచించాడు. అటు తరువాత తంజావూరు, మధుర, పుదుక్కోట, చెంజి మొదలైన ప్రాంతాలను పరిపాలించిన నాయక రాజుల కాలంలో తెలుగు సాహిత్యం అనేక విధాలుగా పరిఢవిల్లింది. దాదాపుగా ఈ దశలోనే తెలుగు పదకవితలు వెలువడి, క్షేత్రయ్య, అన్నమాచార్యులు, త్యాగయ్య, రామదాసువంటి వాగ్గేయకారులవలన తెలుగు భాషా సాహిత్యాలు శాశ్వతతోబాటు సంగీత సురభిళాన్ని కూడా సవరించుకుంది.

భాష ఒక జీవనదివంటిది. అది నిరంతరం పారుతూ మార్పులకు లోనవుతూ క్రొత్త రూపాన్ని పొందుతూ ఉంటుంది.

17వ శతాబ్దిలో ఈస్టిండియా కంపెనీవారి రాకతో భారతదేశంలో సాహిత్యంలో కానీ, భాషలలో కానీ పాశ్చాత్య భాషా సాహిత్య సంపర్కం జరగ నారంభించింది. తత్ఫలితంగా ఆధునిక యుగంలో భాషా స్వరూపంలో బాహిరంగా అనేక మార్పులు వచ్చాయి. కందుకూరి వంటి సంస్కరణ వాదులు, గురజాడ వంటి నూతన కవితాప్రక్రియ నిర్మాతలు, గిడుగు వంటి భావోద్యమకారులు తెలుగు భాషను, తెలుగు

సాహిత్యాన్ని క్రొత్త దారి మళ్ళించారు. దాని ఫలితంగానే ఈనాడు సాహిత్యంలో వ్యావహారిక భాష చోటు చేసుకుంది.

2,500 సంవత్సరాల చరిత్ర కలిగిన తెలుగు జాతి, ఉత్తమమైన, ఉన్నతమైన సాహిత్యాన్ని నిర్మించిన తెలుగు భాష, సహజసంపదలకు కాణాచియై అన్నపూర్ణగా విలసిల్లుతున్న తెలుగు దేశం నిజంగా ప్రపంచ దేశభాషా సాహిత్యాలలోకెల్లా ఉన్నతమైనదని చెప్పడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. అందుకే అప్పయ్యదీక్షితుల వంటి మహానుభావులు 'ఆంధ్రుడగుటయు, ఆంధ్ర భాష చదువుటయు, బహుపూర్వ జన్మల లోని తపస్సు యొక్క ఫలము' అన్నారు.

ఇంతటి మహోన్నతమైన చరిత్ర కలిగిన మన భాషాసాహిత్యాలను, సంస్కృతి సంప్రదాయాలను మరింత పటిష్టవంతం చేసుకునేందుకు, వాటిని సదా పరిరక్షించుకునేందుకు ప్రతి తెలుగువాడు నిరంతరం శ్రమించవలసిన అవసరం ఎంతయినా ఉంది.

# స్వాగతం

## బాసెట్టి నూకయ్య

తెలుగుగడ్డనుండి వచ్చు అన్నయ్యల్లారా !
స్వాగతం, సుస్వాగతం, ఘనస్వాగతం !
మా అతిథులుగా మీ రుండి
మము గౌరవించండి

ఆంధ్ర నేల నుండి మా నాన్నలు-వారి నాన్నలు
వచ్చారు మా దేశం
వారి పుత్రులం, మనుమలం ఆహ్వానిస్తున్నాము
ఆప్యాయతతో, అభిమానంతో.

పాడి పంటల కిచట లోపాలు లేవు
బ్రతుకు బాటల కిచట అడ్డంకులు లేవు
ఆనందాని కిచట హద్దంటూ లేదు
సంతసముగ నున్నాము- మాసహచరులతో
మా దేశ సమైక్యతే మా లక్ష్యం
మా దేశ సౌభాగ్యమే మా ధ్యేయం !

మా మలేసియా దేశంలో లోపాలు లేవు
సకల సమూహములు పెరగొచ్చు తిరగొచ్చు
సకల భాషలు, కళాచారములు సంస్కృతులు
విలసిల్లుట కిచట అడ్డులు లేవు, వాటి
గౌరవ మర్యాదలకు లోపాలు లేవు
మాపరిపాలకులు మహమంచివారు-కాబట్టి
ప్రతివ్యక్తి స్వాతంత్ర్యం, రక్షించబడి,
పోషించబడింది.

మలేసియా దేశీయులం—తెలుగుతల్లి పుత్రులం
మా తల్లిభాష తెలుగు—అందుకే
అయినాము మీకు తమ్ములం.

తెలుగును పెంచా లని-తెలుగువారు పెరగా లని
తెలుగుసంస్కృతి నిలవా లని-తెలుగు కళాచారము విలసిల్లా లని
ప్రాకులాడుతున్నాం-విసుగు విరామం లేక
తిరుగులాడుతున్నాం. అందుకే అడిగాము-
ఆంధ్ర సర్కారుని.

కొన్ని విద్యా సౌకర్యాలకోసం
చదువుకున్న సమూహం మనదైతే
లోపాలు-కొఱతలు మటుమాయ మవుతాయి.

ఆకాశవాణిలో ప్రవేశపెట్టండి-తెలుగు
కార్యక్రమములు; తనివితీర వింటాం.

# ఆంధ్ర దేశంమీద భారత చరిత్ర ప్రభావం

## వేమూరి కామేశ్వరశర్మ

ఆంధ్రదేశం భారతదేశంలో ఒక భాగం. అలా ఉండటానికి మనం ఎప్పుడూ కాదనలేదు. ఆంధ్రదేశం రాజకీయంగా ఏకమైనప్పుడూ కానప్పుడూ కూడ ఆంధ్రదేశం భారతదేశంలో అంతర్లీనమైన భాగంగా ఉంటూవచ్చింది. విచ్ఛిన్నకరమైన ఆలోచనలకూ ధోరణులకూ ఉద్యమాలకూ ఎప్పుడూ దూరంగా ఉంటూ వచ్చారు. జాతీయ భాషకు జాతీయ సంస్కృతికి తమ భాషా సంస్కృతులతో పాటు సమానమైన గౌరవాన్ని ఆదరాన్ని చూపిస్తూ వచ్చారు.

### భారత దేశ చరిత్రలో ఆంధ్ర దేశం

భౌగోళికంగా కూడ ఆంధ్రదేశం ఉత్తర దక్షిణాలకు మహారాష్ట్ర దేశంతోపాటు మధ్యలో ఉండి రెండు ప్రాంతాలకు వారధి అయింది. ఆంధ్ర మహారాష్ట్రాలు ప్రక్క ప్రక్కన ఉన్నప్పటికీ చారిత్రక కారణాలవల్ల ఆంధ్రదేశం దక్షిణ భారతానికి కాస్త చేరువ అయింది. చరిత్రలో కాస్త వెనక్కిపోయి చూస్తే మహారాష్ట్రులకు కూడ దక్షిణ భారతంలో ఎంత సన్నిహిత సంబంధం ఉండేదో కన్పడుతుంది. అయితే వాళ్ళు అంతగానూ ఉత్తరానికి వ్యాప్తి చెందటంవల్ల (గుజరాతులోకి, మధ్యప్రదేశ్‌లోకి) దక్షిణ దేశంతో సంబంధం తెగిపోయింది. కాని, మనకు బ్రిటిషువారి ధర్మమా అని దక్షిణ భారతంతో సంబంధం గట్టిపడింది. క్లైవు కర్ణాటక రాజ్యాన్ని వశం చేసుకొని కాంపోజిట్ మద్రాసు స్టేటుకు పునాదులు వేశాడు. బుస్సీని ఓడించి కోర మండలం నిజాం రాజ్యాన్ని ఎలుక కొరికినట్లు కొరికి దత్త మండలాలు గుంటూరు జిల్లా కాజేసి తమిళ నాడుకు తగిలించాడు. ఫోర్టు సెంటుజార్జి మద్రాసులో వుండటంతో మద్రాసు ముఖ్య పట్టణం అయింది. అదే మచిలీపట్నం కనుక మొదటినుంచి బ్రిటిషువారి ఆధీనంలో వుండి వుంటే, అనగా ఫ్రెంచివాళ్ళ చేతుల్లో బ్రిటిషువాళ్ళు ఓడిపోకుండా వుంటే బహుశా మద్రాసు కున్న స్థానం మచిలీ పట్నానికి ఉండేదేమో !

ఏదైనా ఇదంతా గతించిన చరిత్ర. తిరిగి రానటు వంటి దిను. దక్షిణ భారతంలో సగానికి పైగా ఆంధ్ర దేశం కలిసి ఉండటంతో మిగిలిన 9 జిల్లాలు నిజాం రాజ్యంలో ఉండి అస్తిత్వం లేకుండా ఉండటంతో ఆంధ్రులు దక్షిణ దేశంతో కలిసిపోయారు. కాని, ఇదే విధంగా కన్నడదేశం కూడా మూడు ముక్కలైనా ప్రధాన భాగం మైసూరు రాజ్యంలో వుండటంచేత వారి అస్తిత్వం అంతగా దెబ్బ తినలేదు.

ఇప్పుడు ఇదంతా చెప్పటం - మనం తమిళులతో కలిసి వుండటం వలన ఏదో నష్టపోయామని కాదుకాని మనమీద మద్రాసీ ముద్ర పడటానికి మటుకు ఈ చారిత్రక నిజాలే కారణం. ముఖ్యంగా ఆంధ్ర దేశం దాటి బయటకు వెడితే ఈ సమస్య ప్రతి ఆంధ్రుడికీ ఎదుర్కొంటుంది.

ఇది ఇట్లా వుంచి, మన ఆంధ్రదేశం చారిత్రక, ఆర్థిక, సాంఘిక రాజకీయ పరిమాణాల్ని భారతదేశ చరిత్ర ఎంతవరకూ ప్రభావం చేసిందో పరిశీలిద్దాం. ఆదిలో శాతవాహనుల దగ్గర్నుంచి ఎత్తుకుంటే శాతవాహనులు వింధ్యకు, ఇవతలి భూభాగాన్ని అంతా ఏకం చేసి పరిపాలించారు. ప్రాకృతపైశాచీభాష లా కలియికతో సామాన్య జనులు వాడుక కోసం సంస్కృత భాష కాక మరొక భాష అమలులోకి వస్తున్న రోజులు అవి. దక్షిణంలో అది ద్రావిడభాష ప్రాకృత పైశాచీ సంస్కృత భాషలు-అన్నీ కలిసి కొత్త భాషల్ని రూపొందిస్తున్నాయి. ఇది ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క రకంగా పెరుగుతున్నది.

## పురాణ యుగం

పురాణ యుగం Aryanisation అయిపోయి బౌద్ధజైనయుగాలు, ప్రబలంగా వున్న రోజులు, ఆర్యనైజేషను కాలంలో ఆంధ్రులే మొదట దెబ్బ కాచారు. ఆర్య సంస్కృతిని జీర్ణించుకొన్నారు. అగస్త్య మహాముని తిరిగి ఉత్తర భారతం వెళ్ళాడో లేదో తెలియదు కాని ఆంధ్రదేశంలో ఆయన యొక్క ప్రభావం చక్కగా కన్పిస్తుంది. తర్వాత వ్యాసుడు- బహుశా దక్షిణ భారతం వెళ్ళమంటే వెళ్ళనని మొరాయించేదేమో- పరమశివుడు ఈయనకు కాశీలో భిక్ష పుట్టకుండా చేసి మరి పంపించాడు, దక్షిణ కాశికి. అప్పటికే అగస్త్యుడు అక్కడ వున్నట్టుంది. ఆయనతో చెప్పుకొని హృదయభారం దింపుకొన్నాడు. ఆంధ్రదేశంలో వేదాధ్యయనం సంస్కృత పదాలు భాషా ప్రచారం ఎక్కువగా జరిగినట్లు కన్పిస్తుంది. ఆంధ్ర భాషలో సంస్కృత పదాలు అంత ఎక్కువగా వుండటానికి అదే కారణమేమో ! అలాగే పురాణగ్రంథాలు సంస్కృతకావ్యాలు, ఆంధ్రదేశంలో బహుళ ప్రచారం పొందాయి. భారతాన్ని తెలుగులో ఇప్పటికి దాదాపు 1000 సం॥ కితమే వ్రాశారన్నా కవికుల గురువు కాళిదాసు కావ్యాలమీద మల్లినాధసూరి వ్యాఖ్యానం వ్రాశాడన్నా - అంతకు పూర్వం ఎంతో కృషి జరిగి వుండాలి కదా...

## శాతవాహనుల తర్వాత

బౌద్ధ మతానికి ఆంధ్రదేశం తక్కువ చేసిందా. నాగార్జునుడి శూన్యవాదం కదా బౌద్ధమతానికి, తర్వాత శంకరాచార్యుల అద్వైతానికి కూడా పునాది అయింది. దేశంలో అంతటా పోయేటప్పటికి ఆంధ్రదేశంలోనూ పోయింది బౌద్ధమతం, శిల్పాలు మటుకు మిగిల్చి. తర్వాత మళ్ళీ శాలంకాయనులు వారి తర్వాత విష్ణుకుండినులు బౌద్ధమతాన్ని హిందూమతాన్ని ప్రోత్సాహించారు. తూర్పు చాళుక్యులు వచ్చి హిందూమతానికి పూర్తి ప్రాముఖ్యత యిచ్చి నిలబెట్టారు. రాజకీయంగా చూస్తే చాళుక్యులనుంచి చోళులవరకు నాలుగై **దువందల** ఏళ్ళు తెలుగు తమిళ దేశాలు రెండూ ఏకమయ్యాయి. ఎవరుమీద ఎవరుక్రింద అని కాక పరస్పరం ఇచ్చి పుచ్చుకున్నారు. అప్పుడే తూర్పు కోస్తానుంచి ఓడల మీద ఆగ్నేయాసియా వెళ్ళి రాజ్యాల్ని స్థాపించారు. వీళ్ళకు దారిచూపించింది బౌద్ధులే. నాగార్జునునికాలంలో బుద్ధఘోషు డనే బౌద్ధాచార్యుడు సింహళం వెళ్ళా డని తెలుస్తున్నది. కళింగదేశంనుంచి ఉత్తర ఆంధ్రనుంచి ఓడలలో బంగాళాఖాతం మీద ప్రయాణం చేసి ఆగ్నేయాసియా దేశాలన్నిటితోనూ సన్నిహిత సంబంధాలు పెట్టుకున్నారు. ఈ నౌకా నిర్మాణం కూడ ఆంధ్ర దేశంలో జరిగినదే.

## కాకతీయ సామ్రాజ్యం

అయితే శాతవాహనుల తర్వాత మళ్ళీ ఆంధ్రదేశాన్నంతా ఒకే రాజ్యం క్రిందకు తీసుకువచ్చిన నాథుడు లేనందువల్ల ఈ కాలంలో మనం సాధించిన కార్యాలకు తగిన రాణింపు లేకుండా పోయింది. కాని, కళింగ రాజ్యం ఆంధ్రులదే- ఉండటం ఒరియా దేశంలో వున్నప్పటికీ ఆ సమయంలోనే జరిగింది కాకతీయసామ్రాజ్య ఆవతరణ. ఇది తెలుగువారి చరిత్రలో ఒక ముఖ్యమయిన ఘట్టం. నిఖార్సుగా తెలుగురాజ్యం అని చెప్పకోతగ్గ రాజ్యం కాకతీయ రాజ్యం. ముసునూరి కాపయ నాయకుడు మిగతా రాజుల్ని అందర్ని కూడగట్టుకొని తురకల్ని ఎదిరించటం భారతదేశ చరిత్రలో సువర్ణాక్షరాలతో వ్రాయవల్సిన ఘట్టము. ఉత్తర భారతంలో రాజులందరూ ఒకళ్ళతో ఒకళ్ళకు పడక కొట్టుకువచ్చి తురకల్ని రానిచ్చారు. వచ్చిం తర్వాత వాళ్ళకు పట్టపగ్గాలు లేకుండాపోయాయి. ఉత్తర భారతదేశంఅంతా ఆక్రమించి ఆర్యసంస్కృతిని భ్రష్టంచేశారు.

ఆ సమయానికి ఆర్య సంస్కృతిలో వున్న మంచి అంతా హిందూ సంస్కృతిలో కల్సిపోయి దేశమంతా హిందూ సంస్కృతి ప్రాకి నిలదొక్కుకొని రాజ్యాలు ఎన్ని వున్నా సాంస్కృతికంగా భరతఖండం ఒకటే అనే దశ చేరుకున్నాం. కనుకనే మహమ్మదీయులు 700 ఏండ్లు పరిపాలించినా మనల్ని ఏమీ చేయలేకపోయారు. మహమ్మదీయులను దక్షిణ దేశంలో, రాజకీయంగానూ, సాంస్కృతికంగానూ ప్రతిఘటించటంలో ఆంధ్రులే ముందు నిలిచారు. ఉత్తర భారతదేశంలో మహమ్మదీయుల దండయాత్రల్ని ఎదుర్కొనడంలో పంజాబు ఎలా ముందుకువచ్చిందో దక్షిణ భారతదేశంలో ఆంధ్ర

మహారాష్ట్ర దేశాలు అలా ముందుకు వచ్చాయి. మహారాష్ట్రలో యాదవరాజ్యం ఆంధ్రదేశంలో కాకతీయ రాజ్యం మైసూరులో హొయసాల రాజ్యం మహమ్మదీయుల ధాటిని ఎదుర్కోవలసి వచ్చింది.

ఆంధ్రుల ఆరంభ శూరత్వం అనాది నుంచీ వున్నదల్లేవుంది. మొదట కాపయనాయకుడితో చేతులు కలిపి తురకలతో పోట్లాడటానికి ముందరకు వచ్చిన వాళ్ళంతా జారుకున్నారు. వేడి చల్లారిపోయింది. కార్యశూరత్వం తగ్గిపోయింది. దక్షిణ భారతంలో కూడ మహమ్మదీయులు రాజ్యం స్థాపించుకున్నారు. తర్వాత తర్వాత ఈ బహ్మనీ రాజ్యమే విజయనగర సామ్రాజ్యాన్ని కబళించింది.

కాకతీయ సామ్రాజ్యం అనంగానే రుద్రమదేవి ప్రతాపరుద్రుడు తిక్కన శ్రీనాథుడు పోతన మొదలయిన మహాకవులు, ఓరుగల్లు ఆలయాలు, శిల్పాలు అన్నీ స్ఫురణకు వస్తాయి. ఉత్తర భారతదేశం నుంచి వచ్చే మహమ్మదీయుల ధాటికి తట్టుకోలేకనే ఈ రాజ్యం అస్తమించింది. తెలంగాణా ప్రాంతంలో ఆంధ్ర సంస్కృతి స్థిరంగా పాదుకుని పోవటానికి కాకతీయులే కారణం. తర్వాత వచ్చిన 500ఏళ్ళ మహమ్మదీయ పరిపాలనను ఈ ప్రాంతం తట్టుకొని నిలబడింది, స్వభాషని స్వమతాన్నీ సంస్కృతినీ నిలబెట్టుకొంది.

## భక్తిమార్గం — ఆంధ్రదేశం

ఈ సమయంలోనే దేశమంతటా భక్తి మార్గం ప్రబలి సామాన్య ప్రజానీకం మహమ్మదీయుల కిరాతకాలనూ అత్యాచారాలనూ తట్టుకునేందుకు తోడ్పడింది. మతం మానవుడి మనుగడకు తోడ్పడేదిగా వుండాలని, సంఘంలో చీలికలు తీసుకుని వచ్చేదిగా వుండకూడదనీ కష్ట సమయాల్లో భగవంతుడిమీద భక్తి విశ్వాసాలు ఆత్మ స్థయిర్యాన్ని యిచ్చి ధైర్యసాహసాలు కలిగిస్తాయని కవులు వేదాంతులు ప్రజలకు వారికి అర్థమయ్యే భాషలో పాటలు పద్యాలు భజనగీతాల ద్వారా చెప్పారు. పోతనగారి మహాభాగవతం ఈ సమయంలో చేసిన మహారచనే. ఉత్తర భారతదేశంలో గురునానకు, సూరదాసు, చైతన్యమహాప్రభు, కబీరు, తులసీదాసు మహారాష్ట్రలో జ్ఞానదేవు, తుకారాం దక్షిణదేశంలో రామానుజాచార్యులు వారి శిష్యులు-యిలా ఎంతమందో మతాన్ని సామాన్య ప్రజానీకం దైనందిన జీవితంలోకి తీసుకొని వచ్చారు.

## విజయనగర సామ్రాజ్యం

ఉత్తర భారతదేశంలో రాజస్థానం, ఉత్తర బీహారు, పంజాబులాంటి కొన్నిచోట్లతప్ప ముస్లిములకు ప్రతిఘటన అంటూ లేకపోయింది. పై చెప్పిన ప్రాంతాల్లో కూడ చెదురుమదురుగా తప్ప సంఘటితమైన పోరాటం అంటూ ఎక్కడా లేదు. దక్షిణ భారతదేశంలో మటుకు అట్లా కాకుండా ఒక రాజ్యం తర్వాత మరొకటి పుట్టుకవచ్చి హిందుమత సంస్కృతి పరిరక్షణకు రాజకీయరంగంలో ముస్లిముల రాజ్యప్రతిఘటనకు పాటుపడ్డాయి. కాకతీయరాజ్యం తర్వాత, విజయనగర సామ్రాజ్యం మళ్ళీ హిందుమత ప్రాభవాన్ని నిలబెట్టింది. శ్రీకృష్ణదేవరాయల రాజధాని ప్రస్తుతం కర్ణాటక రాష్ట్రంలో కలిసిపోయినప్పటికి అది తెలుగునేలే. చుట్టుప్రక్కల అంతా తెలుగుదేశమే. ఆంధ్రదేశాన్నంతా ఒకేత్రాటి మీదకు తీసుకు వచ్చింది ఈయనే. ఇది మూడవసారి చరిత్రలో ఆంధ్రదేశం అంతా ఒకే రాజ్యంగా ఉండటం. ఈయన స్వయంగా తెలుగులో ఆముక్తమాల్యద వ్రాసి రాజకవి అయ్యాడు. తెలుగు సాహిత్యానికి స్వర్ణయుగం. తెలుగు కళలకు సంస్కృతికి శిల్పాలకు ఈయన చేసిన సేవ చరిత్రలో ఏ రాజు చేయలేదు. ఈయనకాలంలో ఆంధ్రదేశానికి యిటు కన్నడ తమిళదేశాలతోనే కాక మహారాష్ట్రదేశంతోకూడ సన్నిహితసంబంధాలు వుండేవి. రాజకీయంగా ప్రస్తుతం ఒరిస్సా ప్రాంతంలో రాజ్యం చేస్తున్న గజపతులను ఓడించి కళింగదేశంలో కలిసివున్న ఆంధ్ర ప్రాంతాల్ని విజయనగర సామ్రాజ్యంతో ఏకం చేశాడు.

## ఆంధ్రులు — మహారాష్ట్రులు

ఈ కాలంలో మహారాష్ట్రదేశంలో పండరీపురంలో ఉన్న పాండురంగదేవాలయాన్ని మహమ్మదీయులు కొల్లగొట్టాలని ప్రయత్నం చేశారు. ఆ సమయంలో పాండురంగని విగ్రహాన్ని రహస్యంగా హంపీ తీసుకొని వచ్చి ఆ గడ్డుకాలం పోయేవరకు దాచారు. దా దా పు

మహారాష్ట్రదేశంలో చాలభాగం బహమనీసుల్తానుల పాలనలో ఉండటం మూలంగా చాలమంది మహారాష్ట్రులు విజయనగరరాజుల వద్ద ఆశ్రయం పొందారు. దాని వల్లనే తరువాత తరువాత యిటు తెలంగాణా జిల్లాల్లోనూ అటు రాయలసీమ జిల్లాల్లోనూ కూడ ఎంతోమంది మహారాష్ట్రులు స్థిరపడ్డారు. మూడవ పానిపట్టు యుద్ధంలో పీష్వాల సైన్యంలో అనేకమంది ఆంధ్ర సైనికులు పోట్లాడారు.

విజయనగర సామ్రాజ్యం అంతరించిన తర్వాత నాయకరాజులు వచ్చారు. వీరి సమయంలో ఆంధ్ర దేశం తమిళదేశానికి మరింత చేరువ అయింది. నాయక రాజులు ఆంధ్రులు కావటంవలన పరిపాలనలోనూ సైన్యం లోనూ వారికి తోడుపడటానికి విశ్వాసపాత్రులయిన ఎంతోమంది ఆంధ్రుల్ని మధుర, తంజావూరు రాజ్యాలకు తీసుకువెళ్ళారు. వీరి సంతతి యిప్పుడు తమిళదేశంలో అంతటా వ్యాపించి అక్కడే స్థిరపడిపోయారు. అదే విధంగా పీష్వాల పతనం అనంతరం మహారాష్ట్ర సామ్రాజ్యం నాలుగు భాగాలయింది. నాగపూరు రాజధానిగా విదర్భ దేశాన్ని పాలించిన భోంస్లేలు ఆంధ్ర దేశంనుంచి పరిపాలన కోసం సైన్యం కోసం చాలా కుటుంబాల్ని పిలిపించారు. దరిమిలా వీరంతా విదర్భ దేశంలోనే స్థిరపడిపోయారు.

ఉత్తర భారత దేశంలో మొగలాయిల పరిపాలన క్రింద మహమ్మదీయులు దేశంలో రాజకీయంగా నిలద్రొక్కుకోడమే కాకుండా సాంస్కృతికంగా కూడ తమ ప్రభావాన్ని వ్యాపింపచేశారు. ముఖ్యంగా అక్బరు పాదుషా అనుసరించిన విధానాలు యీ విషయంలో బాగా తోడ్పడి హిందూ ముస్లిం సమైక్యతకు బాగా తోడ్పడింది. రాజకీయ ప్రయోజనాల కోసం అయినప్పటికి, ఆయన దారి చూపించిన హిందూ ముస్లిం వివాహాలు యీ సమైక్యతను యింకా ముందుకు తీసుకుపోయాయి. హిందూస్థాని సంస్కృతి అని చెప్పదగ్గ ఒక జీవన విధానం రూపొందింది.

## హిందూస్థానీ సంప్రదాయాలు

దక్షిణ భారత దేశంలో యీ హిందూస్థానీ సంస్కృతి సంప్రదాయాలు గోల్కొండ సుల్తానుల ద్వారా నిజాం సంస్థానంలోకి వ్యాపించాయి. రాజకీయంగాను మతపరంగాను విభేధాలు వున్నప్పటికి, ఉత్తర భారత దేశంలో మొగలు సుల్తానుల అధికార ప్రాబల్యాలు దక్షిణ భారత దేశంలోని ముస్లిం రాజ్యాలకు అక్కరకు వచ్చాయి. దక్షిణ భారత దేశంలోని ముస్లిం రాజ్యాలన్నీ మొట్టమొదట ఢిల్లీ సుల్తానులకు సామంతులుగా వుండి తర్వాత తర్వాత స్వాతంత్ర్యం ప్రకటించుకొని వేరుపడిపోయినవే అని తెలుస్తుంది.

గోల్కొండ నవాబుల కాలంలో నాలుగవసారి ఆంధ్రదేశం అంతా ఒకటయింది. గోల్కొండ నవాబు అనంగానే రామదాసు మల్కిభరాముడు భాగ్యనగర స్థాపన, అంతా కళ్ళముందు తిరుగుతాయి. గోల్కొండ నవాబులు అవటానికి ముస్లిము లయినప్పటికి తెలుగు దేశానికి ఎంతో సేవచేశారు. ముఖ్యంగా ఔరంగజేబు ప్రాభవం పడకుండా ఆంధ్రదేశంలో మతదురహంకారం సామాన్య ప్రజానీకాన్ని బాధించనీయకుండా తోడ్పడ్డారు.

అంతేకాకుండా గోల్కొండ నవాబుల కాలంలోనూ తర్వాత నిజాం ప్రభువుల కాలంలోకూడ ఆంధ్ర దేశంలో మత సామరస్యము భాషా సంస్కృతీ పోషణ ఏమాత్రం కొరవడలేదనే చెప్పాలి. ఈ నవాబులకు లోబడి స్థానికంగా వివిధ ప్రాంతాలలో పరిపాలించిన జమీందార్లు, జాగీర్దార్లు ఎంతోమంది హిందూమతాన్ని ఆంధ్ర సంస్కృత భాషలనూ సంస్కృతిని పోషించారు. మరొకప్రక్క ఉర్దూభాషా సాహిత్యాలకూ హిందూస్థానీ సంస్కృతికి కూడ సమానమయిన ఆదరం లభించింది. ఉత్తర ప్రదేశ్‌లో లక్నో లాగా ఆంధ్ర ప్రదేశ్‌లో హైద్రాబాదు హిందూ ముస్లిం మత సామరస్యానికి పరస్పర అవగాహనకు ఐకమత్యానికి తోడ్పడింది. కాని, ఒక తేడా ఏమిటంటే ఉత్తర భారత దేశంలో హిందూ మతానికి సంస్కృతికి లభించని పోషణ ఆదరణ దక్షిణ భారత దేశంలో లభించాయి.

## ఆంధ్రులు-హిందూమతం

మతానికి జాతి జీవనానికి మతకేంద్రాలు దేవాలయాలు కీలకం. అనాదిగా కాశీరామేశ్వరాలు రెండూ

హిందూ దేశం అంతటిని ఏకంచేస్తూ దేశం (యిప్పుడు ప్రపంచం) అంతట్నుంచీ హిందువుల్ని ఆకర్షిస్తున్నయి. ప్రయాణ సౌకర్యాలు తక్కువగా వున్న రోజులలో ఆంధ్రదేశం యీ యాత్రికులకు ఎంతోసేవ చేసింది. కాశీ రామేశ్వరాలకు మధ్యలో వున్నందున ఎటువెళ్ళే యాత్రీకుడయినా ఆంధ్ర దేశంలోంచి వెళ్ళవలసిందే. వారి సౌఖ్యగునా సత్రాలు చలివేంద్రాలు పెట్టి యాత్రీకుల సౌకర్యానికి తద్వారా జాతీయ సామరస్యానికి తోడ్పడ్డారు. అదిన్నీకాక ఆంధ్రదేశంలో-దాదాపు కాశీకి వెళ్ళేదారిలో అనేక పుణ్యక్షేత్రాలలో దేవాలయాలు కట్టించి హిందూమతానికి ఎనలేనిసేవ చేశారు. తిరుపతి, కాళహస్తి, శ్రీశైలం, బెజవాడ, ద్రాక్షారామం, అన్నవరం, సింహాచలం, అరసవల్లి, శ్రీకూర్మం యిలాగ దారిపొడుగునా ప్రసిద్ధి చెందిన ఆలయాలు భక్తులను ధార్మిక చింతనకు ప్రేరేపిస్తూ మతకార్యాలకు కేంద్రాలై వుండేవి. ఆంధ్రులుకూడ అటు కాశీ విశ్వేశ్వరుణ్ణి యిటు రామేశ్వరంలో రామనాథస్వామిని దర్శించుకోవటం జీవితంలో ముఖ్యమని భావించేవారు. దారిలో పూరీ జగన్నాథం కంచి మధుర కూడ ప్రధాన పుణ్యక్షేత్రాలుగా ప్రసిద్ధి చెందాయి.

బ్రిటిషు ప్రభుత్వం వచ్చిన తర్వాత ఆంధ్రకు సంబంధించినంత మటుకు వారి విస్తరణ పదకొండు (యిప్పుడు 12) జిల్లాలకు పరిమితమయింది. 1857లో సిపాయిల విప్లవం జరిగి కంపెనీ సంపాయించిన రాజ్యాన్ని విక్టోరియారాణి స్వాధీనం చేసుకొన కుండా వుంటే మిగిలిన జిల్లాలు కూడ నిజాం దగ్గర్నుంచి లాగే వారేమో కాని అలా కాలేదు. మహారాష్ట్ర దేశంలో పేష్వా ప్రభువుల ప్రాభవం ఆపాటికే అంతమయి పోయింది. ఈ విధంగా చిన్న చిన్న సామంత రాజ్యాలు జమీందారీలు తప్ప దక్షిణ భారతదేశం అంతా బ్రిటిషు వారి పాలనలోకి వచ్చింది. నైజాం మైసూరు తిరువాన్కూరు రాజ్యాలు వున్నా, వారు బ్రిటిషు వారిని ఎదిరించే స్థితిలో లేరు. మొగలాయిల పరిపాలనలో ఉత్తర భారతదేశం అంతకు ముందే నిర్వీర్యమై పోయింది.

## బ్రిటిషు వారు — ఆంధ్రులు

సిపాయిల విప్లవంలో ఆంధ్రుల పాత్ర అంతగా ఉన్నట్లు కన్పడదు. రాజకీయ కారణాలవల్ల నిజాం ప్రభువు ఆయన సామంతులు బ్రిటిషు వారినే బలపరిచారు. ఒక్క అల్లూరి సీతారామరాజు మాత్రమే బ్రిటిషు వారిని ప్రతి ఘటించిన వారిలో ముఖ్యుడిగా కన్పిస్తున్నాడు. కోస్తాజిల్లాలలో కొందరు జమీందార్లు కూడ బ్రిటిషు వారిని ఎదిరించి సర్వనాశన మనటానికి వెనుదీయలేదు. కాని, బ్రిటిషు వారు తీసుకొన్న చర్యలతో 19వ శాతాబ్దంచివరినుంచి యీ పరిస్థితి పూర్తిగా మారి పోయింది. కోస్తాప్రాంతం దత్తమండలాలు బ్రిటిషు వారి అధీనంలోకి రావటంవలన జరిగిన మంచి పనుల్లో చెప్పుకోదగ్గవి. కృష్ణా గోదావరినదులమీద ఆనకట్టలు, కోస్తావెంబడి రైలుమార్గం, ఇంగ్లీషులో విద్యాబోధన ముఖ్యమైనవి. 1857కు పూర్వం కంపెనీ ప్రభుత్వం మద్దతుతో కొందరు క్రిష్టియన్ మిషనరీలు స్కూళ్ళు కాలేజిలూ స్థాపించి అటు విద్యాబోధన యిటు మత ప్రచారం ప్రారంభించారు. వీటి ప్రాబల్యం ప్రభావం అరికట్టటానికి ఆంధ్రులుకూడ ఆంగ్లభాష విద్యాసంస్థలు స్థాపించి విద్యా వ్యాప్తికి తోడ్పడ్డారు. ఇవేకాక ప్రభుత్వకళాశాలలు జమీందార్లు స్థాపించిన విద్యాలయాలు కూడ చెప్పుకోదగ్గవే.

## ఆంధ్రులు - సాంఘికోద్యమాలు

ఈ రకంగా విద్యావ్యాప్తి జరిగి 19వ శతాబ్దం చివరి భాగంలోనే ఆంధ్రదేశంలో సాంస్కృతిక పునరుజ్జీవనానికి దారి తీసింది. రాజకీయ పరిస్థితులకు రాజీ పడిపోయి ఆంధ్రులు వారి శక్తిసామర్థ్యాలను సాంఘిక సాంస్కృతికరంగాలలోకి మళ్ళించారు. ఆ రోజులలో దేశంలో నాలుగు మూలలనుంచి అనేక రకా లయిన ప్రభావాలు వుద్యమాలు వ్యాపించాయి. ముఖ్యంగా బెంగాలు మహారాష్ట్ర నుంచి వివిధ రంగాల్లో చైతన్యం వచ్చి దేశమంతటికి ప్రాకింది. బెంగాలులో బ్రహ్మ సమాజము. ఏకేశ్వరోపాసన ఒక ప్రక్క రామకృష్ణ పరమహంస ఆయన శిష్యుడు వివేకానందస్వామి హిందూ మత పునరుద్ధరణ, మరొక ప్రక్క మతరంగంలో మహోన్నతమయిన పునరుజ్జీవనమునకు దారితీశాయి. సాంఘిక రంగంలో వీరేశలింగం పంతులు చిలకమర్తివారు గురజాడవారు స్త్రీవిద్య వితంతువివాహము కన్యాశుల్కం

వరకట్న నిషేధం మొదలయిన సమస్యలని ఎదుర్కొన్నారు. భాషారంగంలో వీరందరితోపాటు గిడుగు వారు వ్యావహారిక భాషకు రాచబాట వేశారు. నాటక రంగంలో మహారాష్ట్రనుంచి వచ్చిన సురభి నాటకబృందం ధార్వాడ కంపెనీల ప్రభావం మూలంగా పైన చెప్పినట్లుగా మారుతున్న సాంఘిక వాతావరణం దృష్ట్యా ఒక నూతనయుగం ప్రారంభమయింది. అనేక క్రొత్త క్రొత్త నాటకాలు వ్రాయటం ప్రదర్శించటమే కాక ప్రజల్లో నాటకరంగం అంటే ఆదరణ ప్రోత్సాహం కలిగాయి.

## ఆంధ్రరాష్ట్రం—ఆంధ్రప్రదేశ్

ఇలా 19వ శతాబ్ది చివర్నుంచీ మొదటి ప్రపంచం యుద్ధంవరకు ఆంధ్రదేశం అంతటా ఒక రకమయిన ఉత్తేజము ఉత్సాహం వచ్చి సామాన్య ప్రజానీకాన్ని కూడ ప్రభావితం చేసింది. ఆ సమయంలోనే జాతీయోద్యమం ఆంధ్రదేశానికి కూడా ప్రాకి స్వాతంత్ర్య పోరాటంలో ఆంధ్రదేశాన్ని అగ్రగామిని చేసింది. ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం లేకపోయినా విడిగా రాష్ట్ర స్థాయిలో కమిటీ ఏర్పరచారు. హిందీ తర్వాత అధిక సంఖ్యాకులు మాట్లాడేభాషగా తెలుగును గుర్తించి ఆ రోజుల్లోనే బ్రిటిషు ప్రభుత్వం ప్రభుత్వ నాణెముల మీద నోట్లమీద తెలుగులో వాటి విలువని ముద్రించింది. ఆంధ్రలో కాంగ్రెసు మహాసభలు జరగటం ఆంధ్ర నాయకులు జాతీయ నాయకులకు కుడిభుజంగా ఉండి జాతీయ పోరాటంలో కృషి చెయ్యటం పన్నుల నిరాకరణ, రామదండు, చీరాల సత్యాగ్రహం, హిందీభాష ప్రచారం యివన్నీ కూడ అందరికి చిరపరిచితాలు.

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఆంధ్రులకు జరిగే అన్యాయాల్ని సహించలేక భాషాప్రయుక్త రాష్ట్రాలకు నాందీవాక్యం పలికించి ఆంధ్రులే. భాషాప్రయుక్త రాష్ట్రాలు మంచివా కాదా అనేది చర్చనీయాంశం అయినా వీటివల్ల భాషకు సంస్కృతికి ఆంధ్రప్రజలకు జరిగిన మంచిచెడ్డలు కాలమే నిర్ణయించాలి. ఆంధ్రరాష్ట్రం సాధించి దాన్ని విశాలాంధ్రగా రూపొందించుకొన్న అనంతరం వచ్చిన సమస్యల్ని విజ్ఞతతో ఎదుర్కొని ఆంధ్రప్రదేశ్ అన్ని రంగాల్లోనూ ముందంజ వేస్తున్నది.

ఆంధ్రదేశం ఉత్తర దక్షిణ ప్రాంతాలవారికి మధ్యలో ఉండటంవల్ల పొరుగు రాష్ట్రాలవారు అనేకమంది యిక్కడ స్థిరపడిపోయి జీవిస్తున్నారు. అలాగే అనేకమంది ఆంధ్రులు ఇరుగుపొరుగు రాష్ట్రాలలో శాశ్వత నివాసం ఏర్పాటు చేసికొన్నారు. కొన్ని వందల ఏండ్లుగా ఇది జరుగుతున్నది. ప్రవాసాంధ్రులు ఎక్కడ వున్నా తమ భాషను సంస్కృతిని మరిచిపోకుండా కాపాడుకొంటున్నారు. ఇదే కాకుండా విదేశాలలో అనేకమంది ఆంధ్రులు ఉద్యోగ వ్యాపారాలకు వెళ్ళి స్థిరపడిపోయారు. ఈ ప్రపంచ తెలుగు మహాసభలు ఆంధ్రులు ఎక్కడెక్కడ వున్నా వారందరికీ శుభాకాంక్షలు అందచేస్తూ వారి ఉన్నతిని కోరుతున్నది.



'అఖిల పశ్చిమ రాజ్య భాషాళియందు
తన తెలుఁగు మాటలను నిల్పుకొనెను తల్లి
ఖండ శర్కర లోపల కణుపుకొట్టి
కడగి యాబాసలోన మీగడలు తేర్చి'

—విశ్వనాథ

# తెలుగు వారి సామాజిక జీవితము

## ఖండవల్లి లక్ష్మీరంజనం

అంతర్జాతీయ తెలుగు సంస్థవారు తెలుగువారి సామాజిక జీవితాన్ని గురించి వ్యాసం వ్రాయించడం ఉచితంగానే ఉంది. కాని, వారి బాధ్యత ఇంతటితో తీరదు. ఒక వ్యాస పరిమితిలో ఇమిడే విషయము కా దది. తెలుగువారంటే ముద్ద కట్టిన ఒక మనుష్య సంఘంకాదు. వారిలో ఎన్నో కులాలు ఉన్నాయి. మనము ఎంత వద్దనుకున్నా, గర్హించినా, శాసనాలు చేసినా అవి ఇంతట్లో అంతరించే సూచనలులేవు. తెలుగువారిలో అన్న మాటేమిటి, భారతదేశం అంతా ఈ వ్యవస్థ ఏదో రూపంలో కొనసాగుతూనే ఉంది. ఆయా కులాల్నిబట్టి వారి వారి సాంఘికాచారాలు భిన్న రూపంలో ఉంటున్నాయి. ఇవి మంచివా చెడ్డవా అనే ప్రశ్న సామాజిక శాస్త్రజ్ఞుని పరిధిలోనిది కాదు. ఆ భారాన్ని శాసన నిర్మాతలకు విడిచి పెట్టుదాము. సంఘం మొత్తంమీద ఆయా కులాల్లో కాని, వర్గాల్లో కాని అనూచానంగా వస్తూండే ఆచారాలు ఏమిటో సర్వే చేయించి ప్రత్యక్ష సాక్ష్యం సేకరించి పెట్టడమే సామాజిక శాస్త్రజ్ఞుని కర్తవ్యం: ఆధునిక భావ ప్రేరితులు ఎంతచెప్పినా, తెలుగువారు కానివ్వండి, ఏ ఇతర భారతీయులైన కానివ్వండి, సాంఘికాచారాల దగ్గరకి వచ్చేసరికి— వారి పెద్దలు ఎలా చేశారో అట్లా చెయ్యడానికే ఉద్యుక్తు లవుతారు. ఇదే సనాతనాచారము. తైత్తిరీయోపనిషత్తు ఇదే శాసించింది. "అథ యది తే కర్మ విచికిత్సావృత విచికిత్సా వా స్యాత్ యే తత్ర బ్రాహ్మణాః సమర్శినః— యుక్తా అయుక్తాః— అలూక్ష ధర్మకామా స్స్యుః— యథా తే తత్ర వర్తేరన్— తథా తత్ర వర్తేథాః" నీకు కర్మాచరణ విషయంలో కాని, నడవడి విషయంలో కాని సందేహం వస్తే— ఆయా సందర్భాల్లో లోభరహితులు, ధర్మకాములు అయిన బ్రాహ్మణులు, లేక పెద్దలు ఏవి నడుచుకునేవారో నువ్వు ఆవిధంగా నడుచుకో అ వేదము. ఇది భారతీయ సంప్రదాయము. తెలుగ సంప్రదాయం కూడా. అంతర్జాతీయ తెలుగు ప్రధానంగా సాహిత్య సంస్థ కావచ్చును. అయినప వీరు తెలుగువారి సాంఘికాచారాలను సశాస్త్రీయ సర్వే చేయించి, కనీసము Thurston అనే అంగ్లే కారి పూర్వం చేసిన సేవ వంటిది, కొంత చేసినా పరిధిని దాటిపోవడం కాకపోవచ్చు. ఎందుచేత సంఘజీవితం ఝరీవేగంతో మారిపోతుంది. ప్ర సాంఘిక భావాలు, వ్యవస్థల మూలంగా ప్రాతజీ సొబగులు, పరిమళాలు అంతర్హితం అవుతున్నా వీటిని గ్రంథాల్లోనైనా నిక్షేపించి ఉంచడం ధర్మము. ఈ కార్యభారాన్ని ఇతర సంస్థలు పూనినట్లు కూడా కనబడదు. నా చిన్న వ్యాస ఆధారం నేను విన్నవీ, కన్నవీ మాత్రమే. శా విషయ సేకరణ కాదు.

విషయ విభజన దగ్గరే సమస్య ఏర్పడుతు కులాలవారీగా వ్రాయాలంటే ఇప్పుడు సాధ్యము ప్రాచీనులు మానవుని సంఘజీవితాన్ని షోడశకర్మ విభాగించి ధర్మశాస్త్ర గ్రంథాల్లో వివరించి పెట్ట జాతకర్మ, నామకరణము, అన్నప్రాశనము మొ పెట్టుకొని అంత్యకర్మదాకా నియమబద్ధంచేసి ఉం పేరు పెట్టడంలో కూడా కొన్ని నియమాలు కొన్నారు ఆర్యులు. తెలుగువాళ్ళు సాధారణంగా పు లైతే అన్న, అయ్య, స్త్రీలైతే, అమ్మ, అంతంగా పేర్లు పెట్టుకునేవారు. నన్నయ్య, తిక్క సూరన్న, శేషమ్మ, పుల్లమ్మ— ఈ రీతిగా ఉంట

తాతపేరు సాధారణంగా మనవడికి పెట్టడం తెలుగువారి పూర్వాచారం. దీన్ని ఇప్పటివాళ్ళు ఆదరించడం లేదు. 'చదువుకున్న కమల' నవలలో నాయిక ఇది పనికి రాదంటుంది. ఇట్లా మారుతున్నాయి భావాలు, సంప్రదాయాలు. అధికారం గల స్త్రీలకు 'సాని' బిరుదు చేర్చేవారు. విరియాల కామసాని, పిల్లలమర్రి ఎరకసానమ్మ, బమ్మెర లక్కసాని (పోతరాజుగారి తల్లి). అయితే ఈ విధంగా ధర్మశాస్త్రాలు చెప్పిన షోడశకర్మలలో, ఆచారాలు సమీక్ష చెయ్యడం సాధ్యం కాదు. జీవితాన్ని కొన్ని వయస్సులుగా భాగించుకొని ఆయా ఘట్టాల్లో కొన్ని విషయాలు స్థాలీపులాక న్యాయంగా చెప్పుకోవాలి 1. బాల్యము. 2. యౌవనము. 3. ప్రౌఢవయస్సు, 4. యత్ర నార్యస్తు పూజ్యంతే-రమంతే తత్ర దేవతాః-ఎక్కడ స్త్రీలు సంభావింపబడుతారో అక్కడ దేవతలు హర్షిస్తా రని పెద్దలు చెప్పుతున్నారు గనుక నాలుగవ విభాగం స్త్రీలకు బాలికలకు కేటాయిస్తాము.

మొదటివశ బాల్యము. అనాదినుంచి ఆంధ్రుల కేమిటి భారతీయులందరికీ 'అపుత్రస్య గతి ర్నాస్తి' అనేది బాగా వంటబట్టి ఉండడంచేత సంతానాన్ని, ముఖ్యంగా పురుష సంతానాన్ని కోరుకుంటారు. ఇది అన్ని దేశాల్లోనూ అన్ని కాలాల్లోనూ ఏదో రూపంలో ఉండక తీరదు. సంతాన ప్రాప్తి కోసం తపించడము, గుళ్ళకు, గోపురాలకు వెళ్ళడము, అశ్వత్థ ప్రదక్షిణాలు చేయడము గోప్యంగానైనా జరుగుతూనే ఉంటాయి. శిశుజననానికి ముందు తల్లి కోరికలు నెరవేర్చడం సంపన్నుల్లో జరుగుతూంటుంది. పురిటియింటి జాగ్రత్తను, 'శోభను' శివరాత్రి మాహాత్మ్యంవంటి గ్రంథాల్లో బాగా చిత్రించారు అజ్ఞానంచేత దయ్యాలు, గాలులూ, ధూళులూ వీటి ప్రభావాన్ని పామరజనం మరిచి పోలేకుండా ఉన్నారు. శిశువు జనించిన 11వ దినంగాని 21న గాని బారసాల చేస్తారు. శబ్ద వ్యుత్పత్తి తెలియదు కాని కొందరు బాలసారె అని చెప్పుకుంటున్నారు. 'ఆత్మావై పుత్ర నామాసి'-తానే కుమారుడుగా జన్మిస్తున్నాడనే న్యాయం చేత తండ్రికి పుత్రోత్సాహం కలుగుతూంది. ఐదేళ్ళు నిండగానే ఊళ్లో బడి ఉంటే దానికి, లేకపోతే ఏదో అయ్యవారి దగ్గర చదవ వేస్తారు మగపిల్లల్ని ఇప్పుడిప్పుడే ఆడపిల్లలకి కూడా చదువు అవసర మని గుర్తించి వాళ్ళను కూడ బళ్ళకు తోలుతున్నారు. అది వానాకాలపు చదువుగా ఉంటుంది. అక్షరాభ్యాసం చేసేటప్పుడు 'ఓం నమశ్శివాయ సిద్ధం నమః' అని పల్లెటూళ్ళలో దిద్దపెడతారు. మన దేశపు సార్వజనిక విద్యాతత్వం దీంట్లో కొంత కనబడుతుంది. పూర్వ కాలంలో బౌద్ధులు ప్రప్రథమ సార్వజనిక విద్యాప్రచారకులనే విషయం 'సిద్ధం నమః' అనే దానివలన కనబడుతుంది. బౌద్ధులు కులతత్వం పాటించేవారు కారు వచ్చిన వారందరికి చదువుచెప్పడం వారి మర్యాద తరువాత శైవులు ఈ రహస్యం గ్రహించి, వారుకూడా కొంతవరకు సార్వజనిక విద్యాభిమానులయ్యారు. శైవులకూ, తత్రాపి వీరశైవులకూ బౌద్ధులకూ మత వైషమ్యాలు తీవ్రంగా ఉండేవి. అయినా బౌద్ధులు ప్రవేశపెట్టిన సిద్ధం నమః అనే నమస్కార వాక్యాన్ని తోసిపుచ్చక, తమ దైన పంచాక్షరీ మంత్రం దీనికి జోడించి, ఒక సమన్వయ పద్ధతికి దారితీశారు. ఈ సమన్వయ శబ్దం బాగా గుర్తు పెట్టుకోవాలి. ఆంధ్రులు లేక తెలుగువారి జీవితం అంతా సమన్వయ రాశియే. ఆర్య, ద్రావిడాచార సమన్వయం ఆంధ్రులసాంఘిక జీవితంలో అడుగడుక్కీ ప్రత్యక్ష మవుతూంటుంది.

పిల్లలకు సాంఘికసమస్య లేముంటాయి? అసలు వారికి ఏ సమస్యలు లేవు, ఉండకూడదు. వారి ఆటలు, పోటీలు అవే వారి సమస్యలు. చెడుగుడు, ఉప్పట్టి, బొంగరాలాట, ఈతలు కొట్టడం, పతంగులు ఎగర వేయడం, కొంచెం వయస్సు వచ్చిన తర్వాత కుస్తీలు, కర్రసాము ఇటువంటివి వారి క్రీడలు. నాచన సోమ నాథుని ఉత్తర హరివంశంలో ఉప్పట్టి సూచిత మయింది. బొంగరాలాట పల్నాటి వీరచరిత్ర కాలానికే ఉంది. నదీప్రాంతం వారికి ఈదడం ఆటగా ఉంటుంది. దేశ మధ్యంలో తటాకాభావంచేత నీటిభయం కొంత ఎక్కువ. ఈ పిల్లలు ఈదేటప్పుడు బెండ్లకట్ట నడ్డికి కట్టుకుంటారు. ఆ బెండ్లు ఈతగానిని తేలుస్తాయి. నదులు వరదమీద వున్నప్పుడు తెప్ప సహాయంతో ఈదుతారు. పతంగులు ఎగరవేయడం దేశమధ్యంలో ఎక్కువగా కనబడుతూంది. దీనికి గాలి విసురు అతిగా ఉండకూడదు. సంకురాత్రి దినాల్లో వినిర్మలాకాశం రంగురంగుల పతంగుల విహారాల్తో కిర్మీరిత మవు

టుంది. 'పిలాయించు, పిలాయించు' నినాదాల్తో దిక్కులు శ్రుతిమధురంగా ప్రతిధ్వనిస్తూ ఉంటాయి. కత్తిసాములు ఇపుడు లేవు. కాని, కర్రసాములు సాగుతూనే ఉంటాయి. తరగతి గదుల్లో కాగితపు విమానాలు, రాకెట్లూ, మాస్టారు దిక్కుగాను ఆడపిల్లల శ్రేణుల మీదికీ దూసుకు పోతూంటాయి. పట్టణాల్లో ఏ ఖాళీ స్థలం చూసినా ఈనాడు బాలక్రికెటియర్లో, గుడిసెలవారో ప్రత్యక్షమవుతున్నారు. ఈ వయస్సులో బ్రాహ్మణసంఘంలో ఉపనయనాచారం నడుస్తుంది. వేదాధ్యయనానికి ఇది పునాదిగా భావింపబడేది. వేదాధ్యయనం సన్నగిల్లి అస్తమితప్రాయం అవడంచేత బ్రాహ్మణుల్లో వివాహానికి అనుమతిపత్రంగా మాత్రమే ఇది మిగిలిపోతూంది. ఉపనయన మంత్రాలు చూస్తే శిక్షాయుత జీవితానికి ఇది మంచి ప్రాతిపదికగానే కనబడుతుంది. వటువు చేసుకొనే వ్రతాలు 'తన్మ ఉభయం వ్రతమ్' ఆ రెండూ నా వ్రతాలు అనేవి నిస్సంశయంగా శీలపోషకములు. ఇతర వర్ణాల్లో ఈ ఆచారం లేదు. త్రైవర్ణికులకు ఈ సంస్కారం చెప్పబడే ఉంది. ఆయా కులాల బాలురు తండ్రులతో కలిసి వ్యవసాయమూ, ఇతర శిల్పవృత్తులూ అభ్యసించి వయస్సు వచ్చేసరికి ఇంతో అంతో సంపాదన చేసుకోగలుగుతున్నారు. కుటుంబ భారంగా ఉండడం లేదు. పిల్లలకి ఎక్కువ ఉత్సాహం, సందడీ కలిగించే మూడు పండుగలు కనబడుతూన్నాయి. రాకీపున్నమి- శ్రావణ శుద్ధ పూర్ణిమను వైదికవర్గం ఉపాకర్మ సంస్కారానికి వినియోగిస్తున్నారు. ఇతరులు రాకీలు కట్టడానికి ఉపయోగిస్తున్నారు. రంగురంగుల పూలబిళ్ళలు అమర్చిన సూత్రాలు తమ చేతులకు కట్టుకోవడం పెద్దవాళ్ళకు కట్టడం వీరి కొక వేడుక. రెండవది గణేశచవితి. ఇప్పుడు దీనిని అన్ని వర్ణాలవారు పాటిస్తున్నారు. గణపతి పూజకు 21 పత్రులు సేకరించడం, పువ్వులు తేవడము, పూజలు, భజనలు, విసర్జనలు, ఇవన్నీ తెలుగు బాలురకు మంచి సందడి సమయం. దీపావళీ పటాసులు కాల్చడం పేల్చడం సరేసరి. ఇది ఇప్పుడు యువకుల వీరవ్రతాచారంచేత కళాశాలల్లో కూడా ప్రవేశించింది. ఆఖరుది హోలీ ధులండీ అనే వేడుకలు. ఇవి ఎక్కువగా తెలంగాణాలో కనబడుతున్నాయి. ఔత్తరాహుల ప్రభావం ఇక్కడ ఎక్కువ అవడంచేత కాబోలు. ఫాల్గుణ శుద్ధ పూర్ణిమకు కామదహనం. వడ్డీ వ్యాపారస్తులు, ధనికవర్గంమీద పేదవారి కుండే ధర్మాగ్రహం ఎట్లాగో దీంట్లో మారింది. నాథూరాం అనేవ్యక్తి దీనికి ప్రతినిధి అయ్యాడు. 'నాథూరామ్ సచ్చిండు' అంటూ అరుస్తూ చిన్నచిన్న కర్ర సామానులు అడిగి, అడగక తెచ్చి కామదహనం - నాథూరామ్ అగ్నిసంస్కారం— రెండూ కలిపి నిర్వహించి, కసితీరా ఆ చితాభస్మం వంటికి పూసుకొని, రంగులు చల్లకొని క్రీడించడం బాలురు, యువకులూ చేస్తూంటారు. కోస్తా జిల్లాల పిల్లలు సంకురాత్రికి సందడిగా ఉంటారు. భోగి మంటల కని ఎక్కడెక్కడి పాత సామాన్లు వచ్చి పడతాయి. ఏమర పాటున ఉన్న గృహస్థుల యిండ్ల తాలూకు పాత తలుపులు ఇప్పుడు విముక్తిని అనుభవిస్తాయి.

2. యౌవనము : తెలుగు యువకుల వీరశౌర్యాలు, ధైర్యసాహసాలు శాతవాహన యుగంలోనూ తూర్పు చాళుక్యుల కాలంలోనూ కాకతీయుల ఖడ్గదీధితుల క్రిందనూ లోకం చవిచూచినవే. 'తరుణ స్తావత్ తరుణీ సక్తః' అని శంకరాచార్యులవారు చెప్పినట్లు ముందుగా వీరి వివాహకలాపం సమీక్షిద్దాము. ప్రాచీన కాలంలో విద్యా సమార్జన పూర్తిచేసుకొని, ఆచార్యుని అనుమతిని పొంది స్నాతకం నిర్వహించి, పెళ్ళి చేసుకొనేవారు. 'ఆచార్యాయ ప్రియమ్ ధన మాహృత్య ప్రజాతంతుమ్ మా వ్యవచ్ఛేత్సీః' అని వేదానుశాసనము. ఈ సత్సంప్రదాయం క్షీణయుగంలో విస్మరింపబడినా ఇప్పుడిప్పుడు తిరిగి ఉద్ధరింపబడుతున్నట్లు తోస్తుంది. యువకులు ఈనాడు వివాహబంధంలో ఇరుక్కోడానికి అంతగా ఉబలాటపడడం లేదు. ఆర్థికకారణాలు, సంతాన నిరోధ ప్రచారము దీనికి హేతువులై యుండవచ్చును. ఇదివరలో చెప్పినట్లు తెలుగువారి సంస్కృతిలో ఆర్య - ద్రావిడాచారాల సమ్మేళనం అనాదిగా వస్తూంది. వివాహప్రక్రియలో ఇది బాగా కనబడుతుంది. పాణిగ్రహణము, సప్తపది వంటివి మంత్రములతో నిర్వహించేవి. మంగళసూత్రధారణవంటిని శ్లోకాల్లో ఉన్నాయి. అగ్రవర్ణాల వారిలో ఈ రెండూ సమ్మేళనం

చెందాయి. మేనత్త కొడుకును, మేనమామ కూతుర్ని పెండ్లి చేసుకోవడం ఆంధ్రుల్లో అత్యంతాభిప్రేతమైన సముదాచారము. ఇది ఉత్తర దేశంలో లేదంటారు. తెలుగు వారిలో ఇక్ష్వాకు వంశపు రాజుల కాలంనుంచీ ఈ సంప్రదాయం చెల్లివస్తూంది. ఆంధ్ర భారత కృతి భర్త రాజరాజ నరేంద్రుడు, ఆయన కొడుకు చక్రవర్తి కులోత్తుంగ చోడుడూ మేనమామ కూతుళ్ళనే గృహిణులుగా చేసుకొన్నారు. మేనరికం ఎంత ప్రజామోదం పొందిందంటే హాస్యపు సామెతలుకూడా పుట్టాయి. 'మేనత్తకొడుకు ఒక మగడేనా, పప్పుతో ఉండ్రమూ ఒక పిండివంటేనా', అని. మేనమామనే పెండ్లి చేసుకోవడం బ్రాహ్మణేతరుల్లోనూ ఇప్పుడు విప్రవర్ణంలోనూ కూడా సామాన్యమవుతుంది. సగోత్ర వివాహాలు శాసనాలు ఆమోదించినా సమాజానికి ఇంకా సమ్మతం కాలేదు. వర్ణాంతర వివాహాలు సకృత్తుగా వస్తున్నాయి. కట్నకానుకల నిర్బంధం బాగానే ఉంటూంది. అందుచేత యువతులు అభిమానపడుతున్నారు. తల్లిదండ్రులు ఇబ్బంది పడుతున్నారు. వరకట్నాలమీద విమర్శగా వరవిక్రయంవంటి నాటకాలు బయలుదేరాయి. ఈ కట్నాలు ధనరూపంలోనూ భూమిరూపంలోనూ ఉంటున్నాయి. తాను వలచిన వేశ్యకు 'అత్తవారిచ్చిన అంటుమామిడితోట' కానుకచేసి పశ్చాత్తాపపడతాడు చింతామణి నాటకంలోని నాయకుడు. వీరేశలింగం పంతులుగారి ధర్మమాఅంటూవృద్ధవివాహాలు,అతిబాల్యవివాహాలు చాలావరకు మాయమయాయి. వితంతు వివాహాలు సామాన్యం అయ్యాయి ఇల్లరికం ఆచారం పూర్వం నుంచీ ఉంటూంది. కళాపూర్ణోదయంలో శాలీనుడనే ఇల్లరికపుటల్లుడు ప్రత్యక్షమవుతాడు. తన భర్త ఇల్లరికపుటల్లుడు కాకూడదు అంటుంది శ్రీమతి యద్దనపూడి సులోచనారాణిగారి మీనా అనే నాయిక. 'అల్లుని మంచితనము—తెల్లని కాకులు లే' వన్నాడు సుమతీశతకకారుడు. ఈ వైజ్ఞానిక యుగంలోనైనా ఆంధ్రులైన జామాతలు ఈ అపకీర్తి కడిగి వేసుకోవాలి. మధుపర్కం ఎప్పు డెవరికి జరపాలి అని చర్చిస్తూ గౌతమ ధర్మసూత్రకారుడు అల్లుడు ఎప్పుడు వచ్చినా మధుపర్కం ఇవ్వాలి అన్నాడు. ఆ మహర్షికే తప్పనిది సామాన్య గృహస్థులకు తప్పుతుందా? యువయువతులైన దంపతులు మీవా శ్మేమి పెట్టారంటే మీవాళ్ళేమి పెట్టారని చిట్టిపొట్టి వివాదాలు లేపుకొంటూంటారు. పర్యవసానంలో ఇవి ప్రణయకలహాలు. సుభద్రార్జునులే ఒకమారు ఇట్లా కీచులాడుకున్నారని సుభద్రపెండ్లి అనే పాట చిత్రిస్తుంది.

'పున్నమి నాడైన-జాబిలి లొండుకొని
పురుషుడా రమ్మన్ని-పిలువరు మీవాళ్ళు
అమావాస్యనాడైన-అరిసె లొండుకొని
అల్లుడా రమ్మన్ని-అనరూ మీవాళ్ళు
పచ్చాకమ్మల బట్ట-పెట్టరు మీవాళ్ళు'

అని భారతవీరాగ్రణి గిల్లికజ్జా పెట్టుకొన్నాడట. అభిమానవతియైన సుభద్ర కస్సుమని లేచింది.

'మావాళ్ళు పేదవాళ్ళు-మాకేమి కలదూ
పెట్టగలచోటైన పెళ్ళాడరాదా
ఇవ్వగల చోటైన వియ్యమందరాదా'

ఆ మగధీరుడు కోపంవచ్చి భార్యను పాపుకోళ్ళ కాళ్ళతో తన్నాడట.

ఆంధ్ర వీరయువకులు భారతదేశపు సైన్యాల్లో ఉంటూనే ఉన్నారు. వీరికి ప్రత్యేక గుర్తింపు, ఆంధ్ర పటాలం లేకపోవడం ఒకలోటుగానే భావించాలి. సంకుచిత దృష్టిగా దీనిని కొట్టివెయ్య కూడదు. ఆంధ్రులు భారతదేశ దూరదూర ప్రాంతాల్లో ఉద్యోగులుగా కార్మికులుగా వెళ్ళి రాణిస్తున్నారు. జీవనోపాధి కోసం ఆంధ్రులు దేశాంతరాలకు గడచిన శతాబ్దంలోనూ ఈ శతాబ్దంలోనూ వెళ్ళారు. ఖండాంతర వాసులైన తెలుగు సోదరులతో, ఇటీవల జరిగిన ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా, పునస్సమ్మేళనం జరిగి అదొక చారిత్రక సన్నివేశంగా పరిణమించింది. అన్నదమ్ముల ఈ రాకపోకలు భవిష్యత్తులో సాంద్రతరములు, స్వల్పవ్యవధానములు కాగలవని ఆశిద్దాము.

పురుషులకు ఉత్సాహదాయకము లగు పుణ్యదినములు పండుగలు కొన్ని పేర్కొనవచ్చును. ఉగాది సర్వులకును ప్రీతిదాయక మైనది. చైత్ర శుద్ధమునందు శ్రీరామనవమి, సీతారాముల ఉనికిచే పునీతమైనవిగా

భావింప బడుచున్న భద్రాద్రి, పర్ణశాల క్షేత్రములను పలువురు సందర్శిస్తారు. చైత్రశుక్ల పక్షమునందే వసంత నవరాత్రులు చేస్తారు. ఏరువాక పున్నమికి రైతులు వ్యవసాయ కార్యక్రమాలకు పూనుకుంటారు. శ్రావణ బహుళ అమావాస్యను పొలాల అమావాస్యగా పరిగణిస్తారు. ఇప్పటికి కృషి కార్యములు చాలవరకు అయి యుంటాయి. నాట్లు పడిపోతాయి. ఇన్నాళ్ళు దుక్కిదున్ని అలసిపోయిన వృషభరాజములకు కొంత విశ్రాంతి ఇవ్వాలి. శ్రావణ అమావాస్యనాడు ఎద్దులను కడిగి, అలంకరించి, బెల్లము, నూనె, నువ్వులు మొదలైనవి తినబెడతారు. ఇవి పెట్టుటచే దుక్కిటెద్దులు రొమ్ముతాకుడు (బరువులు లాగుటచే గుండెలకు కలుగు శ్రమ) లేకుండ బలము కలిగి ఉంటాయి. మగవారికి ఆసక్తి కలిగించే వాటిల్లో గణేశచతుర్థి : భాద్రపద బహుళమున మహాలయము (పితృదేవతారాధన), ఆశ్వయుజ శుద్ధమున దసరా-జమ్మిస్వారి, సీమోల్లంఘనము వంటివి-దీపావళి తూటాల పోటీలు, సంకురాత్రి కోడి పందెములు, హోలీక్రీడలు- ఇటువంటివి కొన్ని. ఆంధ్రులు ఆరాధించే దైవతములు పలువురు ఉన్నప్పటికీ ముఖ్యమైన దైవతములు...సత్యనారాయణస్వామి, తిరుపతి వేంకటేశ్వరస్వామి, శ్రీశైల మల్లికార్జున దైవము. సత్యనారాయణ వ్రతాన్ని పామరులు కూడా చేస్తున్నారు. దీనిని వారు ముద్దుగా సత్యనారాయణ కత అంటారు. పుణ్యక్షేత్రములలో భద్రాద్రి, అన్నవరపుకొండ, శ్రీశైలము, మహానంది, త్రిపురాంతకము, శ్రీ కాళహస్తి, తిరుమల తిరుపతి, తెలంగాణంలో రామప్ప క్షేత్రము, ప్రాచీనములైన కాళేశ్వర ధర్మపురి క్షేత్రాలు పలువురు సందర్శిస్తారు. ఉత్తరాది ఆంధ్రులు అరసవెల్లి సూర్యనారాయణస్వామిని, సింహాచలము, శ్రీ కూర్మము సేవిస్తారు. అవకాశమునుబట్టి తెలుగు వారందరు అన్ని క్షేత్రాల దైవతములను ఆరాధిస్తూనే ఉంటారు. శైవ వైష్ణవ భక్తి సంప్రదాయములు ఇప్పటికీ ఉన్నప్పటికీ పూర్వం ఉండేటంత 'నన్ను ముట్టుకోకు' భావం ఇప్పుడు లేదు. ఈ యుగంలో దైవాంశ సంభూతులుగా వెలిసిన హరనాథబాబా, సాయిబాబా, భగవాన్ తాతాజీ మొదలైన సిద్ధపురుషులను కొలిచి వారి సందేశామృతం ఆస్వాదించేవారు చాలామంది ఉన్నారు. తెలుగు గ్రామసీమల్లో అంటరానితనం సాగుతూనే ఉంది. సజ్జనుల ప్రబోధంచేతనూ, ప్రభుత్వం వారి కృషిచేతనూ ఇది బాగా పట్టు సడలింది. ఆ కులంలో నుంచి స్వర్గీయ దామోదరం సంజీవయ్యగారి వంటి పుణ్యులు జనిస్తున్నారు.

3. ప్రౌఢ వయస్సు : వీరి అభిరుచులు యౌవనమునందే స్థిరపడి ఉంటాయి. ధర్మచింతన చేస్తూఉండడం, ధర్మగ్రంథాలు చదవడం, ప్రవచనములు వినడం, కాశీ రామేశ్వరాది దూరపుణ్యక్షేత్రాలు సందర్శించడం ఇవి తెలుగు వారికి పెద్ద వయసులో ప్రీతిదాయకములు. ప్రజాహిత కార్యాచరణ, పంచాయతీలు మున్నగు సభలలో సభ్యత్వము వీరిని వ్యాపృతులుగా ఉంచుతాయి. సమిష్టి కుటుంబ పద్ధతి ఈనాడంతగా వ్యాప్తిలో లేదు. కుమార్తెలత్తవారిండ్లకునూ, కుమారులు ఉద్యోగాల నిమిత్తమూ, వ్యాపారాభిలాష చేతనూ గృహమునకు దూరమగుటచే వృద్ధులగు మాతాపితరులు అచ్చపు శాంతినే అనుభవిస్తూ ఉంటారు. ఈకాలంలో పల్లెటూళ్ళనుండి పట్నవాసాభిముఖంగా జనయాత్ర తీవ్రతరం అయింది. విద్య కోసము, పై కోర్టులలో అభియోగాల కోసము, కార్మికులైనవారు జీవనోపాధికై ఫ్యాక్టరీలుగల నగరాలకు తరలి వెళ్ళవలసి ఉండడం చేతను, వర్తకులు వాణిజ్యం కోసము, ఈవిధంగా నగరము అసంఖ్యాక ప్రయోజనాలకు కేంద్రంగా ఏర్పడడంచేత జనం విస్తారంగా నగరాల్లో అచ్చటి అసౌకర్యాలకు గురిఅవుతూ జీవిస్తున్నారు. అందుచేత పల్లెటూళ్ళు నిస్తేజంగా అవుతున్నాయి. ప్రభుత్వంవారు నగరాభిముఖయాత్రా సమ్మర్దాన్ని సడలించడానికి ప్రయత్నిస్తున్నారు. ప్రజల వేడుకల్లో ముఖ్యమైనది సినిమాలు చూడడం. ఇది పట్నవాసాల్లో కేంద్రీకృతం అవడంచేత బెల్లం కోసం చీమలవలె బాలురు, యువకులు, ఓపిక ఏమాత్రమైనా మిగిలిన వృద్ధులూ నగరాలకు యాతాయాతములు చేస్తున్నారు.

4. వనితాలోకము : మంచికో చెడ్డకో మన సాంఘికాచారాలు స్త్రీ లోకంలో విస్తారంగా జీవించి ఉన్నాయి. జీవితావసరాల్ని బట్టి స్త్రీలు పురుషులకన్న

ఎక్కువగా సంప్రదాయప్రీతి కలిగి ఉంటాము. సాంఘిక జీవితానికి కేంద్రము ఇల్లుగనుక ఆ మర్యాదల్ని కాపాడుకుంటూ రావడము ఇల్లాండ్ర కర్తవ్యమైనది. తెలుగుభాషలో వ్యాకరణ ప్రయోజనాల కోసం శబ్దాల్ని మహత్తులు-అమహత్తులు అని విభాగించి, అందులో స్త్రీలను అమహద్వాచకాల్లో చేర్చారు. దీన్ని చూసి కొందరు పాశ్చాత్య పండితులు తెలుగువారికి స్త్రీ సమాజంమీద తృణీకార మనే వింత సిద్ధాంతానికి వచ్చారు. కాని, బళ్ళల్లో చిన్నపిల్లలుకూడా చదివే సుమతీశతక పద్యం విని ఉంటే వారు అట్లా పొరబడి ఉండరు.

'కులకాంతతోడ నెప్పుడు
కలహింపకు, పట్టి తప్పు ఘటియింపకుమీ
కలకంఠి కంటి కన్నీ
రొలికిన సిరి యింట నుండ నొల్లదు సుమతీ.'

అయితే ఇప్పుడిప్పుడు మహిళాలోకం కూడా భావ సంఘర్షణకు లోనవుతూంది. కాలానుగుణంగా మారక పోతే దేశాభ్యుదయమూ, సమాజ ప్రగతీ కుంటుబడతాయి. పాశ్చాత్య నాగరికతా సంపర్కంచేత వేష భాషల్లో ఆచారాల్లో మార్పులు వస్తూనే ఉన్నాయి. పురుషుల్లో ముందు, స్త్రీలల్లో కొంచెం ఆలస్యంగా. ఇప్పుడు స్త్రీవిద్య పట్నవాసాల్లో బాగా వ్యాపిస్తూంది. పల్లెటూళ్ళల్లో మందమందంగా సంచరిస్తూంది. కళారంగంలోనూ విద్యారంగంలోనూ బాలికలు యువతులు పురుషుల్తో పోటీ పడుతూ ఒక చూపువాసి తామే మేలు అనిపించుకొంటున్నారు. సహవిద్య గల సంస్థల వలన ఎక్కువ మేలే కలుగుతూంది. వయసువచ్చే ఆడపిల్లలు మగపిల్లగాండ్రు ఒకరొకరి అభిరుచులు తెలుసుకుంటూ అన్యోన్యం గౌరవించుకొంటూ ఉద్రిక్తతలు లేకుండా సంచరించడం సంపూర్ణశ్రేయోదాయకంగా ఉంది. లోపాలు లేని మనుష్య వ్యవస్థే లేదు. చదువు సంధ్యల సందడి చేత బాలికలూ యువతులూ, నవనాగరికతా విధానములైన క్లబ్బుజీవితం చేత సంపన్న మహిళలూ తెలుగువారి సాంఘికాచారాలకి కొంతదూరమవుతున్నారు. చదువులచేతనూ ఉద్యోగాలచేతనూ బాల్యవివాహాలు నగరాల్లో కన్పించడం లేదు.

తెలుగు సంఘంలో మరొక ముఖ్యమైన మార్పు వస్తూంది. ఇది భారతదేశ సామాన్యము అన్నా తప్పులేదు. అదేమిటంటే సమిష్టి కుటుంబ పద్ధతి. దీనిలో అత్తమామలు కుటుంబాధినేతలు. తరువాత కొడుకులు, పొలంలోనూ బయట కష్టిస్తారు గనుక. ఆడబడుచులు అని చెప్పబడే ఇంటికూతుండ్రది కూడా ప్రముఖ స్థానమే. అందుచేతనే 'ఆడుబిడ్డంటే సగం మగడు' అని సామెత వచ్చింది. కట్టకడపటి స్థానం కొత్త కోడళ్ళది. కోడంట్రికము అనే అనవసర సమస్య ఏర్పడి ఎన్నో గృహచ్ఛిద్రాలకు శోకాంత ఘట్టాలకు దారి తెరిచింది. ఇప్పుడిప్పుడు పల్లెటూళ్ళలో కూడా వివేకం జాగృత మవుతూంది. పరాయియింటి పిల్లను మనయింటి పిల్లలాగే చూచుకోవా లనే సౌమనస్యం సంభరిత మవుతూంది. స్త్రీ జీవితాన్ని నియమించే ముఖ్యలక్ష్యము పాతివ్రత్యమూ, ఉత్తమ సంతానప్రాప్తి. పాశ్చాత్య నాగరికత గాని ఉన్నతోన్నతవిద్య కాని ఎంత వ్యాపించినా ఈ రెండు ధర్మాల విషయంలో శ్రద్ధాసక్తులు యథాతథంగానే ఉంటున్నాయి. ఆడువారు పట్టే నోములు, ఆచరించే వ్రతాలు చాలభాగం మంచి మగడు, మంచి సంతానం అనగా సుఖమయమైన కుటుంబం కోరి చేసేవిగానే కనబడుతున్నాయి.

పూర్వం ఆడపిల్లల చదువుసమస్య ముఖ్యంగా భావింపబడకపోవడంచేత వారిని భవిష్యజ్జీవితానికి తరిఫీదుచేసే ఆచారాలే ప్రాముఖ్యం వహించేవి. అవి చాలా అందమైనవీ భావగర్భితమైనవీ అనడంలో వెనుకాడనక్కరలేదు. కన్నెపిల్లలుపట్టే నోముల్లో — కన్నెతులిసమ్మ నోము, మూగనోము, చిట్టిబొట్టు, ఉదయకుంకుమ, నిత్యశృంగారము, ఉండ్రాళ్ళతద్దె, అట్లతద్దె, చద్దుల బతకమ్మ, బొమ్మల నోము మొదలైనవి ఎన్నో ఉన్నాయి. బాలికలకు శీలము, మితభాషిత్వము, వెగటు కాని సింగారం చేసుకోవడం,సంయమనం ఇవన్నీ నేర్పవలసిన మంచి లక్షణాలు. పై నోములందుకే ఏర్పడ్డాయి. మూగనోము చూద్దాము. దీపావళి మొదలు కార్తీకశుద్ధ పూర్ణిమదాకా బాలికలు ఈ నోము పడతారు. సూర్యాస్తమయానికి ముందే భుజించి, నీళ్ళు పోసుకొని అలంకారం చేసుకొని, గౌరీదేవిని పూజించి ఊరి పేరంటాళ్ళకు బొట్టుపెట్టి రావాలి. బయలుదేరి

నప్పటినుంచి, నక్షత్రాలు వచ్చి కొన్నింటిని లెక్కపెట్టే దాక, మౌనం పాటించాలి. ఎవరు ఎన్నివిధాల మాట్లాడించినా పెదవి విప్పరాదు. ఇది మితభాషిత్వాన్ని నియమశీలతను పోషించేదిగా కనబడుతూనే ఉంది. చల్లుల బతకమ్మ వ్రతం తెలంగాణంలో విస్తారంగా కనబడుతుంది. ఇందులోనూ గౌరీ పూజ అందంగా ఉంటూంది. స్త్రీల సౌభాగ్యంకోసం గౌరిని, సంపద కోసం వరలక్ష్మిని కొలవడం అనాది సిద్ధాచారాలు. బతకమ్మ పూజలో భక్తి, కళాప్రియత్వం రెండూ కనబడతాయి. వేరువేరు పువ్వులతో అమ్మవారిని పేర్చడం ఒక శిల్ప విన్నాణము. ఆమె చుట్టూ పాటలు పాడుతూ నృత్యం చెయ్యడం కళాభ్యసనం అవుతూంది. ఈ పండుగను ఆశ్వయుజ శుద్ధంలో చేస్తారు. అంతకు ముందు మహాలయ పక్షంలోనే కన్నెపిల్లలు బొడ్డెమ్మను కొలుస్తారు. శ్రావణమాసంలో మంగళగౌరీవ్రతం చేసుకొని సెనగలు పంచిపెడతారు. పౌర్ణమి ముందర శుక్రవారంనాడు వరలక్ష్మీవ్రతం. క్రొత్తగా పెండ్లి అయిన ఆడపిల్లలకు అత్తవారు బంగారు సొమ్ములు పంపుతారు. శ్రావణ బహుళ అమావస్యను స్త్రీలు పోలేరమ్మ అమావాస్య అంటారు. ఆనాడు పిలకలతో ఉన్న కందచెట్టును తెచ్చి పసుపు కుంకుమ రాసి పూజిస్తారు. పోలేరమ్మ దయచేత తమ సంతానం కంద పిలకల్లా తామర తంపరగా పెరగాలని కోరుకొంటారు. అట్లతద్దినాడు చంద్రుణ్ణి పూజించి అట్లు వాయనం ఇస్తారు. చంద్రునివంటి ఆహ్లాదకరుడైన భర్త రావాలని కన్నియలు వేడుకుంటారు. కార్తీక శుద్ధ చవితి నాగుల చవితి. సంతానవతులైన గృహిణులు పాముపుట్టలో పాలుపోసి నాగుమయ్యను తమ సంతానాన్ని భర్తలను కాపాడమని మొక్కుకుంటారు. సంకురాత్రికి బొమ్మల నోము. ఇది సంఘపూజ. చాలమంది మహిళలు కలిసి పనిచేస్తారు. ధనుర్మాసంలో కన్నెపిల్లలు సందడిగా ఉంటారు. చీకటితోనే లేచి పెండతో గొబ్బెమ్మను చేసి ముగ్గులు పెట్టి పాటలు పాడుతారు. గొబ్బిపిడకల్ని భోగిమంటల్లో వేసి ఆనందిస్తారు. రథసప్తమి ఉత్తరాయణాన్ని సూచిస్తుంది. గృహిణులు ఈనాడు పాలు పొంగించి సూర్యనారాయణమూర్తిని ఆరాధిస్తారు. కుటుంబ క్షేమమే ఆంధ్ర స్త్రీల ధ్యేయము.

## ప్రబోధము

అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయములు స్థాపించునాడు
ఓరుగల్లున రాజవీరలాంఛమునగాఁ బలు శస్త్రశాలలు నిలుపునాడు
విద్యానగర రాజవీధులఁ గవితకు పెండ్లి పందిళ్ళు కప్పించునాడు
బొట్టుగారికి సమీపమున నాంధ్ర సామ్రాజ్య దిగ్జయస్తంభ మెత్తించునాడు
ఆంధ్రసంతతికే మహితాభిమాన దివ్యదీక్షా సుఖస్ఫూర్తి తీవరించె
నా మహావేశ మర్థించి యాంధ్రులార! చల్లు డాంధ్ర లోకమున నక్షతలు నేడు.

— రాయప్రోలు.

# తెలుగు పండుగలు

## రావూరు వెంకట సత్యనారాయణరావు

### తెలుగు పండుగలు వెలుగు మజిలీలు

పండుగ అనగానే మనస్సులో ఏదో వెలుగు నిండి నట్లు తోస్తుంది. పెద్దలు నిర్ణయించిన పండుగలు కొన్ని ప్రతి సంవత్సరం పసిడి వలయాలుగా అవతరిస్తూ వుంటాయి. నిజానికి మనస్సుకు ఆనంద రసానుభూతి అందిన సమయాలను కూడా మనం పండుగలుగా భావించి సంబరాలు పడుతూ వుండటం సహజం.

నిజానికి మానవ జీవితం ఒక పెద్ద పండుగ. మనం జరుపుకొనే పండుగలన్నీ ఆ పండుగలో పండుగలు. మానవులంతా పెదవులమీద చిరునవ్వులతో, ఆధ్యాత్మిక స్పందనతో, అమృత భావనతో జీవించాలని భగవంతుని ఆశయంగా వర్ణింపబడింది. మానవ హృదయం-సహనం, సంస్కృతి, త్యాగం, రాగం, భోగం, దానం, వినయం, విజ్ఞానం మొదలైనవాటికి నిలయమని సృష్టికర్త భావన. ఇన్నింటితో కూడిన మానవజీవితం నిత్యకల్యాణంగా భాసించడాని కేమి అభ్యంతరం వుంటుంది ? ఈ దివ్య సంపదలతో మానవుడు పురోగమించి మానవాతీతుడు కావాలని భగవంతుని సంకల్పం.

అంతటి పరిపూర్ణతను, ప్రాభవాన్ని నిలుపుకోవడానికి తగినశక్తి మానవులలో లోపిస్తోంది. మరి సంతోషభావన కల్పించడానికి మార్గ మేమిటి ? భక్తి భావనలో తన్మయత్వం చెందే అవకాశా లున్నాయి. ప్రతి మానవుడూ ఇహాన్ని మరచి పరలోకంలోకి తొంగిచూచి మోక్షానుభూతిని పొందడానికి భక్తి ఏకైక లక్ష్యం. దీనిని నిత్యసాధనగా నియమించుకోగల స్థితి ఏ కొద్దిమందికో మాత్రమే సాధ్యం. తక్కినవారు సంసార బాధ్యతలో పడి కొట్టుకుపోతూవుంటారు. వీరికి తమ్ము గుర్తించుకునే అవకాశాలే తక్కువ. అలాటి ప్రజాసీకానికి పెద్దలు నిర్ణయించిన పండుగలు ఎంతో దోహదం చేస్తాయి.

నిత్యం తమంత తాముగా పొందలేని ఆనందాన్ని భక్తిపారవశ్యాన్ని పండుగలు అందిస్తూవుంటాయి. ఏ ఒకటి రెండో తప్ప తక్కినపండుగలన్నీ మత సంబంధమైనవే ! అంటే భగవంతుని లీలలతో హేలలతో ముడిపడినవే. అందువల్ల పండుగలు మానవుని నిత్యయాత్రలో రవంతసేపు నిలిచి, భగవంతుని కొలిచి, ఐహికాన్ని గెలిచి, తోటివారిని ఆనందముతో పిలిచి, శాంతినీ తృప్తినీ సంతరించుకోగల తీర్థయాత్రల వంటివి.

### ఉగాది పొద్దులు : వెన్నెల హద్దులు

మనకు మొదటగావచ్చే పండుగ ఉగాది. 'ఉగాదినాడు మూగ పెదవులు కూడా కదులుతాయి' అనేది సామెత. అలాటి సమయంలో మామూలు హృదయాలు ఆనందంతో గంతులు వెయ్యడంలో అశ్చర్యంలేదు. ఎండలో పయనించే పాంథుడు ఒక మజిలీ చేరి, మామిడి తోపులో చల్లటి నీడలో నిలబడి, వికసిత కుసుమాలను, వీచీలహరులను, పిక సంతతి కూజితాలను విని ఆనందంలో మునిగి ముకుళిత హస్తాలతో పరమ పురుషుని ప్రార్థించినట్లుగా జీవనయాత్ర కొనసాగిస్తున్న బాటసారులకు ఉగాది ఒక చక్కటి పర్వదినం-పసిడి స్వప్నాల ఊయల - భవిష్యత్తుకు కర్పూర నీరాజనం, గతించినజీవితాన్ని తాత్కాలికంగా మరచి, ఆనందంతో మరొక వత్సరంలో అడుగు పెట్టిన సంబరంతో తీయటి కలలతో, తరితీపివెన్నెల చూపులతో, పకపకలాడే నరుల వదనాలతో ఎన్ని నవ్య భావనలు తొంగి

చూస్తాయో ఎలా వర్ణించడం ! ఉగాదులు వస్తూనే వుంటాయి; మనస్సులను ఊరిస్తూనే వుంటాయి. పేరులు మారినా అవి వెన్నెల వలయాలుగా మానవ జీవితాల చుట్టూ పరిభ్రమిస్తూ భ్రమర గీతా లాల పిస్తూనే వుంటాయి; రామచిలుక పచ్చటిరెక్క విసిరి నట్లు సొగసుగా అవి వ్యజనసేవ చేస్తూనేవుంటాయి. ఉగాదులు ఆబాలగోపాలానికి ఏదో 'ఆదిని' కల్పిస్తూనే వుంటాయి.

వేపలు పూస్తాయి; వేడుక కల్పిస్తాయి; ఋతు లక్ష్మికి పట్టిన పైడిగొడుగులుగా నిలుస్తాయి. నూతన వత్సరానికి నరులకన్న తరువులే ఎక్కువగా పులకించి స్వాగతవాక్యాలు పలుకుతాయి. మామిడి చెట్టుపై కొమ్మ కొమ్మనూ పిందెలు నిండి 'కొమ్మకొమ్మకూ కోటి లింగాలు' అన్న సామెతను సార్థకం చెయ్యడానికి పూనుకొంటాయి. వేపలు, మామిళ్ళు – చేదు వగరులకు ప్రతీకలు. ఈ రెండింటిలో రవంత తీపి రంగరించి ఉగాదపచ్చడి చేసి సేవిస్తారు. దీనిలో ఎంతో వేదాంత భావన నిండివుంది.

బ్రతుకు చేదువగరులతో నిండి వుంటుంది; వాటిని తప్పించుకోవడం అసాధ్యం. కనుక భక్తి అనే తీపిని అందులో రంగరించుకోవడం ఒక్కటే మార్గం. అప్పుడే ఆ వగరును, చేదును అనుభవించగలుగుతాం– అనే భావం ఈ ఉగాది పచ్చడిలో దాగి ఉంటుంది. ఇతర పండుగల సందర్భంలో ఎలా వున్నా ఉగాదినాడు తప్పకుండా అందరూ కొత్త ఉడుపులు ధరిస్తారు. జీవితాన్ని వేడుకగా గడపటానికి ప్రయత్నిస్తారు. హితులను, అల్లుండ్రను ఆహ్వానిస్తారు. వారిని యథోచిత రీతిని సత్కరిస్తారు. తమ మనస్సునూ, గృహాన్ని వెన్నెల మందిరంగా చేసుకోవడానికి పూను కొంటారు. "పండుగనాడు ఎలా గడిపితే సంవత్సర మంతా అలా గడుస్తుంది" అనే విశ్వాసం ఒకటి కల్పించుకొంటారు. ఇలా జరిగినా, మానినా-సంవత్సర మంతా యీ రీతిగా గడపాలనే ఆకాంక్ష అందరిలో బయలుదేరుతుంది.

"ఈ ఉగాదికి సేసి
కెంత ఉత్సాహమో
చెప్పమంటే రావు
సేసి చేసిన పనులు"

ఇలాంటి సే సమ్మలు ప్రతి ఇంటా వెలుస్తారు; ప్రతి కంటా మెరుస్తారు. జీవన శోభ ఎన్నో రీతులుగా వెల్లి విరుస్తుంది ఉగాది ప్రొద్దుల్లో నిండు మనస్సును ప్రద ర్శించ కలిగినగృహస్థు "బ్రతుకంతా ఉగాదిగా మార్చవా భగవాన్" అని లోలోపల నమస్కరిస్తా డాయనకు. నూతన సంవత్సరారంభంలో బ్రతుకును సింహావ లోక నం చేసుకొని, భవిష్యత్తును గురించి బంగారు కలలు కంటూ ముందడుగు వేస్తాడు మానవుడు. కాని, కొద్ది అడుగుల తర్వాతనే బ్రతు కొక ఉగాది కనుక ప్రతి రోజునూ ఉగాదిగా మార్చుకోవాలనే సత్యాన్ని మరచి పోతాడు. మళ్ళా ఉగాది వచ్చిన జ్ఞాపకం చేసేదాకా అంతే !

## రామయ్యణ్ణి దగ్గిర చేశాడు గోపన్న

ఇలా కొన్ని అడుగులు ముందుకు వేయగానే– ఎదురుగా వచ్చి నిలుస్తుంది శ్రీరామనవమి. అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడు, అయోధ్యరాముడు మళ్ళా మనకు జ్ఞాపకం చేస్తాడు-మానవ జీవితం ఆధ్యాత్మిక వలయాలలో ఎలా చుట్టుకు పోయేదీ! మానవుడై జన్మిం చిన ఆ సాకేత ప్రభువు కల్యాణం. ప్రతి వారి చెవుల్లో సీతారాముల కీర్తనలు ఎవరూ పాడకుండానే వినిపి స్తాయి. అయన లీలలు కను లరమూసుకుంటేనే కనిపి స్తాయి. రాముడు వైదేహిసహితు డవుతున్నప్పుడు పుడమి పులకరిస్తుంది. గగనం రవంత మెరుగవుతుంది. మేఘమాలలు ముత్యాల జల్లులు కురిపిస్తాయి.

అందరికీ రాముడు ఇష్టదైవం. తెలుగువారికి మరింత దగ్గిరవాణ్ణి చేశాడు గోపన్న. భద్రాచలం ఆయన గారికి స్థిరనివాసం చేశాడు. ప్రతినిత్యం గోదావరిని రామనామస్తోత్రం చెయ్యమని కోరాడు. తను రామ చంద్రుడు ప్రార్థించి పునీతుడయ్యాడు. ఆయన చరిత్ర రామభక్తు లందరికీ మహాకావ్యం. కోదండపాణి కోటి సూర్యుల కాంతితో ప్రకాశిస్తున్నట్లు దర్శనమిస్తాడు, రామదాసు కీర్తనలో రామయ్యా అందరికీ తండ్రి, సీతమ్మతల్లి ... ప్రతివారికీ పితృమాతృ దేవతల దర్శ

నం ప్రతినిత్యం కావచ్చు. కాని, అందరూ సీతారాముల దర్శనం కోసం ప్రాకులాడుతూ వుంటారు: ప్రార్థనలు జరుపుతూవుంటారు. ఊరూరా కల్యాణం జరుగుతుంది. అందరి తలలపై తలంబ్రాలు వెదజల్లబడతాయి. అందరి హృదయాలూ భక్తిభావముతో పల్లవిస్తాయి.

"రావయ్య రామా
నవనీరద శ్యామా ॥రా॥
మునివేళ్ళను ఎగిరి ఎగిరి
ఎదురు చూచినది శబరి.
నీ అరికాళ్ళను తుడిచి తుడిచి
పడవ నెక్కించెను గుహుడు ॥రా॥

ఆంధ్రదేశంలో ఊరూరా ఒక శబరి, ప్రతి గృహంలో గుహుడు వున్నారంటే ఆశ్చర్యంలేదు. శ్రీరామనవమి జీవితానికి క్రొత్త శక్తిని, అనుపమ భక్తిని ప్రసాదించే పండుగ.

పట్టాభిరాముణ్ణి తలచిన తర్వాత పవన తనయుణ్ణి స్మరించకుండా ఎలా వుండగలం? అయోధ్యరాము డెక్కడ వుంటాడో అంజనీసుతుడు అక్కడ వుంటాడం టారు. అలాంటి మహనీయుని జయంతి తర్వాత జరుపు కొంటాం. మననం చేసుకొన్న రామనాను ప్రభావాన్ని అంజనేయస్తోత్రంతో మరింత బలపరుచుకొని మధుర భావనంలో మునిగిపోయే అవకాశం మనకు లభిస్తుంది. 'శ్రీ ఆంజనేయం ప్రసన్నాంజనేయం' అని స్మరించి పులకరించడం భక్తులకు పరిపాటి. జై హనుమాన్ జీవనగతుల్ని సరిదిద్ది ధైర్యాన్ని శక్తిని ప్రసాదించే దివ్యమూర్తి! సంజీవిని తేగల సమర్థుడు. ఆయన స్మరణ పవిత్ర దీక్ష; శ్రీరామ రక్ష కూడా!

గ్రీష్మతపంలో నుంచి బయట పడతాం. తొలకరి జల్లులు వెలగల ముత్యాలుగా కురుస్తాయి. మనస్సులు సేదతీరుతాయి స్వేదం అంతరించి మోదం అవతరి స్తుంది. రైతులు ఏరువాక సాగుతారు. ప్రతి గొంతులో కోయిల పాటలు వినిపిస్తాయి. నారుమళ్ళలో విత్తులు చల్లుతారు. క్రొత్త పంటకు నాందిగీతాలు పాడుతారు. చేతివెంట ఎదుగుతుంది నారు. రైతుల కళ్ళల్లో జ్యోతులు వెలుగుతాయి. పంటలక్ష్మి ప్రయాణానికి సిద్ధమతుంది.- కాళ్ళకు పారాణి దిద్దికొంటూనో, కళ్ళకు కాటుక దిద్దుకొంటూనో! ఎలాటి మహోత్స వం! ఎలాటి పండుగ! మత సంబంధం కాకపోయినా మనుగడ సంబంధమైన పండుగ ఇది.

## శ్రావణంలో ఇంటింటా తోరణాలు

ఆషాఢమేఘాలు అల్లనల్లన ప్రాకిపోతాయి. చల్లటి పిల్ల తెమ్మెరలు వీస్తూవుంటాయి. భూమాత పచ్చని పూల తివాసీగా మారిపోతుంది. మనస్సుల్లో ఆహ్లాదం పిల్లన గ్రోవిగా వినిపిస్తుంది. సంసారాలు చల్లగా సాగి పోతుంటాయి. మగువల పండుగ వస్తుంది. శ్రావణంలో ఇంటింటా తోరణాలు వెలుస్తాయి. మనస్సుల్లో పన్నీటి జల్లులుకురుస్తాయి. అతివలువరలక్ష్మీవ్రతం ఆరంభిస్తారు. క్రొత్తగా పెళ్ళి అయినవారు వ్రతం పడతారు. మంగళ వారాలు, శుక్రవారాలు ఇంటింటా వరలక్ష్మీపూజలు జరుగుతాయి. అతివలలో తేజస్సు తొంగిచూస్తుంది. వ్రతాలు వాటినంటి పేరంటాలు; చక్కగా అలంకరించు కొని మహాలక్ష్మిదూతలలాగే పకపకలాడుతూ పండుగ చేసుకొంటారు: మంగళహారతులు పాడతారు. మానవ జీవితాభ్యుదయానికీ, జాతీయ సుసంపదకూ, సుభి క్షానికీ, శాంతికీ ఈవ్రతమహిమ ఎంతో వుపకరిస్తుంది.

నిత్యకల్యాణం పచ్చతోరణంగా గృహాలు భాసించా లనీ, వదనాలు వికసించాలనీ కోరుతూవుంటాం. అలాటి సంపదలు శ్రావణమాసంలో ద్యోతకమవుతాయి. వీధిలో ముసిముసి నవ్వులతో ముత్తైదువుల ఊరేగింపులు - ప్రతి ఇంట దేవి విగ్రహాలు - మంగళ గీతాలు - నిత్యం దివ్యనీరాజనాలు. ఎంత గొప్పపండుగ! వారు చేసిన వ్రతాలు సిద్ధించాలి. జాతీయ జీవనం శుభప్రదంగా వర్ధిల్లుతుంది. అతివలు అపరదేవతా మూర్తులుగా ప్రత్యక్షమౌతారు. వారి పకపకలు ఎంతో నిండుగా వినిపించి పండుగచేస్తాయి. శ్రావణం నిండైన పండుగ. మా ఇంట్లో ఒక ముసలమ్మ అనేది-- "నాలుగు శ్రావణా లొక్కసారి వరుసగా వస్తే చూడా లని వుంది. దానితో భూమి పవిత్రమైపోతుంది. స్త్రీ జన్మ సార్థకమైపోతుంది" అని. అలా రావడానికి ఎక్కడ వీలుంటుంది! తక్కిన పండుగలు తమ వంతు ఆనందాన్ని అందించడానికి తొందరపడవూ?

పరవశంతో ప్రమదలు హృదయాల నిండి ఉన్న తరుణంలో అందులో వయస్సు వచ్చిన వారినందరినీ యశోదలుగా మార్చాలని కృష్ణాష్టమి పరుగున వస్తుంది. చల్లటి వేళ నల్లనయ్య పుట్టాడు. తాను నల్లనై ఇతరుల హృదయాలలోని నల్లతనాన్ని రూపుమానడానికి వస్తా డాయన. ఆ కంసారి కారుచీకట్లను తరిమి వేణు నాదంలో వెన్నెల జల్లులు కురిపిస్తాడు.

జన్మాష్టమి ఎంత వినోదమైన పండుగ! ఎంత వేదాంతపరమైన మహోత్సవం! అందరి హృదయాలలో కృష్ణలీలలు తొంగిచూస్తాయి. అందరి చెవులవద్ద తువ్వాయిల మెడలో గంటలు వినిపిస్తాయి. కనిపించని కేకిపింఛం పిల్లలతలలపైన వూగుతుంది. భక్తిరస భావం అందరిలో తూగి సాగిపోతుంది. అన్ని దిక్కు లకూ పరమపురుషుని జన్మదినం. భగవద్గీతను బోధిం చిన రథసారథి బోధనామృతం పండిన హృదయాలలో భక్తిరసం పిండిపోస్తుంది. కృష్ణ పరమాత్మను తలచి, కొలిచి, మనసార పిలిచి తన్మయత్వం చెందని జీవి ఎక్కడ వుంటాడు ?

## బ్రతుకులు పురివిప్పిన నెమళ్ళు

అంతులేని ఆనందం, స్వాంతాన్ని కుమ్మరించే పాటలు. ప్రతి ఇంటా వెన్న ముద్దల పంపిళ్లు. పంటలు పండబోతుండగా వాటివంకనుంచి దృష్టిని మరలించి భక్తి రసాన్ని పండించుకొమ్మని హెచ్చరిస్తుంది కృష్ణా ష్టమి. కరువార స్మరించుకొమ్మంటుంది. పురుషులందరూ నంపులై పరవశంతో చిందులు త్రొక్కమంటుంది. విశ్వరూపుణ్ణి తలచి, తల పాదాల మీద వాల్చి మొక్క మంటుంది కృష్ణాష్టమి.

ఇంతలో వస్తుంది వినాయక చవితి. మనస్సులు స్థిరపడి, మధురభావనలు ఉప్పొంగి, ఆధ్యాత్మిక చింతనాయత్త చిత్తులైన మానవులు శివకుమారుని పూజించడానికి పూనుకొంటారు. ఎట్టి విఘ్నాలు లేకుండా కాపాడవలసిందిగా ఆయన్ని ప్రార్థిస్తారు. ఉండ్రాళ్ల నైవేద్యంపెట్టి 'తొండము నేకదంతమును'... అని పద్యాలు పఠిస్తూ ఆయన ప్రాపకాన్ని అర్థిస్తారు. ఆ బొజ్జ గణపయ్యను ఆదిలో సేవించి అన్ని విధాలా శుభాలు పొందడానికి యత్నిస్తారు. వినాయక చవితి .. ఎంతో భక్తితో చేసే పండుగ. బ్రతుకు వెంట ఆ ఏక దంతుడు నడిచి భాగ్యభోగాలు, సుఖ శాంతులు కల్పించ గలడని విశ్వాసం. ఆదిలో ఆయన్ని తలవని పూజ లేదు. క్రతువు లేదు. కార్యక్రమం లేదు. అయినా చవితినాడు ఆయన్ని మనసారా కొలిచి, కొంత తృప్తినీ, శాంతినీ పొందుతారు అందరు గృహస్థులూ.

పంచాంగాలు సంవత్సరాన్ని ఎలా సూచించినా ప్రజానీకానికి పంటలతో నూతన సంవత్సరం ఆరంభ మవుతుంది. అంటే సిరి నవ్వుతూ ఇంట్లో, వంట్లో సాక్షాత్కరించడమే నూతన జీవితారంభం—అదే క్రొత్త సంవత్సరం. ఆ పండుగ రాబోతున్న సమయంలో పంటపొలాలు పొట్టలమీద వున్న తరుణంలో – జరుగు తుంది వినాయక పూజ. కొంద రీ ముక్కంటి ముద్దు బిడ్డడిని పంటల దైవంగా కూడా భావించి పూజిస్తారు. వినాయక చతుర్థి వినూత్నశక్తి కల్పిస్తుంది.

## నవరాత్రులలో నరులు కిన్నెరలు

విఘ్నరాజును కొలిచిన బలంతో వేల్పుటమ్మలను కొలిచే అవకాశం లభిస్తుంది. అల్లన అడుగు పెడతాయి నవరాత్రులు—శుభరాత్రులు. పరమ పవిత్రమూర్తి దుర్గను, వెన్నెలకిరీటధారి వాణిని – అర్చించి, కృతార్థు లయ్యే పుణ్య ఘడియలు. తొమ్మిది రోజులు ఈ వేల్పు టమ్మల పాదాలమీద గుండెలు కుమ్మరించి, తాము నిమిత్తమాత్రులై జగన్మాత కరుణను అర్థించే అమర ఘడియ లివి. ఎక్కడ చూచినా దుర్గపూజలు. ఎక్కడ చూచినా పసుపు, కుంకుమల రాసులు, పూల గుట్టలు, స్తోత్రవాక్యాలు, మంగళహారతులు, జేగంటలు, భక్తి రసపూరిత హృదయాలలో ఆధ్యాత్మిక స్పందనలు. ఈ నవరాత్రులలో నరులు కిన్నెరలుగా మారి గానాలు వొలికిస్తూ వుంటారు. మహాదేవి, వాగ్దేవి అందరి హృదయాలలో అడుగుపెట్టి ఆశీస్సు లందిస్తుంది. ఎలాటి పండుగ! బ్రతుకులు పండగా, ఎదలు నిండగా నిలిచే పండగ.

ఈ నవరాత్రులలో జైత్రయాత్రకు సంబంధించిన వేడుకలు చాలా వుంటాయి. పాండవులకు సంబంధించిన పురాణగాథను పురస్కరించుకొని, పిల్లలు విల్లంబు లతో కోతిబొమ్మలతో పద్యాలు, పాటలు పాడుకొంటూ

బయలుదేరడం ఒక చక్కని దృశ్యం. ప్రతి పాఠశాలలో గురువులు దసరా పాటలు నేర్పుతారు పిల్లలకు. నవరాత్రులలో చక్కటి దుస్తులు ధరించి, విల్లంబులు వగైరాలు తీసుకొని అందరి ఇండ్లకూ వెళ్ళి, పాటలు పాడి, బుక్కాయి చల్లి గురువుకు కానుకలు సంపాదించి యివ్వడం – పప్పుబెల్లాలతో తాము తృప్తిచెందడం ఆచారం. ఎక్కడ చూచినా, "జయాభిజైభవా దిగ్విజైభవా" అని నినాదాలు, "ధర సింహాసనమై నభంబు గొడుగై" లాంటి పద్యపఠనలు వినిపించి మనసుల్ని ఎంతో మురిపిస్తాయి. విజయదశమి జీవిత విలసనానికి, వైలక్ష్యానికీ చిహ్నంగా నిలుస్తుంది. దసరా అశేష ప్రజానీకాన్ని ఆనందపరిచే పండుగ.

ఈ ఆనందాన్ని నెమరు వేసుకొంటూండగా దర్శనమిస్తుంది దీపావళి, నరకాసురవధను పురస్కరించుకొని ఏర్పడిన చతుర్దశి. ఆ మరునాడు దివ్వెల, వెలుగు రవ్వల పండుగ, అలుముకొన్న చీకట్లను అసుర సంహారంతో పటాపంచలు చెయ్యడం, తిరిగి వెలుగు తొంగి చూడటం, లోకకల్యాణ ప్రదమైన ఆ శుభ సమయంలో ఆనందాతిరేకంతో అందరూ ఆ విశ్వపురుషునికి నివాళు లందించడం ఈ పండుగలోని ప్రత్యేకత.

మానవుడు వెలుగును – ఆధ్యాత్మిక, ఆధిభౌతిక సంపందలు చెందినది-సంతరించుకోవడం కోసం ప్రాకులాడుతూ వుంటాడు. ప్రాపంచిక రీతులలోనుంచి, గతులనుంచి తప్పించుకొని, తపస్సిద్ధి సంపన్నుడు కావడానిని ప్రయత్నిస్తూ వుంటాడు. విజ్ఞాన తేజః పుంజంగా వెలుగొందా లని ఆకాంక్షిస్తూ వుంటాడు. అలాటిస్థితికి ప్రతీక దీపావళి. దివెనుచూస్తే మనస్సులో ఏదో మువ్వల మ్రోత వినిపిస్తుంది. అది అద్భుతమైన స్పందన. అలాటి వెలుగును కనులారా దర్శించి, మనస్సులో వెలుగుతో కలబోయడం కోసమే దీపావళి. అది ఆత్మలో ఆనందంతో అందించే నివాళి. అనతి కాలంలో ప్రకృతి అందించబోయే సంపద అందుకోవడానికి ప్రజలు దీపావళి శోభను వెంట పెట్టుకొని వెళ్ళడంలో ఎంత పండుగ వుంది.

సూర్యభగవానుడు ఉత్తరాయణంలో ప్రవేశిస్తాడు. ప్రకృతి పచ్చి బాలింతరాలుగా నిలిచి వుంటుంది. కాని నిండు గర్వం ఆమె నేత్రాలలో తొంగిచూస్తుంది. అంతులేని పంటలు. ఆనందంతో వికసించిన ప్రజల వదనాలు. పచ్చతోరణాలతో పకపకలతో నిండిన సదనాలు ఇంతటి సౌభాగ్యాన్ని వెంటబెట్టుకు వస్తుంది సంక్రాంతి. సిరి ఎల్లతావుల్లో లాస్యంచేస్తూ వుంటుంది. పౌష్యలక్ష్మి పేదతనాన్ని చేదివేస్తుంది. సంవత్సరం పొడగునా చేసిన ప్రార్థనలు, పూజలు ఫలించి బ్రతుకును బంగారు స్వప్నంగా మార్చే పండుగ సంక్రాంతి.

మనస్సులు త్యాగం వైపు తూగుతాయి. హస్తాలు దానంకోసం సాగుతాయి. ఇంట్లో అందరూ నూతన వస్త్రాలు ధరించి, నిండు మనస్సుతో పండుగ చేసుకొంటారు. ఒకవిధంగా సంక్రాంతి ఆట విడుపు. స్వేచ్ఛగా ఆడి పాడి ఆనందించే పుణ్యదినాలు. కుదించుకొన్న రెక్కల్ని విదిలించి, వినూత్నశోభతో విహరించే ప్రొద్దులు. ఏదో తెలియని అనుభూతి, తెలిసిన ఆనందం మేళవించి మానవ జీవితాలను మధురగీతంగా మార్చే పండుగ సంక్రాంతి. సంక్రాంతి వేడుకలు ఎన్నో వున్నాయి. సంబరాలూ, సరసాలూ ఎన్నో వున్నాయి. సంతోష తరంగాలపై మనస్సులు తేలిపోతుండగా – ప్రజలు భగవంతుని స్మరించి మరోమజిలీకి ప్రయాణమవుతారు. కాలచక్రం గిర్రున తిరిగిపోతుంది. ఎన్ని సంక్రాంతులో ! ఎన్ని ఉగాదులో ! అన్నిటిలో దైవత్వాన్ని దర్శించి మానవుడు శక్తిని సమకూర్చుకొంటూ వుంటాడు.

## దివ్యదంపతుల చూపుల పందిళ్లు

ఈ పండుగలలో శివరాత్రి గురించి వివరించలేదింతవరకు. భారత జాతీయ జీవనానికి శివరాత్రికీ ఎంతో అవినాభావ సంబంధం వుంది. నిజం చెప్పాలంటే – ఇది పరమశివుడు పాలించే సీమ. కైలాస శిఖరం నుంచి ఆ పన్నగధారి నేత్రాల నుంచి వెలువడే చల్లని పందిరు లల్లుకొంటాయి. ఆ నీడలోనే భారతజాతి నిండు గర్వంతో జీవిస్తుంది. నదులన్నీ నంది దేవుని మెడలో గంటలవలె కెరటాలవలె కెరటాల చప్పుళ్లు వినిపిస్తాయి. ప్రతి అణువు శివోహం – అంటూ అహరహం స్మరించి తరించాలని ప్రాకులాడుతూ వుంటుంది. ఆ శబ్దాలు

ప్రతి హృదయంలో స్పందిస్తాయి. పరమేశ్వరుని కృప కోసం ఎదురుచూస్తూ వుంటాయి. నిజానికి సంవత్సరానికి ఒకమాటు వస్తుంది శివరాత్రి. కాని, ప్రతి నిత్యం మనసు శివరాత్రే.

మనం తెలుగువారం. ఇది త్రిలింగదేశం. మూడు తావుల్లో వెలిసిన ముక్కంటి స్వరూపాలను స్మరిస్తూ తెలుగు ప్రజలు జీవితాలను గడుపుతూ వుంటారు. మహేశ్వరి మనలను సదా దీవిస్తూ వుంటుంది. చల్లటి తెల్లటి ప్రాలేయ శృంగాలను విడిచి భక్తజన పరిపాలనకై ఆ మిత్తిగొంగ తెలుగుదేశంలో వెలశాడు. అది తన సామ్రాజ్యంగా భావించి దీవిస్తున్నాడు. ఆ చంద్రశేఖరుని దయనుకోరేవారికి శివరాత్రి ఎలాటి పండుగ! ఎడలు నిండిన వెలుగు ఆ విశ్వేశ్వరుడు, సకల సంపదలను సమకూర్చే దాత ఆ సర్వేశ్వరుడు. జీవితాలలో తుషార బిందువులు వెదజల్లే కరుణామయుడు ఆ వృషభ వాహనుడు. తెలుగువారికి శివరాత్రి గొప్ప మహోత్సవం. అది నిత్యోత్సవంకూడా.

## సుందర నందన వనాలు పండుగలు

ఇక్కడ పేర్కొన్న పండుగలు కాక ఇంకెన్నో పండుగలున్నాయి మనకు. ఆ పుణ్యాపుడియలన్నిటితో పరమాత్మ చింతనా, ఆధ్యాత్మిక బోధనా మనకు అందుతూ వుంటుంది. నిజానికి పండుగలలో మానవుడు మధుర భావన లందుకోవడానికి ప్రయత్నిస్తాడు. హృదయాన్ని మహతిగా మార్చుకోవడానికి పూనుకొంటాడు. భక్తుడైన నరుడు పండుగలలోగల శక్తిని సంపాదించి మానవాభ్యుదయము కావటానికి ప్రయత్నిస్తాడు.

కాలవాహిని వొడ్డులలో దూరదూరంగా ధర్మపరంగా, కాలానుసారంగా వెలయించిన సుందర నందనవనాలు పండుగలు. హృదయాలకు స్పందన కల్పించే ఆనందవొలికలు పండుగలు. ఆధ్యాత్మిక బోధన కల్పించే అద్భుత విహారాలు కూడా.

మనకు ఎన్నో జయంతులున్నాయి- నృసింహ జయంతి, హనుమజ్జయంతి, కూర్మజయంతి, శ్రీ కృష్ణ జయంతి, మత్స్యజయంతి, పరశురామజయంతి, యాజ్ఞవల్క్య జయంతి. వీటితోపాటు ఈనాడు గాంధి జయంతి, నెహ్రూ జయంతికూడా పండుగ స్థానాలు ఆక్రమించినాయి. వీటి నన్నిటినీ పండుగలుగా గడిపే వారు ఎంతమందో వున్నారు.

## మ్రొక్కిన రోజు చక్కని పండుగ

స్త్రీలకు ఎన్నో వ్రతా లున్నాయి. సావిత్రివ్రతం, నటసావిత్రివ్రతం, మంగళ గౌరీవ్రతం, అనంతవ్రతం- ఇలాటి వ్రతా లెన్నో జరుపుతుంటారు మహిళలు. 'వ్రతమే వనితల జీవితం' అనే సామెత వుంది. సంసారమనే మహాక్రతువు నిర్వహించడానికి దైవబలం కావాలి. ఆ బలం వ్రతాలద్వారా సమకూర్చుకోవాలి- అనేభావం వుంది. ముత్తైదు జీవితం వ్రతాలతో పునీతమవుతుంది. సంతానంకోసం, సౌభాగ్యం కోసం సంపద కోసం-నాతి కనిపించిన చెట్టు కల్లా మ్రొక్కుతుంది. పుట్టకల్లా మ్రొక్కుతుంది, రాతికి మ్రొక్కుతుంది. అదే ఆమెకు జీవిత పరమార్థం, మనసారా దేవతా శక్తులకు మ్రొక్కిన రోజల్లా చక్కని పండుగ పడతికి.

పండుగలతో పాటు పర్వదినాలు చాలా వుంటాయి. ఆ రోజుకూడా మనస్సులు దేవతా యత్తమైపోతాయి. ఆయా కార్యక్రమాలలో మునిగి ముచ్చట పడుతూ వుంటారు ప్రజలు. కొన్ని పర్వదినాలలో సముద్ర స్నానాలు, కొన్నిటిలో నదీస్నానాలు ఆలయదర్శనం, కొన్ని పర్వదినాలలో పుట్టలకు చెట్లకు, పూజలు జరుపుతూ తమ హృదయాలను ఆయా దేవతలకు అంకితం చేస్తారు. నాగులచవితి మనకు ఎంతో ముఖ్యమైన పండుగ. పన్నగ ప్రభువుకు పుట్టల వద్ద పూజలు చేయడం, ముగ్గులు పెట్టి జ్యోతులు వెలిగించటం, పాటలు పాడటం, ప్రసాదాలు నైవేద్యం పెట్టడం, పాలు పుట్టలో పోసి "ఆరగించు స్వామీ! దయ వుంచు స్వామీ" అని ప్రార్థించడం - ఎంతో చక్కటి పండుగ. పరమపురుషునికి పాన్పుగా అమరిన ఆదిశేషుని అర్చించడంలో ఎంతో భక్తి దాగి వుంటుంది.

## జల దేవతలు-కుల దేవతలు

ఏటా సముద్రస్నానాలు వస్తాయి. అందులో కొన్ని మహాపర్వదినాలు. ఆనాడు ప్రజలు తండోపతండాలుగా సముద్ర తీరానికి చేరి, అక్కడొక చిన్న గ్రామాన్ని

సృష్టించి ఆ కడలి గర్జనలు వింటూ, కెరటాల ఉయ్యాలల మీద పండ్లు, పువ్వులు విరజిమ్మి, మంత్రోక్తంగా స్నానాలు చేసి, దక్షిణలు, దానాలు సమర్పించి, దగ్గరలో వున్న ఆలయానికి చేరి ఆ కొలనులో తిరిగి స్నానంచేసి దేవుని అర్చించి, అద్భుతశక్తిని సంతరించుకోవడం పరిపాటి. అర్థోదయ, మహోదయ సమయాలలో ప్రజలు మరింత భక్తిగా సముద్ర స్నానాలు చేస్తారు.

నదులతో స్నానాలు చేయడం మన ఆచారాలలో ముఖ్యమైనది. నదీతీరాలలో అందువల్లనో ఏమో అనేక దేవాలయాలు వెలసినాయి. అవన్నీ పుణ్యతీరాలుగా అవతరించినాయి. నదీమతల్లిని అర్చించి, దేవాలయాలలో పూజలు జరిపి, మనస్సును భక్తిపథంలో పరుగులు తీయించడంకన్న పండుగ ఏం వుంది? పుష్కర సమయంలో పితృదేవతల నర్చించడం ఆచారం. నదిలో పిండాలు వేయడం, ఫలపుష్పాలు విరజిమ్మడంవంటి కార్యక్రమాలు మంత్రోక్తంగా జరుపుకొంటూ వుంటారు. ఇవి హృదయాలను స్నిగ్ధం చేసే పండుగలు. ఒక్కొక్కప్పుడు సాగర సంగమాలలో స్నానాలు చేస్తూ వుంటారు. అది మరింత పవిత్రమైన కార్యక్రమంగా భావిస్తారు.

చాలామందికి కులదేవతారాధన అతి ముఖ్యమైన పండుగ. ఇళ్ళలో ఏ శుభకార్యాలు చేసినాకుల దేవతలకు ముందుగా మ్రొక్కాలి. ఆయా దేవతల ననుసరించి ఆరాధనలు వేరువేరుగా వుంటాయి. వారిని సంతృప్తి పరచడంద్వారా స్వాంతాలను సరిదిద్దుకొంటూ వుంటారు. ఆపద సమయాలలో ఆ దేవతలకు మ్రొక్కుకోవడం-వారిదయవల్ల అవి తొలిగిపోవడం సంభవిస్తుంది. ఆపదలు తొలగడంకంటె పండుగ ఏం వుంటుంది! అందువల్ల ఆ దేవతల్ని తలచి మ్రొక్కులు తీర్చుకోవడంలో ముమ్మరమైన భక్తి భావన గోచరిస్తుంది.

వీరు గాక ప్రతిచోటా గ్రామదేవత లుంటారు. ఈ దేవతల పండుగలు ఒక్క గ్రామాలలోనే కాకుండా పట్టణాలలో, నగరాలలోకూడా జరుగుతూ వుంటాయి. ఈ పండుగలలో కొన్ని ప్రాచీన సంప్రదాయా లుంటాయి. వీటిద్వారా ఎంతో శాంతి లభిస్తుంది సామాన్య ప్రజానీకానికి.

## కడుపు పండితే కలకాలం పండుగ

'మనస్సులు నిండుగా వుంటే పండుగలకు కరువేమిటి?' అనే సామెత వుంది. కనక మనస్సులను పండించుకోవడానికి ఆలంబనగా కొన్ని పండుగలను గృహస్థులు ఏర్పాటు చేసుకొన్నారు. పెళ్లిళ్ళు, ఉపనయనాలు వగైరాలు ఎంతో గొప్పగా చేయడం అలవాటు. పురుళ్లు, బారసాలలు, సీమంతాలు ఆనందంతో చేసే పండుగలు, పుత్రోత్సవం గొప్ప పండుగ అంటారు. అలాగే పుత్రికా జననాలు, వారికి నామకరణాలు-జీవిత మహోత్సవాలుగా జరుపుకొంటారు.

పిల్లలపరంగా చేసే పండుగ లెన్నో వున్నాయి. అడుగులకు అరిసెలు, పలుకులకు చిలకలు, గడప దాటితే గారెలు-తర్వాత కేశఖండన, అక్షరాభ్యాసం - అవన్నీ నలుగురు సంతానంగల సంసారాల్లో ఇలాటి నవ్వుల పండుగలెన్నో తొంగిచూచి, గుండెల్లో నవ్వులు గిలకరిస్తాయి.

## మనసు ఉయ్యాలా — మమత ఉయ్యాలా

ఆడపిల్లలకు ప్రత్యేకించి అట్ల తద్దెలు, ఉండ్రాళ్ళ తద్దెలు ఏర్పాటుచేశారు. ఆ రోజు తెల్లవారుఝామున లేవడం, స్నానాలు చేసి, చక్కగా అలంకరించుకొని తెల్లవారకముందే విందులు కుడిచి వినూత్న భావాలు సంతరించుకొని ఎంతో స్వేచ్ఛతో సంచరించడం సంతోషాన్ని పంచుకోవడం జరుగుతూవుంటుంది. ఊగే మనస్సులకు దోహదంగా వుయ్యాల లూగుతూ వుంటారు. చెరువుగట్టునో, ఊరి మధ్యతోటలోనో ఉమ్మడి ఉయ్యాలవేసి కన్నెమిన్నలందరూ చేరి కాటుక కంటిచూపులు కలబోసుకుంటూ మనస్సుల్ని పడబోసుకుంటూ ఉయ్యాల లూగడం ఎంతో హృద్యమైన పండుగ. జీవితమంతా అలా సీతాకోకచిలకల్లాగా విహరిస్తే ఎంతబాగుండును-అనిపిస్తుంది. అది అలవి గానిపని గనుక అలా అప్పుడప్పుడు మారిపోయేందుకు పండుట లేర్పడ్డాయి. తోటివారితో కలిసినప్పుడు మనస్సులు ఉయ్యాల లూగుతాయి. మమతలూ ఉయ్యాల లూగుతాయి. దానికి ప్రతీక వారు ఊగే ఉయ్యాల.

పండుగలూ, వ్రతాలూ ఆధ్యాత్మిక జీవనానికి అను

కించిన పసిడినిచ్చెనలు. జీవులు ప్రతి నిత్యం యిలాటి నిచ్చెన లెక్కి పై పైకి ప్రాకిపోవాలని ఆశిస్తూవుంటారు. నిత్యజీవితంలో అలాటి ఆశయాలు సిద్ధించే అవకాశాలు తక్కువ. పండుగలు ఆ దివ్యజీవనాన్ని జ్ఞాపకం చేస్తాయి; తగినంత జ్ఞానబోధ చేస్తాయి.

పండుగ అనగానే గృహాన్ని చక్కగా అలంక రించుకొనే అవకాశం ఏర్పడుతుంది. ఆనాడు దేవతలు నట్టింట అడుగుపెడతా రని అభిప్రాయం. గృహాలు అలంకరించి వుంచే వారు అనందించి కొంచెం నిలబడి తీరుబడిగా దీవించి వెడతా రని విశ్వాసం.

## ఇంటింటా చిలకల గుంపులు

పండుగ సందర్భాలలో, ఇదివరకే చెప్పినట్లు, గృహాలు ఎంతో చక్కగా అలంకరించ బడతాయి. 'నిత్యకల్యాణం పచ్చతోరణం' అనే సామెతకు ఉదాహ రణగా నిలుస్తాయి. గృహంలో వారు చిలకల గుంపు లాగా ఎగిరిపోతూ వుంటారు. ఆటలు, పాటలు, విందులు, వేళాకోళాలు, విహారాలు, సహకార భావనలు-ఎన్నో తొంగిచూస్తూ వుంటాయి ప్రతిగృహంలో.

అన్ని పండుగలు ఆలాగే వున్నా సంక్రాంతి పండుగలో ప్రత్యేకత వుంది. పంటల కాలంలో వచ్చే పండుగ గనుక మనస్సులు ఎంతో ఆనందంగా ఉండ టం సహజం. ఆ సంబరంలో ఇంటిని అలంకరించడంలో ఎంతో నేర్పు కనిపిస్తుంది. ఇళ్ళకు ఎన్నాళ్లు ముందు గానో వెల్లవేస్తారు. మసిపట్టిన వంటిళ్ళను కూడా గీకి గీకి సున్నంవేసి వెలుగులోకి తెస్తారు. ఇళ్ల ప్రహరీలకు కూడా వెల్లవేయడం, లేదా చిలును కొట్టడం జరుగు తుంది. అంతేకాదు - పశువుల కొట్టాలను, ధాన్యపు గిడ్డంగులను కొందరు కోళ్ళ గుడిసెలను కూడా చిలును కొడతారు. అంటే ఇంట్లో ఏ భాగం కూడా మామూ లుగా వుండకూడ దని వారి అభిప్రాయం.

గుమ్మాలకు, కిటికీలకు, కొన్ని సందర్భాలలో దూలాలకూ జేగుర్లు పూస్తారు. గడపలకు పసుపు కుంకుమలు పెడతారు. వాకిళ్ళలో రంగవల్లులు అలంక రిస్తారు.

ధనుర్మాసం నెలలోజులు నడుస్తుంది. ఆ నెల రోజులూ ముంగిట రంగవల్లులు అలంకరిస్తారు. వాటిలో గొబ్బెమ్మలు, వాటిలో రకరకాల పువ్వులు వాటిని ముగ్గులలో చేర్చి సంతోషంతో గంతులు వేసే ఆడ పిల్లల ముసిముసినవ్వులు. భోగి పండుగనాడు అభ్యం గన స్నానాలు, క్రొత్త దుస్తులు, వంటి నిండా నగలు, అవి అందించే నవ్వులు. ఈ అన్నిటిలో అమరులుగా మారిపోతారు ప్రతి ఇంట్లో సభ్యులు.

ప్రతి ఇంటికి ఆడపడుచులూ అల్లుళ్లూ ఆహ్వానింప బడతారు. అల్లుళ్ళకు రాజసత్కారాలు. కూతుళ్ళకు చనువుతో నిండిన సత్కారాలు, బావమరదళ్ళ సరసాలు, ముసలిదంపతుల చమత్కార సంభాషణలు. అసలు ప్రతివారూ ఆనందంతో గంతులు వేస్తూవుంటారు. అనుకోని హాస్యాలు వెల్లివిరుస్తాయి అందరిపెదవుల నుంచీ. రకరకాల పిండివంటలూ, వడ్డనలలో కూడా ఎంతో అలంకారం, అందం, వయ్యారం. "నవ్వులతో బువ్వలు'' అనే పల్లెటూరి సామెత సార్థక మవుతుంది పండుగరోజుల్లో.

## పూలదీవులు-పుప్పొడి నావలు

మరో విశేష మేమంటే-పండుగ దినాల్లో తాము ఆరగించి ఆనందించడంతోనే తృప్తిపడకుండా-ఇత రులకు కూడా దానధర్మాలు చెయ్యడం జరుగుతుంది. తెల్లవారి లేచినప్పటినుంచి అనేకమంది భిక్షుకులు వస్తారు వాకిట్లోకి. కొందరు చక్కని పాటలు పాడతారు, కొందరు దీవన లందిస్తారు.కొందరు ఇంటిని ఆలయంగా, ఇంట్లో వాళ్ళను దేవతలుగా పోల్చి పొగిడిపోతూ వుంటారు. ఎక్కడ చూచినా సిరి, చిరునవ్వులు.

నిజానికి పండుగలు పూలదీవులు- ఆ సంబరాన్ని అందుకొనే ప్రజలు పుప్పొడి నావలు.

# తెలుగు స్త్రీలు - వ్రతాలు

## ఇల్లిందల సరస్వతీదేవి

అయి పుట్టిన తరువాత తనకంటూ ఒక సంసా
ుత్యాలలాంటి పిల్లలూ కావాలని కోరుకోని వాళ్ళు
. గృహిణి అయి బిడ్డలతో ఆదర్శవంతంగా
ౖు చక్కబెట్టుకొనాలని ప్రతికన్యా కాంక్షిస్తుంది.
్తా తన బిడ్డలు తన సంసారము చల్లగా పది
ాటు సిరిసంపదలతో తులతూగాలని కోరుకుం
వీటన్నిటికీ మూలమైన తన ఐదవతనము తన
తము సురక్షితంగా ఉండాలని తపించిపోతోంది.
ుకలను తీర్చమని వేయిదేవుళ్ళను ఆరాధిస్తుంది.

ఆరాధనే స్త్రీ జీవితములో ఒక వ్రతముగా
కఠోర నియమాలతో ఆచరించేదిగా భారతదేశ
రూపొందింది. ఈ నోములు వ్రతాలద్వారా స్త్రీ
ుచేది తన సుఖ మొక్కటే కాదు. సంఘములో
సుఖసంతోషాలనూ కోరుకుంటుంది. ఎదుటి
ఓర్వటానికే, ఎదుటి మనిషి సుఖపడటానికే
మార్గాలు నోములూ వ్రతాలద్వారా అన్వేషి
ఈ విశాల విశ్వానికంతకూ జనని కాగల
ృక్పథాన్ని సాధించగలగాలని ప్రజలనందరినీ
ాటిమీద నడిపించాలనీ ఆమె ప్రగాఢవాంఛ. ఈ
ి మంచిపనులు చేస్తే వచ్చే జన్మలో కష్టనష్టాలు
ునీ- సకలసంపదలు సత్సంతానము తప్పకుండా
ాతాయనీ క్రిందటిజన్మలో చెడ్డపనులేవో చేసినందు
ఈ జన్మలో దుఃఖాలు కలుగుతున్నాయనీ, ఈ
ు ఆచరించినట్లయితే పాపహరమవుతుందనీ విశ్వా
ో భక్తితో ఆచరిస్తుంది. ఈ నోములూ వ్రతా
తగిన నిష్ఠతో, నియమాలతో ఆచరించకుండాను,
ు పూర్తికాకనే మధ్యలో మానివేసినందువల్లనూ,
ాన్నో కష్టాలు అనుభవించినవారి కథలు అనేకంగా
యి. ఈ నోములూ వ్రతాలూ నియమనిష్ఠలతోనే
కాక అత్యంత భక్తితో ఆచరించాలని ఉంది. కథ
లోపమైనా వ్రతలోపము కాకూడదు. వ్రతలోప మైనా
భక్తిలోపము కాకూడదు. ఇది అన్నిటికంటె ప్రధాన
మైనది.

వ్రతాలూ నోములూ భారతదేశములో అన్ని
ప్రాంతాలలోనూ ఏదో ఒకపేరున ఉంటూనే ఉన్నాయి.
ఈవ్రతాలు 245 ఉన్నాయని లక్ష్మీధర ప్రోక్తమయిన
వ్రతకాండలోనూ స్కంథపురాణంలోని వ్రతచూడామణి
లోనూ వివరింపబడ్డాయి. వీటిలో కొన్ని విష్ణు మహే
శ్వరుల పరమైనవీ- కొన్ని దేవీపరమైనవిగానూ
ఉన్నాయి. వ్రతాలు కొన్ని మాస వార ప్రధానమయి
నవీ- కొన్ని తిథి మాస ప్రధాన మయినవీ- కొన్ని
మాసనక్షత్ర ప్రధానమయినవీ ఉన్నాయి. అట్లతదియ,
నాగుల చవితి, ఋషిపంచమి, సుబ్బరాయషష్ఠి, శ్రీ
కృష్ణజన్మాష్టమి, శ్రీరామనవమి, విజయదశమి, వైకుంఠ
ఏకాదశి, చిలుకుద్వాదశి, దీపావళిఅమావాస్య మొదలైన
పండుగలే కాక- కొన్నింటికి వ్రతాలు కూడా ఉన్నాయి-
మొత్తంమీద అన్నీ మతానికీ దేవపూజకూ సంబంధించి
నవే. వీటిలో కొన్నివ్రతాలు దంపతులు కలసి చేసేవీ-
మరికొన్ని స్త్రీలు మాత్రమే ఆచరించేవి. స్త్రీల వ్రత
కథల ననుసరించి శ్రావణ మంగళవారము నోము, వర
లక్ష్మీవ్రతము, సావిత్రీగౌరీదేవి నోము, కేదారేశ్వర
వ్రతము, అనంత పద్మనాభస్వామి వ్రతము, సంప
ద్గౌరీ వ్రతము, సత్యనారాయణ వ్రతము, చిట్టి బొట్టు,
నిత్యశృంగారము, నందికేశ్వర వ్రతము, పదహారు
ఫలాల నోము, గ్రామకుంకుమ, మూగనోము వంటివి
245 వరకూ ఉన్నాయి.

ఈ వ్రతాలన్నీ స్త్రీలకు జీవితములో నైతికబలమ్మూ
మనోనిగ్రహము, క్రమశిక్షణ, ఏకాగ్రతలను కలిగించే

కూనికి, హిందూమతము నిర్దేశించిన పరంపరాగతమైన సంప్రదాయ స్వరూపాలు- అందరికీ అనుసరణీయమైన సాంఘిక సాంస్కృతిక ఆచారాలు.

భారతనారికి ఆదర్శము జగజ్జననీ శక్తిమంతురాలూ అయిన పార్వతీదేవి. ఆమె ఘోరమైన తపస్సు చేసి పరమశివుని భర్తగా పొందగలిగింది. అచంచలమైన దీక్షతో పట్టుదలతో ఇరువై ఒక్కరోజులు కఠోరనియమాలతో తపస్సుచేసి పరమేశ్వరుడి అర్థశరీరాన్ని పొంది, దేవతలందరిచేతా పూజింపబడ్డది. ఆమె దీక్షతో ఆచరించిన వ్రతమే కేదారేశ్వర వ్రతము. ఆశ్వయుజ అష్టమినాడు ప్రారంభమైన ఈ వ్రతము దీపావళితో ముగుస్తుంది. ఈ వ్రతవిధానమూ దాని మహిమ వ్రతకథలో వివరింపబడ్డది. ఈ వ్రతము ఒక్కరుగానీ సామూహికంగా గానీ ఆచరించవచ్చు.

సావిత్రీగౌరీదేవి వ్రతము సామూహికంగా స్త్రీలు ఆచరించేది. సూర్యుడు మకరరాశిలో ప్రవేశించిన మరునాటి నుండి తొమ్మిదిరోజులు ఒంటిపూట భోజనముతో దేవి సహస్ర నామార్చన చేసి అఖండ దీపారాధనతో ఆచరించే దీ వ్రతము. ఈ వ్రతము సావిత్రీదేవి ఆచరించినందువల్లనే యముడితో పోరాడి పతి ప్రాణాలను నిలుపగలిగిం దనీ, అత్తమామలకు కళ్ళు వచ్చేటట్లు, రాజ్యము తిరిగి ప్రాప్తించేటట్లూ, వరాలు పొందిం దని వ్రతకథ చెప్పుతున్నది.

పదహారు ఫలాల వ్రతములో పదహారు రకాల ఫలాలను పదహారు మందికి దానము చేసినట్లయితే సత్సంతానము కలుగుతుం దని వివరించబడ్డది.

మూగనోము వ్రతములో చెప్పినట్టుగా తిథి వార నక్షత్రాలు మాసముతో కూడా చూసుకొని- ఉదయము నుండీ సాయంత్రము వరకూ మౌనముగా ఉండి గౌరీ పూజ చేయాలనీ ముత్తైదువలకు బొట్టుపెట్టి తాంబూలమివ్వాలనీ వివరింపబడ్డది. మౌనంవల్ల సంయమనమూ నిగ్రహశక్తి అలవడుతాయని దీనివల్ల గ్రహించగలుగుతాము.

నిత్యశృంగార వ్రతములో ఒక సంవత్సరముపాటు ప్రతినిత్యమూ ఒక ముత్తైదువకు తల దువ్వి బొట్టూ కాటుకపెట్టి, గంధముపూసి, తలలో పూలుపెట్టి, విసనకర్రతో విసిరి, పండూ తాంబూల మివ్వాలి. దీనివల్ల తోటి స్త్రీలపట్ల అసూయ కలగకుండా ఉంటుందని ఆశించబడ్డది.

ఈ వ్రతాలన్నీ స్త్రీలకు ముఖ్యమైనవే. ఆచరింపతగినవే. వీటన్నిటికీ అర్థబలమూ అంగబలమూ కావాలి. ప్రధానంగా వీటన్నిటికినీ ఆచరించాలన్న ఉత్సుకత కావాలి. కాని తెలుగు దేశంలో ముత్తైదువలు ఏ నోము పట్టకపోయినా అర్థబలమూ అంగబలమూ తక్కువయినా-శ్రావణమాసములో వచ్చే మంగళగౌరీవ్రతమూ, వరలక్ష్మీ వ్రతమూ ఆచరించని వారుండరు. ఖండాంతరాలలో ఉన్న తెలుగు స్త్రీలు కూడా తమ సంప్రదాయాలను సాధారణంగా విడిచిపుచ్చరు.

శ్రావణ భాద్రపద మాసాలు వర్షఋతువు. ఆదనుకు పదనయితే బంగారుపంటలు పండుతాయని శ్రావణంలో వర్షాగమనానికి రైతులు ఎదురుచూస్తూ ఉంటారు. ప్రజలు ఘాటైన ఊరగాయను భద్రపరచుకుంటారు. క్రొత్త అల్లుళ్ళకు ఆషాఢపట్టి అత్తవారింటినుండి పంపబడుతుంది. తెలుగుసీమలోని ముత్తైదువలు తమకు ఐదవతన మిచ్చి, అష్టైశ్వర్యాలనూ ప్రసాదించే మంగళగౌరి, వరలక్ష్మి వ్రతాలను ఆచరించటానికి కలిగిన దానిలోనే కావలసిన వస్తువులను సేకరించుకుని ఎదురుచూస్తూ ఉంటారు.

క్రొత్తగా వివాహమయిన బాలికకు శ్రావణ పట్టీ అత్తవారు పంపాలి అత్తవారు పంపిన చీరె, రవికె ధరించి, వారి ఖర్చుతో మంగళవారము నాడు మంగళగౌరిని ఆవాహనచేసి, ఆరాధించి, పూజించి ముత్తైదువలకు పసుపు కుంకుములతోపాటు కాటుక కూడా ఇచ్చి సెనగలు వాయన మివ్వాలి. ఈ వ్రతము ఐదుసంవత్సరాలు ఆచరించి ఉద్యాపన తీర్చుకోవాలి. ఈ వ్రతము కన్య ముత్తైదువలు చేయాలనే కథలో చెప్పబడ్డది. ఈ కథలోని రాజకుమారై అపురూపమైన నైతికబలము కలది. అర్థాయుష్కుడైన ఒక రాజకుమారుడు మేనమామతో కూడా కాశీయాత్రకు బయలుదేరి ఒకతోటలో ఒకరాత్రి శయనిస్తాడు. తెల్లవారగానే ఆదేశపు రాజపుత్రి తన చెలికత్తెలతో పూలు కోయటానికి వచ్చి వాళ్ళతో కలిగిన వివాదములో తను కోసిన పూలన్ని

విసిరి వేయగా చూస్తాడు. ఆపూలు ఏచెట్టునుండి కోసినవి ఆచెట్టుకు చేరుకుని వాటి తొడిమల నంటుకొంటాయి. ఆశ్చర్యముతో ఆ చోద్యము చూస్తున్న రాజకుమారుడు ఆమె శక్తికి అబ్బురపడతాడు. ఆ రాత్రికి ఆమెను వివాహమాడ పోయే వరుడు ఆకస్మాత్తుగా రోగగ్రస్తుడవుతాడు. ముహూర్తము వృథా కాకుండా రాజుగారు తోటలో విడిసిన రాజకుమారుడిని తీసుకు వచ్చి వివాహము చేస్తారు. వివాహమయిన రాత్రి వరుడికి పెద్ద సర్పగండము ఉంటుంది. పెళ్ళికూతురు మంగళగౌరి కలలో కనబడి చెప్పినట్టుగా చేసి, పెనిమిటి సర్పగండాన్ని తప్పిస్తుంది వరుడు కాశీయాత్రకు వెళ్ళిపోతాడు. ఆతడు తిరిగి వచ్చేవరకూ నియమ నిష్ఠలతో అన్నదానము తాంబుల దానమూ చేస్తూ ఆమె అతడిని చేరుకుని సుఖంగా ఉంటుందని మంగళగౌరీ వ్రత కథ చెప్పుతున్నది. ఈ కథ పాటగా రూపొంది, సంగీతజ్ఞానము లేక పోయినా – స్త్రీలు సులభంగా పాడుకోవటానికి వీలుగా ఉంది. మంగళవారాలు ఒక్కొక్క సంవత్సరము శ్రావణమాసములో ఐదు వస్తాయి. ఒక్కొక్కసారి నాలుగే వస్తాయి. శ్రావణ మాసములో వచ్చే మంగళవారాలన్నీ వ్రతమాచరించవలసినవే. ఏ కారణాల చేతనయినా అన్ని మంగళవారాలు నోము చేసుకోవటానికి అనుకూల పడక పోయినట్లయితే, మొదటి వారము చివర వారము తప్పకుండా ఆచరించాలి. మొదలు చివర ఆచరించినవారికి అది ఒక సంవత్సరము క్రింద లెక్కింపబడుతుంది. మొదలు చేసినా – చివరి వారము చేసుకోవటానికి వీలుకాని పక్షంలో దానిని వినాయక చవితినాడు చేసుకున్నట్లయితే ఆ సంవత్సరము పూర్తిగా చేసుకున్నట్టు లెక్క.

శ్రావణ మంగళవారమునాడు చేసుకునే మంగళగౌరీ వ్రతము ఆచరించవలసినది ఐదు సంవత్సరాలే కాని-శ్రావణములో వచ్చే వరలక్ష్మీ వ్రతము ఐదవతన మున్నంతవరకూ ఆచరించేది. మగధదేశంలో కుండిన నగరమనే పట్టణంలో చారుమతి అనే సామాన్య స్త్రీ తన నియమనిష్ఠలచేత పెద్దల యెడ భక్తి శ్రద్ధల చేత మహాలక్ష్మి అనుగ్రహం పొంది ఆమెను పున్నమి ముందర వచ్చే శుక్రవారమునాడు పూజించి సకలైశ్వర్యాలూ పొందింది. ఆమె పట్టిన నోము జగమంతా పట్టింది.

శ్రావణమాసంలో పేరంటము నోములు నోచుకున్న వారికీ నోచుకోని వారికీ కూడా ఆనందాన్నిచ్చే శుభప్రదమైన పండుగ. ప్రతి ఇల్లూ పచ్చటాకు తోరణాలతో కళకళలాడుతుంది. స్త్రీలందరూ పచ్చగా అలంకారాలు చేసుకుని పేరంటానికి బయలుదేరుతారు. ఎంత వర్షములో నయినా పసుపు కుంకుమలకు పది ఆమడయినా వెళ్ళాలని నానుడి. ఈ పేరంటానికి పిలవక పోయినా వెళ్ళి వాయనము తెచ్చుకోవటము ఘనముగా భావిస్తారు.

ఈ నోము సందర్భములో ఉపయోగించే పసుపు కుంకుమలకూ నానబోసిన సెనగలకూ గల ప్రాముఖ్యము వాటిని ముత్తైదువలకు విరివిగా పంచటములోనే తెలుస్తుంది. వర్షాకాలములో తడిలో ఇటూ అటూ తిరిగినందువల్ల పాసిపోయిన పాదాలకు పసుపు రాసినందువల్ల వెంటనే నయమవుతుంది. పసుపులో ఇనుము (Iron) ఉంటుంది. కనుక పాదాలకు తడివల్ల చల్లబడకుండా వెచ్చదనాన్నిస్తుంది. కుంకుమలో కూడా పసుపు ఉన్నందువల్ల నొసలు చల్లబడకుండా కాపాడు తుంది.

పప్పుధాన్యాలలో 20 శాతముపైగా మాంసకృత్తులుంటాయి. మొలకలు వచ్చిన పప్పుధాన్యాలలో "బి" విటమినులు కొన్ని అధికమవుతాయి ముడి పప్పుదినుసులలో విటమిను "సి" ఉండదు. కాని మొలకదేరిన పప్పుధాన్యాలలో విటమిను "సి" చాలా ఎక్కువగా ఉంటుంది. పప్పుధాన్యాలలో సహజంగా ఉండే పోషక విరుద్ధమైన పదార్థాలు మొలకదేరటంలో నశిస్తాయి. సాధారణంగా మంగళగౌరీ వ్రతానికి సెనగలు, శుక్రవారము నాటి వరలక్ష్మి వ్రతానికి పెసలూ నానబోసి ముత్తైదువలకు వాయనాలు ఇస్తారు. ఆ మరునాటికి ఈ పప్పుధాన్యాలు బాగా మొలకదేరి ఉంటాయి. అధిక ప్రమాణములో విటమినులు ఉత్పత్తి చేసిన మొలకదేరిన పెసలూ సెనగలూ "విధిగా వాడండి" అని ఈ నోముల ద్వారా చెప్పకుండానే చెప్పే ఈ ఆచారములో ఆరోగ్యసూత్రాలు కూడా ఇమిడి ఉన్నాయి.

మనదేశపు స్త్రీలలో పరంపరాగతమైన నైతిక బలో ద్వేగమూ దీక్షా జీవించి ఉండటానికి నోములూ వ్రతాలే కారణము. కష్టాలను ఓరిమితో సహించిన సీతమ్మ, యముడితో పోరాడి పతి ప్రాణాలను కాపాడి దక్కించుకున్న సావిత్రీ, ఘోరమైన తపస్సు చేసి పరమశివుడి లోని అర్థభాగాన్ని పొందగలిగిన పార్వతీ, త్రిమూర్తులను పసిపాపలుగా చేసి తన శీలాన్ని కాపాడుకున్న అనసూయ, సూర్యచంద్రాదుల గతులను అరికట్టిన సుమతీ మన స్త్రీలకు ఆదర్శమూర్తులు.

ఈ వ్రతాలూ నోములూ మనదేశములోని స్త్రీలకు విద్యరాని కాలములో కూడా ఆచారములో ఉన్నాయి. అక్షరజ్ఞానము లేకపోయినా వాటిపైన శ్రద్ధ గల స్త్రీలు ఆనోటా ఆనోటా కథలు చెప్పించుకుని కంఠస్థము చేసుకున్నారు - పాటలు పాడు కున్నారు. ప్రాచీనులు అధిక విద్యావంతులు కాని స్త్రీలకు విధ్యుక్తధర్మాలనూ, లౌకిక జ్ఞానాన్నీ, పురాణపరిచయాన్నీ, చారిత్రక విశేషాలనూ, ఆరోగ్యసూత్రాలనూ, వేదాంతతత్త్వాలనూ, ఆచార వ్యవహారాలనూ - ఒక చేమిటి సకలశాస్త్రాలనూ పాటల రూపంలో అందించి చక్కని విజ్ఞాన బోధ చేశారు. ఈ పాటలే వారికి విద్యాపీఠాలు. ఈ పాటలలోని సాంఘికజీవనము అతి సహజమైనది. ఇవి సాంఘికజీవితానికీ కుటుంబజీవితానికీ ప్రతిబింబాలు. మనసంస్కృతికీ నాగరికతకూ మూలాధారాలు. ఈ పాటలు పాడుకుంటూ - తమ విధ్యుక్త ధర్మాలను జ్ఞప్తికి తెచ్చుకుంటూ - పారమార్థిక చింతనను కూడా స్త్రీలు సాధించారు.

భారతీయులు సమస్త చైతన్యాన్నీ జ్యోతిగా భావించారు. మహర్షులు పరమాత్మనే స్వయంప్రకాశం గల ఆది దీపంగా దర్శించారు. ఆ ఆదిదీప ప్రకాశం సహస్ర సూర్యుల కాంతిని మించినదని కీర్తించారు. ఆ జ్యోతి మానవ మనోంతరాళాల్లో శుద్ధదీపంగా ప్రకాశిస్తున్నట్లు భారతీయులు విశ్వసిస్తున్నారు. పరబ్రహ్మకు ప్రతీకలుగా నిలిచే దీపాలకు విశేష ప్రాముఖ్యాన్ని ఇచ్చారు. దీపదాన మహిమాదికాలను పురాణగ్రంథాలలో వివరించారు. కార్తీకమాసమంతా దీపాలు పెట్టడములోనూ లక్ష వత్తులనోము చేయటములోనూ స్త్రీలు పొందే ఆనందము కృష్ణానదీ తీరాన చూసి తీరవలసిందే. ప్రతిదినమూ కాకపోయినా నోములూ వ్రతాలూ ఆచరించే సందర్భములో దీపారాధన చేసి తమ ఆత్మలను ప్రకాశింప చేసుకుంటారు స్త్రీలు.

"స్త్రీలు తమ ఆదర్శాలను సాధించటానికి పట్టుదలతో భక్తిశ్రద్ధలతో దీక్షతో నోములూ వ్రతాలూ ఆచరించి ఒక విశిష్టమైన శారీరక మానసిక క్రమశిక్షణను అలవరచుకున్నారు. ఇవి వారి జీవితములో పరమ పవిత్రమైన ఘట్టాలు. ఉపవాసాలు వాటిలో ఒక భాగము. నేను వీటిలోని మహిమను మాతల్లి ద్వారా తెలుసు కున్నాను. ఆమె నుండే నేర్చుకుని నా జీవితములో ప్రయోగించి చూశాను. మౌనవ్రతమూ దాని వలన కలిగే ఫలితము కూడా ఆమె నుండి తెలుసుకున్నదే" అని మహాత్మాగాంధి ఆత్మకథలో వ్రాసుకున్నారు.

ఆధునిక కాలములో సాంఘిక జీవనములో ఎన్ని మార్పులు వచ్చినా - ప్రాచీనాదర్శాలు ఎంత నశించి పోయినా ఒక ఆదర్శము మాత్రము ఇంకా నిలిచి ఉన్నది. వేలమందిలో ఒక స్త్రీ అయినా తన పరిమితుల లోనే పైకి కనబడకుండా, పెద్ద ఆర్భాటం లేకుండా - దేశనాగరికతనూ సంస్కృతినీ మత విశ్వాసాలనూ మొలకెత్తించి పోషిస్తూ వాటితో సంబంధ సామరస్యాలను విడనాడకుండా ప్రతినిత్యమూ ఆ వెలుగులో తన భర్తనూ పిల్లలనూ నడిపిస్తుంది. గృహసీమకు రాణి అయిన గృహిణి అడుగుజాడలలో పురుషుడు నడుస్తున్నాడు. చెదురుమదురుగా అక్కడక్కడ విడిపోయిన జంటలు ఉన్నప్పటికీ మనదేశములో వివాహబంధము, కలతలు వచ్చినా తేరుకుని పటిష్ఠవంతముగా సాగిపోవటానికి ఇవే మూలకారణాలు.

# జానపద సాహిత్యం - చిన్నపిల్లల పాటలు

## యస్. గంగప్ప

ఏ సాహిత్యంలోనయినా బాలసాహిత్యానికి ఒక ప్రత్యేకత ఉంటుంది బాలురకు సంబంధించిన పాటలు, కథలు, అనేక విషయాలపై వ్యాసాలు, రచనలు మొదలైనవి బాలుర మేధా సంపత్తిని పెంచడంతో పాటు వినోదాన్ని అందించడంలో ఎక్కువ ప్రాధాన్యం వహిస్తాయి. బాలుర మనస్సులు క్రమవికాసం చెంది సత్పౌరులుగా రూపుదిద్దుకోవడానికి ఎంతగానో ఉపకరిస్తాయి. ఇవన్నీ చదువు సందెలకు, నాగరికతా వాతావరణానికీ దూరంగా ఉన్న అమాయక ప్రజలే ఎక్కువ మనదేశంలో. వీళ్లందరూ గ్రామీణవాసులే. ఈ జానపదుల ఉత్సాహానికీ, ఉల్లాసానికీ నిదర్శనంగా పండుగ పబ్బాల్లో, జాతర్లలో పాడుకొనే పాటలేగాక, నిత్యమూ నిజజీవితంలో చేసేపనిపాటల్లో, పనిభారాన్ని తగ్గించుకోడానికిగానీ, మానసికాహ్లాదం కోసంగానీ పాడుకొనే పాటలు అనేకం, ఇవే జానపదగీతాలు. ఈ పాటల్లో కేవలం పిల్లలు గుంపులు గుంపులుగా చేరి పాడుకొనే పాటలు ఎన్నోరకాలు. తన్మూలంగా పామర ప్రజల పిల్లలు ఆనందం, వినోదం పొందుతారు. ఈనాడు మారుమూల పల్లెటూళ్లలో వెన్నెల రాత్రుల్లో, పండగ పబ్బాల్లో మనం చూడవచ్చు, వినవచ్చు. కానీ, చాలా వరకు ఈ జానపదగేయాల ప్రాబల్యం ఈ నవనాగరిక ప్రపంచంలో అంతరిస్తూ ఉందని చెబితే ఆశ్చర్యపడాల్సిన పనిలేదు. కాబట్టి వాటిని సేకరించి, మన జానపద సంపదని పరిరక్షించాల్సిన బాధ్యత మనపై ఉంది. నా సేకరణలోని జానపద గేయాల్లో ప్రధానంగా చిన్నపిల్లల పాటలు కొన్నింటిని పరిశీలిద్దాం ఈ వ్యాసంలో. పైగా ఇది అంతర్జాతీయ బాలల సంవత్సరం గదా మరి!

ఖులాసాగా కాలక్షేపం చేయడం కోసం రాత్రి వెన్నెట్లో పిల్లలు ఆడామగాతేడాలేక. జతలుజతలుగా ఆడుకొంటూ పాడుతూంటారీ కింది పాటలు. వీటిలో వెన్నెలాయిల పదాలు, అల్లోనేరేడి పదాలు, ఉయ్యాల పాటలు మొదలైనవి ప్రాముఖ్యం వహిస్తాయి. అలాంటి వాటిలో కొన్నింటిని చవిచూద్దాం. రెండుజట్లుగా పిల్లలు చేరి ఆడపెళ్లివారి పక్షాన, మగపెళ్లివారి తరపున మాట్లాడుతున్నట్లు ఈ కింది పాట కొనసాగుతుంది. తక్కినవాళ్లు పాటవింటూ ఆటచూస్తూ వినోదిస్తూ ఉంటారు.

"ఆరు కులారు కులు బొందులుగట్టి వెన్నిలాయిలో"
మేము ఆరును సీమ రెడ్డి బిడ్డలు "వెన్ని"
చిలుముతూరు చిలుకట్ల మిందా "వెన్ని"
యీసీతకి పెత్తనం వొచ్చినామూ "వెన్ని"
వొచ్చేవాళ్లు నొత్తురు గానీ "వెన్ని"
మీనల్లగాముని కిచ్చెల్లేదు[1] "వెన్ని"
చిలుము తూరు చిలకట్ల మిందా "వెన్ని"
యీసీతకు పెత్తనం వొచ్చినామూ "వెన్ని"
వొచ్చేవాళ్లు వత్తురుగానీ "వెన్ని"
మీదోసీ కడుపోని కిచ్చేల్లేదు "వెన్ని"
చిలుముతూరు చిలకట్ల మిందా "వెన్ని"
యీ సీతకు పెత్తనం వొచ్చినామూ "వెన్ని"
వొచ్చేవాళ్లు వత్తురుగానీ "వెన్ని"
యీవొప్పి చెవులోనికిచ్చే ల్లేదు "వెన్ని"
ఆరుకులారుకులు బొందులు గట్టి "వెన్ని"
మేము ఆరుకు సీమ రెడ్డి బిడ్డం "వెన్ని"

ఇలా మగుస్తుందీగేయం వింటూ చూస్తున్నంతసేపు ఎంతో వినోదంగా ఉండి హాయిని చేకూరుస్తుందీగేయం.

---

1. ఇవ్వము

ఇలాగే వెన్నెట్లో పాడుకొనే చిన్నపిల్లల పాట అల్లో నేరేడిపాట. ఈ వెన్నెల పదాలు, అల్లో నేరేడి పదాలు చాల ప్రాచీనమైనవి. అలాంటి వాటిల్లో అల్లో నేరేడి పదం ఈ కిందిది.

"అల్లో నేరిడల్లా, అల్లోనేరేడికింద సల్లన్ని చెలిమి
అల్లో నేరిడల్లా"
"అల్లో" సల్లన్ని చెలిమితావ[1] సెద్ది[2] తినరా
మరిదీ "అల్లో"
"అల్లో" సెద్ది దిన్న దావనా బండే
పాయా "అల్లో"
"అల్లో" [3]ఎదుకన్న ఎదుకరా నాచిన్ని
మరిదో "అల్లో"
"అల్లో" ఎదుకంగ ఎదుకంగ
[4]మలకయ్యా పుట్లో "అల్లో"
"అల్లో" మలకయ్యా పుట్టిందీ
మానయ్యా పెరిగిందో "అల్లో"
"అల్లో" మానయ్యా పుట్టిందీ ఆకయ్యా
యిగిరో[5] "అల్లో"
"అల్లో" ఆకయ్యా యిగిరిందో మగ్గయ్యా[6]
వేసిందీ "అల్లో"
"అల్లో" మగ్గయ వేసిందీ పూతయ్యా
పూసిందీ "అల్లో"
"అల్లో" పూతయ్యా పూసిందీ[7]
పింజయ్యా కాసిందీ "అల్లో"
"అల్లో" పింజయ్యా కాసిందీ
పొండయ్యా[8] మాగిందీ "అల్లో"
"అల్లో" పొండయ్యా మాగిందీ తినన్న
తినరానా చిన్నమరిదో "అల్లో"

ఇంతకంటె చిన్నపిల్లలు పండగ పబ్బాల సందర్భాల్లో ఉయ్యాల లూగుతూ ఉల్లాసంగా పాడుకొనే పాటలు ఎంతో నిసర్గమనోజ్ఞంగా ఉంటాయి.

"అలాక మంచము మల్లాసరము అమరు తిప్పారే
రామలకి అమరాతిప్పారే ॥అలాక మంచము॥
తనకక్కమానె పూవుల వస్త్రము పైన కప్పారే
రాములకి పైనా కప్పారే ॥అలాక మంచము॥
తనకక్కమానె పూవుల తురాయి దరియించారమ్మా
రాములకి దరించారమ్మ ॥అలాక మంచము॥
అలాక మంచము మల్లాసరము అమరాతిప్పారే
రాములకి అమరాతిప్పారే" ॥అలాక మంచము॥

ఇలాగా ఈ పాట పాడుతూ ఉయ్యాల లూగుతూ ఆనందిస్తూంటారు పిల్లలు.

కాగా ఆడపిల్లలకి మాత్రమే పరిమితమైన పాటలున్నాయి. వీటిని చంద్రమ్మ పాటలంటారు. పౌర్ణమి నాటి పిండార బోసినట్లుండే వెన్నెల్లో ఊరిముందర రచ్చకట్టవద్ద, లేదా ఊరి మధ్య విశాల ప్రాంగణంలో యుక్తవయస్కులైన ఆడపిల్లలు చేరి, రకరకాలుగా ముగ్గులువేసి గౌరీదేవిని కలశాలతో పూజిస్తారు. కలశాలు అన్ని ఇళ్లలోనుంచి బయలుదేరి వస్తాయి. ఆ గౌరిదేవి పూజలో ఆడపిల్లలు జంటలుగా పాటలు పాడతారు. చిన్నలు పెద్దలు కలిసి ఈ వినోదం చూసి ఆనందిస్తూంటారు పల్లెటూళ్లలో.

జానపదులకు సహజమైన రీతిగా, నిసర్గ మనోజ్ఞమైన రకరకాల భావాలకు, రసాలకు తగిన విధంగా భాషా ప్రయోగంతో ఈ పాటలన్నీ ఉండడం విశేషం. పైగా ఇవి పిల్లలకు సంబంధించిన పాటలు కనుక పసిహృదయాన్ని అమాయక మనస్సుల్ని రంజింపచేయగల విషయాలు, వాటికి తగిన పాటలు, అందుకీ ఉచితమైన భాష ఉండడం కూడా అవసరమే. ఇవన్నీ ఈ పాటల్లో మనం చూడవచ్చు. అందుకే ప్రౌఢ సాహిత్యంలో బాల సాహిత్యానికి ఎంతో ప్రాధాన్యం ఇస్తున్నారు. విద్యావంతులు ఈఆధునిక యుగంలో పైగా ఇది అంతర్జాతీయ బాలల వత్సరం గనుక తదుచితంగా దీని ప్రాధాన్యం పెరిగింది. అదే రీతిని జానపదుల చిన్న పిల్లలకు సంబంధించిన ఈ జానపద గేయాలను స్వీకరించడం వాటిని ప్రచారంలోకి తీసుక రావడం సాహిత్యవ్రతుల లక్ష్యంగా ఉంచుకోవలసిన ఆవశ్యకం ఎంతైనా ఉంది. అందుకై సాహిత్య విద్యార్థులందరూ యత్నిస్తారని ఆశిస్తున్నాను.

---

[1. చోట, 2. చద్ది. 3. వెదుకు, 4. మొలక, 5. చిగిరో, 6. మొగ్గ 7. పిందె, 8, పండు]

# మన చేతిపనులు

## ఆర్. వి. రావు

భారతదేశము కళలలో, చేతిపనులు, ప్రజానీకానికి అభిరుచి వున్నన్నాళ్ళు, ప్రతిభావంతమైన పనితనం విలువను గ్రహింప గల్గినన్నాళ్ళు, సౌందర్యవంతమైన వస్తుపరిచయము చూచి వారు ఆనందింప గలిగినన్నాళ్లు, జీవించటమేగాక, ఎవ్వటికీ వర్ధిల్లుతాయని సర్ జార్జి బర్ట్ ఉడ్ అనే ఆంగ్లేయ నిపుణుడు చెప్పిన మాటలలో చాల సత్యముంది. సౌందర్యంగల వస్తువు లెల్లప్పుడు, ఆనందప్రదాలనే మాటలు వాడటం ఎప్పుడూ వింటూనే వుంటాం. మనిషికి కావలసినది తిండి మాత్రమే కాదు. అనాది నుండి మానవుడు, అందమైన వస్తువులకొరకు ఆకాంక్షిస్తూనే వున్నాడు. మట్టి వస్తువులు, పేడ బొమ్మలు పేదవారి అభిమానానికి మాత్రమే నోచుకొంటే, అంతకంటె స్తోమతగల సంపన్నులు, ఖరీదైన వాటిని కొనవచ్చు. భారతీయ చేతి కళలలోని, నిరాడంబర సౌందర్యాలలో, తరతరాల, యుగయుగాల. భారతీయ సంప్రదాయాలు ప్రతిబింబిస్తాయి. ఆ పనివారిని సంఘం ఆదరించింది. సంపన్నులు అభిమానించారు కూడా.

ఆంధ్ర ప్రదేశ్ తీసుకొంటే, ఈ ప్రాంతం భారతదేశపు చేతిపనులకు ప్రతిబింబమని, ఆంధ్రులు గొప్ప సంపన్నులని, సంప్రదాయాలు లక్ష్యపెట్టేవారని, దయార్ద్ర హృదయులని, దేశసేవా పరాయణులని, అతి సన్నని, రమణీయమైన దారం చేతితో వడకుటకు పనికి వచ్చే ప్రత్తి, యిచ్చట లభ్యమగునని, ఆంధ్రులంటే తనకు చాల యిష్టమని మహాత్మాగాంధి తన వారపత్రిక 'యంగ్ ఇండియా' లో 1921 ఏప్రిలు 13 వ తారీకున వ్రాశాడు.

ఆంధ్రజాతి గొప్ప చారిత్రాత్మకమైనది. ఆంధ్రులు వారి ప్రత్యేకత, స్వాతంత్రాభిమానం నిలబెట్టుకొని, కళలకు గొప్ప దోహదమిచ్చారు. కాకతీయ రాజుల కాలంలో, ఆంధ్రుల గొప్పతనం వాణిజ్య వ్యాపారాలలోనే కాక, వాఙ్మయం, సంస్కృతి, కళలు మొదలగు వాటిలో ప్రతిఫలించాయి. ఇప్పటికీ వరంగల్ సమీపంలో వున్న రామప్ప దేవాలయం, హనుమకొండలోని వెయ్యి స్తంభాలగుడి, ఆనాటి శిల్ప చాతుర్యాన్ని చాటుతాయి. నైజాం ప్రభువు కాలంలో కూడ చేతి పరిశ్రమలకు పోషణ వుండేది. 1956లో ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడింది.

ఆంధ్రులలో నూటికి 70 మందికి పైగా వ్యవసాయం మీద ఆధారపడతారు. కాని, చేతిపనులలో కూడ చాల మంది నిమగ్నులై వున్నారు. మన రాష్ట్రంలో 5 లక్షలకు పైగా చేనేత మగ్గాలున్నాయి. 30 లక్షల మంది ప్రజలకు ఉపాధి సౌకర్యం యివ్వటమేకాక, మన రాష్ట్రంలో తయారయిన చేనేత బట్టలకు, చేనేతకుట్టుడు దుస్తులకు విదేశాలలో మంచి గిరాకీ వుంది. ఉప్పాడ, వెంకటగిరి, గద్వాల, మాధవరం గ్రామాలలో అందమైన చీరలు నేస్తారు. ఆర్థిక పరిస్థితులు మారుతున్నా మన కళాకారులు, వంశపారంపర్యమైన చేతిపనులను విడనాడుట లేదు. కాని, వారికి సరియగు పోషణ లేకపోతే, వారి పిల్లలు, ఇతర లాభదాయక వృత్తులలోకి పోవచ్చు. హైదరాబాదులోని సాలారుజంగు ప్రదర్శనశాల, ఒక్క వ్యక్తి, ఎన్ని చేతిపరిశ్రమలకు దోహదమిచ్చాడో తెలుపుతుంది. స్వదేశీ సంస్థానాలు పోయాయి. కనుక, పెద్ద భూస్వాములకు స్వస్తి చెప్పాం కనుక యీనాడు ప్రజలు చేతిపనులకు ప్రోత్సాహం యివ్వాలి. కళాకారుల సంస్థలు లేవు. వారు పైకివచ్చి డప్పులు కొట్టుకోరు. వారికి మంచి భవనాలు కూడ లేవు. విదేశీయులు మన చేతిపనులను మెచ్చుకొన్న నాడే, మనం మురిసిపడి పోతాం. ఇది చాల తప్పు.

అంధ్రప్రదేశ్ చేతిపనులు బహు ప్రాచీనమైనవి. యుగయుగాలలో అవి వర్ధిల్లాలి. మన సంస్కృతిలో అవి ఇమిడి ఉన్నాయి. వంశపారంపర్యంగా ఈ వృత్తులను నమ్ముకున్న కళాకారులలో గొప్ప గంభీరత, గర్వం, కనిపిస్తుంది. వారి హస్తాలతో బ్రహ్మాండమైన చేతిపనులు చేస్తారు. చాలమందికి అక్షర జ్ఞానం కూడ లేదు. కాని, వారికి గొప్ప నిపుణత వుంది. తివాసి నేతలోగాని, కొండపల్లి బొమ్మల తయారీలో గాని ఏ యితర చేతిపనిలోగాని. గణితశాస్త్ర జ్ఞానం, తత్వశాస్త్ర,

జ్ఞానం, ఇతర శాస్త్రాలలో జ్ఞానం కావలసి వుంది. ఇవన్నీ మన కళాకారులకు అనుభవం ద్వారా వస్తున్నాయి. వారికి గృహమే పాఠశాల అనాలి. పోటీ మీద ఆధారపడుతున్న ఆర్థిక వ్యవస్థలో ఉత్పత్తి తీరు తెన్నులు నిర్దేశించగలవారు ప్రజలే కదా! సంపన్నమైన జాతీయ వారసత్వాన్ని కాపాడగలిగే వారు ప్రజలే. సంఘంలో వస్తున్న మార్పుల కనుగుణంగా, సమన్వయ మార్గం అవలంబించి, చేతి పనుల అందచందాలు విస్మరించకుండా, వుండటం మన కర్తవ్యం. సృజనాత్మక శక్తి, నైపుణ్యం కలవారు ఆకలిబాధలో వుండి, మరణానంతరం మాత్రం గౌరవాలు పొందితే, అది మనకు గర్వకారణమైన విషయంకాదు. చేతి పనులను పోషించిన నాడే, సృజనాత్మక శక్తి వర్ధిల్లుతుంది. ఇవి మన సాంస్కృతిక సాంప్రదాయక చిహ్నాలు. ఇవి మన అనధికార రాయబారుల వలె వ్యవహరించి, విదేశాలతో, పరస్పర స్నేహసంబంధాలు, నెలకొల్పుటలో ఎంతో తోడ్పడగలవు.

కళలు ఆనందం కొరకే. వాటి స్పర్శ వలననే హృదయం ఉప్పొంగుతుంది. మనస్సు వికసిస్తుంది. ఇంట్లో చేతిపనుల సరకులు ఉంటే, ఇంటికి హంగు, చూడవచ్చినవారికి ఆనందం. గ్రామీణ జీవితంలోను, భారత సంస్కృతిలోను, ఇవి ఒక ముఖ్యభాగం. మన రాష్ట్రంలో వున్న, వివిధరకాల చేతిపనులు, ఏయితర రాష్ట్రంలోను లేవు. ఆంధ్రప్రదేశ్‌లో డిజైనులు, రంగులు, నిర్మాణాలు, కొన్ని శతాబ్దాలనుండి వచ్చాయి.* అవసరాల బట్టి కొత్త ముడిపదార్థాలు ఉపయోగించారు. నిర్మల్‌లో బంగారం రంగుగల రంగు తయారుచేసి, దానిని కట్టెబొమ్మలపై పూసేవారు. లక్కబొమ్మలను, మొగలి ఆకుతో Polish చేస్తారు. మన రాష్ట్రంలో తయారయే, ముఖ్య చేతిపరిశ్రమలను గురించి కొంత తెలిసికొందాం.

### ఆటబొమ్మలు

ఆంధ్రప్రదేశ్‌లో తయారయ్యే బొమ్మలను తప్పక చూసి తీరాల్సిందే. నిర్మల్‌లో కట్టెతో తయారయిన సింహాన్ని చూస్తే, నిజమైన సింహమని పిల్లలు భయపడతారు. మానసిక శాస్త్రం ప్రకారం, పిల్లలకు బొమ్మలవలన ఎంతో విజ్ఞానం వస్తుంది. వారికి అవి స్నేహితులనాలి. మన రాష్ట్రంలోనలుదిశలా, రకరకాల బొమ్మలు తయారవుతున్నాయి. నేటి సమాజంలో ఆటబొమ్మలకు గొప్ప స్థానం వచ్చింది. దసరా, సంక్రాంతి సందర్భంలో, చాలమంది బొమ్మలకొలువు పెడతారు.

మన రాష్ట్రంలోని బొమ్మలు, ప్రజల స్వీయ చరిత్రను వెల్లడి చేస్తాయి; మనయొక్క సంస్కృతిని విశదీకరిస్తాయి. అచ్చటి పరిసరాలు, లభ్యమయ్యే ముడిపదార్థాలు, ప్రజల ఆర్థికస్థితి వీటివలన బాగా తెలుస్తాయి. కొన్ని బొమ్మలు నిర్మాణాత్మకమైనవి. కొన్ని కొత్త విషయాలు కనుక్కొనే శక్తిని ఇస్తాయి.

కొండపల్లి గ్రామంలో, కట్టెతో బొమ్మలు చేస్తారు. అవి చూడముచ్చటగా వుంటాయి. మనుషుని రూపు, చూపు, వెల్లడిచేసే బొమ్మలకు కొండపల్లి పెట్టింది పేరు. "కొండపల్లి బొమ్మలాగా" అనే సినిమా పాట కూడా వుంది. ఈ బొమ్మలు గ్రామీణ వాతావరణాన్ని ప్రదర్శిస్తాయి. తెల్లపొనుకుకట్టె స్థానికంగా లభ్యమవుతుంది. పక్షులు, వృత్తులు, పౌరాణిక బొమ్మలు ఇచ్చట బాగా తయారు చేస్తారు. ఇచ్చట తయారయిన దశావతారం బొమ్మలు చాల ప్రసిద్ధి కెక్కాయి. కళాకారులు కొన్ని శతాబ్దాల క్రింద, రాజస్థాన్ నుండి వచ్చారట.

ఇచ్చట కళాకారులకు సహకార సంఘం వుంది. కళాకారులకు సామాజిక క్షేత్రాన్ని కూడ ప్రభుత్వం స్థాపించింది. ఇది చరిత్రాత్మక ప్రదేశం కనుక విలాస యాత్రికులు, ఈ బొమ్మలు బాగాకొంటారు విదేశాలలో కూడా మంచి గిరాకి ఉంది. సాలీనా లక్షరూపాయల బొమ్మలు తయారవుతున్నాయి.**

### నిర్మల్ బొమ్మలు

ఇచ్చట కూడ, కట్టెతో పక్షులు, ఆటబల్లలు' యింకా ఎన్నో ఎన్నో రకాల బొమ్మలు తయారు చేస్తారు. తేలికైనకట్టె యిచ్చట లభ్యమవుతుంది. ఆదిలాబాదు అడవులలో నెమళ్ళు పెద్దపులులు బాగా వున్నాయి. వాటిని అచ్చుపోసినట్లు కళాకారులు

---

*"The evolution of design, colour and form embodied in Handicrafts is a story of experiment and evolution through centuries, perfected through the passage of time" Dr S. V. Rao, Handicrafts of Andhra Pradesh Page 26.

**కీ. శే. కళా వెంకట్రావు కొండపల్లి బొమ్మలు రైలుపెట్టెలలో పంపినా గిరాకీ వుండగా బుట్టలకు సరిపడినన్ని కూడ చేయలేక పోతున్నా మన్నారు.

తయారు చేస్తారు. హైదరాబాదులో కొత్త నిర్మల్ పరిశ్రమలో paintings చేస్తున్నారు. చాలాకాలం నిలచు రంగులవలననేగాక, వనమూలికల రసాయనములతో రంగుల కిచ్చు బంగారు వన్నెవలన కూడ, యీ వస్తువులకు అందం, గిరాకీ పెరిగింది. అమెరికా, జర్మనీ యితర దేశాలలో, వీటికి మంచి గిరాకీ వున్నది.

ఏటికొప్పాక లక్క బొమ్మలు

కర్ణాటక రాష్ట్రంలో చెన్నపట్నంవలె, యిక్కడ లక్క బొమ్మలు చేస్తారు. సాలీనా 2, 3 లక్షల రూపాయల బొమ్మలు తయారవుతాయి. బెంగాల్, బీహార్ రాష్ట్రాలలో, యీ బొమ్మలకు మంచి గిరాకీ వుంది.

తిరుచానూరు బొమ్మలు

తిరుపతికి సమీపగ్రామం తిరుచానూరులో, నల్ల చందనంతో మంచి బొమ్మలు తయారు చేస్తారు. వీటికి కెనడా, అమెరికాలో మంచి గిరాకీ వుంది. ఎర్ర చందనం, ఆంధ్రప్రదేశ్‌లో చిత్తూరు, కడపజిల్లాలలో మాత్రమే లభ్యమవుతుంది. జపాను మంచి ధరకు కట్టెను కొని వాయిద్యపు పరికరాలు చేయుటకు ఉపయోగిస్తోంది. పిల్లలు బొమ్మలకు దుస్తులు తొడిగి బొమ్మల పెళ్ళిళ్ళు చేస్తారు.

బందరులో కాగితపు పల్పుతో బొమ్మలు చేసి springతో నృత్యం చేయిస్తారు. వీటిని dancing dalls అంటారు.

స్థిరమైన ఆర్థిక సమాజంలో నైతిక, సాంఘిక ప్రవృత్తులను కాపాడవలసి ఉంటుంది. మన సాంప్రదాయాలు, సంస్కృతిని అనుసరించి, మనం ప్రవర్తించాలి. మారుతున్న ప్రపంచంలో వీటికి స్థానం లేదనుటలో అర్థం లేదని మాత్రం మనం గుర్తించాలి.

తివాసీలు

తివాసీలు పారశీక సంతతివి. కాని, నేతలోను, డిజైనులలోను, యిచ్చటి సాంప్రదాయాలనుబట్టి మార్చారు. హైదరాబాదు సంస్థానంలో, యీ పరిశ్రమకు ప్రత్యేక స్థానం వుండేది. ఇప్పటికీ వరంగల్ జైలులో యీ పరిశ్రమ మంచి స్థితిలో వుండేది. కాని, యిప్పుడు నశించింది. మన రాష్ట్రంలో వరంగల్‌లో తయారయిన తివాసీని 1857లో లండన్ ప్రదర్శనంలో ప్రదర్శించారు. ఒక చదరపు అంగుళంలో 12 వేల కుట్లు ఉన్నాయట. వీటినే రత్నకంబళ్ళు అంటారు. ఏలూరు కూడ తివాసీ పరిశ్రమకు పెట్టింది పేరు. కావలసిన ఉన్ని మన రాష్ట్రంలో దొరుకుతుంది. 10, 15 లక్షల రూపాయల తివాసీలు విదేశాలకు ముఖ్యంగా అమెరికా, జర్మనీలకు ఎగుమతి అవుతున్నాయి.

సామాన్యపు ప్రజలు ఉన్నిదారంతో నేయబడ్డ కంబళ్ళను వాడుతారు. దక్షిణ భారతదేశంలో, ఈ పరిశ్రమ ఏ రాష్ట్రంలోను లేదు. మన రాష్ట్రపు ఉన్ని తివాసీలకు ప్రత్యేకతవుంది. కనుక వీటిని మనం గర్వ కారణంగా గుర్తించి, వాటి అభివృద్ధికై ప్రత్యేక శ్రద్ధ తీసికోవలసిన బాధ్యత మనపై వుంది.

అద్దకాలు

చేనేత పరిశ్రమను గురించి, మనం యిదివరకే తెలిసికున్నాం. మన రాష్ట్రంలో ధర్మవరం, పోచంపల్లి, బచ్చన్నపేట, పెద్దాపురం, ఆర్మూరు గ్రామాలలో పట్టుచీరలుకూడ నేస్తారు. గౌ. కె.వి. కేశవులు గారు యీ శాఖకు మంత్రి అయాక, మన రాష్ట్రంలో మల్బరి తోటలుపెంచి, ముడిపట్టుచేయటానికి చర్యలు తీసికొన్నారు. గత సంవత్సరంలో 2000 అవనపు ఎకరాలు, మల్బరి పెంపకం క్రిందకు వచ్చాయి.

ఇక అద్దకాలు గురించి కొంచెం తెలుసికొందాం. ఇది మనరాష్ట్రంలో మంచి ప్రాచీనమైన కళ. తూర్పిండియా సంఘంవారు, అద్దకాలు కొని బాగా డబ్బు చేసికొనేవారు. బందరు రేవునుండి ఎగుమతి అయేవి. రామాయణం, భారతం ఇతిహాసములలోని కథలు, కాళహస్తిలో అద్దకం చేస్తారు. బందరులో తయారయిన కాలికోలకు, బంటాలకు, ఒకనాడు ప్రపంచ ప్రఖ్యాతి ఉండేది. ప్రాచీన గ్రీకురాజులు వాటిని విరవిగా కొనేవారు. బందరులో కొన్ని శతాబ్దాలనుండి యీ అద్దకం పరిశ్రమ ఉండేదని Imperial Gazetteer వలన తెలుస్తోంది. చేతితో అద్దినా, ఒక్కొక్కప్పుడు వీటిని, చేతి కుట్టు అని భ్రమ పడతాం.*

*అనాదినుండి మన చేనేత పరిశ్రమల సరకులకు, విదేశాలలో గిరాకీ వుండేది. అందచందాలకు పెట్టింది పేరు. మనదేశం సందర్శించిన యాత్రికులు యిచ్చిన అభిప్రాయాలు చదివితే మన సరకుల విశిష్టత తెలుస్తుంది. ఎరిత్రయన్ సముద్రానికి చెందిన పెరిప్లస్ వ్రాయుచు, మాసాలియా (మచిలీపట్నం) ప్రాంతంలో మస్లినులు, యితర రంగుల బట్టలు లభ్యమయేవని, తూర్పుతీరం వాటికి పెట్టింది పేరని అన్నాడు. ఫ్రెంచి తత్వజ్ఞుడు Valtaire మసూలాలో తయారయే అద్దకం బట్టలంటే, ఫ్రెంచివారికి యిష్టమన్నాడు. కలంకారి గురించి పురాణాలలోకూడ పేర్కొనబడింది. 1618-1622 లోని Factory Records ప్రకారం, వరంగల్‌లో చేసిన బట్టలకు పారశీకదేశంలో బాగా

కలంకారి అంటే కలంతో పనిచేయటం అని అర్థం. క్రొత్త ఢిల్లీలోని నేషనల్ మ్యూజియం నూలువస్త్రశాఖ క్రొక్కిపోతే, ఒక పెద్ద గుడ్డమీద రామాయణం, బొమ్మ లతో సూచించబడింది. దానిని కాళహస్తిలో తయారు చేశారు. మదరాసు మ్యూజియంలో, ప్రాత అద్దకం నమూనా లున్నాయి.

హిమ్రూ

నూలు కృత్రిమపట్టు కలసి శాలువలు, తెరలు చేస్తారు. రాష్ట్రపతి నిలయంలో ఖాదీ హిమ్రూను వాడారు.

లేసు పరిశ్రమ

ఈ పరిశ్రమ పశ్చిమ గోదావరి జిల్లాలో వుంది. సుమారు 15 లక్షల రూపాయల లేసు విదేశాలకు ఎగుమతి అవుతోంది. లేసు పని చూడ్డానికి చాల సొంపుగా వుంటుంది. వేలాది స్త్రీలకు ఈ పని వలన ఉపాధి సౌకర్యాలు వచ్చాయి.

బిద్రి

తుత్తినాగం, రాగి కరిగించి, పోతపోసి, దానిమీద వెండితో డిజైనులు చెక్కుతారు. ఢిల్లీ నేషనల్ మ్యూజియంలో, యిప్పటికీ బిద్రి కుర్చి ఉంది. పెట్టెలు, బొమ్మలు, అగరవత్తి స్టాండులు అనేక రకాల వస్తువులు తయారవుతున్నాయి. Professor Speight దీన్ని గురించి వ్రాస్తూ "There are very few wares in the World, more pleasing as antiques" అన్నాడు. వీటికి విదేశాలలో కూడ గిరాకీ వుంది.

షిల్గ్రి

వెండితీగతో అత్తరు దానులు మొదలయినవి కరీం నగరంలో చేస్తారు. మహమ్మదీయులు కట్నపు కానుక లలో వీటిని యిచ్చేవారు. భారతీయ స్వర్ణకారులు, పరికరాల మీదకంటె, తమ స్వంత నైపుణ్యంమీద ఆధారపడతా రని, పరికర సామగ్రి తక్కువ అనే మాటలలో చాల సత్యముంది.

ఇతర చేతి పనులు

దంతపు పని విశాఖపట్నంలో జరుగుతోంది. చార్మి నారు దగ్గర గాజుముక్కలు లక్కమీద అతికించి, గాజులు మీదవేసి అమ్ముతారు. హైదరాబాదు వచ్చిన వారు లాడ్ బజారులో తప్పక యీ గాజులు కొంటారు. తోలుబొమ్మలాట, వెనుక, ప్రజలకు కావలసిన విద్య

పరిశ్రమ ఉంది. చిత్తూరు జిల్లాలో పాపనాయుడు పేటలో సన్నటి పూసలు తయారవుతాయి. ఇంత చిన్న సన్నని పూసలు చేతితో కళాకారులు చేస్తారు. వారి నైపుణ్యాన్ని మెచ్చుకోవాలి. సుందరమైన చాపలు, ఇత్తడి సామానులు కూడ మన రాష్ట్రంలో తయారవు తాయి. పెంబర్తిలో నగిషి సామానులు, పెరుమాళ్ళ పల్లిలో విగ్రహాలు తయారవుతాయి. చిత్రములు చిత్రించిన తలుపులు కూడ తయారు చేస్తారు. వెదురు బుట్ట, తాటాకు బుట్టలు, యీతాకు బుట్టలు కూడ రంగు లతో చేస్తారు. ఈతాకు బుట్టలకు అమెరికాలో గిరాకీ ఉంది.

ఈ క్రింది పట్టికలో, మన రాష్ట్రంలోని కొన్ని చేతిపనుల సరకులు ఏ ఏ దేశాలకు పోతున్నాయి పేర్కొనబడింది.

| వస్తువులు | దిగుమతి చేసుకొంటున్న దేశాలు |
|---|---|
| లుంగీలు | - దక్షిణ తూర్పు ఆసియా, ఆఫ్రికా |
| సిల్కులు | - యూరప్, ఆస్ట్రేలియా, అమెరికా |
| మదరాసు చేతి రుమాలు | - నైజీరియా, ఘానా, జాంబియా, |
| కంబళ్ళు | - శ్రీలంక |
| హిమ్రు | - అమెరికా, జపాన్ |
| కలంకారి | - అమెరికా, జపాన్ |
| ఉన్ని తివాసీలు | - కెనడా, పశ్చిమ జర్మనీ, అమెరికా, ఇంగ్లాండు |
| బిద్రి | - అమెరికా |
| లేసు | - ఆస్ట్రేలియా, జర్మని, అమెరికా |
| ఆట సామాన్లు | - అమెరికా |
| రెడిమేడ్ దుస్తులు | - అమెరికా, జర్మనీ, మొదలగు దేశాలు |

---

గిరాకీ వుండేది. పశ్చిమ గోదావరి జిల్లా నర్సాపురంలో ఓడలు నిర్మించి, ఎర్రసముద్రం, తూర్పు దేశాలలో వర్తక వ్యాపారాలు చేసేవారమని ఈ రికార్డులవల్ల తెలుస్తుంది. బ్రిటిషు ప్రభుత్వకాలంలో ఇవి చాల వరకు నశించాయి. స్వాతంత్ర్యం వచ్చాక మన ఆర్థిక ప్రగతిలో వాటికి ప్రత్యేక స్థానం యిచ్చి, తగు చర్యలు తీసికొన్నాం. ఈనాడు మన చేతి పరిశ్రమల సరకులకు విదేశాలలో గిరాకీ వచ్చుట సంతోష

# మలేషియాలో తెలుగు తేజం

'కళాప్రపూర్ణ' డాక్టర్ దాశరథి
(ఆంధ్ర ప్రదేశ్ ఆస్థాన కవి)

మలేసియాలో మనవాడు
మహాశక్తిగల మొనగాడు
ఆ దేశానికి వెళ్లాడు
స్వేదవర్షమును కురిసాడు
కేదారాలను పండించాడు
గాదెల నెన్నో నిండించాడు;
రబ్బరు తోటలు, కొబ్బరితోటలు
రమ్య తైల భూరుహముల తోటలు
కూర్చినవాడు ఆంధ్రవీరుడు ;
మలే "బహాసా"లో వినిపించే
మధుర గీర్వాణ అరబీ మాటలు
నేర్చినవాడు ఆంధ్ర తనయుడు

లక్షా యాభై వేల జనావళి
కక్షలు తెలియని తెలుగు ప్రజావళి
అందరి మన్నన పొందినవారు
నందన వనిలో ఉండినవారు
తెలుగంటే తమ మాతృమూర్తిగా
తెలుగంటే తమ జాతికీర్తిగా
తెలుగంటే తమ కంటి వెలుగుగా
తలచే వీరులు ఇట ఉన్నారు

*రంబుటాను వలె తియ్యని తెలుగు
*మ్యాంగోస్టీన్ వలె కమ్మని తెలుగు
*డోరియాను వలె వెచ్చని తెలుగు
నోరారా మాట్లాడేవారు
మూడు వేల మైళ్ళావల ఉన్నా
ఓడ, విమానం ప్రయాణమైనా
గుండె గుండెకూ దూరం లేదని
నిండు మనసుతో అంటున్నారు

ఇష్టంతో కష్టించేవారు
ముష్టికి చేతులు సాచనివారు
ఆంధ్రత్వంతో నిండినవారు
ఆత్మాభిమాన ముండినవారు

రెండవ ప్రపంచ తెలుగు మహాసభ
దండిగ జరిగే శుభ సమయం
ఐకమత్యమును ఆకాంక్షించే
ఆంధ్ర ప్రజలకు ఇది విజయం

మలయ మారుతముల భూమి
మలేషియా జిందాబాద్ !
మలేషియా తెలుగువారి
మహనీయత జిందాబాద్ ! !

---

*మలేసియాలోని మధురఫలాల పేర్లు

# మలేసియా తెలుగువారి మహనీయత జిందాబాద్ !

డాక్టర్ దాశరథి

మలయానిలమును గూరిచి
మహాకావ్యముల చదివితి,
మలేసియా దర్శించితి
మలయానిలు స్పర్శించితి
విగహిజనుల, రేలందున
వేగించే మలయానిల !
ఇంతకాలమూ నీదు
అంతు దొరుకలేదయ్యా
మలేసియా గహనాటవి
మధ్యస్థిత తరువులలో
మహా సౌధములలో వలె
విహార మొనరించెదవా !
విరహులు కాని జనాళికి
విశ్రాంతి నొసంగ గలవు
విశ్వమ్మును వూయెలలో
ప్రేమతోడ వూపగలవు
తెలుగువారి గుండియలే
"మలయా" చల్లని కొండలు,
వారి తెలుగు అభిమానం
మధుర మలయ పవమానం
'పెనాంగు'లో కలుసుకున్న
తెనుగు వారి అనురాగం
'బెలు కాన్సన్‌లో కలిసిన
తెలుగు వారి అన్యోన్యం
'పెటలింగ్ జయ'లో మిత్రుల
ప్రేమ్మోసదాతిథ్యం,
సింగపూరులో కలసిన
అంగనాళి అభిమానం
*'కే యల్'లో 'కిలాంగ్'లో
తీయ తెలుగు సంగీతం,
నందన వనమే తానై
క్రిందికి దిగె ఆదేశం
మలయాలో తెలుగుతల్లి
కొలువు తీర్చు శుభసమయం
త్వరలోనే రానుందని
పరమాప్తులు చెప్పినారు.
ఆంధ్ర మాత కొాక భవనం
అచ్చట నిర్మిస్తారు
తెలుగువారి కీర్తి — రత్న
దీపంలా వెలిగించేరు
ముఖ్యమంత్రి పర్యటన
సఖ్యత నింకా పెంచును
విద్యామంత్రి రాకతో
విశ్వాసం పెంపొందును
మలయ మారుతముల భూమి
మలేసియా జిందాబాద్ !
మలేసియా తెలుగు వారి
మహనీయత జిందాబాద్ !

---

* కవులాలంపూర్

# మలేషియా మధురిమలు

డా॥ సి. నారాయణరెడ్డి

మలేషియా తిలకించితి
మరీ మరీ పులకించితి
తెలుగువారి యెదలలోని
తీపిని ఆస్వాదించితి

తెలుగు పదం విన్నచాలు
అలలెత్తును హృదయాలు
తెలుగుతనం కన్నచాలు
అలరులెత్తు వదనాలు

ఎటు వీచిన వెచ్చదనం
ఎటు చూసిన పచ్చదనం
పచ్చదనం కాదు బ్రతుకు
పండించే పచ్చ - ధనం

తరుణుల తలపించు తైల
తరువులు నిలిచిన బాటలు
శాఖా సుందర కరములు
సాచే రబ్బరు తోటలు

మచ్చికతో పితికిన గో
మాత గుమ్మపాలిచ్చును
చీల్చినగానీ రబ్బరు
చెలి చిక్కని పాలిచ్చును

ఆ పాలను సేకరించు
గోపాలురు తెలుగువారు
మలేషియా ద్వీపమ్మున
తలలెత్తుకు తిరుగువారు

తండ్రుల తాతల తరమున
తరలి వచ్చినారు వీరు
కొత్తగడ్డలోన తెలుగు
విత్తనాలు చల్లినారు

ఎక్కడ మన విశాఖ ; మరి
యెక్కడిదీ ద్వీపశాఖ !
తెలుగుతల్లి కిచ్చట ది
ద్దిరి సౌహార్ద తిలకరేఖ

[ జులై 1976 ]

## మలయాళా గీతం

జె. బాపురెడ్డి

మలయ మారుతం
మలయ మారుతం
మలయాళాగత మైత్రీ
మధుర మారుతం—

గోలకొండ మంచుకొండ
గుండెలు పొంగారినట్టి
గోదావరి గంగా
తరంగ మారుతం— ॥మలయ॥

తెలుగునోట తెలుగు పాట
వెలిగే భారత సంస్కృతి
మలయా భావలయాత్మను
అలరించే మధుగీతం— ॥మలయ॥

డెందాలను శ్రుతిచేసిన
అందాలను జతచేసిన
హిందూ సింధువు పారే
హిమవన్నగ సంగీతం ॥మలయ॥

మమతల మల్లియలు కూర్చి
కలల కలువ పూలు తీర్చి
ఆనందాంజలి ఘటించు
మానవతా జలపాతం— ॥మలయ॥

## తెలుగుగీత మైపోయె

జె. బాపురెడ్డి

తేటగీత మైపోయె
థేమ్సు నది
ఆటవెలది అయిపోయె
ఆంస్టర్‌డాము—

రోములోన తెలుగువాణి
రోమాంచము కలిగించెను
మారీషస్‌లో తెలుగు
మాట తేనె చిలికించెను— ॥తేట॥

తెలుగు ప్రతిభ సెహరానకు
వెలుగు హస్త మందించెను
తెలుగుల కని అమెరికాయె
నిలువెల్లా పులకించెను— ॥తేట॥

మలయాలో తెలుగు తల్లి
మల్లెపూలు ముడుచుకుంది
మాస్కోలో తెలుగు కవిత
మైత్రి భాష నేర్చుకుంది— ॥తేట॥

తూర్పు పడమరలు తలుపులు
తెరచి స్వాగతము పాడెను
భారతాత్మ వెలుగు తెలుగు
భారతికి కళారతికి— ॥తేట॥

# విదేశాల్లో తెలుగు వారు - సాంస్కృతిక వికాసం

## మండలి వెంకట కృష్ణారావు

2,500 సంవత్సరాల మహోజ్జ్వల చరిత్ర కలిగిన తెలుగు జాతి సంస్కృతి ప్రపంచ నాగరిక సంస్కృతు లన్నింటిలోకి అతి పురాతనమైనది. అతివిశిష్టమైనది. ఆదనుంచి మన జాతి ప్రపంచంలోని ఇతర జాతులతో, ఇతరదేశాలతో సత్సంబంధాలను పెంచుకొంటూ సాంస్కృతికౌన్నత్యాన్ని పెంపొందించు కొంటూ వున్నది.

నాటి రాచరికపు వ్యవస్థలో ఒక జాతి, ఒకదేశం మరో జాతితో, మరో దేశానితో రాజకీయంగాను వ్యాపార వాణిజ్య విషయకంగానూ, విద్యాపరంగాను, సత్సంబంధాలను పెంచుకొంటూనో, సమరాలు సాగిస్తూనో ముందుకు సాగిపోతూ ఉండేవి. ఇందుకు నాడు ప్రధానంగా నౌకాయానం రవాణా సౌకర్యంగా ఉండేది. ఈ విధంగా ప్రపంచ దేశాలలోని పరస్పర ఆదాన ప్రదానాలవల్ల ఆయా జాతుల, దేశాల సంస్కృతి వికాసం పొందుతూ ఉండేది. అంతేకాదు, విదేశీరాయబారులు, యాత్రికులు, మతస్థులు, విద్యార్థుల పర్యటనలవల్లకూడా ఒకజాతి, ఒకదేశం సంస్కృతి మరో దేశంలో ప్రచారం చేయబడి, మరో జాతిని ప్రభావితం చేస్తూ వచ్చేది. అందుకే ప్రపంచంలోని ప్రతి జాతి సంస్కృతిలో అంతస్సూత్రంగా ఒకేభావం భాసిస్తుంది. పైకి కనిపించే లక్షణాలలో వైవిధ్యం గోచరించినా, ఒక్కో వైవిధ్యం ఒక్కో విలక్షణాన్ని కలిగి ఆయా జాతుల సంస్కృతికి విశిష్టతను సంతరిస్తుంది. ఈ విధంగా సంతరించబడిన విశిష్టతలలో మన తెలుగు జాతి సంస్కృతికి గొప్ప స్థానం ఉంది.

ఈనాడు ఆధునిక యుగంలో ప్రపంచ దేశాల నడుమ నాడు ఉన్నంతగా సంకుచిత పరిధులు లేవు. మానవుడు వైజ్ఞానికంగా పురోగమిస్తున్నాడు. ఈ వైజ్ఞానిక పురోగమనంలో ఒకజాతి, ఒకదేశం అంటూ గిరిగీసుకొనకుండా విశ్వగోళం విశాల పరిధిలో ఈనాటి మనిషి విహరిస్తున్నాడు. అందుకే ఈనాడు ఎల్లలు లేకుండా అన్ని దేశాలు, అన్ని ఖండాలు అతి సునాయాసంగా చుట్టివస్తున్నాడు. ఇందుకు రాజకీయ, సాంఘిక, సాంకేతిక, వైజ్ఞానిక, విద్యా విషయకమయిన కారణాలు అనేకం ఉన్నాయి. ఈ విధమయిన భ్రమణం 'వసుధైక కుటుంబం' అనే సద్భావనకు దారి తీస్తుం దని ఆశించవచ్చు.

ఈ రకమైన గమనంలో మన తెలుగు జాతి కూడా ప్రముఖమైన పాత్రనే చేపట్టినది. మన తెలుగు జాతి కూడా ప్రముఖమైన పాత్రనే చేపట్టినది. మన తెలుగు వారిలో కూడా చాలామంది అనేక కారణాలవల్ల ఇతర దేశాలకు వెళ్ళటం జరిగింది.

ఈస్టిండియా కంపెనీ వారి రాకతో భారతదేశం జీవనగమనంలో ప్రధాన మయిన మార్పు వచ్చింది. 19 వ శతాబ్దపు మధ్యభాగంలో భారత దేశంలో రైలు మార్గాలు పడినప్పటి నుంచి ఇతర దేశాలలోనికి వ్యాపారానికి, పరిశ్రమల పెంపుదలకు స్వదేశం నుంచి అనేకమంది కూలీలుగా, కార్మికులుగా వలస వెళ్ళవలసి వచ్చింది. బ్రిటిష్ వారి పరిపాలనా కాలంలో భారత దేశంనుంచి ఈ విధంగా కాందిశీకులుగా తరలింపబడినవారిలో తెలుగువారు కూడా ఉన్నారు. వీరు విదేశాలలోని రబ్బరు, కాఫీ, తేయాకు, కలప వంటి తోటలలో కార్మికులుగా పనిచేస్తూ జీవనోపాధి గడుపుచు ఉండేవారు. అయితే భారత దేశానికి స్వాతంత్ర్యం సంక్రమించిన తరువాత వీరిలో చాలామంది మళ్ళీ తిరిగి స్వదేశానికి రాలేదు.

ఆ విధంగా అక్కడ స్థిరపడిపోయిన తెలుగువారు

తమ పరిధిలో తమ మాతృభాషా సంస్కృతులను పరిరక్షించుకొంటూనే అక్కడి స్థానిక భాషా సంస్కృతులను సమాదరిస్తూ ప్రవాసాంధ్రులుగా మిగిలిపోయారు. అయితే వీరి తరువాత తరాల వారు తమ స్వీయ సంస్కృతిని, సంప్రదాయాన్ని, భాషా చరిత్రను మరచిపోయే ప్రమాదం కూడా లేకపోలేదు. అందువల్ల వారిలో ఎప్పుడు ఆ స్పృహను జాగరితం చేయడానికి, వారిలో వాటి పట్ల అభిమానాన్ని, ఆదరణను పెంచడానికి మన సంస్కృతీ సంప్రదాయాలు, వారి పుట్టుపూర్వోత్తరాలను, ఔన్నత్యాన్ని తెలియజెప్పవలసిన ఆవశ్యకత ఎంతయినా ఉంది.

స్వాతంత్ర్యానంతరం, ఇటీవలి కాలంలో మాత్రం చాలావరకు ఉద్యోగాల రీత్యా, ఉన్నత విద్యార్జన కోసం వెళుతున్న వారు ఉన్నారు. ఈ విధంగా ఇటీవలి కాలంలో వెళ్ళిన వారు అక్కడి తెలుగు వారిలో రేఖామాత్రంగా ఉన్న తెలుగు సంస్కృతి సంప్రదాయాల వికాసానికి తోడ్పడాలి. అంటే విదేశాలలోని తెలుగు వారిలో మన సంస్కృతి సంప్రదాయాలను వికసింపజేయడానికి అటు ప్రజలు, ఇటు ప్రభుత్వం వారు కూడా కృషి చేయవలసిన అవసరం ఉంది.

ఈనాడు మలేసియా, మారిషస్, దక్షిణాఫ్రికా, ఫిజీ, బర్మా, సింగపూర్, అమెరికా, శ్రీలంకా, యు.కె. కెనడా వంటి దీవులలో, దేశాలలో దాదాపుగా ఐదు లక్షల మంది తెలుగువారు నివసిస్తున్నట్లుగా ఇటీవల జరిగిన సర్వేవల్ల వెల్లడయినది. అయితే వీరంతా తమ అస్తిత్వానికి, వ్యక్తిత్వానికి మూలమైన సంస్కృతిని మరిచిపోకూడదు. కేవలం మన సంస్కృతిని మనం పరిరక్షించుకోవడం, ప్రచారం చేసుకోవడమే కాకుండా ఎదుటివారి సంస్కృతిపట్ల కూడా సమాదరణ దృష్టిని కలిగి ఉండాలి. కానీ, పొరుగువాడి సంస్కృతీ వ్యామోహంలో పడిపోయి మన సంస్కృతిని విస్మరించ కూడదు.

విదేశాలలో ఉన్న తెలుగు వారి ఇళ్ళను చూడగానే, వారి కట్టుబొట్టు తీరును చూడగానే తెలుగు సంస్కృతి ప్రతిబింబించేలా ఉండాలి. అంటే ముంగిళ్ళలో ముగ్గులు తీర్చి, ద్వారాలకు తోరణం కట్టి, పసుపు పారాణి పెట్టుకొనే తెలుగు సంస్కృతి కొట్టవచ్చినట్టు కనిపించాలి.

నేను మారిషస్, మలేసియాలలో పర్యటించినప్పుడు అక్కడి కొన్ని తెలుగు కుటుంబాలవారు తమ వాకిళ్ళ ముందు ముగ్గులు తీర్చిదిద్దుకొని, ద్వారాలకు తోరణాలు కట్టుకొని, పసుపు కుంకుమలు రాసుకొనే తెలుగు సంస్కృతిని నేను అక్కడ స్వయంగా చూశాను. ఈ విధమైన మన సంస్కృతి ప్రపంచ దేశాలలో ఉన్న తెలుగు వారి ఇళ్ళలో వికాసం పొందాలని ఆశించాను. ఈనాటికీ విదేశాలలోని తెలుగు స్త్రీలలో మన సంస్కృతి వుట్టిపడుతూ వుంటుంది. తెలుగు ఉగాది, విజయదశమి, దీపావళి పండుగలకు తెలుగు వారు తాము జరిపే సాంస్కృతిక కార్యక్రమాల ద్వారా సంస్కృతిని ప్రదర్శిస్తూ ఉంటారు.

ఈ సాంస్కృతిక వికాసం అన్నది కేవలం వైయక్తికంగా జరిగేదికాదు. సామూహికంగా, స్వచ్ఛంద సంస్థల ద్వారా, ప్రభుత్వ సహకారంతో కొనసాగవలసినది. వైయక్తికంగా అయితే ఇటీవలి కాలంలో అక్కడికి వెళ్ళిన విద్యావంతులయిన వారు పూర్వం నుంచీ అక్కడే స్థిరపడి, తెలుగు సంస్కృతీ సంప్రదాయాలకు దూరంగా ఉండి, వాటి ఉనికిని గురించి అంతగా తెలియనివారికి తమ భాషణలద్వారా, చిన్నచిన్న గోష్ఠులద్వారా, ఉపన్యాస కార్యక్రమాలద్వారా, అక్కడి తెలుగు వారికి తెలియజెప్పే అవకాశం ఉంటుంది. ఈ విధంగా తమ స్వకీయమైన సంస్కృతిని గురించి కొద్దిపాటిగా తెలుసుకొన్న వారిలో వాటిని గురించి కూలంకషంగా తెలుసుకోవాలి, అవలోకనం చేయాలి అనే జిజ్ఞాస బయలుదేరుతుంది, వారిలోని ఈ బీజావాపనానికి, అంకురార్పణకు చేయూతగా కొన్ని స్వచ్ఛంద సంస్థలుగాని, ప్రభుత్వ రంగంగాని పూనుకొని కృషి చేయాలి. వారిలోని చిరుకోరికకు ఆలంబనగా వారికి ముందుగా గ్రంథజాలం అవసరం. ఇందుకు ముందుగా వారికి భాషలో ప్రవేశం ఉండాలి. అందుకు మొదటి సోపానంగా విద్యను ప్రవేశ పెట్టాలి. విదేశాలలో ఉన్న తెలుగు వారికి, వారి పిల్లలకు మాతృభాషా బోధనా సౌకర్యాలను ఏర్పాటు చేయడంలో ప్రభుత్వం శ్రద్ధ కనబరచాలి.

విద్యాబోధన పథకాన్ని ప్రవేశ పెట్టడమే కాదు. వారికి తగు పాఠ్య గ్రంథాలు అందుబాటులో ఉండేలా

చూడడం, వాటిని వారి గ్రహణశక్తికి అనుగుణంగా రూపొందించడం అవసరం. అంతే కాదు. ఆయాస్థానిక గ్రంథాలయాలలో తెలుగు పుస్తకాలు లభ్యమయ్యే ఏర్పాట్లు చేయడంవంటి బాధ్యతలను కూడా చేపట్టాలి.

సాంస్కృతిక వికసనంలో పత్రికలు, సినిమాలు, నాటకాల వంటి సాధనాలెన్నో ఉపకరిస్తారు. ఉదాహరణగా అక్కడ ఉన్న తెలుగు కుటుంబాలవారు తెలుగు పర్వదినాన్ని జరుపుకోవడానికి వారికి ఆయాతిథి వార నక్షత్రాలు తెలియజెప్పే పంచాంగం వంటివి అందుబాటులో ఉండాలి. పత్రికలద్వారా ఎప్పటికప్పుడు వారికి వారి స్వజాతి నిత్యజీవన వ్యవహారాలు కళ్ళకు కట్టినట్లుగా చూపగలుగుతూ ఉండాలి. సినిమాలు నాటకాల వంటి ప్రక్రియలద్వారా మన పౌరాణిక చరిత్ర వైభవాన్ని, మనజానపద జీవిత చిత్రణను, సాంఘిక ఆచార వ్యవహారాలను వారికి దృశ్య రూపంలో ప్రదర్శించి చూపితే అవి వారి మనసుల్లో హత్తుకుని తమ సంస్కృతి ఔన్నత్యంపట్ల ఉన్న ఆత్మాభిమానంతో వ్యక్తిత్వాన్ని మహోన్నతంగా రూపొందించుకోగలరు. వీటి ద్వారా ముందుగా వారిలో మన మంతా ఒక్కటే, 'మన సంస్కృతి ఒక్కటే' అనే స్వీయభావన ఏర్పడుతుంది. తద్వారా జాతీయ సమైక్యత పెంపొందుతుంది. ఈ జాతీయ సమైక్యత దేశప్రగతికి, జాతి ఔన్నత్యానికి మూలకంద మవుతుంది.

ఇక్కడ మరొక్క ముఖ్యమయిన అంశాన్ని గూర్చి ముచ్చటించుకోవలసిన అవసరం ఉన్నది విదేశాలలో ఉన్న తెలుగు వారిలో తెలుగు సంస్కృతిని వికసింపజేసి, ఆయాదేశాలలో కూడా మన సాంస్కృతిక విప్లవాన్ని కొనసాగించాలంటే ముందుగా అక్కడి స్థానికుల అండదండలు కూడా ఎంతో అవసరం. అందుకు వారు కూడా సహకరింపవలసిన ఆవశ్యకత ఉంది. అంటే, వారికి ముందుగా మన సంస్కృతిలోని ప్రత్యేకతను, విశిష్టతను తెలియజెప్పి వారికి మన సంస్కృతి పట్ల సదభిప్రాయ, సమాదరణలు ఉండేలా చూడడానికి ప్రయత్నించాలి. ఇందుకు పెద్ద ఎత్తున కార్యక్రమాలు ప్రారంభించవలసి ఉంటుంది. దీనిలో ప్రభుత్వం ప్రధాన పాత్ర వహించవలసి ఉంటుంది.

ఇందుకు నాందిగా అప్పుడప్పుడు విదేశాలలో కూడా మన తెలుగు మహాసభలను నిర్వహిస్తూ ఉండడం ముఖ్యం. అందు కే రెండవ ప్రపంచ తెలుగు మహాసభలను మలేసియాలో జరపాలనే ఒక యోచన కూడా ప్రభుత్వం అమలు జరిపింది. వీటి ద్వారా సాంస్కృతిక వికాసం పెద్ద ఎత్తున జరుగుతుంది.

ఈ విధమున ప్రపంచ మహాసభల ద్వారా ఒక జాతి, ఒక రాష్ట్రం ఒక దేశం సాధించినది ఎంతైనా ఉంది. ప్రపంచ దేశాల సరసన సమున్నత స్థానాన్ని పొందడం, దేశ గౌరవ ప్రతిష్ఠలను ఇనుమడింపజేసుకోవడం వీటి వల్ల సాధించే ఫలితాలుగా చెప్పుకోవచ్చును.

విదేశాలలో తెలుగు సంస్కృతి వికసనం కోసం మన ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం పరిధిలో తాను కృషి చేస్తుందని చెప్పవచ్చు. విదేశాలలో ఉన్న తెలుగు వారి సాంస్కృతి కావసరాలను తీర్చడానికి రాష్ట్ర ప్రభుత్వం రాష్ట్ర రాజధాని నగరం హైదరాబాదులో అంతర్జాతీయ తెలుగు సంస్థ పేరిట ఒక సంస్థను స్థాపించినదీ.

అంతర్జాతీయ తెలుగు సంస్థ ప్రభుత్వ ప్రతినిధిగా రాష్ట్రేతర, విదేశాంధ్రులకు తన పరిధిలో తాను సేవ చేస్తూనే ఉన్నది. ప్రధానంగా ఈ సంస్థ అక్కడి తెలుగు పిల్లలు తెలుగు నేర్చుకోడానికి అనువుగా తెలుగు వాచకాల వంటి పాఠ్య గ్రంథాలను రూపొందించి, వాటిని వారికి సరఫరా చేయడం. పత్రికలు, పాఠ్యగ్రంథాలు, పఠనీయ గ్రంథాలు, ఆధునిక ప్రక్రియ లయిన నవల, కథ, కవితవంటి సాహిత్య సామగ్రిని వారికి అందచేయటం, అప్పుడప్పుడు సినిమాలు చూపటం, నాట్య, నాటక బృందాల వారికి పంపడంవంటి కార్యక్రమాలను ఈ సంస్థ చేపట్టి ప్రభుత్వం వారి సహాయ సహకారాలతో నెరవేరుస్తూ ఉంది.

ఇదే విధమయిన సేవానిరతితో, జాత్యభిమానంతో, మన భాషా సంస్కృతుల పరిరక్షణకు, వికాసానికి ప్రభుత్వం, ప్రభుత్వం పక్షాన స్థాపింపబడిన అంతర్జాతీయ తెలుగు సంస్థ ద్విగుణీకృతమయిన ఉత్సాహంతో, చైతన్యంతో ముందు ముందు మరిన్ని ఉత్తేజకరమయిన ప్రణాళికలను రూపొందించి, వాటిని సక్ర

మంగా నిర్వహిస్తే విదేశాలలో మనం సాంస్కృతిక చైతన్యకేతనాన్ని ఎగురవేయవచ్చు.

ప్రభుత్వం రూపొందించిన రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు కూడా విదేశంలో జరుగనున్న మన సాంస్కృతిక విప్లవంలో అవి ఒక మైలు రాయిగా నిలిచిపోయి మన గౌరవ ప్రతిష్ఠలకు ఒక కలికి తురాయిగా మిగిలి పోగలవు. అద్యతన భావిలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, ప్రభుత్వం పక్షాన అంతర్జాతీయ తెలుగు సంస్థ ఈ మహాయజ్ఞాన్ని కొనసాగించడంలో ముందుకు వచ్చి కృతకృత్య మవుతాయని మనమంతా ఆశిద్దాం.



# తేనెవంటి తెలుగుభాష

**కు. మారి వి. ఎస్. రాధాదేవి**

రవి కలమవు నీవై
కవి భావాలు నేనై
ప్రేమకు చరిత్ర సృష్టిస్తూ
తేనెవంటి తెలుగు భాషలో తేలిపోదమురా;

ప్రకృతిలో పుష్పము నీవై
పుష్పములో మధువును నేనై
ప్రకృతి ఒడిలో రాజ్యం చేస్తూ,
మననం చేద్దాం మైమరపించే తెలుగుభాషనురా !

వెన్నెల చిలుకవు నీవై,
నీ పొందున గోరింకను నేనై,
నీ వ్రాతను మరువలేక దగ్గిరై
నీ భాషను మరువలేనురా ;

నా గుండెల్లో మరువలేక నీవై
నీ చరిత్రమును మరువలేక నేనై
చిరకాలపు పవిత్ర బంధంలో
తెలుగు భాషలో కరిగి పోతానురా.

# నాలుగవ భాగం

# మలేసియా ఆంధ్ర సంఘ రజతోత్సవ అనుబంధం

# మలాయా ఆంధ్ర సంఘ స్థాపన చరిత్ర

కె. సిద్దప్ప
మలాయాంధ్ర సంఘ అధ్యక్షుడు

సకలవిదేశీయులకు, మలాయాలో ప్రవేశించే మార్గమేర్పడినది మొదలుకొని, మన మాతృభూమి యగు భారతఖండమునుండి నానావిధఉద్యోగ వ్యాపార, పనిపాటులు మొదలగు జీవనోపాయవృత్తులు చేసి జీవించునిమిత్తమై, సకలసంపద సౌభాగ్యములకు నిలయమై యుండు రమణీయ మగు మలాయా మండలమునకు వచ్చి, నివాస ముండు భారతీయులలో తెలుగువారని పిలువబడు ఆంధ్రుల మైన మేమును, బౌతిక భాగమై యున్నాము.

ధనసంపత్తు గల దేశ మని లోకప్రఖ్యాతి గాంచిన ఈమలాయా దేశాభివృద్ధికి ఆధారమైన ప్రముఖవ్యాపార ప్రసిద్ధములగు, రబ్బరు, కాయ, ఆయిల్ పామ్, మొదలగు ఎస్టేటులలో ప్రవేశించి, మిగుల శక్తి సామర్థ్యములతో, కార్యనిర్వాహము లొనరించి పేరు ప్రఖ్యాతి జెంది, యధికారుల యభిమానము బడసి, వారివలన, వలయు సమస్త సహాయములను పొంది సుభిక్షముగా జీవించుచుంటిమి గాని, ఆంధ్రుల పేరు ప్రపంచమంతట ప్రజ్వరిల్లక యింతకాలము వెనుకంజ వేయబడి యుండుట మిగులవిచారగ్రస్తమైన విషయమై యున్నది.

మాతోపాటు ఈమలాయారాజ్యమునకు జీవింప వచ్చిన, తక్కినజాతీయులతో, మేము మిగుల అన్యోన్య సోదరభావముతో కలసిమెలసి యుంటిమి. మొత్తము మీద మలాయాలోనున్న, సకలభారతీయుల సంరక్షణ, నిమిత్తమై యేర్పర్చబడిన పలువిధసంఘములలో ఉన్నవారు, వారివారి స్వజాతి అభిమానము గలవారై, వారివారి సమూహముల అభివృద్ధికి అవశ్యమగు, కళాచార, సంతోషవిధానములను యేర్పరచుకొని, నమ్మియుండిన మలాయాంధ్ర సమూహమును పొత్తిగా నిరాకరించి, వారివలె మాకును, ప్రత్యేకమైన భాష యున్నదనియు, అందులకై ప్రయాసపడు, మలాయా ఇండియాసంఘముల ముఖ్యబాధ్యతయై యున్నదని గ్రహించక, ద్వేషబుద్ధిగలవారై మమ్ములను పూర్తిగా మరచి నిర్లక్ష్యముగా చూచిరి.

మలాయాలో ఉన్న ఆంధ్రులలో అనేకులు విద్యా వివేకములు కలిగి, ప్రవీణులై యున్న ప్రముఖులు మిగులఉన్నతదశలో యున్నను, ఆంధ్రాభిమానము ఇంచుకైనను లేనివారై, యితరజాతులవారితో సాంగత్యము గల్పించు ఆచార, కళాచార, రాజకీయార్థిక సాంఘికఅభివృద్ధులకును మరియు శారీరక, మానసిక విజ్ఞానవిశేషముల శ్రేయోభివృద్ధులకును, తమఆంధ్ర భాషను ఆచార, కళాచారములను పూర్తిగా మార్చుకొని సోదరద్వేషము గలవారై వారివారి స్వప్రయోజనము నకు ప్రతిష్ఠ గౌరవములకే, పాటుపడుచు, తమస్వజన సంరక్షణను యేమాత్రమును గమనించక తెలియని వారివలె నటించుచుండిరి.

ఇంతకాలమైనప్పటికిని, మలాయాలో, ఆంధ్రు లను ప్రత్యేకమైన తెగ ఒకటి యున్నదని, సర్కారు వారికి కూడ తెలియకపోవుట ఎంతోశోచనీయమైన విషయమై యున్నది. కారణ మేమనగా, రాజ్యాంగములోని పలు రకసులజాబితాలలో, తెలుగువారిని, అరవవాండ్రుగా గుర్తించి రిజిష్టరు చేయబడి యున్నందువలన మా

తెలుగువారందరు తమిళుల జనసంఖ్యలో జేర్చబడి యున్నందున, తెలుగుప్రజల పూర్తి జనసంఖ్య తెలియ బడకుండా పోయినది. అందువలన మేము మామాతృ భాష, విద్యాభివృద్ధులకై తగిన వసతులను యేర్పాటు జేసికొనుటకు, సర్కారువారి మూలముగా, సహాయము పొందుటకు, మాకు యేలాటి హక్కు, ఆధారము లేకుండా పోయినది.

చివరకు మలాయాలో యున్న, ఆంధ్రులు యేలాటి ఆదరణ, అనుకూలము లేని వారైయుండి, ఇతరజాతుల వారితోపాటు మామాతృభాషాభివృద్ధికి యేలాటి సదుపాయములు లేకుండిన కారణముచే, మలాయాలో నలుదిక్కులలో నివాసముండు ఆంధ్రులు ఒకరికొకరు యేలాటి సంబంధము లేక, ఎవరికివారు ప్రత్యేకముగా యుండినందువలన, ఇరుగుపొరుగువారగు, ఇతర జాతులతో సహవాససంబంధములను గల్పించుకొని వారిభాషాచారములను అవలంబించి తుదకు తమజన్మ భూమియగు ఆంధ్రరాష్ట్రమును గూడ పూర్తిగా మరచి, తెలుగువారనేమాట లేకుండ మారిపోయి, మిగుల దౌర్భాగ్యమైనదశలో మెలగుచు, యితరజాతులవారిచే అతికేవలముగా జూడబడుచుండిరి.

మలాయాదేశములో యుండు 7లక్షలభారతీయులలో మనఆంధ్రులు 2 లక్షలయేభై వేలుకు పైగా యున్నారు. ఈరెండున్నరలక్ష తెలుగువారు ఆరంభమునుండి యీనాటివరకు తమిళులుగా భావించబడియున్నారు. అందువలన మలాయాలో ఆంధ్రులసంఖ్య బహుస్వల్పముగా యేర్పడినందువలన, ఇతరులదృష్టిలో ఆంధ్రులు ఎన్నికలేనివారుగాను విద్యావిహీనులుగా నెంచబడిరి.

ఇట్టిదౌర్భాగ్యదశలో యేమియు చేయుటకు తోచక, మాజన్మభూమియగు, ఆంధ్రరాష్ట్రప్రభావమునుగూర్చి తలపోయజొచ్చితిమి. భారతఖండముతో పురాతనకాలము నుండి, అనగా క్రీస్తుశకమునకు పూర్వము ఎన్నియో వందలశతాబ్దములనుండి బలపరాక్రమ, ప్రావీణ్యము గల రాజవర్గముచే పరిపాలించబడినదియు, క్షామ మనునది ఎరుగక, సదా సకలపాడిపంటల సమృద్ధితో సుభిక్షముగా జీవించుటకు అనుకూలమైన జీవనదులతో కూడియుండు మిగులసారవంతమైన భూములతో నింపబడినదియు, సంస్కృతాంధ్రకవీశ్వరులచే ప్రశంసింపబడి, తేనెలొలుకు మృధుమధురమగు, వీనుల కింపుగా నుండు నటువంటి తెలుగుభాషతో నలంకరింప బడి నట్టిదియును, భరతఖండస్వాతంత్ర్యమునకై ప్రాణములు కోల్పోయిన యభిమానపురుషశ్రీరత్నము లతో వెలిగింపబడినట్టిదియు, మనోవ్యాకులతను మార్చి మనోహరమును గావించు, సంగీతప్రభావముతో వెలయుచుండు మహోన్నతమైన ఆంధ్రరాష్ట్రపు, పుత్రులమై యుండి, అధైర్యమొంది విలపించుట పురుషలక్షణము గాదని యెంచి, పౌరుషజ్ఞానములను బొంది ఆంధ్రరాష్ట్రఖ్యాతిని, ఈమలాయాలో నిలుపుటకు త్యాగము జేసికొంటిమి.

మలాయాలో ఆంధ్రరాష్ట్ర మహోన్నత దశను గూర్చి ఎరుగనివారు, ఆంధ్రభాషయొక్క రమ్యతను, విలువను తెలిసికొనజాలక, మమ్ములను భాష లేని వారుగా నెంచిరి. సంస్కృతసారముచే నిమిడి యున్న అతిరమ్యమైనభాష యేది? పశ్చిమదేశములచే, "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్" యని పొగడబడినది ఏది? భారతఖండములో రెండవ ప్రముఖమైన భాషగా ఎన్నబడినది ఏది? మాఆంధ్రభాషయేనా? మాణిక్యము కుప్పలో బడినను దానిప్రభావము పోవునా? ఇట్టి ప్రసిద్ధి జెందిన భాషనుగూర్చి కేవలముగా మాట్లాడు వారు మూఢులు గాక జ్ఞానులా?

మన ఆంధ్రదేశ ప్రఖ్యాతి, ప్రభావములచే మిక్కిలి యభిమాన, సాహసము గలవారమై, పులికడుపున బుట్టి మేక అరపు లరచుట కాపురుష లక్షణ మని ఎంచి మేము నిజాంధ్రుల మని లోకమునకు వెల్లడి జేయుటకు, మాతల్లిభాషను మేము వదలక నేర్చుకొనుట ముఖ్యావశ్య మనియు, దానియభివృద్ధికై తగు సదుపాయములను వెదకుట ఆంధ్రుల భార మని ఎంచి, యిక యే మాత్రము నాలస్యము జేయుట నిష్ప్రయోజన మని తలంచి, 1955సం॥ ఆగష్టుమాసము 17 తేదీన 99మంది ఆంధ్రాభిమానులతో యొక ఆంధ్ర సంఘమును స్థాపించితిమి. 1956సం॥ ఫిబ్రవరిమాసము 17తేదీన గవర్నమెంటువారిచే రిజిష్టరు జేయబడి, రిజి

ష్ట్రీరువారుచే, ఆమోదించబడిన, చట్టదిట్టములచే పరిపాలించబడుచున్నది.

1958సం॥ అక్టోబరుమాసము 14వతేదీన జాగన్ డత్తో సంపాంగ్ తీగాలో జరిగిన సాలుసరిసమావేశములో యీ క్రింద నుదాహరింపబడిన నూతన సంఘ ఉద్యోగస్తులు ఎన్నుకొనబడిరి.

| | | |
|---|---|---|
| అధ్యక్షులు | ... | కె. సిద్దయ్యగారు |
| ఉపఅధ్యక్షులు | .. | వి.కె. దాసుగారు |
| కార్యదర్శి | ... | యన్. దురగయ్యగారు |
| ఉపకార్యదర్శి | ... | యం.వి. వీరినాయుడుగారు |
| కోశాధికారి | ... | |

కార్య నిర్వాహక కమిటీ మెంబర్లు,

1. వి. కె. క్రిష్ణకుమారి గారు
2. టి. వరహాలుగారు
3. యం. డి. సోమునాయుడుగారు
4. బి. యస్. సముద్రముగారు
5. ఎ. వి. జువాల్‌గారు
6. కె. ఆర్. రాజుగారు.

లెక్కల పరిశోధకులు

1. కె. వి. స్వామిగారు
2. ఎ. ఎ. అప్పలనాయుడుగారు

మలాయా ఆంధ్రసంఘముయొక్క ముఖ్యసిద్ధాంతములు.

1. మలాయాలో నలువైపుల చెదరియుండు ఆంధ్రులను దర్శించి వారిలో అన్యోన్యసహవాస, ప్రేమాభిమానములను గలుగజేయుట.

2. రాజ్యాంగవ్యవహారములలో, యేలాటి జోక్యము పెట్టుకొనక, తమ జీవనోపాయవృత్తులలో యేలాటి లోభము లేకుండా శక్తిసామర్ధ్యములతో కార్యనిర్వాహ మొనరించి, ఆంధ్రసమూహముయొక్క ఖ్యాతిని నిలబెట్టుకొనుటకు ప్రయాసపడుట.

ఇంతకాలము ఇతరజాతులవారిచే కేవలముగా జూడబడిన ఆంధ్రులు, ఈ ఆంధ్రసంఘస్థాపనమును గూర్చి వినినవెంటనే చెప్పనలవిగాని సంతోషసాగరములో మునిగినవారైరి. తమ కున్నవ్యసనాక్రాంతములను విడచి, గాఢనిద్రలో నుండి, దిగ్గున మేల్కాని పునర్జన్మము బొందినవారై, సంతోషముఖలక్షణములు గలవారై సంఘ ప్రచారకులను మిక్కిలి యభిమానముతో నాలింగము జేయుచు, ప్రేమతో సన్మానించుచూ సంఘప్రచారములను, మిగుల అపేక్షతో తిలకించి, అతితీవ్రముగా, సంఘములో సభ్యులుగా జేరసాగిరి.

మలయాలో నుండు ప్రతి సంస్థానములో యున్న ఆంధ్రప్రజలు ముందుకుసాగి సంఘములో జేరుట, మిక్కిలి అతిశయమైన విషయమై యున్నది.

ఈ సంఘము స్థాపించబడి యిప్పటికి, స్వల్పకాలమై నప్పటికిని సంఘ ఉద్యోగస్తులు, సంఘాభివృద్ధికై ఎన్నియో కార్యములను కొనసాగించి యున్నారు. ప్రచార గోష్ఠులను ప్రతి స్థలములకు పంపి సంఘ స్థాపన విషయమై, ప్రతి ఆంధ్రులకు తెలియపరచియున్నారు. ఈనాటికి, ఆంధ్రసంఘములో జేరియున్నవారు నాలుగు వేలకుపైగా యున్నారు. ఇంకను అత్యాసక్తితో, ప్రచారములు, తీవ్రముగా జరుపబడుచున్నవి.

మరియు సంఘంతరఫున ఒకరాయబారవర్గము, రాజ్యాంగ ముఖ్యమంత్రులను అనగా, విద్యాశాఖ మంత్రిని, కార్మికమంత్రిని, దేశీయవ్యవహారమంత్రిని, రిజిస్ట్రేషన్‌డైరక్టరు జనరల్‌గారిని సందించి, వారికి మలాయాలో యున్నఆంధ్రుల కొరతలను పూర్తిగా వివరించి ముఖ్యముగా, యితర జాతులకువలె, ఆంధ్రులకును మాతృ విద్యా స్థాపన లేర్పరచ వలయునని చర్చించియున్నాము. అందులకు, వారు, ఇంతకాలము ఆంధ్రులును, తమిళులును, ఒకేభాషను అవలంబించి యుండిరనియు, ఇప్పుడు ఆంధ్రులభాష ప్రత్యేకమైన భాషయని తెలిసికొని ఇకమీదట ఆంధ్రుల మాతృభాషాస్థాపనాభివృద్ధులకు తగిన యేర్పాటులను జేయుదుమని, ఆదరణీయమైన వాక్కిచ్చి యున్నారు.

ఇంకను ఆంధ్రస్థాపనము మలాయాలో నూతన ముగా యున్నందున, అనేకమందికి, దీని విషయమై పలువిధ సందేహము లేర్పడుచున్నవి. అందువలన వారియొక్క సంశయములను పూర్తిగా తీర్చి వారికి ఆంధ్రసంఘము యేర్పడుటకు ముఖ్యకారములను, దాని ముఖ్యసిద్ధాంతములను గూర్చి వెల్లడిజేయుటకై 1956 సం॥ డిసెంబరు మాసము 5 తేదీన, పేరాక్, టెలుకాన్ సన్‌లో యుండు గాంధిమహాత్మ జ్ఞాపకార్థం మండపములో ఈ సంఘప్రారంభోత్సవము తేనీరు, ఫలహార విందులో ఎక్కువ వైభవముగా జరిపించితిమి.

దానిలో పాల్గొను నిమిత్తమై దేశీయ కార్మిక నాయకులగు శ్రీ పి. పి. నారాయణగారును, ఇండియా ఉపకమిషనర్‌గారగు శ్రీ దేశాయ్‌గారును, కార్మిక మంత్రియగు శ్రీ. వి. టి. సంబంధం గారును ఎక్కువ యభిమానముతో ఆరుదెంచిరి. ఇంకను రాజ్యాంగాధి కార్లును పలువిధ సంఘనాయకులును, ప్రాముఖ్యజన సముదాయమును, ఎంతయో యభిమానముతో సమా వేశమైరి. వారందరు విద్యావిషయమై ఆంధ్రులకు చాలాకాలము నుండి యుండిన కొరతల విషయమై విచారించి ఆంధ్ర ఏర్పడుట ముఖ్యావశ్య మనియు, ఆంధ్రుల కొరతలను తీర్చి సాధ్యమైనంతవరకు ప్రయాస పడుదురని ఆదరణతో తెలియజేసిరి.

ప్రపంచములో నున్న ప్రతిజాతివారికి వారివారి మాతృభాషాభిమానము గలిగియుండుట సర్వసామాన్య మైన విషయమే. మలాయాలో నున్న అన్యజాతులకు, వారి స్వభాషాభివృద్ధికై ఎన్నియో సదుపాయములు యేర్పరచుకొని సంతోషాతిశయములతో వెలుగు చున్నారు. అట్లుండ అనాగరికులుగాను, విద్యలేని మూఢులు గాను, ఎన్నబడిన వారము, ఆంధ్రుల మైన మేమే.

ఆంధ్రులకు అనిర్జించిన విపరీతకరమైన సంభవ మును గూర్చి, ఆంధ్రరాష్ట్రాభిమానులు యేవిధముగ తలంచుచున్నారో మాకు తెలియదు.

భారతఖండమునుండి ఎందరో సర్కారుప్రతి నిధులు, మలాయాలో నున్న భారతీయుల సంరక్షణకై నియమింపబడి వచ్చుచు పోవుచున్నారు. ఒకరైనను ఈనాటికి ఆంధ్రులను యొకజాతివా రున్నారా? అట్లు యున్న కళాచారపరిస్థితులు యేవిధముగ నున్న వని తెలిసికొన ప్రయత్నించినవారు లేరు.

మలాయాదేశఆంధ్రులమైన మేము విరోధముచేగాని, నిరాకరించబడిగాని, మలాయాకు రాలేదు. జీవించు నిమిత్తమై స్వేచ్ఛానుసారముగాను, సర్కారువారి ఉత్తరువువలన మలాయాకు వచ్చి నివసించితిమి. నీతి పద్యముజెప్పుప్రకారముగా, 'తమతమ నెలవులుతప్పిన, తమమిత్రులు శత్రు లగుట తథ్యము సుమతీ!' యను రీతిగా మాస్థానములు అనగా జన్మభూమిని విడి చినను, మాతృసోదర అభిమానము గలిగి యున్నామే గాని వేరుభావము మా కెంతమాత్రము లేదు. మమ్ము లను శత్రువులుగా భావించుట న్యాయము గాదు.

కావున సోదరభావము గల ఆంధ్రరాష్ట్ర అభి మానులారా! దూరమున నున్న మీ ప్రియసోదరులమైన మమ్ము, విద్యాసంబంధముగా యభివృద్ధిజేసి కొన గలందులకై మాకు ముఖ్యావశ్యమగు ఆంధ్రచరిత్ర లను, పలువిధపుస్తకములను, నీతిపద్యావాచకములను, పత్రికలను మా మలాయా ఆంధ్రసంఘమూలముగా పంపించి మమ్ములను ఆదరించగలందులకై భారత ఆంధ్రసోదర సోదరీమణు లందరికిని వినయపూర్వక ముగా మనవిజేసి కొనుచున్నాము.

మరియు రేడియో సంబంధముగా మాకు ఆంధ్ర దేశవార్తలను విశేషముగా వినిపించి, మనోరథులైన మమ్మును, సంతోషభరితులుగా జేయ ప్రార్థించు చున్నాము. మలాయాలో నున్న రెండున్నర లక్ష ఆంధ్రుల విద్యాసంబంధమైన కొరతలను తీర్చి, విద్యావంతులగుటకు తగిన సహాయము నిచ్చి ఆంధ్ర రాష్ట్రఖ్యాతిని, నెలకొల్పజేయగలందులకై ప్రతి ఒక్కొక్క సోదరీ, సోదరుడు యభిమాన పూర్వకముగా ప్రయాసపడి మాయభివృద్ధికి తోడ్పడవలెనని మిక్కిలి వినయ పూర్వకముగా ప్రార్థించుచున్నాము. భారత ఆంధ్రులందరికీ మాయొక్క స్నేహపూర్వక వందన ములను అర్పించుచున్నాము.

# మలేసియా ఆంధ్ర సంఘ ప్రారంభ చరిత్ర

## నేతేటి దుర్గయ్య, PPN.

1955లో సింపాంగ్ అంపాట్ అరవపాఠశాలలో తెలుగు7-వతరగతి జరుగుచుండేది. ఆ తరగతికి మలాయాఅంతటినుండీ బాలబాలికలు వస్తూఉండేవారు. అందులో బోధించుచుండిన నేనూ, చిరంజీవి మదిని సోమునాయుడూ మన మలేసియా ఆంధ్రసంఘాన్ని ప్రారంభించాము.

తెలుగుతరగతిజరుగుచుండిన అదే పాఠశాలలో మరో ప్రక్క అరవ ఏడవ తరగతి జరుగుచుండేది. తెలుగు తరగతివారు ప్రతినెలా ఆ పాఠశాలకు అద్దెచెల్లించే వారు; కాని అరవతరగతివారి కాబాధ లేదు. ఇదీ కాక ఆ పాఠశాల నిర్వాహకులు ప్రతీవారం ఏదోఒక తప్పును తెలుగుతరగతిపై మోపుచుండేవారు. ఈ పాఠశాలలో తెలుగువారికి హక్కు లేదు అంటూ యుండేవారు. దానిని వ్యతిరేకించి ఒకసారి శ్రీగుమ్మడి అప్పలనాయుడుగారి మేనమామ శ్రీ గోరపల్లి సింహాచలము తండేలుగారు ఆ పాఠశాల పెద్దలతో జగడానికి గూడా వెళ్ళారు. కారణము ఆ పాఠశాల కట్టునప్పుడు అది ఇండియావా రందరికీ స్వంతం; భారతమాత బిడ్డలందరికీ హక్కు గలదు అని చెప్పి డబ్బు వసూలుచేశారు. శ్రీ సింహాచలంగారు కూడ స్వయంగా ఎంతోడబ్బును వసూలుచేసి యిచ్చారు.

ప్రక్కగదిలో చదువుచున్న అరవతరగతికీ, మన తెలుగుతరగతికీ ఒకనాడు బంతాట పందెము జరిగినది. అందులో మనవారు జయం పొందారు. అందువలన వారికి మనపై అసూయ ఏర్పడింది. మనలను నిందించుటకు ప్రారంభించారు.

అంతట చిరంజీవి మదిని సోమునాయుడు, నేను ఆంధ్రసంఘమును ప్రారంభించాలనీ, ఒకసభ వేయాలని తీర్మానించి పత్రికకు ప్రకటన యిచ్చాము. అది పత్రికలో పడగానే శ్రీయుతులు అరుల్ ప్రకాశము గారును, నాయరుగారునురుంకుపుతోటలోని మాయింటికి వచ్చారు. "నేను పేపరుకు వార్త పంపలేదు. శ్రీమదిని సోమునాయుడుగా రిచ్చిరి" అని చెప్పితిని.

నే నొక కమ్యూనిస్టును అని ఎస్టేటు మానేజర్లకు నాపై అనుమానము. అందువలన నాపై విరోధము వలన నాకు మంచియిల్లు యివ్వలేదు. చిన్న గుడిసెలో నన్ను పెట్టారు. ఒకనాడు మలాయా బ్రిటీషుగవర్నరు సర్ డోనాల్డ్ మెగ్లిచ్‌రేగారు బాగాన్ డత్తోకు పోతూ పోతూ మా పాఠశాలకు వచ్చారు. అది బ్రిటీషు మహారాణి ఎలిజబెత్తు పట్టాభిషేక దినము. పాఠశాలనల్ల బల్లలో యూనియన్ జేక్ జెండా పటమును వ్రాసి బోధించుచూయున్నాను. గవర్నరుగారు నాతో కొంతసేపు మాట్లాడి నా యిల్లు చూశారు. నాకు మంచియిల్లు కట్టి యివ్వాలని ఆ తోట మానేజరుకు ఆలోచన చెప్పారు. అందువలన కోపం చెందిన ఆ తోట మానేజరు అసలు ఆ తోటనుండి వెడలగొట్టటానికి ఏర్పాటుచేశారు. అయితే అప్పుడు లేబరు ఆఫీసరుగా శ్రీ కే. ఎన్. నాయుడుగారు ఉండేవారు ఈయన అచ్చతెలుగువారు. నాయందు అభిమాన ముంచి మానేజరు అనుకున్నట్లు ఏదో ఒక అడవి ప్రాంతానికి మార్చకుండ ప్రక్కనే యున్న 26వమైలుబాగాన్‌డత్తోతోట పాఠశాలకు మార్చారు. రొట్టె విరిగి నేతిలోపడ్డట్టు నేను చిరంజీవి మదినిగారున్న చోటును చేరుకున్నాను. సంఘాన్ని స్థాపించి దాని అభివృద్ధికి పనిచేస్తున్న చిరంజీవి మదిని సోమునాయుడుగారు ప్రధాన ఉపాధ్యాయులుగా పని చేస్తున్నచోటు అది. ఈ మారకంవల్ల మనఆంధ్రసంఘానికి కలిసిమెలిసి పనిచేయడానికి మాకు చాల అనుకూలం ఏర్పడినది. ఇందువలన ప్రక్కప్రక్క యిండ్లలో ఉండిన మేమిద్దరము పుట్టెడు బిడ్డలతో యుండిన మా కుటుంబాలను వారాలకొలది విడిచిపెట్టి దేశం నలుమూలలకు వెళ్ళి ప్రచారం చేసి, ఎందరో దొరల దగ్గర తిట్లులు కాచి, సంఘాన్ని వటవృక్షంలాగా పెంచాము. ఆనాడు నేనూ చిరంజీవి మదిని సోము నాయుడు వేసిన విత్తనం ఈనాడు వటవృక్షమై లక్షా యాభై వేల మలేసియా తెలుగువారికి సేవ చేస్తూ యుండుట చూచి నేనెంతో సంతోషపడుచున్నాను. ఈ సంఘం యింకా బలంగా పెరిగి ఎల్లకాలము తెలుగుజాతికోసం పాటుపడాలని ఆశిస్తున్నాను.

# మలేసియా ఆంధ్ర సంఘ చరిత్ర

## జి. వి. శ్రీరాములు

క్రీస్తు శకము 1956 వ సంవత్సరము డిసెంబరు నెల పదిహేనవ తేదీ.

నేటికి దాదాపు 25 సంవత్సరముల నాటి దినము!

మలేసియా తెలుగు ప్రజలు ఏనాడూ మరువలేని బంగారు దినము ! !

తెలుగు వారి చరిత్రలో బంగారు వ్రాతలలో వ్రాయదగిన పవిత్ర దినము !!!

కారుచీకటిలో దారి తెన్ను కానక అలమటించునటువంటి మలాయాంధ్రులను వెన్నుతట్టి, వారి పురోభివృద్ధికి ప్రథమ సోపానంగా వెలసినటువంటి 'మలయా ఆంధ్ర సంఘం' యొక్క ప్రారంభోత్సవ దినము అది.

ఆనాడు మలయాలో[1] ఆంధ్రుల కోటగా ఖ్యాతి గాంచినటువంటి దిగువపేరా జిల్లా ముఖ్యపట్టణమయిన టెలుకాన్సను నగరములో గల గాంధీ జ్ఞాపకార్థ మండపము[2] మలాయా నలుమూలలనుండి వచ్చినటువంటి తెలుగు వారి ప్రతినిధులతో కిటకిటలాడుచున్నది. మనకంటూ ఒక సంఘం వెలసినదే అన్న ఉత్సాహము అచ్చటయున్న ప్రతిఒక్కరి ముఖములోను తేట తెల్లంగా కన్పిస్తున్నది.

సంఘ ప్రారంభోత్సవమునకు ఆహ్వానించబడినటువంటి ప్రముఖులతోను, పెద్దలతోను, తెలుగు వారి నాయకులతోను, ప్రతినిధులతోను ఆ సభా భవనము నిండియున్నది.

వేదికపై సంఘ ప్రముఖులతో బాటు ప్రారంభోత్సవమును చేయవచ్చిన అప్పటి సమిష్టి మలయా ఆరోగ్య శాఖామాత్యులును, లక్షలాది ఇండియా వారి ప్రియతమ నాయకుడును అగు శ్రీ వి. టి. సంబంధన్ గారును, భారత దేశ సహాయ కమీషనరు శ్రీ పి. దేశాయి గారును, దేశీయ తోట కార్మిక సంఘ కార్యదర్శి శ్రీ పి. పి. నారాయణ గారును, దిగువపేరా జిల్లా అధికారి శ్రీ అంజాంగ్ గారును, బాగన్ డత్తో తోటల మానేజరు శ్రీ కవి గారును, ఇంకను పలువురు ప్రముఖులును అమరియుండిరి. పై సభకు సహాయ కార్మికుల కమిషనరు గారయిన శ్రీ కె. ఎస్. నాయుడు గారు అధ్యక్షత వహించారు. సంఘ అధ్యక్షులు శ్రీ కుండా సిద్దయ్యగారు తన ఉపన్యాసములో 'మలాయాలో నివసించు తెలుగు వారిని గురించి, వారికి సంఘ ఆవశ్యకతను గురించి, ఆంధ్రుల చరిత్రను గురించి సుదీర్ఘమయిన ఉపన్యాసమును ఒసంగారు. రాజకీయంగాను, సాంఘికంగాను, ఆర్థికంగాను వెనుకబడిపోయిన తెలుగు వారికి ఇటువంటి ఒక సంఘం ఆవశ్యకమనియు, అది భవిష్యత్తులో తెలుగు వారి పురోభివృద్ధికి సాంఘికంగా ఎంతయినా సేవ చేయగలదనియు వక్కాణించారు.

సుమారు 300 మంది ప్రతినిధులును, అతిథులును పాల్గొన్న ఆ సభలో ఆరోగ్య శాఖామాత్యులు శ్రీ వి. టి. సంబంధన్ గారు, సంఘానికి తన శుభాకాంక్షలను అందజేసుకుంటూ, దూరదృష్టి గల సంఘ వ్యవస్థాపకులను శ్లాఘిస్తూ, ప్రారంభోత్సవమును గావించారు. వేదిక నలంకరించిన పెద్దలందరును వారి వారి గంభీరమయిన ఉపన్యాసముల ద్వారా సంఘ అభివృద్ధికి

---

1. ప్రస్తుతము పశ్చిమ మలేసియా.
2. ఇండియన్ సంఘ భవనము.

తద్వారా తెలుగు వారి భవిష్యత్తుకు ఆశీస్సులను అంద జేసుకున్నారు.

ఆనాటి యీ సభ అంత వైభవముగా జరుగుటకు నాంది ప్రస్తావన ఎచ్చట జరిగింది?

మూలపురుషులు ఎవరు?

ప్రత్యక్షంగా, పరోక్షంగా పాలు పంచుకున్న ప్రముఖు లెవరు?

## మలాయా తెలుగువారి పూర్వీకులు

బ్రతుకు తెరువు నిమిత్తము ఇతర భారతీయులతో బాటు తెలుగువారు గూడా బ్రిటీషు వలసదేశా లయిన బర్మా, సిలోన్, ఇండోనేసియా, ఫిజి, మారిషస్, దక్షిణ ఆఫ్రికా, తూర్పు ఆఫ్రికా, బ్రిటీషు గయానా, పశ్చిమ ఇండియా దీవులు వంటి దేశాలకు వలసలు పోయారు. అదే విధముగా మన పూర్వీకులు కూడా అలనాడు ఈ దేశానికి వలస వచ్చారు. ఆనాడు మలాయాలోని రబ్బరు, కొబ్బరి, కాఫీ తోటలలో పని చేయుటకు, అడవులు కొట్టి మొక్కలు నాటుటకు, రస్తాలు, రైలు త్రోవలు నిర్మించుటకు కార్మికులుగా తేబడిన భారతీయులలో అధిక సంఖ్యాకులు తమిళు లయితే తరువాత పేర్కొన దగినవారు తెలుగువారు.

ఆనాడు మలయాకు వచ్చిన తెలుగువారిని ఇరుతెగ లుగా భాగించవచ్చును. మొదటి తెగకు చెందినవారు ఆంధ్రదేశపు సముద్రతీరపు జిల్లాలలోనివారు. వీరు ఎక్కువ విద్యావంతులు కారు. కేవలం నిరక్షరాస్యులో లేదా తెలుగు జిల్లాలలోని ప్రాథమిక పాఠశాలలందు కొద్దిగా చదువుకున్నవారో అగుదురు. మలాయా పడమటి తీరములో గల తోటలలో[3] తెలుగువారు అధిక సంఖ్యలో నివసించుచుండిరి. అట్టి చోట్ల తోటయజ మానులు తెలుగువారి పిల్లలు చదువుటకు తెలుగు పాఠ శాలలను నిర్మించారు. తెలుగు ఉపాధ్యాయులు రప్పిం చబడ్డారు. వారు తెలుగు పిల్లలకు 6వ తరగతి వరకు విద్య గరిపిస్తూ వచ్చిరి.

తమిళులు అధిక సంఖ్యలో గల తోటలందు పనికి కుదిరిన తెలుగువారు తమ పిల్లలను అచ్చట గల తమిళ పాఠశాలలకే పంపించవలసిన నిర్బంధమునకు గురి యయిరి. మొదట మనవారికి పరిసరాలు అయోమ యంగా ఉండినా, తొందరగా కలిసి వారాపరిస రాలకు అలవాటు పడిపోయారు. అందువల్ల పరభాషే వారికి మాతృ భాషగా అయి, మాతృభాష సవతితల్లి భాషగా మారిపోయినది. కాల చక్రగమనంలో వారు తమిళులుగా మారిపోయారు.

ఇక రెండవతరగతికి చెందినవారు కొన్ని శతాబ్దాల క్రిందట తెలుగు జిల్లాలను వదలి తమిళనాడులో నివాస మేర్పఱచుకొనిన రెడ్డియార్లు, నాయుడ్లు[4] అగు దురు. తమిళనాడు నుండి మలాయా వచ్చిన వీరు పట్టణాలలో ఉద్యోగమో వ్యాపారమో చేయుచుండిరి. వీరికి అరవము చదువుట వ్రాయుట వచ్చును గాని తెలుగు రాదు. అయినప్పటికి వారు తెలుగు, అరవము కలిసిన ఒక రకమయిన భాష మాట్లాడేవారు. వారిలో తెలుగు కొరప్రాణాలతో యుండెడిది. అందువలన చాల కుటుంబాలలో కేవలము వయసయిన పెద్దవారికే కల్తీ తెలుగు మాట్లాడుటకు వచ్చునుగాని, వారి బిడ్డలకు రాదు. వీరికి తెలుగు భాషకంటె, తమిళభాష పయిననే అభిమానము మెండు.

పట్టణాలలో ఈ రెండవ తరగతికి చెందిన తెలుగు వారు పురపాలక సంస్థలందును, ప్రభుత్వ కార్యా లయము లందును ఉన్నత పదవులు వహించు చున్న ప్పటికి తెలుగు భాషాభివృద్ధికిగాని, జాతి అభివృద్ధికి గాని పాటుపడినవారు కారు. ఏ ఒకరిద్దరో తప్ప, ఆంగ్లము, అరవము వారిలో దీర్ఘముగా పాతుకుపోయి నందున పట్టణాలలో తెలుగు పాఠశాలలను స్థాపించు టకు పూనుకొనరైరి. బ్రిటీషువారి పాలనలో తెలుగు పాఠశాలలను స్థాపించుటకు చాల అవకాశా లుండినప్పటి కిని గ్రామాలంను, తోటలందు నివసించిన తెలుగువారి కుండిన భాషాభిమానము నగరాలలో నివసించిన తెలుగువారికి లేనందున తమిళుల కంటె తెలుగువారు అన్ని విధాలా వెనుకబడిపోయారు.

---

3. బ్రిటీషు కంపెనీలకు సొంతమయిన ఎస్టేటులు
4. వీరు నాడు, నేడు తమిళు లని గుర్తించు కొనుటకే ఇష్టపడ్డారు; ఇష్టపడుచున్నారు.

తెలుగు ఏడవ తరగతిలో —

ఎంతోమంది తెలుగువారు తెలుగేతరులుగా మారిపోతున్న రోజులవి.

తెలుగువారు సాంఘికంగాను, సాంస్కృతికంగాను వెనుకబడిపోయిన రోజులవి.

తాము తెలుగువారిమన్నది, తమకొక మృదుమధురమయిన భాషా సంస్కృతులు గలవన్న సత్యాన్ని, మహోజ్జ్వల చరిత్ర యున్నదన్న నిజాన్ని తెలుసుకోని రోజులవి.

అభివృద్ధి అన్న పదానికి అర్థం తెలియని రోజులవి.

ఒక ప్రక్క దేశనాయకులు దేశానికి విడుదలను[6] సంపాదించుటకు సంప్రదింపులు జరుపుచున్న రోజులవి.

ఆ రోజులలో నాలుగురోడ్లకూడలియయిన సింపాంగ్ లింపాట్[7] అను చిన్న గ్రామములో గల సన్మార్గ సంఘానికి సొంతమయిన భారతి తమిళ పాఠశాలలో ప్రతి శనివారము తెలుగు ఉపాధ్యాయులను తయారు చేయుటకయిన ఏడవ తరగతి జరుగుతూ యుండెడిది.

ఆనాటి విద్యా ప్రణాళిక ప్రకారము ఆంగ్లము కాని ఇతర భాషా పాఠశాలలందు 6-వ తరగతియే ఆఖరి తరగతి అన్నమాట. ఆ తరువాత ఏమి చేయాలన్నది విద్యార్థులకు తెలియదు. అటువంటి రోజులలో తెలుగు ఉపాధ్యాయులలో అగ్రగణ్యులు అయిన శ్రీ నేతేటి నర్సయ్యగారు తెలుగు విద్యార్థులను అభివృద్ధిపథానికి నడిపించే అగ్రజులుగా, మార్గదర్శిగా విలసిల్లారు. ఉదయము తెలుగు పాఠశాలలో ఉపాధ్యాయునిగా తన కర్తవ్యాన్ని నిర్వర్తిస్తూ, సాయం సమయములందు పలు గ్రామాలకు వెళ్ళి పిల్లలకు ఆంగ్లమును బోధిస్తూ ఉండేవారు. వారి అభివృద్ధికి పలు సూచనలు ఒసంగేవారు. ఆయన తన జీవితకాలంలో చాలవరకు తెలుగుభాష, తెలుగుజాతి అభివృద్ధికి పాటుపడిన త్యాగధనుడు. ఆ రోజుల్లో నర్సయ్యగారంటే తెలియని తెలుగువారు లేరు.

ఆరవ తరగతి తరువాత ఏమి చేయాలని దిక్కుతోచని తెలుగు విద్యార్థులను తెలుగు ఉపాధ్యాయులుగా తయారు చేయాలన్న దృఢ సంకల్పంతో తెలుగు ఏడవ తరగతి ప్రారంభించుటకు విద్యాధికారులతో సంప్రతింపులు జరిపారు. పలు అడ్డంకులకు తరువాత తన సంకల్పాన్ని నెరవేర్చుకొని, తన సహచరులయిన శ్రీయుతులు అల్లూరి కన్నయ్యనాయుడు, బి. యస్. సింహాచలం, త్రిమూర్తి మొదలగువారితో ఆ తరగతి నిర్వహిస్తూ వచ్చారు. నేటి తెలుగు ఉపాధ్యాయుల నెందఱినో తయారుచేసిన ఆనాటి ఏడవ తరగతి తెలుగు జాతి అభివృద్ధికి నాంది ప్రస్తావనలు ఆలాపించిందంటే అది సత్యదూరం కాదు.

ఆ రోజుల్లో బాగన్ డత్తో[7]కు సమీపమున గల స్ట్రాత్ మాపి, తోటలో తెలుగు ఉపాధ్యాయులుగా యుండిన శ్రీమదిని సోమునాయుడు గారు తెలుగు భాషపై గల ప్రగాఢమయిన వాంఛతో తెలుగువారిని గురించి, తెలుగువారి చరిత్రను గురించి నాటి తమిళ దినపత్రికలలో వ్యాసాలు వ్రాస్తూ, తెలుగు యొక్క ఔన్నత్యమును చాటేవారు. శ్రీ బి.యస్. సింహాచలంగారు ఉద్యోగరీత్యా సింగపూరుకు వెళ్ళిపోయినందున ఆయనకు బదులుగా ఏడవ తరగతి విద్యార్థులకు గణిత పాఠము బోధించుటకు శ్రీ సోమునాయుడు గారు నియమించబడ్డారు. ఒక ప్రక్క పిల్లలకు గణితమును బోధిస్తూ, మరో ప్రక్క తెలుగు అభిమానమును నూరిపోస్తూ, వారిని ఉత్సాహపరుస్తూ యుండేవారు.

1955 వ సంవత్సర ఆరంభములో తెలుగు ఏడవ తరగతి విద్యార్థులు వారిలో ఏర్పడిన ఉత్సాహ కారణముగా తమిళ ఏడవ తరగతి విద్యార్థులతో బంతియాట పోటీకి వెళ్ళారు. ఆ కాలు బంతియాట పోటీ టెలుక్కాన్సన్ కాలుబంతియాట మైదానములో జరిగినది. తెలుగు విద్యార్థులు తమిళ విద్యార్థులను 6కు 0 అను గోళ్ళతో ఓడించారు. వారిలో ఉత్సాహము అధికరించింది. ఆ తరువాత టెలుక్‌బారుతోట తమిళ యువకు

---

5. Telugu Teachers' Preparatory Examination.

6. దివి 31-8-1957 నాడు దేశము స్వాతంత్ర్యమును పొందినది.

7. టెలుక్కాన్సను నుండి బగన్ డత్తో వెళ్ళు త్రోవలో గలదు.

లతో పందానికి వెళ్ళారు. అందులో గూడా జయము పొందారు ఇట్లే ప్రతినెల ఏదో ఒక జట్టుతో పందెం వేయడం, జయము గాంచడం జరుగుతూ వచ్చినది. ఈ వార్తలు అప్పటి కప్పుడు తమిళ పత్రికలలో పడేవి. అవి మలాయా నలుమూలలా నివసించుచుండిన తెలుగు వారిలో సంతోషాన్ని, ఉత్సాహాన్ని కల్పించేవి.

## తెలుగు బంతాట సంఘము

'తెలుగు బంతాట సంఘం' అను పేరిట ఒక సంఘాన్ని స్థాపించి, తెలుగు వారికి క్రీడారంగంలో మంచి తర్ఫీదునిచ్చి, జిల్లా, రాష్ట్ర, దేశీయ స్థాయిల్లో జరుగు ఆటలలో పాల్గొనజేసే తెలుగు జాతికి గౌరవం ఏర్పడుతుంది గదా అని శ్రీయుతులు నేతేటి దురయ్య, సోమునాయుడు గార్లు అనుకున్నారు. ఈ విషయాన్ని విద్యార్థులకు తెలియజేయగా వారి ఉత్సాహము పెల్లుబికింది. మరువారం ఒక సభను ఏర్పాటుచేసి, విద్యార్థుల ద్వారానే అన్ని ప్రాంతాలకు వార్తను పంపించారు. దాదాపు వందమంది తెలుగువారు ఆ సభకు వచ్చారు. ఆ సభలో శ్రీ మదిని సోమునాయుడు, శ్రీ నేతేటి దుర్గయ్యగార్లు వారి అభిప్రాయములను, ఆలోచనలను తెలుపగా అందరును వారితో ఏకీభవించారు. సంఘ స్థాపనకు తగు ఏర్పాట్లుచేసే పూచీ వారిరువురికి విడిచిపెట్టారు.

## దక్షిణ పేరా ఆంధ్ర సంఘము

మరికొందరు పెద్దల ఆలోచన మేరకు మరోసభ 17-7-1955 నాడు అదే భారతి తమిళ పాఠశాలలో జరిగినది. ఆ సభకు శ్రీ కె. వి. స్వామిగారు అధ్యక్షత వహించారు. తెలుగువారికంటూ ఒక ప్రత్యేక సంఘము అత్యవసరమని శ్రీ మదిని సోమునాయుడు, శ్రీ కె.వి. స్వామి, శ్రీ కుండా సిద్దయ్య, శ్రీ నేతేటి దుర్గయ్య, శ్రీ పోతల మారయ్య, శ్రీ ఆడారి అప్పల నాయుడు ప్రభృతులు ఉద్ఘాటించారు. 'తెలుగు బంతాట సంఘం' అను పేరిట సంఘాన్ని స్థాపిస్తే క్రీడారంగంలో మాత్రమే పాల్గొనగలం కాబట్టి, 'దక్షిణపేరా ఆంధ్ర సంఘం' అను పేరిట సంఘాన్ని స్థాపించటం మంచి దన్న పలు ఆలోచనలకు తరువాత అందరును ఏకగ్రీవముగా సమ్మతించిరి. ఈ సంఘ కార్యక్రమాన్ని గమనింప అధ్యక్షులుగా శ్రీ కుండా సిద్దయ్యగారును, నిర్వాహక సభ్యులుగా శ్రీయుతులు నేతేటి దుర్గయ్య, పోతల మారయ్య, మదిని సోము నాయుడు, ఆడారి అప్పల నాయుడు, ఆకుల సింహాచలం, తరిణి వరహాలు గార్లు నియమితులయ్యారు.

## మలాయా ఆంధ్ర సంఘము

దక్షిణపేరా ఆంధ్ర సంఘ స్థాపన సంబంధముయిన వార్తలను పత్రికలలో చదివిన ఆంధ్రాభిమానులు శ్రీయుతులు కొత్తపల్లి రంగారావు చౌదరి, ఎన్.ఏ. నాయుడు గార్లు దివి 25-9-1955 న అదే పాఠశాలలో జరిగిన మరో సభకు వచ్చారు. వారు అప్పుడు సుంగై సిపుటుకు సమీపమున గల చంకాట్ సాలాక్ తోటలో ఉద్యోగులుగా ఉండేవారు. శ్రీ చౌదరిగారి తేనెలొలుగు ప్రార్థన గీతముతో సభ ప్రారంభమయినది. సంఘ అధ్యక్షులు సిద్దయ్యగారును, ఆనాటి సభకు అధ్యక్షత వహించిన చౌదరిగారును పుష్పమాలాంకృతులు గావింపబడ్డారు. చౌదరిగారి ఆవేశపూరిత ఉపన్యాసము సభకు వచ్చిన వారినందరిని మరింత ఉత్సాహపరచినది. దక్షిణపేరా ఆంధ్ర సంఘము అను పేరిట సంఘాన్ని స్థాపిస్తే, అది ఒక్క దక్షిణపేరా జిల్లాకు మాత్రము పరిమితమయిపోతుంది. కాబట్టి, ఇతర ప్రాంతాలలోగల తెలుగువారు సంఘంలో పాలు పంచుకొనుటకు వీలులేకుండా పోతుం దని చౌదరిగారు పేర్కొన్నారు. ఇందువలన భవిష్యత్తులో మలాయాలో నివసించు తెలుగువారికి పలు సంఘాలు ఏర్పడే అవకాశం కలుగుతుం దని, అది సమూహాభివృద్ధికి మంచిదికాదని, అందువలన దేశీయ స్థాయిలో మలయా ఆంధ్ర సంఘముగా సంఘాన్ని స్థాపించుట ఉచితమని, ఆయన ఆలోచన నొసంగారు. సముచితమయిన ఆ ప్రేరణను అందరును సమ్మతించగా 'మలాయా ఆంధ్ర సంఘము' అను పేరిట సంఘాన్ని స్థాపించాలని తీర్మానించారు. ఆనాటి సభలో శ్రీయుతులు డేవిట్, నేతేటి దుర్గయ్య, మదిని సోము నాయుడు, కుండా సిద్దయ్య ఆత్తి సిమ్మాద్రి మొదలగువారు స్థాపించనున్న సంఘానికి ఆంధ్రులు ఏ విధ

ముగా సహకరించవలయునో వివరించారు. తరువాత మరొక తాత్కాలిక నిర్వాహము ఎన్నుకొనబడినది.

అధ్యక్షులు — శ్రీ కుండా సిద్దయ్య
కార్యదర్శి — శ్రీ మదిని సోమునాయుడు
కోశాధికారి — శ్రీ నేతేటి దుర్గయ్య

నిర్వాహక సభ్యులు — శ్రీయుతులు పోతల మారయ్య, ఆడారి అప్పలనాయుడు, తరిణి వరహాలు, ఆకుల సింహాచలం, ఏ. జి. నాయుడు, శ్రీమతి వేముల పల్లి కృష్ణకుమారి.

సంఘ ప్రారంభమునకు చేదోడువాదోడుగా యుండి, చట్టదిట్టములను తయారుచేసి, ప్రజలలో ఉత్సాహమును రేకెత్తించిన శ్రీ కొత్తపల్లి రంగారావు చౌదరిగారు కార్మిక సంఘ మూడునెలల తర్ఫీదు విద్యకై 1955వ సంవత్సరము డిసెంబరు నెలలో కలకత్తాకు వెళ్ళి, అదేనెలలో గుండెపోటుచే అకాలమరణము పాలయిరి. సంఘ మింకను నమోదు చేయబడుటకు పూర్వమే కీర్తి శేషులయిన ఆ అమృతమూర్తి ఆత్మశాంతికి ఆనాడు తెలుగు వారందరు తమ హృదయాంజలులు అర్పించారు.

ఇండియావారి కందరకు ఒక సంఘము ఉన్న సమయములో తెలుగువారికంటూ ఒక ప్రత్యేక సంఘము ఏర్పడడము ఇష్టపడని కొందరు సంఘము నమోదు చేయ బడకుండా ఎన్నో అడ్డంకులను, కష్టాలను కల్పించారు. కాని తెనుగుతల్లికృప మనపై ఉన్నందునను, ఆనాటి సంఘ నాయకుల విడువని పట్టుదలవలనను, మన సంఘము 'మలాయా ఆంధ్ర సంఘము'గా 1956వ సంవత్సరము ఫిబ్రవరినెలలో 631 అను నమోదు అంకెను పొంది రిజిష్టరు చేయబడినది. దివి 14-10-1956 నాడు మలాయాంధ్ర సంఘ మొదటి మహాసభ సింపాంగ్ తీగా దేశీయ పాఠశాల (మలాయి)లో జరిగినది. అంతవరకును 25-9-1955 నాడు ఎన్నుకొనబడిన తాత్కాలిక నిర్వాహమే సంఘాన్ని నమోదు చేయు పూచీ తీసుకొని, నిర్వహిస్తూ వచ్చినది. ఎన్నో కష్టాల నడుమ జన్మించిన మన సంఘానికి శ్రీయుతులు కుండా సిద్దయ్య, నేతేటి దుర్గయ్య, మదిని సోమునాయుడుగార్లు ముమ్మూర్తులా త్రోవజూపారు. ఇంకను ఎందరో నాయకులు వీరికి ప్రక్క బలంగా ఉండి, సంఘ పథాన్ని సుగమం చేశారు. వీరూ అని వారి పేర్లను నేనిచట వ్రాయక పోయినా ఆ పరోక్ష త్యాగశీలురకు తెనుగుతల్లి ఆశీస్సులు ఎల్లప్పుడూ అందుతునే యుంటవి.

సంఘ ప్రారంభంనుండి ఐదుసార్లు అధ్యక్షులుగా ఏకగ్రీవముగా ఎన్నికయి అపార సేవ చేసిన శ్రీ కుండా సిద్దయ్యగారు తన ఆశీస్సుల నందించి, 1960లో ఆంధ్ర దేశానికి తరలి పోయారు. శ్రీ చౌదరిగారితో సహా మన సంఘ స్థాపనకు అనేక విధముల పాటు పడిన శ్రీ ఎన్. ఏ. నాయుడుగారు ఒక మోటారు విపత్తుకు గురియయి, మరణించారు. మొదటి మహాసభలో ఉపాధ్యక్షులుగా ఎన్నుకొనబడిన శ్రీ వేములపల్లి కాళిదాసుగారును కొంతకాలము సంఘానికి సేవచేసిన అనంతరము కీర్తిశేషులయ్యారు.

## మలేసియా ఆంధ్ర సంఘము

1963వ సంవత్సరము సెప్టెంబరు 16న దేశపిత శ్రీ తుంకు అబ్దుల్ రహమాన్‌గారి అవిరళకృషి ఫలితంగా మలాయా, సింగపూర్, సబా, సరవాక్‌లు ఏకమయి మలేసియా ఆవిర్భవించినది. సింగపూర్, సబా, సరవాక్ ప్రాంతాలలో గల తెలుగు వారిని గూడా సంఘములో చేర్చుకొని, సంఘసేవను విస్తరించు నిమిత్తము 1965వ సంవత్సరము మలాయా ఆంధ్ర సంఘము 'మలేసియా ఆంధ్ర సంఘము'గా నమోదు చేయబడినది. కాని, అదే సంవత్సరము సింగపూరు కొన్ని రాజకీయ కారణములరీత్యా మలేసియానుండి విడిపోయి స్వతంత్ర దేశముగా ప్రకటించుకున్నందున ఆ ప్రాంతమున గల ఆంధ్రులు మనతో ఐక్యపడలేక పోయారు.

ప్రారంభకాలంనుండి నేటివరకు ఆంధ్ర సంఘము ఆంధ్రుల అభివృద్ధికి తన సాయశక్తులా సేవచేస్తూనే వుంది. సంఘము ఏర్పడిన అనంతరము తెలుగువారు, తెలుగు భాష ఒక గుర్తింపుకు వచ్చి, ఆర్థికంగా, సాంఘికంగా అభివృద్ధి చెందుటకు అవకాశములు ఏర్పడినవి

ఆనాడు ఈ సంఘమే స్థాపించబడకుండా ఉన్నట్లయి నచో ఈనాడు మలేసియాలో 'తెలుగు' అన్నపదమే పూర్తిగా లేకుండా పోయి ఉండెడిది.

సంఘము యొక్క ప్రోత్సాహబలముచే అస్థిర మయిన జీవితాలను గడుపుతూ వచ్చిన వేలాది తెలుగు వారు దేశపౌరులయి ఇచ్చటనే స్థిరపడిపోయి, ఆర్థికంగా ఎంతో అభివృద్ధి చెందారు. సంఘనాయకులు గ్రామ గ్రామములకు, నగరములకు వెళ్ళి, ప్రజల కుపయోగ పడు మంచి ఉపన్యాసములను ఒసంగి, దేశకాల పరి స్థితులను వివరించి తెలుగువారికి మేలుకొలుపులు పాడారు. నాయకుల కృషి ఫలితముగా విద్య యొక్క ఆవశ్యకతను గుర్తించిన తెలుగువారు తమ పిల్లల భవిష్యత్తుకు పునాదులు వేసుకున్నారు. ఈనాడు మలేసియా ఆంధ్రులు ఎందరో స్వదేశములోను, విదేశాలలోను ఉన్నత విద్యలు అభ్యసించి వచ్చి, ఉన్నత పదవులు వహించుచున్నారు. ఇతర జాతీయుల వలె తెలుగువారు కూడా ప్రగతి పథంలోకి పయనించు చున్నారు. నేటి మలేసియా తెలుగువారి అభివృద్ధికి, మలేసియాలో తెలుగు భాషా సంస్కృతుల ప్రగతికి సంఘము ప్రత్యక్షంగాను పరోక్షంగాను ఎనలేని దోహదం చేసినది.

## సంఘ శాఖలు

నేడు మలేసియా ఆంధ్ర సంఘానికి పశ్చిమ మలేసియా నలుమూలలా 17 శాఖలు గలవు. ఈ శాఖలు ఆయా ప్రాంతాలలో గల తెలుగువారికి అన్ని రంగాలలో సేవచేస్తూ వస్తున్నవి. నాడు 'మలాయా ఆంధ్ర సంఘము' అను పేరిట వ్యవహరించబడిన మన సంఘా నికి మొదటి శాఖగా వెలసినది సిత్యవాన్ శాఖ. ఇది 17-7-1960నాడు ప్రారంభించినది. దివి 17-8-60 నాడు ప్రారంభించబడిన కెడాశాఖ (సుంగై పటాణి) రెండవ శాఖ యగును.

| క్రమ సంఖ్య | ప్రారంభించబడిన సం॥రము | శాఖ |
|---|---|---|
| 1. | 1960 | సిత్యవాన్ శాఖ |
| 2. | 1960 | కెడా శాఖ (సుంగై పటాణి) |
| 3. | 1961 | దిగువ పేరా శాఖ |
| 4. | 1964 | నగిరి సెంబిలాన్ శాఖ |
| 5. | 1964 | మధ్య పేరా శాఖ |
| 6. | 1964 | బెలుక్కాన్నను శాఖ |
| 7. | 1964 | సింపాంగ్ అంపాట్ శాఖ |
| 8. | 1964 | సిలాంగూర్ శాఖ |
| 9. | 1965 | తై పింగ్ శాఖ |
| 10. | 1965 | తంజోంగ్ మాలిం శాఖ |
| 11. | 1965 | కూలిం శాఖ |
| 12. | 1965 | సబాక్ బెర్నం శాఖ |
| 13. | 1965 | సుంగై సిపుట్ శాఖ |
| 14. | 1968 | కిల్లాను శాఖ |
| 15. | 1975 | సిగామట్ శాఖ |
| 16. | 1975 | కులువాంగ్ శాఖ |
| 17. | 1976 | పినాంగ్ శాఖ |
| 18. | 1976 | రవాంగ్ శాఖ |
| 19. | 1979 | పహాంగ్ శాఖ |

పై పందొమ్మిది శాఖలలో తై పింగ్, సుంగై సిపుట్ శాఖలు మంచి నిర్వాహకుల కొఱత వలన సరిగా నిర్వ హించబడనందున కొంత కాలమునకు తరువాత మూసి వేయబడినవి. కిల్లాన్ శాఖ కొంతకాలము నిద్రావస్థలో ఉండి, మొన్న మొన్ననే పునఃప్రారంభించబడినది.

## ఆంధ్ర మహిళా సభ

దివి 13-4-1963లో ఆంధ్ర సంఘ విభాగముగా ఆంధ్ర మహిళాసభ సెలెక్కో. సమూహ భవనములో అప్పటి అధ్యక్షులు శ్రీ కె. వి. స్వామిగారిచే ప్రారం భించబడినది. శ్రీమతి కస్తూరిబాయి స్వామిగారు అధ్య క్షురాలుగాను, శ్రీమతి రాములమ్మ సోమునాయుడుగారు కార్యదర్శినిగాను యుండి, పలు మంచి కార్యములను జరిపించి ఆంధ్ర మహిళలలో మేలుకొలుపులు పాడారు. కాని కొంత కాలమునకు తరువాత నిర్వాహకులు పలు తావులకు చెదిరిపోవుటచే సభలు చక్కగా జరుగక మూసివేయబడినది.

## కేంద్ర సంఘ నిర్వాహకులు

గత 25 సంవత్సరములుగా ఆంధ్ర సంఘాన్ని నిర్వహిస్తూ వచ్చిన, నిర్వహించుచున్న ప్రధాన నిర్వా హకులు...

## 25 సంవత్సరాల కేంద్ర నిర్వాహకుల పట్టిక

| క్రమ సంఖ్య | మహాసభ జరిగిన తారీఖు | అధ్యక్షులు | ఉపాధ్యక్షులు | గౌ. ప్ర. కార్యదర్శి | గౌ. ప్ర. స. కార్యదర్శి | గౌ. ప్ర. కోశాధికారి |
|---|---|---|---|---|---|---|
| 1 | 17-7-1955 | శ్రీ K. సిద్దయ్యగారు. | — | శ్రీ మదిని సోమునాయుడు | — | శ్రీ N. దుర్గయ్యగారు. |
| 2 | 14-10-1956 | శ్రీ K. సిద్దయ్య | శ్రీ V. K. దాసు | శ్రీ N. దుర్గయ్య | శ్రీ M. వీరునాయుడు | శ్రీ P. మారయ్య |
| 3 | 25-5-1958 | శ్రీ K. సిద్దయ్య | శ్రీ K. V. స్వామి | శ్రీ N. దుర్గయ్య | శ్రీ M.D. సోమునాయుడు | శ్రీ P. మారయ్య |
| 4 | 24-5-1959 | శ్రీ K. సిద్దయ్య | శ్రీ K. V. స్వామి | శ్రీ N. దుర్గయ్య | శ్రీ M.D. సోమునాయుడు | శ్రీ B. S. సముద్రము |
| 5 | 20-3-1960 | శ్రీ K. సిద్దయ్య | శ్రీ K. V. స్వామి | శ్రీ మదిని సోమునాయుడు | శ్రీ P. మారయ్య | శ్రీ B. S. సముద్రము |
| 6 | 29-4-1961 | శ్రీ K. V. స్వామి | శ్రీ N. దుర్గయ్య | శ్రీ ,, సోమునాయుడు | శ్రీ T. వరహాలు | శ్రీ B. S. సముద్రము |
| 7 | 10-6-1962 | శ్రీ K. V. స్వామి | శ్రీ N. దుర్గయ్య | శ్రీ ,, సోమునాయుడు | శ్రీ T. వరహాలు | శ్రీ B. S. సముద్రము |
| 8 | 7-7-1963 | శ్రీ K. V. స్వామి | శ్రీ N. దుర్గయ్య | శ్రీ ,, సోమునాయుడు | శ్రీ A. C. అప్పారావు | శ్రీ B. S సముద్రము |
| 9 | 16-8-1964 | శ్రీ K. V. స్వామి | శ్రీ N. దుర్గయ్య | శ్రీ ,, సోమునాయుడు | శ్రీ A. C. అప్పారావు | శ్రీ B. S సముద్రము/ శ్రీ P. మారయ్య |
| 10 | 15-8-1965 | శ్రీ A. C. అప్పారావు | శ్రీ N. దుర్గయ్య | శ్రీ ,, సోమునాయుడు | శ్రీ T.A. అప్పలస్వామి | శ్రీ మండే లక్ష్మణ |
| 11 | 4-9-1966 | శ్రీ A. C. అప్పారావు | శ్రీ N. దుర్గయ్య | శ్రీ ,, సోమునాయుడు | శ్రీ D. V. శ్రీరాములు | శ్రీ మండే లక్ష్మణ |
| 12 | 8-10-1967 | శ్రీ A. C. అప్పారావు | శ్రీ N. దుర్గయ్య | శ్రీ ,, సోమునాయుడు | శ్రీ D. V. శ్రీరాములు | శ్రీ మండే లక్ష్మణ |
| 13 | 9-2-1969 | శ్రీ T.A. అప్పలస్వామి | శ్రీ N. దుర్గయ్య | శ్రీ ,, సోమునాయుడు | శ్రీ D. V. శ్రీరాములు/ గుమ్మడి అప్పలనాయుడు | శ్రీ R. P. రాములు |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 14 | 1-8-1971 | శ్రీ T.A. అప్పలస్వామి | శ్రీ N. దుర్గయ్య | శ్రీ | ,, సోమునాయుడు | శ్రీ D. V. శ్రీరాములు | శ్రీ R. P. రాములు |
| 15 | 22-7-1973 | డా॥ A. C. అప్పారావు | శ్రీ N. దుర్గయ్య | శ్రీ | ,, సోమునాయుడు | శ్రీ B. దేవుడు | శ్రీ R. P. రాములు |
| 16 | 22-9-1974 | డా॥ A. C. అప్పారావు | శ్రీ మండే లక్ష్మణ | శ్రీ | ,, సోమునాయుడు | శ్రీ D. V. శ్రీరాములు | శ్రీ R. P. రాములు |
| 17 | 11-4-1976 | డా॥ A. C. అప్పారావు | శ్రీ మండే లక్ష్మణ | శ్రీ | ,, సోమునాయుడు | శ్రీ D. V. శ్రీరాములు | శ్రీ R. P. రాములు |
| 18 | 9-4-1978 | డా॥ A. C. అప్పారావు | శ్రీ A. S. కృష్ణమూర్తి | శ్రీ | ,, సోమునాయుడు | శ్రీ D. V. శ్రీరాములు | శ్రీ R. P. రాములు |
| 19 | 14-12-1980 | డా॥ A. C. అప్పారావు | డా॥ విజయన్ | శ్రీ | ,, సోమునాయుడు | శ్రీ బీసెట్టి నూకయ్య | శ్రీ R. P. రాములు |

1976 నుండి ముగ్గురు సహాయ అధ్యక్షులు ఎన్నుకొనబడిరి.

వారు :— 1976 — శ్రీయుతులు A. సుబ్రమణియం, A అప్పలస్వామి, M. S. శర్మ.

1978 — శ్రీయుతులు A. అప్పలస్వామి, B. A. నాయుడు, A. కృష్ణ

1980 — శ్రీయుతులు N. అప్పలస్వామి, డా॥ దయానంద, P. సుందరం

1978 నుండి అదనంగా మరో గౌ. ప్ర. సహాయ కార్యదర్శి ఎన్నుకొనబడిరి.

1978 — శ్రీ A. అప్పారావు, 1980 — శ్రీ A. సుబ్రమణియం

# కేంద్ర సంఘ మహాసభల వివరముల పట్టిక

| అంకె | మహాసభలు జరిగిన తారీఖులు | స్థలము | సభలకు ప్రారంభోత్సవము చేసినవారు |
|---|---|---|---|
| 1 | 14-10-1956 | దేశీయ ప్రాథమికపాఠశాల (మలాయి) సింపాంగ్ తీగా బా. డత్రీ | |
| 2 | 25- 5-1958 | గాంధీ జ్ఞాపకార్థ మండపము, బెలుక్కాన్సను | |
| 3 | 24- 5-1959 | " " " " | |
| 4 | 20- 3-1960 | " " " " | |
| 5 | 29- 4-1961 | క్యాంగ్ తీంగ్ హీ కువాన్ భవనము " | |
| 6 | 10- 6-1962 | గాంధీ జ్ఞాపకార్థ మండపము, " | |
| 7 | 7- 7-1963 | " " " " | ఇంచే సులైమాన్ భూలోన్, పేరారాజ్య సహాయమంత్రి బుసార్ |
| 8 | 16- 8-1964 | క్యాంగ్ తీంగ్ హీకువాన్ భవనము " | ఇంచే సులైమాన్ భూలోన్, వ్యవసాయ సహకార మంత్రి |
| 9 | 15- 8-1965 | మహా మరియమ్మ దేవాలయ భవనము, ఈపో | ఇంచే మహమ్మద్ కైర్ జోహారి, విద్యామంత్రి |
| 10 | 4- 9-1966 | కళామండపము, కౌలాలంపూర్ | ఇంచే సెనుబిన్ అబ్దులుల్ రహమాన్, ప్రచారశాఖామాత్యులు |
| 11 | 8-10-1967 | గాంధీ జ్ఞాపకార్థ మండపము, బెలుక్కాన్సను | శ్రీ యర్రోజు మాధవాచార్యులు, M.A., ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము పంపించిన తెలుగు పండితులు |
| 12 | 9- 2-1969 | క్యాంగ్ తోంగ్ హీకువాంగ్ భవనము, బెలుకాన్సను | శ్రీ దత్తో వి. మాణిక్క వాసగం, కార్మికమంత్రి |
| 13 | 1- 8-1971 | తోట భవనము, పెటాలింగ్ జయ | |
| 14 | 22- 7-1973 | కాంవ్గ్ తోంగ్ హీకువాంగ్ భవనము, బెలుక్కాన్సను | దత్తో లోవ్ ఆసింబిన్ కెతింగ్, పేరారాజ్యమంత్రి బిసార్ ప్రతినిధి |
| 15 | 22- 9-1974 | తోట భవనము, పెటాలింగ్ జయా | |
| 16 | 11- 4-1976 | సుల్తాన్ ఒడ్లిఫా మాధ్యమిక పాఠశాల కూలిం | డా॥ న్యూయోపాంగ్, సాంస్కృతిక, యువజన, క్రీడా సహాయమంత్రి |
| 17 | 9- 4-1978 | సెంటాల్ రైల్వేట్రైనింగు పాఠశాల కౌలాలంపూర్ | |
| 18 | 14-12-1980 | కథోలిక్ సెంటర్, ఈపో | |

శ్రీ కె. వి. స్వామిగారు

సంఘ ప్రారంభకాలమునుండి సంఘానికి ఇతోధికంగా సేవచేస్తూ వచ్చిన వారిలో శ్రీ కె.వి. స్వామిగారు పేర్కొనవలసిన వారు. 1958 నుండి సంఘానికి ఉపాధ్యక్షులుగాను, 1931 నుండి 1965 వరకు అధ్యక్షులుగాను పదవీనిర్వహణ చేసి సంఘాభివృద్ధికి ఎనలేని సేవచేశారు. ఆ తరువాత సంఘమునుండి విశ్రాంతిని పొందిగూడా సంఘ ఆలోచకులుగా ఉండి, మంచి ఆలోచనలను ఒసంగారు. సంఘ పూర్వనాయకులలో ఒకరయిన ఆ మహనీయుడు గత 18-9-1973నాడు మనలనందరిని వీడి, కీర్తిశేషులయారు.

సంఘ మహాసభలు

సంఘం ప్రారంభించిన నాటినుండి నేటివరకును మొత్తం 18 మహాసభలు జరుపబడ్డాయి. మొదటిమహాసభ దివి 14-10-1956నాడు సింపాంగ్ తీగా దేశీయ పాఠశాల (మలాయి)లో జరుపబడినది. సంఘము అభివృద్ధి చెందిన కొలది దేశము నలుమూలలా సంఘ శాఖలు ప్రారంభించటంతో కేంద్రమహాసభలను ప్రతి సంవత్సరము గాకుండా రెండుసంవత్సరముల కొకతడవ జరుపుట ఉచితమని దివి 22-9-1974నాడు జరిగిన ఒక సభలో తీర్మానించడం అయినది. దానిని అనుసరించి అప్పటినుండి ద్వివర్షాంతర ప్రతినిధుల మహాసభలు జరుపబడుచున్నవి.

సంఘ మహాసభలు, అవి జరుపబడిన స్థలములు, వాటికి ప్రారంభోత్సవములు చేసినవారి వివరములు 16వ పేజీలోని పట్టికలో చూడవచ్చును.

డా॥ సి. అప్పారావు గారికి 'కళాప్రపూర్ణ' బిరుదు

విదేశాలలో తెలుగు సాహితీ సంస్కృతులకు, తెలుగు సంఘాలకు ఎనలేని సేవచేసిన ప్రముఖులకు 'కళాప్రపూర్ణ' అను బిరుదు నొసంగి గౌరవించాలని ఆంధ్రప్రదేశములోని ఆంధ్ర విశ్వవిద్యాలయము వారు తీర్మానించుకున్నారు. ఆ విశ్వవిద్యాలయ స్వర్ణోత్సవము సందర్భముగా విదేశాలలోనున్న ఇరువురు తెలుగు ప్రముఖులకు 'కళాప్రపూర్ణ' (డాక్టరేటు) అను బిరుదులను ఒసంగి గౌరవించిరి. వారిలో ఒకరు మన సంఘ అధ్యక్షులయిన డా॥ సి. అప్పారావుగారు, గత పలు సంవత్సరములుగా మన సంఘానికి అధ్యక్షపదవిని వహిస్తూ, మలేసియాలో తెలుగుభాషా సంస్కృతుల అభివృద్ధికి చక్కని సేవ చేస్తూవస్తున్న డా॥ అప్పారావుగారు. అభినందనీయులు ఉన్నత విద్యావంతులయిన అతనికి 'కళాప్రపూర్ణ' బిరుదు లభించడం అతనికి మాత్రమే గాక మనకందరకు గౌరవ ప్రదమగును.

ఉగాది, ప్రపంచ తెలుగు మహాసభల— చొక్కాయిలు (T-Shirts)

దివి 9-4-1978 లో కేంద్ర స్థాయిలో ఉగాది ఉత్సవము కౌలాలంపూరులో ఆంధ్ర సంఘ ప్రతినిధుల మహాసభ అనంతరము అతిచక్కగా కొనియాడబడినది. ఆ ఉత్సవమును పురస్కరించుకొని అందమయిన డిజైనులో సంఘము పేరుతో తెలుగులో ముద్రించబడిన చొక్కాయిలు అమ్మబడినవి, తెలుగు లిపిలో వెలువడిన మొదటి చొక్కాయిలు అవి అంటే అది సత్యదూరము కాదేమో! తరువాత 1979 లో జరుగవలసిన రెండవ ప్రపంచ తెలుగుమహాసభలను పురస్కరించుకొని, మహాసభల చిహ్నముతో పలు రంగులలో చొక్కాయిలు ముద్రించి, అమ్మబడినవి. ఆ తరువాత ఇద్దరమ్మాయిల చిఱుతల ఆటను ప్రదర్శించు అందమయిన బొమ్మలతో ఉగాది చొక్కాయిలు అమ్మబడి, ఆంధ్ర సంఘానికి, తెలుగు మహాసభలకు, ఉగాది పండుగకు దేశమంతటా విరివయిన ప్రచారముజరిగినది. ఈ సత్కార్యానికి వెనుకనున్న నాయకుడు అప్పటి గౌరవ ప్రధాన సహాయ కార్యదర్శి శ్రీ అ. అప్పారావు గారు అభినందనీయులు.

తెలుగు సాహితీ సమితి

1965 లో సింపాంగ్ అంపాట్ ఆంధ్ర సంఘశాఖవారు నవయుగకవి గురజాడ అప్పారావు గారి స్మారక దినోత్సవమును మహా వైభవంగా సింపాంగ్

అంపాట్ లో జరిపింది. 'గురుజాడ' అను లిఖిత సంచి కను మలేసియాలోని పలువురి రచనలతో వెలువ డించారు.

తెలుగు సాహితీ సంస్కృతులకు దూరమయిన తెలుగు వారికి తెలుగు కవులను, పండితులను పరిచ యము చేయాలన్న సత్సంకల్పముతో దిగువ పేరా జిల్లా ప్రాంతమున గల దిగువపేరా, సింపాంగ్ అంపాట్, బెలుక్కాన్సను, సబాక్ బెర్నరి శాఖలు ఉమ్మడిగా 'సాహితీ సమితి' అను అనుబంధ సంస్థను స్థాపించుకొని, 1966లో గురజాడ అప్పారావు గారి స్మారక దినోత్సవమును రెండవసారిగా బెలుక్కాన్సను నగరములో అతివైభవముగా కొనియాడినవి. ఆనాడు ప్రముఖ మలేసియ తెలుగు కవియు. తెలుగుఅభిమానియు అయిన శ్రీ జి.యస్. లెక్లర్‌గారు గురజాడ అప్పారావు గారిపై సుదీర్ఘమయిన సాహిత్యోపన్యాసమును ఒసంగారు.

1968 లో అదే సాహితీ సమితి దేశోద్ధారక శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి 101 – వ జయంత్యుత్సవమును చక్కగా గొనియాడినది. పలు నాటికలు, పోటీలతోను, శ్రీ ఎల్లపు కృష్ణమూర్తిగారి సాహిత్యోపన్యాసముతోను ఉత్సవము గొనియాడబడి నది. కాలమాన పరిస్థితుల కారణంగా ఆ తరువాత ఇటువంటి ఉత్సవాలను కొనియాడుట ఆగిపోయినది.

## తెలుగు సహకార సంఘములు

1957 లోనే తెలుగువారు భాషా సాంస్కృతి రంగ ముతోబాటు ఆర్థికరంగములో గూడా అభివృద్ధి చెందాలన్న మంచి అభిప్రాయముతో సంఘ నాయకులు ఒక సహకార సంఘాన్ని ప్రారంభించుటకు పునాదులు వేసారు. సంఘాన్ని నమోదు చేయుటకు ప్రయత్నాలు జరుగుచున్న సమయములో ఎదురుచూడని కొన్ని కారణాంతరముల వలన ఆ మహత్తర కార్యమునకు అంతరాయము కలిగినది.

1964లో శ్రీ పోతల పూరయ్యగారి అధ్యక్షత క్రింద ఆ మంచి కార్యము తిరిగి ప్రారంభించబడినది. కాని,దురదృష్టవశాత్తున ఈతడవ గూడా అంతరాయము గలిగి ఆగిపోయినది. మూడవ తడవగా శ్రీ బొడ్డేటి దేవుడుగారి త్రీ వక్రృషిలో పలువురు తెలుగు అభిమానుల సహకారంతో తెలుగువారికంటూ 'సుజన సహకార సంఘము' దేశీయ స్థాయిలో ప్రారం భించబడినది. కాని, కొన్ని అనివార్య కారణములవలన ఆ సంఘ అభివృద్ధి కొంతకాలంపాటు కుంటుపడినది.

శ్రీ ఆర్.పి. నాయుడుగారి పూచీక్రింద దివి 3-8-1980లో సిలాంగూర్ శాఖవారు జరిపిన తెలుగువారి ఆర్థికాభివృద్ధి సెమినారులో 'సుజన సహకారసంఘాన్ని' అభివృద్ధికి తీసుక రావలయునని తీర్మానించి, జరూ రుగా పనులు చేయుచున్నారు. డా॥ విజయన్‌గారి అధ్యక్షతక్రింద నున్న 'సుజన సహకార సంఘము' అచిర కాలములో ఉన్నతస్థాయికి చేరగలదని ఆశిద్దాము.

## మొదటి ప్రపంచ తెలుగు మహాసభలు

1967లో మన సంఘకోరిక మేఱకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము శ్రీ యత్తోజు మాధవాచార్యులుగారిని సాంస్కృతిక దూతగా మలేసియాకు పంపించినది. ఆతను నెలరోజులపాటు దేశంనలుమూలలా పర్యటించి, సాహిత్యోపన్యాసములను ఒసంగి తెలుగువారిలో జాగృతి కల్పించారు. ప్రపంచ మంతటా చెదరియున్న తెలుగువారి నందరినీ ఒకే వేదికపైకి తెచ్చునిమిత్తము ప్రపంచ తెలుగు మహాసభలను ఆంధ్రప్రదేశ్ ప్రభు త్వము నిర్వహించాలన్న కోరికను ఒక మహజరుద్వారా ఆ సందర్భములో సంఘము కోరినది.

1968లో అంతర్జాతీయ తెలుగు సదస్సులకు ఒక సన్నాహక సంఘము ఏర్పడినది. కాని, 1975 నాటికిగాని ఆ సభలు జరుగలేదు. శ్రీ జలగం వెంగళ రావు, శ్రీమండలి వెంకటకృష్ణారావుగార్ల కృషిఫలితంగా 1975వ సంవత్సరము ఏప్రిల్ 12 నుండి 18 వఱకు వారం రోజులపాటు ప్రపంచ తెలుగు మహాసభలు ఆంధ్రప్రదేశ్ రాజధానీ నగరములో మహావైభవంగా జరిగాయి. మలేసియా ఆంధ్రసంఘము తరఫున 25 మందిగల బృంద మొకటి డా॥ అప్పారావుగారి అధ్యక్షత క్రింద ఆ మహాసభలలో పాల్గొన్నది.

ఈ మహాసభలను పురస్కరించుకొని ప్రధాన అధ్యక్షులు డా॥ అప్పారావుగారు వ్రాసిన వ్యాసము తెలుగువాణి ఆంగ్ల ప్రతిలోను, గౌరవ ప్రధాన కార్యదర్శి శ్రీ మవిని సోమునాయుడుగారు వ్రాసిన వ్యాసము తెలుగువాణి తెలుగు ప్రతిలోను ప్రచురించబడ్డాయి. అప్పటి గౌరవ ప్రధాన సహాయ కార్యదర్శి శ్రీ దాడి శ్రీరాములుగారు 'విదేశాలలో తెలుగువారు' అను చర్చా గోష్ఠిలో తన ప్రధాన వ్యాసమును సమర్పించారు. విదేశాల నుండి హాజరయిన 113గురు ప్రతినిధులలో ఎక్కువమంది మలేసియా నుండి వెళ్ళిన కారణంగా రెండవ ప్రపంచ తెలుగు మహాసభను 1977 లో మలేసియాలో జరుపుటకై తీర్మానించారు.

## అంతర్జాతీయ తెలుగు సంస్థ

మొదటి ప్రపంచ తెలుగు మహాసభల ఫలితముగా హైదరాబాదులో స్థాపించబడిన ఈ సంస్థ మలేసియా ఆంధ్ర సంఘానికి పలు సాయములు చేస్తూ, తెలుగు జాతి అభ్యున్నతికి బహుముఖసేవ చేస్తున్నది. మన కోరికల నెన్నింటినో జయప్రదం గావించినది. తెలుగు వాచకములు, గ్రంథాలయ పుస్తకములు, తెలుగు వార, పక్ష, నెలవారీ సంచికలు మొదలగువాటిని పంపిస్తూ, మలేసియాలో తెలుగు పుస్తకాల కొరతను తీర్చుచున్నది. ఇరుతెలుగు టైపురైటర్లు, తెలుగు అచ్చులు మనకు పంపించినది. మలేసియాలో తెలుగు వికాసానికి అంతర్జాతీయ తెలుగు సంస్థ చాలవఱకు సాయపడుచున్నది.

## తెలుగు విద్య — పాఠశాలలు

1957 లో మలాయా స్వాతంత్ర్యమును పొందిన అనంతరము దేశములో రాజకీయముగా పలు మార్పులు ఏర్పాడ్డాయి. 1956 లో ప్రభుత్వానికి సిఫారసు చేయబడిన రజాక్ విద్యా నివేదికలో తెలుగు చేర్చుకోబడలేదు. ఇందువలన మలాయి, ఇంగ్లీషు, చైనీసు, తమిళ భాషలను మాత్రమే ప్రభుత్వము గుర్తించింది. ఆ భాషా పాఠశాలలకు మాత్రమే అధికారపూర్వక ఆదరణ లభించినది. ఇందువలన తెలుగు పాఠశాలల అభివృద్ధి కుంటుపడిందనే చెప్పాలి.

1949 వ సంవత్సరపు విద్యాశాఖవారి నివేదిక ప్రకారము ఆనాడు మలాయాలో 23 తమిళ తెలుగు పాఠశాలలును, 13 తెలుగు పాఠశాలలును ఉండెడివి. కాని, ఈ సంఖ్య దిన దినం దిగజారుతూ వచ్చింది. 1970 నాటికి ఆ సంఖ్య 25కు దిగజారిపోయింది. ఈ పాఠశాలలన్నియు తెలుగువారు గుర్తింపదగిన సంఖ్యలో నివసించు తోటలందు యుండెడివి. తెలుగువారు అల్ప సంఖ్యలో గల ప్రాంతాలలో తెలుగు పాఠశాలలు లేవు. వారు తమ పిల్లలను తమిళ పాఠశాలలకు పంపించుచున్నారు.

సంఘం ప్రారంభించిన నాటినుండి క్రొత్తగా తెలుగు పాఠశాలను తెరచుటకు పలు ప్రయత్నాలు చేసినప్పటికి రజాక్ విద్యా రిపోర్టు కారణంగా ఆ అవకాశములు లేకుండా పోయినవి. ఉన్నవి అలాగున జరుగవలసిందే గాని క్రొత్త పాఠశాలలు తెరచుటకు వీలులేదని ప్రభుత్వము చెప్పివేసినది.

రజాక్ విద్యా నివేదిక 1960 లో అప్పటి విద్యా మంత్రి ఇంచే అబ్దుల్ రహమాన్ తాలిఫ్‌గారి అధ్యక్షతలో సవరణ చేయబడినది. మన సంఘము తరపున తెలుగును గూడ చేర్చుకోవలయునని మహజరు సమర్పించినప్పటికి తెలుగు తాలిఫ్ విద్యా నివేదికలో చేర్చుకోబడలేదు. పర్యవసానంగా తెలుగు, మళయాళీ, పంజాబీ పాఠశాలలకు ప్రభుత్వ మిస్తున్న మాన్యము 1962 నుండి ఇవ్వబడదని దివి. 4-8-1961 నాటి స్థానిక దినపత్రికలందు ప్రభుత్వము ప్రకటించినది. తెలుగువారికిదిగ్భ్రాంతిగొలుపుఈవార్తరేడియోమలాయా, ఆలిండియా రేడియోలలో గూడా ప్రసారము చేయబడినది. తెలుగు వారందఱు తల్లడిల్లిరి. సంఘ నాయకులు ఆశ్చర్య చకితులయిరి. అయినప్పటికి సహనమును కోల్పోక ప్రభుత్వముతో వాదోపవాదాలు జరిపారు.

తెలుగువారు ప్రాతినిధ్యం వహించు వివిధ సంస్థల ద్వారా ప్రభుత్వముపై ఒత్తిడిని కల్పించారు. మళయాళీ, పంజాబీ సోదరులును మనతోబాటు ఏకమయిరి. నాటి ఇండియా వారి నాయకులయిన డత్తో వి. టి. సంబంధన్, ఇంచేమాణిక్కవాసగం గార్లతోను,

దేశపిత, ప్రధానమంత్రి యయిన గౌరవ నీయులగు తుంకు అబ్దుల్ రహమాన్ గారితోను, ఇంకను పలువురు మలాయి మంత్రులతోను తీవ్రమయిన సంప్రదింపులు జరిపారు. ఆ సంప్రదింపులలో పాల్గొన్న నాటి సంఘ నాయకులు, అభిమానులు—

- శ్రీ కె. వి. స్వామి
- శ్రీ మదిని సోమునాయుడు
- శ్రీ కొరువాడ సుబ్రమణియం
- శ్రీ కె. ఆర్. రాజు
- శ్రీ పాలిసెట్టి సుబ్రమణియం
- శ్రీ నేతేటి దుర్గయ్య
- శ్రీ అల్లూరి కన్నయ్యనాయుడు
- శ్రీ తరిణి వరహాలు
- శ్రీ ఆడారి అప్పలనాయుడు
- శ్రీ తరణి సన్నిబాబు

పట్టు విడువని మన నాయకుల ప్రయత్నములు చివరికి జయము పొందినవి. దేశనాయకులు ఇతర భాషా పాఠశాలలవలె తెలుగు పాఠశాలలకు గూడా మాన్య మివ్వబడు నని వాక్రుచ్చారు. మాటలలో కాకుండా వ్రాతమూలంగా అ హామీ పత్రం కావలయునని, ఆ పత్రాన్ని పొంది రావలసిందిగా శ్రీ తరిణి వరహాలు గారిని నియమించారు. అతను 10 దినాల పాటు కౌలాలంపూరులోనే ఉండి, తీవ్రముగా కృషి చేశారు. చివరకు ఆ హామీ పత్రము మనకు లభించినది. తెలుగువిద్యపై ముసుగువేసిన కారుమబ్బులను పారద్రోలి, వాతావరణమును ప్రకాశవంతము చేయుటకు బలవత్తరమయిన ప్రయత్నాలు చేసి జయమును పొందిన నాటి నాయకుల, అభిమానుల కృషి, ప్రశంసనీయమయినది. పేర్కొనదగినది.

మాధ్యమిక పాఠశాలలందు చదివే విద్యార్థులు తమ మాతృభాషను గూడా ఒక పాఠముగా నేర్చుకొనే అవకాశమును ప్రభుత్వము ఒసంగినది. కాని ఈ అవకాశము మొదట తమిళ, చీనా భాషలకు మాత్రమే ఇవ్వబడినది. తెలుగుకు లేదు. ఇందువలన తెలుగు విద్యార్థులకు, ప్రాథమిక పాఠశాలలందు తాము నేర్చుకున్న తెలుగు భాషాజ్ఞానము ప అభివృద్ధి చేసుకొనే అవకాశములేకుండా పోయినది. తెలుగు విద్యార్థులకు ఏర్పడుతున్న తీరని ఈ నష్టాన్ని గాంచి, సంఘము ప్రభుత్వముతో పలు తడవలు చర్చలు జరిపి చివరకు జయము పొందినది. 1957లోనే సుంగై సుమున్, టెలుక్కాన్సన్, సబాక్ బెర్నం మొదలగు ప్రాంతాలలో గల మాధ్యమిక ఆంగ్ల పాఠశాలలందు తెలుగు ఒక పాఠముగా బోధించబడినవి ఈనాడు కెడా, పేరా రాజ్యములందు గల కొన్ని మాధ్యమికపాఠశాలలందును, జోహర్, నగిరిసెంబిలాన్ రాజ్యములోగల ఐదు తమిళ ప్రాథమిక పాఠశాలలందును తెలుగు పిల్లలకు తెలుగు ఒక పాఠముగా బోధించబడుచున్నది.

మాధ్యమిక పాఠశాలలందు తెలుగును అభ్యసించుచున్న తెలుగు విద్యార్థుల జ్ఞానము వృథాపోకూడదన్న అభిప్రాయముతో సంఘ నాయకులు 1958 నుండి L. C. E[8] పరీక్షలో తెలుగుకు కూడా స్థానమివ్వవలయునని ప్రభుత్వాన్ని కోరుతూ వచ్చినది. విద్యామంత్రితో పలుతడవలు సంప్రదింపులు జరిపారు.

మొదటి ప్రపంచ తమిళ మహాసభలు 1966లో ఏప్రిల్ నెలలో కౌలాలంపూరులో జరిగినవి. ఆ మహాసభల సందర్భముగా 16-4-1966నాడు ఏర్పాటు చేయబడిన తమిళ పురావస్తు ప్రదర్శనలకు ప్రారంభోత్సవముచేస్తూ, అప్పటి విద్యామంత్రి ఇంచే మహమ్మదు ఖైర్ జోహారిగారు "మలేసియా అభివృద్ధికి తెలుగువారు కూడా ఎంతో దోహదము చేశారనియు, తమిళముతో బాటు తెలుగు కూడా ఒక శ్రేష్ఠమయిన భాషయనియు పొగిడి, 1968వ సంవత్సరము నుండి L. C. E., S. R. P.[9] పరీక్షలందు తెలుగు ఒక పాఠముగా ప్రవేశపెట్టబడనున్నదన్న మధురమయిన వార్తను వెలిబుచ్చారు. 1968వ సంవత్సరము నుండి పై పరీక్షలందు తెలుగు ఒక పాఠముగా ప్రవేశపెట్టబడినది.

---

8. Lower Certificate of Examination.
9. S. R. P. Sijil Rendah Pelajaran

M. C. E[10] S. P. M[11] H. S. C[12] SPT[13] పరీక్షలలో గూడా తెలుగుకు స్థానము కల్పించవలయునని సంఘము ప్రయత్నాలు చేసినది. ఆ మధ్య కొంతకాలము MCE,SPM పరీక్షలలో తెలుగును ఒక పాఠముగా తీసికొనగోరే విద్యార్థులకు Indian-Schools Certificate పరీక్ష తయారించబడు తెలుగు పరీక్షాపత్రమును యిచ్చారు: ఈ పరీక్షాపత్రము ఇండియాలో ఉన్నవారి కొరకు తయారించబడినందున మలేసియా తెలుగు విద్యార్థులు కృతకృత్యులగుటరో చాల శ్రమపడవలసి వచ్చినది. అందువలన మలేసియా విద్యార్థులకని ప్రత్యేకముగా ఇచ్చటి తెలుగు భాషా ప్రమాణమును అనుసరించి తమిళ, చీనా పరీక్షా పత్రముల రీతిలో తెలుగు పరీక్షాపత్రములను తయారించవలయునని ప్రభుత్వముతో సంఘము సంప్రదింపులు జరిపినది. కాని, ప్రస్తుతము S.R.P. పరీక్షలో తెలుగు పాఠమును తీసికొను విద్యార్థుల సంఖ్యయే అంత సంతృప్తికరముగా లేనందువలన SPM తెలుగు పరీక్షా పత్రమును కోరు ప్రయత్నము వదలుకోబడినది.

ఆంధ్ర సంతతికి చెందిన మలేసియా విద్యార్థులకు ఉచిత విద్యావేతనములు ఇమ్మని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వముతో మన సంఘము 1957 నుండే సంప్రదింపులు జరిపినది. దాని ఫలితముగా 1959 నుండి ప్రతియేడు ఇరువురు మలేసియా తెలుగువారు ఆంధ్రలో ఉన్నత విద్యలు అభ్యసించుటకయిన ఉచిత విద్యావేతనములు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ఒసంగినది. ఈ ఉచిత విద్యా వేతనములు 1968 వరకు కొనసాగినవి. ఆ తరువాత కొన్ని కారణాంతరములవలన అవి ఆగిపోయినవి.

1975లో మొదటి ప్రపంచ తెలుగు మహాసభలు ఆంధ్రలో జరిగిన అనంతరము, విదేశాలలోగల తెలుగు విద్యార్థులు దంతవైద్యము, పశువైద్యము, ఇంజనీరింగ్, వ్యవసాయము మొదలగువానిలో ఉన్నత విద్యలు అభ్యసించుటకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము సీట్లను కేటాయించినది. మలేసియా తెలుగువారికి గూడా వాటిలో కొన్నిసీట్లు అడపాదడపా కేటాయించబడుటచే, ప్రస్తుతము కొందఱు విద్యార్థులు ఆంధ్రలో విద్య నభ్యసించుచున్నారు.

1970లో 25 తెలుగు ప్రాథమిక పాఠశాలలు ఉండెడివి. కాని ఈనాడు అవి 14 పాఠశాలలుగా తగ్గిపోయినవి. (చూడు పట్టిక - 22వ పుట)

తెలుగు పాఠశాలలు రానురాను దిగజారిపోవుటకు పలు కారణములను చెప్పవచ్చును. ఆర్థిక, సామాజిక సాంఘిక రంగాలలో దేశము అభివృద్ధి చెందుకొలది తెలుగువారు గ్రామాలను పేటలను వదలి నగరాలకూ, ఇతర ప్రాంతాలకూ వలసలు పోవడం ఆరంభించారు. ఈ వలసలు తెలుగువారి ఆర్థికాభివృద్ధికి స్వతంత్ర జీవిత విధానానికి మెరుగులు దిద్దాయి. కాని, ఈ వలసల వలన తెలుగు భాషా సంస్కృతుల అభివృద్ధికి దెబ్బ తగిలినది.

ఒక ప్రాంతములో గల తెలుగువారు ఇతర ప్రాంతాలకు వలసలు పోవుటచే అచ్చట గల పాఠశాలలోని తెలుగు పిల్లల సంఖ్య తగ్గిపోయి, ఆ బడి మూయవలసిన పరిస్థితికి గురియగుచు వచ్చినది. 1969 లో జాతికలవరములు జరిగినపుడు ప్రభుత్వము పని అనుమతి చీట్ల[14] చట్టమును ప్రవేశపెట్టినది. పౌరులు కానివారు ఎటువంటి పని చేయవలయునన్నను ఈ పని అనుమతి చీట్లను పొందవలసి వచ్చినది. భారతదేశముపై ఆశలు పెట్టుకొనిన తెలుగువారు సంఘ బోధనలను పెడచెవిన బెట్టి, దేశ పౌరసత్వమును పొందక, తమ ఆస్తులను ఇండియాకు తరలిస్తూ వచ్చారు. అటువంటివారు ఈ సందర్భమున పలు ఇక్కట్లకు గురి కావలసి వచ్చినది, నిరుద్యోగులయిరి: ఈ పరిస్థితికి భయపడి 1970 లో కొన్ని వేల కుటుంబాలు ఇండియాకు వెళ్లిపోయినవి. వాటిలో కొన్ని వందలయినా

10. M. C. E - Malaysian Certificate of Examination.
11. S P. M-Sijil Pelajaran Malaysia.
12. H. S. C-Higher School Certificate.
13. SPT-Sijil Pelajaran Tinggi.
14. Work Permits

## తెలుగు పాఠశాలల పట్టిక

| అంకె | రాజ్యము | పాఠశాల | |
|---|---|---|---|
| 1 | పేరాక్ | దే. మా. ప్రా (తమిళ/తెలుగు) పాఠశాల, | మెలంటాంగ్ |
| 2 | ,, | ,, ,, | స్ట్రాత్‌మాషి |
| 3 | ,, | ,, ,, | బాగన్‌డత్తో |
| 4 | ,, | ,, ,, | బాగన్‌పాసిర్ |
| 5 | ,, | ,, ,, | కోలాబెర్నం |
| 6 | ,, | ,, ,, | టెలుక్‌బూలో |
| 7 | ,, | ,, ,, | జెండరాటII |
| 8 | ,, | ,, ,, | కాయాన్ |
| 9 | ,, | ,, ,, | కోటబారు |
| 10 | సిలాంగూర్ | ,, ,, | టోర్కింటన్ |
| 11 | ,, | ,, ,, | చంకట్‌ఆసా |
| 12 | ,, | ,, ,, | రవాంగ్ |
| 13 | కెడా | ,, ,, | పెలాం |
| 14 | నగిరి సెంబిలాన్ | ,, ,, | లాడాంగ్ గిడ్డీన్ |

తెలుగు కుటుంబాలు గలవు. ఇట్లు ఉన్న తోటలను వదలి కొన్ని కుటుంబాలు తరలిపోగా కొన్ని తెలుగు బడు లాసమయమున మూతబడినవి.

వీటికి తోడు తెలుగు పాఠ్యగ్రంథాల కొఱత, శిక్షణ పొందిన ఉపాధ్యాయుల కొఱత తెలుగు బడులకు ఎక్కువగా నున్న కారణము చేతను, ఇతర భాషా పాఠశాలలకు గల వసతులు మన తెలుగు పాఠశాలలకు లేనందువలనను తెలుగు బడులలో పిల్లల సంఖ్య తగ్గుచూ వస్తున్నది. చిన్న చిన్న పాఠశాలలను ఉమ్మడి పాఠశాలలుగా[15] మార్చే ప్రభుత్వ ప్రణాళిక క్రింద బాగన్‌డత్తో ప్రాంతముల గల 7 పాఠశాలలు ఇరు పాఠశాలలుగా మార్చబడినవి. ఇందువలన ఈ నాడు దేశములో 14 తెలుగు పాఠశాలలే మిగిలినవి. వాటిలో కొన్ని పాఠశాలలందు విద్యార్థుల సంఖ్య తగ్గు ముఖం పట్టుచున్నందువలన భవిష్యత్తులో తెలుగు పాఠ శాలలు ఈ దేశములో నిలదొక్కుకొనగలవా అన్న సందేహం గలుగుచున్నది.

### సంఘ ఆస్తులు

సంఘ భవిష్యత్తును మదిలో తలంచి, దూరదృష్టి గల సంఘ నాయకులు 1961 లో సింపాంగ్ అంపాట్ ప్రాంతములోగల పూర్వపు మెలంటాంగ్ రబ్బరు ఎస్టేటు అమ్మకమునకు రాగా 15 ఎకరముల రబ్బరు తోటను ఎకరము $ 1200లు చొప్పున $ 18,000లకు కొన్నారు. దివి 7-4-1961 నాడు ఆ భూమి మనకు అప్పగించ బడినది. ఈనాడు ఆ భూమి ద్వారా మనకు రాబడిలేక పోయినప్పటికి కొన్ని లక్షల విలువగల భూమిగా అది మారిపోయినది. ఆ భూమిలో 2½ ఎకరముల భూమి తగాదాలో ఉన్నప్పటికి తెలుగుతల్లి కృపచే మనం జయం పొందగలమన్న నమ్మకముతో నున్నాను.

ఆ భూమిలో ఇండ్లు కట్టి, సభ్యులకు అమ్మి, అచ్చట ఒక తెలుగువారి సెటిల్‌మెంటును ఏర్పరచా లన్న అభిప్రాయము సంఘ నాయకులకు గలదు. అందులకును గాను ఏర్పాట్లు చేస్తూ ప్రముఖులతో సంప్రదింపులు జరుపుచున్నారు.

15. Group Schools.

సంఘానికి ఒక భవనము అవసరమని భావించి 1964 లో జరిగిన ప్రతినిధుల మహాసభలో భవన విరాళనిధిని ఆరంభించారు. ఎందరో ధారాళముగా విరాళములను ఒసంగారు. కాని, తగినంత డబ్బు లభించని కారణముచే ఆ మహత్తర కార్యము అట్లే వదలి వేయబడినది. తిరిగి ఆ కార్యమును జయప్రదము చేయుటకు 1978లో శ్రీయుతులు డా॥ సి. అప్పారావు మదినిని సోమునాయుడు, ఆర్.పి. రాములు, ఎ.ఎస్. కృష్ణమూర్తి, బి. ఏ. నాయుడు, డి. వి. శ్రీరాములు, ఎ. అప్పారావు మొదలగువారుగల ఒక ఉపనిర్వాహము ఏర్పరచబడింది. కౌలాలంపూరులో 4 1/2 అంతస్తులు గల ఒక భవనాన్ని కొనుటకు పూనుకొని జయము పొందినది. దివి. 5.5.1978లో దాదాపు 7149 చదరపు అడుగుల వైశాల్యముగల ఆ భవనాన్ని $ 3,34,800-00 లకు సంఘముకొన్నది. పలువురి విరాళములు అందుకొని, 31-12-1979 నాటికి $ 107,797-50 లను చెల్లించియున్నాము. మిగిలిన డబ్బును అప్పుగా యిమ్మని బేంక్ భూమిపుత్రాకు అర్జీపెట్టుకొంటిమి. ప్రస్తుతము ఇంకను నిర్మాణములో ఉన్న ఆ భవనం విలువ అది కట్టిముగించునాటికి 6 లక్షల రింగిట్లు అగునని అంచనా వేయబడుచున్నది. ఆ భవనమును కొనుటలోను, డబ్బును వసూలించి చెల్లించుటలోను అనేక విధాలుగా ఎక్కువ కృషి చేసిన వారు శ్రీయుతులు ఏ. ఎస్. కృష్ణమూర్తి, ఏ. అప్పారావు, బీసెట్టి నూకయ్యగార్లు అగుదురు. విరాళములు చెల్లించిన, చెల్లించుచున్న దాతలకు ఆ పూచీ తీసుకున్న శాఖల నిర్వాహకులకు అత్యవసరవేళలలో అప్పులిచ్చిసాయపడిన అభిమానులకు ఈ సందర్భమున ధన్యవాదములు అర్పించనిచో మనం కృతజ్ఞతలను మరచిన వారమగుదుము. వారందరి తెలుగుఅభిమానమే ఆంధ్రభవన రూపకల్పన అన్నది ఎవరూ కాదన లేరు; లేదనలేరు.

దాత శ్రీరంగస్వామి పిళ్ళైగారిచే మన సంఘభవనానికై తెలుక్కాన్సను నగరం దాపల దాదాపు 1/4 ఎకరము గల లాటు ఒకటి 1963లో ఇవ్వబడినది. ఐదుగురికి సొంతముగా గల మొత్తం గ్రాంటును విడివిడి పట్టాలకయి ప్రభుత్వానికి ధరఖాస్తు పెట్టబడినది. ఇందులో ఒక మోస్తరు భవనము, జంట ఇళ్ళలోని ఒక ఇల్లు కట్టుటకయిన 2 పట్టాలు సంఘానికి లభించనున్నవి.

మలేసియా ఆంధ్ర సంఘ శాఖలలో మొట్టమొదటి సారిగా ఒక భవనాన్ని కొన్న ఘనత సిలంగూర్ శాఖకు చెందుచున్నది. ఒక పెద్ద భవనములోని ఒక ప్లాటు (FLAT)ను దాదాపు 60 వేల రింగిట్లకు కొని, 30 శాతముల డబ్బును చెల్లించి, దివి 1-12-80న ఆ భవన తాళపు చెవిని పొంది, ఇతర శాఖలకు మార్గదర్శి యయినది.

కొందరు శాఖయువకుల ప్రోత్సాహ, ధార్మిక బలముతో ఆంధ్రులఆరాధ్యదైవమయిన శ్రీ వేంకటేశ్వర స్వామి ఆలయ నిర్మాణము, సభావేదిక, గ్రంథాలయములను నిర్మించే మహత్తర కార్యము దిగువుపేరా శాఖ ప్రాంతములో గల సుంగైసుమున్‌లో కార్యరూపమును పొందుచున్నది. శ్రీ ఎల్లపు నూకునాయుడుగారి అధ్వర్యము క్రింద రూపకల్పన జరుగుచున్న ఈ ఆలయము మలేసియాలోనే తెలుగువారికి సొంతమయిన మొదటి ఆలయము అంటే అది సత్యదూరము కాదు.

మలేసియా ఆంధ్ర సంఘ శాఖలలో మొట్టమొదట ఒక సహకార సంఘాన్ని ప్రారంభించి, తెలుగువారి అభివృద్ధికి పాటుపడుచున్న శాఖ నెగ్రి సెంబిలాన్ శాఖ. ఈ శాఖ బహావ్ సహకార సంఘాన్ని స్థాపించి, చక్కగా జరుపుతూ, లక్షన్నరకి పైబడిన విలువగల ఒక భవనాన్ని కొని, డబ్బును చెల్లించి, 1980లో భవనపు తాళపుచెవిని పొందినది. శాఖను, సహకార సంఘాన్ని దీర్ఘకాలముగా నడిపిస్తూ వస్తున్న శ్రీ పి. యస్. రామునాయుడుగారు సడలనిదక్షతతో పై రెండు సంఘాలను నిర్వహిస్తూ వస్తున్నారు. ఆ భవనములో వ్యాపారము చేయుటకు సన్నాహాలు చేయుచున్నట్లు తెలియుచున్నది.

సంఘ ఆస్తిపోషకులుగా మొదట శ్రీయుతులు ఆడారి అప్పలనాయుడు, ఆడారి గంగునాయుడు, కె. ఆర్. రాజుగార్లు ఉండేవారు: తరువాత 1965 నుండి

శ్రీయుతులు ఆదారి అప్పలనాయుడు, పోతల మారయ్య, అల్లూరి కన్నయ్యా నాయుడుగార్లు వ్యవహరించారు. కొంతకాలమునకు తరువాత శ్రీ అల్లూరి కన్నయ్య నాయుడుగారు ఇండియా వెళ్ళిపోగా ఆ స్థానములో శ్రీ మండే లక్షణగారు నియమించబడ్డారు. ప్రస్తుతము సంఘ ఆస్తిపోషకులుగా శ్రీయుతులు ఆదారి అప్పల నాయుడు, మండే లక్ష్మణ, కె.ఆర్. రాజుగార్లు ఉంటూ ఉన్నారు.

## సంఘ గుమాస్తాలు

సంఘము తొలిరోజుల్లో అనగా 1-3-1957 నుండి సంఘ గుమాస్తాగా శ్రీ రత్నంగారు నియమించబడ్డారు. అతను సంఘ కార్యాలయము బాగన్ పాసిర్ గ్రామములో యున్నంతవఱకును సంఘ గుమాస్తాగా ఉండి సేవ చేశారు.

సంఘ నిర్వాహకులందరు ప్రభుత్వ, ప్రైవేటు రంగములందు ఉద్యోగులయిన కారణముచే సంఘమును గురించి ఎక్కువగా ప్రచారము చేయుటకు వీలులేకుండా ఉండెడిది. పాఠశాలల సెలవుదినాలలో మాత్రమే ఉపాధ్యాయ వృత్తిలో ఉండే నిర్వాహకులు మలాయా అంతటా పర్యటించి, సంఘమును గురించి ప్రచారము చేస్తూ, సభ్యులను చేర్చుతూ వచ్చెడివారు. అందువలన సంఘానికి నిరంతరం ఒక ప్రచారకుడు కావలసివచ్చి, తెలుగు అభిమాని యయిన శ్రీకొరువాడ సుబ్రహ్మణ్యం గారిని ప్రచారకులుగా దివి 1-4-1958 నుండి నియమించారు. సంఘాభివృద్ధికి పాటుపడి, తెలుగు జాతికి సేవచేయాలన్న ఆశతో తన నిరంతర ఉద్యోగమును గూడా త్రోసిపుచ్చి, మన సంఘ ప్రచారకులుగాను, గుమాస్తాగాను యుండి, మలేసియా అంతటా తిరిగి సేవచేసిన వారుసోదరుడు కొరువాడ సుబ్రహ్మణ్యంగారు. తన జీవితములో చాలవరకు తెలుగు సంస్కృతి అభివృద్ధికి పాటుపడిన శ్రీ కొరువాడ సుబ్రహ్మణ్యంగారు గుండెపోటు జబ్బుచే దివి 1-2-1977 నాడు అకాల మరణము పాలయారు.

సంఘ కార్యాలయము బాగన్ పాసిర్ నుండి దివి, 16-7-1958 నాడు బాగన్ డత్తోకు మార్చబడినది. అందువలన ఆఫీసు పనులు చేయుటకు, శ్రీ కొరువాడ సుబ్రహ్మణ్యంగారికి సహాయకులుగా ఉండుటకు శ్రీ మురిపిండి వీరునాయుడుగారు (Part time) నియమించబడ్డారు. దివి 15-4-1960 లో శ్రీ కొరువాడ సుబ్రహ్మణ్యంగారు ఉద్యోగము నుండి రాజీనామా చేయగా, అతనితోబాటే శ్రీ వీరునాయుడు గారుకు పనినుండి ఆగిపోయారు.

దాదాపు 6నెలలు పాటు శ్రీయుతులు కర్రి అచ్యుతరామయ్య, పట్నాల అప్పన్నగార్లు గౌరవార్థముగాను, స్వల్పవేతనమునకుగాను పనిచేసి, సంఘానికి అమూల్య సేవను అందించారు. 1960 నవంబరు నుండి దివి 30-11-1962 వరకు ఇరు సంవత్సరముల పాటు శ్రీ గుంటపల్లి రామునాయుడుగారు సంఘ గుమాస్తాగాను, ప్రచారకులుగాను పనిచేశారు. ఆ తరువాత మెలంటాంగ్ తోటలో ఉపాధ్యాయులుగా ఉండిన శ్రీకాశీన రమణయ్యగారు 1964 వరకు సంఘ గుమాస్తాగా (Part-time) పనిచేసి, ఎనలేని సేవచేశారు.

1965 వ సంవత్సర ఆరంభము నుండి శ్రీ బీసెట్టి నూకయ్య గారును, 1966 నవంబరునుండి శ్రీమండ్ల సుబ్రమణ్యంగారును సంఘ గుమాస్తాలుగా పని చేశారు. 15-1-1968 నాడు మణియంగారు తనపని రాజీనామా చేయగా, దివి 1-2-1968నుండి శ్రీ బీసెట్టి నూకయ్యగారు కొంతకాలంపాటు తిరిగి ఆపనిని చేశారు. శ్రీ నూకయ్యగారు ఉద్యోగ విషయమయి కౌలాలంపూరుకు వెళ్ళిపోగా, అప్పటినుండి మొన్నమొన్నటి వరకు శ్రీ కాశీన రమణయ్యగారే (Part-time) సంఘ ఆఫీసు పనులు గమనిస్తూ వచ్చారు. అతనికి సాయముగా శ్రీ తరిణి సన్నిబాబుగారును, ఇంకను పలువురు అభిమానంగల తెలుగు యువకులును అప్పుడప్పుడు ఉచితముగా సాయపడుతూ సంఘ లిఖిత పత్రికలు, కరపత్రములు వెలువరించుటకు ఇతోధికంగా ఎనలేని సేవను చేశారు. తెలుగులో చక్కగా రచనలు చేయగల శ్రీ కాశీన రమణయ్యగారు ఓర్పు, సహనముతో సంఘ మిచ్చే స్వల్పవేతనమునే మహాభాగ్యముగా తలంచి, దీర్ఘకాలం సంఘానికి సేవ చేశారు. రచనా రంగంతో ఎంతోసాధన చేసిన ఆయన వ్యాసములు,

గేయములు, పాటలు స్థానికంగా వెలువడిన పలు పత్రిక లందు వెలువడిన విషయము పాఠకులకు విదితమే అగును.

తెలుగు సినిమాలు

మానవుడు వ్యక్తిగతముగా బోధించ కష్టసాధ్య మయిన వాటిని రేడియో, సినిమా, టెలివిషన్ వంటి ఆకర్షణీయమయిన ఆధునిక పరికరముల ద్వారా అవ లీలగా బోధించగలుగు చున్నాడు. భాషా సంస్కృతుల అభివృద్ధికి ఈ పరికరములు ఎంతయినా తోడ్పడగలవు.

నిజానికి 30 సంవత్సరములనాడు తెలుగు సిని మాలే ఈ దేశములో విరివిగా ప్రదర్శింపబడినట్లు తెలియుచున్నది. ఆనాడు మళ్ళీపెళ్ళి, గొల్లభామ, బాల నాగమ్మ, జీవితం వంటి పలు తెలుగు సినిమాలు రోజుల తరబడి ఒకచోట ప్రదర్శింపబడినవట.

మలాయా ఆంధ్ర సంఘము ఏర్పడిన తరువాత తెలుగువారిలో కలిగిన ఉత్సాహమును చూచిన కొన్ని సినీపంపిణీ సంస్థలు శాంతి, స్వర్గసీమ, అనార్కలి, వదినెగారి గాజులు, సారంగధర మొదలగు సినిమాలను తెప్పించి ప్రదర్శించారు. కాని, అప్పటికే తెలుగువారిలో తమిళ సినిమాలపై మోజు విపరీతముగా పెరిగిపోయి నందున, తెప్పించబడిన తెలుగుసినిమాలు పాతసినిమా లయినందువలనను తగు ఆదరణ ప్రజలనుండి లభించక తెలుగుసినిమాలు రావడం ఆగిపోయినవి.

1964లో మలేసియాలోని భారత రాయబారి నమ్మినబంటు అను సినిమాను సంఘంకోరిక మేఱకు తెప్పించి యిచ్చారు. తెలుగు సినిమాలు ప్రదర్శింప బడినపుడు ఒక విధమయిన ఉత్తేజము, ఉత్సాహము, అభిమానము తెలుగువారిలో కలిగేడిది. తెలుగు తనానికి కొంతకొంతగా దూరమవుతున్న తెలుగువారికి ముఖ్యంగా యువతరానికి తెలుగు సినిమాల ద్వారా తెలుగు భాషపై అభిమానము కల్పించాలన్న పట్టు దలతో సంఘము, అభిమానము గల తెలుగువారు ఒక చైనీస్ సినీపంపిణీదారుని ప్రోత్సహించగా, అతడు సుఖదుఃఖాలు, సంగీతలక్ష్మి, దేశద్రోహులు, అసా ధ్యుడు, శ్రీ శ్రీ శ్రీ మర్యాదరామన్న, సత్యమే జయం, గొప్పవారి గోత్రాలు అను ఏడు తెలుగు సినిమాలను తెప్పించి ప్రదర్శించాడు. సుఖదుఃఖాలు, అసాధ్యుడు వంటి సినిమాలు ప్రజలను ఆకట్టుకొన్నప్పటికి వ్యాపార రీత్యా లాభదాయకం కాని తెలుగు సినిమాలను తెప్పిం చడం అతడుకూడ మానుకున్నాడు.

1974 లో తెలుగు యువకులచే ప్రారంభించబడిన శ్రీ లక్ష్మీఫిలిమ్స్ అను సంస్థ సంవత్సరమునకు ఒక సినిమా చొప్పున వరుసగా తాత మనవడు, జగత్ కిలాడీలు, శాంతినిలయం, మమత, మీనా, సిరిసిరి మువ్వ అను ఆరు సినిమాలను తెప్పించి విడుదల చేశారు. 1978లో శ్రీరామా ఫిలిమ్స్ ఆవిర్భవించినది. వారు వరుసగా ఆత్మీయుడు, బొమ్మరిల్లు, విచిత్ర జీవితం, విజయ, లక్ష్మణరేఖ మొదలగు సినిమాలను తెప్పించి ప్రదర్శించారు.

1980లో మహలక్ష్మి ఎంటర్ ప్రైజెస్, రాంఎంటర్ ప్రైసస్ అను తెలుగువారికి సొంతమయిన సంస్థలు గూడా తెలుగుసినిమాలను తెప్పించుటకు పూనుకున్నవి. మహలక్ష్మి ఎంటర్‌ప్రైసస్‌వారు ఓ సీతకథ, శీలానికి శిక్ష, మనుష్యులంతా ఒక్కటే అను చిత్రాలను, రాం ఎంటర్ ప్రైసస్ వారు రావణుడే రాముడయితే అను సినిమాను వెలువడించారు.

మలేసియా తెలుగు సినీచరిత్రలో 1979వ సంవ త్సరము ఒక మైలురాయి అని చెప్పవచ్చును. అంతకు మునుపు సంవత్సరానికి ఒకటి, రెండు తెలుగు సిని మాలు మాత్రము విడుదలవగా 1979లో మాత్రము 5 సినిమాలు విడుదల చేయబడ్డాయి. అవి శ్రీరామా ఫిలిమ్స్ వారి బొమ్మరిల్లు, విచిత్రజీవితం, శ్రీ లక్ష్మి ఫిలిమ్స్‌వారి మీనా, మలేసియా ఆంధ్ర సంఘము వారి పండంటి కాపురము, సినిమావైభవము అగును.

'పండంటికాపురం' అను పంచరంగుల తెలుగుసినిమా లండను ఆంధ్రసంఘమువారు మనకు బహూకరించారు. అదేవిధముగా రేఖా మరియు మురళి పిక్చర్స్‌వారికి సొంతమైన సినిమా వైభవమును ఇండియాలోని లక్ష్మి ఫిలిమ్స్‌వారు అంతర్జాతీయ తెలుగుసంస్థద్వారా మనకు బహూకరించారు. అందులకు మనము పై సంస్థలకు కృతజ్ఞతలను అందజేసుకొనుచున్నాము.

1978లో భారతరాయబారి కార్యాలయమువారిచే జరపబడిన ఇండియన్ చలన చిత్రోత్సవములో ఊరుమ్మడి బ్రతుకులు అను సినిమా ప్రదర్శింపబడినది. 1979లో కెలాబ్ సినీ ఫిలిం అను సంస్థ 'ఒక ఊరి కథ' అను సినిమాను తెప్పించి తన సభ్యులకు ప్రదర్శించినది. 1980లో మొత్తం 6 తెలుగు సిని విడుదల చేయబడ్డాయి. ఈ యేడే వీడియో కాసె రికార్డు చేయబడిన 'పాడిపంటలు', 'పంచాయతి' తెలుగు సినిమాలు గూడా విడుదల చేయబడ్డాయి.

ఇంతవరకు విడుదల చేయబడిన మొత్తం సినిమాల పట్టిక

| కాలము | సం॥ర | విడదల చేయబడిన సినిమాలు | ప్రత్యేక ప్రదర్శనలు/ విడియో కాసెట్లు | మొత్తం సినిమాలు |
|---|---|---|---|---|
| 1946-1955 | 10 | 4 | - | 4 |
| 1956-1965 | 10 | 6 | - | 6 |
| 1966-1975 | 10 | 9 | - | 9 |
| 1976-1977 | 2 | 2 | - | 2 |
| 1978 | 1 | 3 | 1 | 3 |
| 1979 | 1 | 5 | 1 | 6 |
| 1980 | 1 | 6 | 2 | 8 |
| మొత్తము | 35 | 34 | 4 | 38 |

1981లో విడుదలకు తయారుగా ఉన్న సినిమాలు మహాలక్ష్మి ఎంటర్ ప్రైసెస్ - మనుష్యులంతా ఒకటే, చిల్లరకొట్టు చిట్టెమ్మ రాం ఎంటర్ ప్రైసెస్ - గోరంత దీపం, భారతంలో అమ్మాయి శ్రీరామాఫిలిమ్స్ - దేవుడు చేసిన మనుష్యులు.

మరో చరిత్ర, శంకరాభరణం వంటి మహత్తర విజయమును సాధించిన సినిమాల విడుదలను గురించిన విరివయిన ప్రకటనలు స్థానిక దినపత్రికలందు చేస్తున్నారుగాని, అవి ఎంత వరకు నిజము అన్నది ఆ దేవునికే ఎఱుక.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వము సంఘానికి బహూకరించిన 'ఆంధ్ర ప్రదేశ్' అను డాక్యుమెంటరీ, అంతర్జాతీయ తెలుగు సంస్థవారు బహూకరించిన 'తెలుగు తల్లి' అను మొదటి ప్రపంచ తెలుగు మహాసభల వార్తా చిత్రం, శ్రీ మేజరు సత్యనారాయణగారు బహూకరించిన కుమారి ఉమాభారతి కూచిపూడి నాట్య చిత్రము మొదలగునవి గూడా గత సంవత్సరాలలో విడుదల చేయబడ్డాయి.

ఈనాడు మలేసియాలో తెలుగు సినిమాల వయిన ప్రదర్శనలకు ప్రత్యాక్షంగానో, పరోక్షంగా మూలాధారమయినది మలేసియా ఆంధ్ర సంఘ అంటే ఎవరూ కాదనలేరు. ముందు ముందు ధ ళంగా తెలుగు సినిమాలే దేశంలో విడుదల అవగల ప్రజల ఆదరణ అధికమై, తద్వారా తెలుగు భా భివృద్ధికి దోహదం అవగలదని ఆశిద్దాము.

## రేడియో, టెలివిజనులలో తెలుగు కార్యక్రమములు

సంఘపు తొలిరోజుల్లో దినానికి 15 నిమిషమ చొప్పున వారానికి ఇరుదినాలు తెలుగు పాటలను రేడి మలాయా కేంద్రము వారు ప్రసారము చేసెడివా దివి 14-10-1956 నాడు జరిగిన సంఘ ప్రథ సాలుసరి సమావేశములో రేడియోలో తెలుగు కా క్రమముల సమయమును అధికరించమని కోరాల తీర్మానము చేయబడినది. పర్యవసానంగా 15 నిమి ముల కాలమును అధికరించి, వారానికి 3 దినా తెలుగు పాటలను ప్రసారము చేశారు. 1959 ల

ుషముల కాలము 75 నిమిషములుగా
ునాడు ప్రతిరోజు 30 నిమిషములు
సాయం సమయవేళలందు తెలుగు
మలేసియా ద్వారా వినవచ్చును.
త్యేక కార్యక్రమములను ప్రసారము
ుపు కోరిక మేఱకు మొదటి సారిగా
ఉగాదిపండుగను పురస్కరించుకొని,
క తెలుగు కార్యక్రమములను ప్రసా

పూరు గూడా రోజూ అర గంట
పాటలను ప్రసారము చేయుచున్నది.
త్యేక కార్యక్రమములను పై రెండు
ము చేస్తూ, తెలుగువారిని ఆనంద
టెలివిజన్ మలేసియాలో గూడా
ువ్వాలని మనం పలు సంవత్సరము
వచ్చాము. కాని, మన ఆ కోరిక
ి నెఱవేరలేదు. అప్పుడప్పుడు ఒకటి
ాటలను టెలివిజనులో వినగలుగుచు

1975 నాడు అప్పుడే క్రొత్తగా
హత్యులయిన గౌరవ డత్తో అమార్
ు గారిని, అప్పటి సంఘ ప్రధాన
ుసుకొని మన కోరికలను అతనికి
. విశ్వదర్శినికార్యక్రమములో తెలుగు
ని, నలనామ సంవత్సర తెలుగు
రచిత్రమును ప్రర్శించమనీ కోరినది.
న కోరికలను పరిశీలించిన ఆ దయా
ఉగాదికి ఒక తెలుగు సినిమాను
ుచే అవకాశాన్ని కలిగించారు. అతని
తొలిసారిగా 'తాతమనవడు' అను
ంచారు. ప్రపంచములోనే మొదటి
ు సినిమాను టెలివిజనులో ప్రదర్శిం
మలేసియాకు దక్కినది.

దర్శింపబడిన తెలుగు సినిమాల

'తాత-మనవడు'

1977లో దేశ ద్రోహులు
1978లో జగత్ కిలాడీలు
1979లో శాంతి నిలయము
1980లో పండంటి కాపురం (కలర్)

సంవత్సరానికి ఒక సినిమా అను నిబంధనను సడలించి, కనీసం 3 తెలుగు సినిమాలయినా టి. వి. లో ప్రదర్శించాలని సంఘము సంప్రదింపులు జరుపుచున్నది. మన ప్రయత్నాలు ఫలిస్తాయని ఆశిద్దాము.

అల్ప సంఖ్యాకుల మయిన మన కోరికలను సయితం మన ప్రభుత్వము సానుభూతిలో పరిశీలించి నేరవేరుస్తున్న ఈ సందర్భములో ఆలిండియా విదేశీ ప్రసారాలలో తెలుగు భాషకు స్థానము కల్పించమని గత 25 సంవత్సరాలుగా బర్మా ఆంధ్రులతోపాటు భారత, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలకు మనము పెట్టుకున్న అర్జీలు అన్నియు చెవిటివాని చెవిలో శంఖూదినట్లు అయినదని ఇచ్చట గుర్తించుకోవలసియున్నది.

భారతావనిలోనే రెండవ స్థానమును వహిస్తున్న తెలుగువారి మాతృభాషకు లభించని స్థానము తెలుగు వారి కంటె స్వల్ప సంఖ్యాకులయిన తమిళులకు, గుజరాతీలకు, చివరకు అల్ప సంఖ్యాకులయిన రొంకణీలకు కూడా లభించినందంటే మన తెలుగు భాషకు ఇండియాలో గల స్థానము చెప్పకుండానే మనకు అర్థమవుతుంది గదా !

తెలుగు పండుగలు, సభలు

మన తెలుగువారిలో అధిక సంఖ్యాకులు హిందూ మతానికి చెందినవారు, స్వల్ప సంఖ్యలో క్రైస్తవులు, ముస్లిములు గలరు. మత సంబంధమయిన దీపావళి, సంక్రాంతి, క్రిస్మస్, హరిరామా ప్రవాసా మొదలగు పండుగలను ఆయా మతాలకు చెందిన తెలుగువారు కొనియాడుతూ వస్తున్నారు. పరిస్థితుల ప్రభావాలకు గురియయిన తెలుగువారు కొందఱు తమ కని కొన్ని ప్రత్యేక పండుగలు ఉన్న విషయాన్ని తలచుకోలేక, తమిళులు కొనియాడు పలు పండుగలను కొనియాడుతూ యున్నారు. తమిళ సంవత్సరాదిని కొనియాడే తెలుగువాడు కూడా లేకపోలేదు. వారు తమిళభాషా

ప్రాబల్యానికి ఎక్కువగా గురియయి తెలుగుతనానికి దూరమవుతున్న తెలుగువా రన్న మాట.

మలేసియా తెలుగువారి అతి ముఖ్యమయిన పండుగ 'ఉగాది' అనేబడే తెలుగు సంవత్సరాది. ఆంధ్ర సంఘం స్థాపించేవఱకు తెలుగు సంవత్సరాది అనే వొక్కటి యున్నదని ఎవరికీ తెలియదు. కాని, అదే దినమున గ్రామాలలో గల నిరక్షరాస్యులయిన తెలుగు వారు భూలోకమ్మ, నూకాలమ్మ అను గ్రామదేవతల పేరిట పండుగలను చేస్తూవచ్చారు. ఆంధ్ర సంఘము ఉగాది ఉత్సవముగా తెలుగువారి మధ్య ప్రాబల్యము చేసినది. మనకంటూ ఒక ప్రత్యేక పండుగ యున్న దన్న నిజాన్ని వెల్లడి చేసినది; ఈనాడు తెలుగు వారందరు ఉగాదిని కొనియాడుతూ యున్నారు. ఇతర పండుగలవలె ఉగాదికి గూడా శుభాకాంక్ష పత్రములను బంధుమిత్రాదులకు పంపించుకునే అలవాటును సంఘము తెలుగువారికి అలవర్చినది. ఉగాది అభినందన పత్రములు మొట్టమొదటి సారిగా జ్యోతిప్రెస్ వారిచే 1964లో ప్రచురింపబడ్డాయి. ఉగాదినాడు దేవాలయాలలో పూజలు జరిపి, భజనలు చేయు మంచి అలవాట్లను కొన్ని ప్రాంతాల తెలుగువారు అనుసరిస్తున్నారు. ప్రాంతాల వారీగాను, శాఖలవారీగాను పలు సాహిత్య, క్రీడా వినోదాలతో ఉగాదిని కొనియాడుచున్నారు.

సంఘ ప్రతినిధుల, సాలుసరి సమావేశాలు నలు మూలలా చెదరియున్న తెలుగువారిని ఒక వేదికపైకి తెచ్చి, ముఖాముఖీ మాట్లాడుకొనే అవకాశములను కల్పించుచున్నవి. అడపాదడపా శాఖలవారీగా జరుగు సభలు తెలుగువారిలో ఐక్యతకు స్నేహభావానికి దారి తీస్తున్నవి. దేశం నలుమూలలా నివసించు తెలుగువారు ఒకరితో ఒకరు పరిచయము చేసుకొనుటకు కేంద్ర ప్రతినిధుల మహాసభలు సహకరించుచున్నవి. బంధు మిత్రాదులు కలుసుకొని పరామర్శించుకొనుటకు ఇది ఒక శుభ సమయము.

తెలుగు అచ్చు

1960వ సంవత్సరమునకు ముందు ఇచ్చట తెలుగులో అచ్చు వేయుటకు ప్రచురణాలయములందు తెలుగు అచ్చులు ఉండేవికావు. సంఘముయొక్క చట్ట దిట్టముల పుస్తకములు, రసీదు పుస్తకములు అన్నియు ఇండియాలోనే ప్రచురించి తెప్పించుకొనేను. ఆ దినాలతో తెలుగువారు తమ పిల్లల వివాహ శుభకార్యములను ఇంటింటికి వెళ్లి వక్కలు, సున్నము పెట్టిన తాంబూలములు ఇచ్చి తెలియజేసెడివారు. ఆర్థికవసతులు గలవారు తెలుగు అచ్చులు లేనందున తమిళములోనే వివాహ ఆహ్వాన పత్రములు అచ్చొత్తించి నలుగురికి పంచిపెట్టేవారు, ఈ దుస్థితిని గాంచిన సంఘము ఒక క్రొత్త పద్ధతిని ప్రవేశపెట్టినది.

స్టెన్సిలుపై అందమయిన డిజైనులు గీసి, అందముగా వ్రాసి, సాధారణ తెల్లకాగితములపై రోనియోచేసి వివాహ పత్రికలను తయారించి ఇచ్చెడిది. తరువాత రంగు రంగుల కాగితములపై రోనియో చేయించి యిచ్చి తెలుగువారికి సాయపడింది. దేశీయ తోట కార్మిక సంఘము వారు వివాహ, దేవాలయ, పండుగ ప్రకటన పత్రికలను అందముగా బ్లాకులు తీయించి, అచ్చొత్తించి ఇచ్చేవారు.

మలేసియాకు తెలుగు అచ్చులను మొట్టమొదట తెప్పించిన ఘనత కీర్తిశేషు లయిన డా॥ వి. టి. సంబంధన్ గారికి దక్కుతుంది. దీర్ఘకాలము ఇండియా నాయకుడుగా ప్రభుత్వములో పలు ఇలాఖాలకు మంత్రిగా వ్యవహరించి, దేశీయ తోట భూమినిధి సహకార సంఘమనే గొప్ప వ్యవస్థను స్థాపించి, ఈ మధ్యనే అమరుడయిన సంబంధన్‌గారు 1960లో తెలుగు వారి ఉత్సాహమును గాంచి, తన సొంత ప్రచురణాలయము యిన కళాశాల ప్రచురణాలయమునకు తెలుగు అచ్చులను తెప్పించారు. అప్పటినుండి పెండ్లిపిలుపు పత్రికలు, దేవాలయ ఉత్సవ ప్రకటన పత్రికలు, సంఘ కరపత్రములు తెలుగులో అచ్చువేయు భాగ్యమునకు నోచుకున్నవి. కాలక్రమమున పలుముద్రణాలయముల వారు తెలుగు అచ్చులను తెప్పించారు. తెలుగువారు తమ శుభకార్యములు అన్నింటిని తెలుగులోనే అచ్చొత్తించి అందరికి తెలియజేయుచున్నారు.

్రతికలు

హూతో ప్రచురించిన మొదటి తెలుగు ఆంధ్రజ్యోతి' అను లిఖిత మాసపత్రిక ఈ పత్రిక శ్రీ జోన్ లాలయ్యగారి సంపాద కింద కోలాలంపూరునుండి 1958 లేక వత్సరాలలో వెలువడినది. కొంత కాలము త ఆ పత్రిక ఆగిపోయినది. తెలుగువారికి ొరతను బాపుటకు సంఘము పూనుకొని, పిల్ నుండి 'ఆంధ్ర సంఘ వార్తలు' మాసపత్రికను శ్రీ మదిని సోమునాయుడు కత్వము క్రింద వెలువడించినది. ఆపత్రిక ుగా శ్రీయుతులు కాశీన రమణయ్య, గుంట యుడుగార్లును, చిత్రకారులుగా శ్రీకొల్లి ును వ్యవహరించారు. 1961 మేనెలనుండి సంఘ వార్తలు' అన్న పేరును 'ఆంధ్ర మార్చి అట్ట నాలుగు పుటలు మాత్రము ుచి, లోపలి పుటలన్నియు సైక్లోస్టైల్ ుడుదల చేయబడినది. ఈ పత్రిక సంఘము ధాన కార్యాలయము బాగన్ డత్తోనుండి ోమునాయుడు, శ్రీ అల్లూరి కన్నయ్య ర్లు సంపాదకులుగా 1963 సెప్టెంబరు వడినది.

 కని ఒక సొంత ప్రచురణాలయము పలు మంచి కార్యాలను సాధించవచ్చునన్న ముతో 'జ్యోతిప్రెస్ లిమిటెడ్' అను సంస్థ లుగుఅభిమానులచే కోలాలంపూరులో ప్రారం . ఈ సంస్థద్వారా 'విదేశాంధ్ర' అను పక్ష ంభించబడగా, ఆ పత్రికకు ఆదరణ నిచ్చు 'ఆంధ్ర రంజని' ప్రచురణను ఆపివేసి, ు ఆదరించుమని సంఘము మలేసియా కోరింది. అచ్చులో ఎనిమిది పుటలుగా ఈ పక్షపత్రిక శ్రీ ఎస్. బి. రెడ్డిగారి త్వముక్రింద దాదాపు రెండు సంవత్సరములు . కాని, తెలుగు పాఠకుల సంఖ్య చాలా నందున రాబడి లేక విదేశాంధ్ర ప్రచురణ ధ్యలో ఆగిపోయినది. ఈ కాలములోనే మనలో పలువురు తమ రచనా శక్తిని వెలికి తీసుకు వచ్చే అవకాశము కలిగినది. స్థానికంగా ఎందరో యువ రచయిత(త్రు)లు బయలుదేరి, కథలు, కథాని కలు, కవితలు, వ్యాసాలు వ్రాయగలిగారు.

తిరిగి పత్రికలేని కొరత తెలుగువారికి ఏర్పడినది. 'ఆంధ్రసంఘ చర్యలు' అను లిఖిత మాస పత్రికను సంఘము కొన్నాళ్ళు జరిపినది. అప్పుడు సంఘ గుమస్తాగా పనిచేసిన శ్రీ బీసెట్టి నూకయ్యగారు ఆ పత్రికను ఆకర్షణీయముగా తయారించి వెలువడించేవారు. తరువాత ఆ పేరు 'మలేసియా ఆంధ్ర సంఘము'గా మార్చబడినది. ఈ ద్వైమాస లిఖిత పత్రికకు కొంత కాలము శ్రీ మదిని సోమునాయుడుగారు సంపాదకులుగా వ్యవహరించారు. తరువాత ఆ బాధ్యత శ్రీ డి. వి. శ్రీరాములుగారికి అప్పగించబడినది.

1972 సంవత్సరారంభమునుండి అదే పత్రిక రిజిష్టరు చేయబడి, 'తెలుగు తల్లిగా' వెలువడించబడినది. రెండు నెలల కొకతడవ వెలువడిన ఈ లిఖిత పత్రికను శ్రీ డి.వి. శ్రీరాములుగారు సంపాదకులుగాను, శ్రీయుతులు ఎల్లపు కృష్ణమూర్తి, మండి లక్ష్మణగార్లు సహాయకులుగాను, ఉండి చాల కాలము నడిపించారు.

1976వ సంవత్సర ఆరంభము నుండి 'తెలుగు తల్లి' వార్తా పత్రిక రూపములో ఆరు పుటలతో అచ్చులో శ్రీయుతులు మండే లక్ష్మణ, డి. వి. శ్రీరాములు గార్ల సంపాదకత్వము క్రింద టెలుక్కాన్ననుకోని రంజనీ ప్రచురణాలయములో ప్రచురింపబడి, కేంద్రముచే వెలువడించబడినది. ఒక పత్రిక ప్రచురించడానికి కావలసినన్ని అచ్చులు, ఆ ప్రచురణాలయములో లేనందువలనను, తెలుగు అచ్చు కూర్చు పనిగాంఢ్ర కొఱత వలనను పత్రిక 1977 డిసెంబరు నెలలో ఆపివేయబడినది.

అంతర్జాతీయ తెలుగు సంస్థవారు మన సంఘానికి ఒక పత్రికను ప్రచురించడానికి కావలసినన్ని అచ్చులను ఉచితముగా పంపించారు. మన కని ప్రత్యేకముగా ఒక స్థల మింకను లేనందువలన మన మా అచ్చులను ఉపయోగించుకోలేని పరిస్థితిలో యున్నాము. పత్రిక పేరును, అంతర్జాతీయ తెలుగు సంస్థవారి సూచన

మేఱకు 'మలేసియా తెలుగు వాణి'గా మార్చి రిజిష్టరు చేయుటకు దరఖాస్తు పెట్టుకున్నాము. కోలాలంపూర్‌లో తెలుగువాణి సొంతమయిన ఒక ప్రచురణాలయమువారితో ఒప్పందము చేసుకొని, శ్రీ బీసెట్టి నూకయ్యగారి సంపాదకత్వము క్రింద పత్రికను వెలువడించవలయునని సంఘము ప్రయత్నించుచున్నది. ప్రభుత్వ అనుమతి యింకను మనకు లభించనందున పత్రికను వెలువడించలేక పోవుచున్నాము. తెలుగు అచ్చులను, తెలుగు టైపురైటర్లను ఒసంగి మరెన్నో సహాయములను చేస్తూ, తగు యోచనలను తెలుపుతున్న అంతర్జాతీయ తెలుగు సంస్థవారికి మనము ఎంతయినా ఋణపడి యున్నాము.

### తెలుగు పుస్తకములు

మలేసియాలో అచ్చులో వెలువడిన తొలి తెలుగు సంచిక 'ఉగాది' అను కథల సంపుటి యగును. శ్రీ విశ్వావసు ఉగాదిని పురస్కరించుకొని, 1965వ సంవత్సరమున మలేసియా ఆంధ్ర సంఘ దిగువుపేరా శాఖ ఈ కథల సంపుటిని వెలువడించినది. శ్రీయుతులు కర్రి అచ్యుత రామయ్య, డి వి. శ్రీరాములు గార్లు ఆ సంచిక సంపాదకు లగుదురు. మలేసియాలోని పలువురు యువరచయితుల కథలు, వ్యాసములు, గేయములతో బాటు, ఆంధ్రప్రదేశ్ రచయితల రచనలు గూడా అందులో చోటు చేసుకున్నవి.

రెండవ సంచిక 1967లో సిలాంగూర్ శాఖవారిచే వెలువడించబడిన 'మురిపించే మువ్వలు' అను కథల సంపుటి యగును. ఈ సంచిక సంకలనకర్త శ్రీ బీసెట్టి నూకయ్యగారు.

మూడవది 'మలేసియా తెలుగు భాషాబోధిని' అను ఒక పాఠ్యగ్రంథము L.C E. S.R.P, ప్రభుత్వ పరీక్షలలో తెలుగును ఒక పాఠముగా తీయు విద్యార్థులకు సహకరించు నిమిత్తము పలువురు తెలుగు ఉపాధ్యాయులచే ఈ పాఠ్యగ్రంథము 1969లో వెలువడించబడినది. మొదటి రెండు కథల సంపుటములు మలేసియాలోని ప్రచురణాలయములందే అచ్చొత్తించబడగా, ఈ పాఠ్యగ్రంథము అంధ్రప్రదేశ్‌లో ప్రచురింపబడినది,

నాల్గవ తెలుగు కథల సంపుటి 'దీక్ష' 1972లో గ్రంథకర్తయగు శ్రీ జి.వి. సుబ్రమణియం గారు తన సొంత ప్రచురణాలయమయిన స్వాతంత్ర ముద్రణాలయములో ఈ సంచికను ప్రచురించి వెలువడించారు. ఈ పుస్తకములో శ్రీ జి.వి. సుబ్రమణియం గారిచే తెనుగించబడిన 'దీక్ష' అను చిన్న నవలయును, కొన్ని గేయములు, కథలు గలవు, సంఘ ప్రారంభ కాలము నుండి సంఘాభివృద్ధికి పాటుపడిన శ్రీ జి.వి. గారు పలు ఆంధ్ర సంఘ శాఖలలో ముఖ్య పాత్రలు వహించిన వారు. తెలుగుఅభిమానం మెండుగా గిలవారు. అంగహీనులయినప్పటికి అచంచలమయిన అభిమానం గలవారు. ఆంధ్రభాషాభివృద్ధి కొరకు పలు రంగాలలో కృషిచేసిన శ్రీ జి. వి. గారు గుండె జబ్బుచే నాడు అకాలమరణము పాలయారు. ఇట్లు మనం ఎందరో సంఘ నాయకులను అభిమానులను కోల్పోయాము. దైవసాన్నిధ్యము చేరుకున్న వారి ఆత్మలు ప్రశాంతత చెందాలని, వారి ఆశీస్సులు మనకు దక్కాలని ఈ రజతోత్సవ శుభ సమయమున తెలుగుతల్లిని వేడుకొందము గాక.'

1975 లో సిలాంగూర్ శాఖవారి తీవ్రకృషి ఫలితంగా 'తెలుగుతల్లి' ప్రత్యేక సంచిక శాఖ దశవార్షికోత్సవమును పురస్కరించుకొని వెలువరించబడినది. విజయవాడకు చెందిన డా॥ రాజారావు గారి సహకారంతో ఇండియాలో ప్రచురింపబడిన ఈ సంచిక సంపాదకులు శ్రీ కర్రి అచ్యుతరామయ్య గారు. శాఖ కార్యదర్శి శ్రీ బీసెట్టి నూకయ్యగారి కృషియు, శ్రీ రామకృష్ణ గారి ధార్మిక గుణమును, శాఖ నిర్వాహకుల పట్టుదలయు ఈ పెద్ద కథల సంపుటి వెలువడుటకు మూల కారణములగును.

తొలి ప్రపంచ తెలుగు మహాసభలలో విదేశాంధ్రుల చర్చావేదికలో చర్చింపబడిన శ్రీ డి.వి. శ్రీరాములుగారి ప్రధాన వ్యాసముతో బాటు ఇండియాలోని పలువురు రచయితు(త్రి)ల రచనలు, గేయములు ఈ సంచికలో గలవు.

సిలాంగూర్ శాఖ సహకారముతో 1978 లో కేంద్ర స్థాయిలో జరుపబడిన తెలుగు ఉగాదికి కేంద్రము

'ఉగాది 78' అను ప్రత్యేక సంచికను వెలువడించినది. గురజాడ ఉత్సవమును పురస్కరించుకొని సింపాంగ్ అంపాట్ శాఖవారు 1965లో వెలువడించిన 'గురజాడ' అను లిఖిత సంచిక, శ్రీ M.P. అప్పలనాయుడు గారి ద్రవ్యసహాయంతో S.R.P. లో తెలుగు పాఠమును తీయు విద్యార్థులకు సహాయపడు నిమిత్తము 1979 లో వెలువడించబడిన "S.R.P. ప్రశ్నల-జవాబులు' అను లిఖిత గ్రంథము ఇచ్చట గుర్తింప దగినవి.

ఈ సందర్భములో ఆంధ్రులు సభ్యత్వము వహించు దేశీయ తోట కార్మిక సంఘము, దేశీయ భూమి నిధి సహకారసంఘము వంటి స్థాపనములు వెలువడించిన సంఘమణి, సహకారము వంటి పత్రికలలో తెలుగుకు గూడా స్థానమిచ్చిన విషయమును మనమిచ్చుట మరువ లేము. ఇట్లు పలువిధాలుగా మన మీ మలేసియాలో తెలుగు భాషా, సాహిత్యాభివృద్ధి కొరకు సంఘ సహకారంతో శ్రమిస్తున్నాము.

## జీవిత సభ్యులు

సంఘ ఆరంభ దినాలలో మాస చందా యేబది కాసులు చెల్లించిన వారు సంఘ సభ్యులుగా పరిగణించ బడేవారు. ప్రతి నెల యేబది కాసులు వసూలించుటలో గల శ్రమల దృష్ట్యా సంవత్సర చందాగా ఐదు రింగిట్లు చెల్లించిన సంఘ సభ్యుల వవచ్చన్న చట్టమును తీర్చి దిద్దారు. ఈనాడు సంవత్సర చందాగా ఐదు రింగిట్లు సభ్యులనుండి వసూలించబడుచున్నది.

సంఘములో జీవిత సభ్యత్వము వహించ ఆశపడే వారు ఒకరికి $ 200 లు సతీపతులకు $ 300 లు అని నిర్ణయించబడినది. మన సంఘములో మొదటి జీవిత సభ్యుడు ప్రముఖ వైద్యులు డా॥ కె.ఎం. రెడ్డి గారు. వారి ననుసరించి డా॥ టి.ఎ. సూర్యన్, శ్రీ కె.ఎస్. మణియం గార్లు జీవిత సభ్యు లయారు. 1967లో శ్రీ యజ్ఞోజు మాధవాచార్యులు గారు మలేసియాలో పర్యటిస్తూ, సాహిత్యోపన్యాసములు ఒసంగు సందర్భమున మలేసియా ఆంధ్ర సంఘానికి పలువురిని జీవిత సభ్యులుగా చేర్చారు. ఈనాడు మన సంఘానికి దేశం నలుమూలలా పలువురు జీవిత సభ్యులు యున్నారు.

## సతీపతుల యావజ్జీవ సభ్యులు

1. శ్రీ మదని సోమునాయుడు దంపతులు
2. శ్రీ ఎల్లపు కృష్ణమూర్తి దంపతులు
3. డా॥ సి. అప్పారావు దంపతులు
4. శ్రీ ఆడారి అప్పలనాయుడు దంపతులు
5. డా॥ ఎ. కృష్ణమూర్తి దంపతులు
6. డా॥ జయరామన్ దంపతులు
7. డా॥ విజయన్ దంపతులు
8. శ్రీ పి.యం. ముత్యాలు దంపతులు,

## జీవిత సభ్యులు

1. డా॥ కె. ఎం. రెడ్డిగారు
2. డా॥ టి.ఎ. సూర్యన్‌గారు
3. శ్రీ కె.ఎస్. మణియం గారు
4. శ్రీ ఎస్. చిన్నరాములు గారు
5. శ్రీ ఎన్. రామనాథం గారు
6. శ్రీ టి.ఎ. అప్పలస్వామి గారు
7. శ్రీ టి.ఎ. కృష్ణ గారు
8. శ్రీ డి.వి. శ్రీ రాములు గారు
9. శ్రీ మండే లక్ష్మణ గారు
10. శ్రీ కె ఆర్. రాజు గారు
11. శ్రీ బిసెట్టి అప్పలనాయుడు గారు
12. శ్రీ నేతేటి దుర్గయ్య గారు
13. డా॥ రఘుపతి నాయుడు గారు
14. శ్రీ బి.ఎ. నాయుడు గారు
15. శ్రీ రంగనాథం గారు
16. శ్రీ టి.ఎం. అప్పారావు గారు
17. శ్రీ అశోకన్ గారు
18. డా॥ డి. దయానందం గారు
19. శ్రీ మంత్రి సుబ్రమణియం గారు
20. శ్రీ హంసరాజు గారు
21. శ్రీ బి. దేముడు గారు
22. శ్రీ బి.కె. సింహాచలం గారు
23. శ్రీ వై. సాంబమూర్తి గారు
24. శ్రీ జి వి. సోములు గారు
25. శ్రీ ఎ.వి. జవాలు గారు
26. శ్రీ ఎస్. బంగారు గారు

27. శ్రీ కె.యస్. దేవుడు గారు
28. శ్రీ ఆ.ఎ. సుబ్రమణియం గారు
29. శ్రీ డి.ఎ. సుబ్రమణియం గారు

## మలేసియాకు విజయముచేసిన తెలుగు కళా కారులు, పండితులు రాజకీయవేత్తలు, అభిమానులు

ఇండియానుండి మలేసియాకు విజయముచేసిన ప్రతి తెలుగు సోదరుని ఆహ్వానించి, పిలుపడిన వారికి అతిథి మర్యాదలు, గౌరవార్థ విందులు జరుపుటలో మనము ఏనాడు వెనుదీయలేదు. మనలను వీడిపోని మన పూర్వీకుల సత్‌సాంప్రదాయాలు, మనలో పాతుకుపోయిన తెలుగుఅభిమానము మనలను ఆవిధంగా చేయుచున్నవి. మధురమయిన తెలుగు పలుకులు విన నోచుకోని మనము సరళమయిన, మృదుమధుర మయిన తేట తెనుగు మాటలను వారి నోటి ద్వారా వినాలని అకాంక్షించాము.

1959 లో అప్పటి భారత పార్లమెంటు సభా నాయకులయిన శ్రీ మాడభూషి అనంతశయనంఅయ్యంగారు కోలాలంపూరుకు రాగా మన సంఘ ప్రముఖులు అతనిని కలుసుకొని, మన కొఱతలను విన్నవించుకున్నారు.

1964 లో అమెరికా వెళ్లివస్తూ, శ్రీ అక్కినేని నాగేశ్వరరావుగారు మలేసియా ఆంధ్ర సంఘ కోరిక మేరకు భార్యాసమేతంగా మలేసియాకు విజయము చేసారు. మన సంఘం దేశములో పలుచోట్ల సన్మాన సభలను ఏర్పాటు చేసి, ఘనంగా వారిని గౌరవించినది.

1967 లో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వము సంఘ కోరిక మేరకే శ్రీ యర్రోజు మాధవాచార్యులు గారిని సాహిత్యోపన్యాసములు ఒసంగుటకు మలేసియాకు పంపించినది. 1969 లో ఆంధ్ర ప్రదేశ్ శాసన పరిషత్తు సభ్యులగు శ్రీ వి. పి. రాఘవాచార్యులు గారును, 1970 లో అప్పటి ఆంధ్ర ప్రదేశ్ వాణిజ్యమంత్రి శ్రీ అంకినీడు ప్రసాదరావుగారును, అతని బృందమును, శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావు, శ్రీ డి. రామానాయుడుగారును, శ్రీయుతులు నూకల రామచంద్రారెడ్డి, శంకరరెడ్డి గార్లును మలేసియాకు విజయము చేశారు.

మలేసియాకు వచ్చిన వారిలో ఇంకను ప్రముఖ నేపథ్యగాయకులు శ్రీ ఏ. ఎం. రాజా దంపతులు, శ్రీ ఎస్.పి బాలసుబ్రహ్మణ్యం, శ్రీ బాల మురళీకృష్ణ, వైణిక శిఖామణి చిట్టిబాబు, ప్రముఖ కార్మికోద్యమ నాయకుడు ఆచార్య రంగా, సైకిలు ప్రయాణికుడు శర్మ, మచిలీపట్నం వాస్తవ్యులు శ్రీయుతులు రంగబాబు, చంద్రమోహన్‌రావు మొదలగువా రెందరో గుర్తించదగినవారు.

మొదటి ప్రపంచ తెలుగు మహాసభలు 1975 లో హైదరాబాదులో జరిగాయి. ఆ సభలకు మలేసియా నుండి 65 గురితో కూడిన పెద్ద ప్రతినిధివర్గం వెళ్లి వచ్చినది. అప్పటినుండి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వముతోను, అంతర్జాతీయ తెలుగు సంస్థతోను సంబంధ బాంధవ్యాలు ఎక్కువయాయి.

1976 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు శ్రీ రాజా మేకా రంగయ్యప్పారావు గారు మలేసియాకు విజయము చేసారు. 1976 లోనే మన కోరిక మేరకు అంతర్జాతీయ తెలుగు సంస్థ ప్రముఖ కవులు డా॥ దాశరథి, డా॥ సి. నారాయణరెడ్డిగార్లను మలేసియాకు పంపించినది. వారు మలేసియాలో దాదాపు నెలరోజుల పాటు దేశమంతటా పర్యటించి చక్కని, తియ్యని, ఉపన్యాసములు ఒసంగారు.

1977 లో అంతర్జాతీయ తెలుగు సంస్థ సహకారంతో కుమారి ఉమాభారతి కూచిపూడి నాట్య బృందము వారు మలేసియాకు విజయము చేశారు. డా॥ రామసుబ్బయ్య విద్యానిధి బోర్డువారి సహకారంతో మనం దేశంలో పలుచోట్ల నాట్య ప్రదర్శనలకు ఏర్పాట్లు చేశాము. ఆ ప్రదర్శన ద్వారా మనవంతుకు $ 13,000 లు లభించినది.

1979 లో రెండవ ప్రపంచ తెలుగు మహాసభల విషయమయి మనతో సంప్రదించుటకు ప్రపంచ తెలుగు మహాసభల నాయకుడు శ్రీ మండలి కృష్ణారావుగారు మిమిక్రీ కళాకారుడు శ్రీ నేరెళ్ళ వేణుమాధవ్‌తోను, మరికొందరు మిత్రులతోను విజయము

చేసారు. వారు ఊరు ఊరూ, వాడవాడా పర్యటించి తెలుగువారి జీవిత విధానాన్ని అవగాహన చేసుకున్నారు జరుగనున్న తెలుగు మహాసభలకు అందరు కలసికట్టుగా పనిచేయాలని కోరారు.

## రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు

ఈనాడు మనం మన సంఘ రజతోత్సవాలతో బాటు రెండవ ప్రపంచ తెలుగు మహాసభను జరుపుకొనే స్థాయికి పెరిగాము. విదేశాలనుండి వచ్చినటువంటి వందలాది ప్రతినిధులు, కళాకారులు, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ నాయకులు, మన దేశనాయకులు మన మధ్య యున్నారు. 14-4-1981 నాడు మన ఉప ప్రధాని మహా ఘనతవహించిన మహదీర్ మహమ్మదు గారిచే ప్రారంభోత్సవము చేయబడిన ప్రపంచ తెలుగు మహాసభలను ఘనంగా జరుపుకుంటున్నాము.

అసలు ఈ మహాసభలు 1977లో కౌలాలంపూరులో జరుగవలయునని మొదటి ప్రపంచ తెలుగు మహాసభలు 1975లో హైదరాబాదులో జరిగినపుడు మహాసభల నిర్వాహముచే ప్రతిపాదించబడనది. కాని, 1977లో వీలుపడదని, 1978 ఏప్రిలులో జరుపుటకు తీర్మానించి, మన సంఘము అన్ని ఏర్పాట్లు చేసివేసినది. కాని, మన దురదృష్టవశాత్తున 1977 నవంబరులో ఆంధ్రప్రదేశ్ తీరప్రాంతమున పెద్ద ఉప్పెన లెగిసి, వేలాది తెలుగు ప్రజలను తన పొట్టన పెట్టుకొని, లక్షలాది ప్రజలను నిరాశ్రయులుగా చేసి, కోట్లాది ధననష్టాన్ని కల్పించినది. లక్షలాది తెలుగు ప్రజలు నిరాశ్రయులయి దుఃఖ సాగరములో మునిగియన్న సమయమున మనం ఆనందముగా మహాసభలు జరుపుకొనుట భావ్యం కాదు కాబట్టి, సభలను సంవత్సరము పాటు వాయిదా వేశాము. కాని, ఈలోగా ఆంధ్రప్రదేశ్‌లో మార్పులు ఏర్పడి, క్రొత్త మంత్రి వర్గం ఏర్పడినది. ఈ మంత్రివర్గం సభల పట్ల సుముఖత చూపక పోవడం కారణంగా అనుకున్నట్లు 1979 ఏప్రిలులో సభలను జరుప లేక పోయాము. 1980లో శ్రీ అంజయ్యగారు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఎన్నుకొనబడటంతో తెలుగు మహాసభలకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆదరవు లభించగలదన్న నమ్మకం అందరిలో కలిగింది. ఈ నమ్మకమును తన సుముఖతలోను, ఆదరవులోను శ్రీ అంజయ్యగారు ధృవపరిచారు. పర్యవసానం ఈనాడు మనం ప్రపంచ తెలుగు మహాసభలను జరుపుకుంటున్నాము. నేల నాలుగు చెఱగుల నుండి వచ్చిన ప్రతినిధులందఱు ఈ జయపురిలో ఆనందముగా కలుసుకొని, మంచి చెడ్డలు మాట్లాడు కొనగలుగు చున్నాము. తెలుగు తల్లికి ప్రణమిల్ల గలుగుచున్నాము. తెలుగు భాషా, సంస్కృతి, సాహిత్యాల ఔన్నత్యములను ఉద్ఘాటించ గలుగుచున్నాము. భవిష్యత్ పునాదులను, దిట్టాలను వేయగలుగుచున్నాము.

## సంఘ రజతోత్సవము

నేటితో మన సంఘ చరిత్రలో 25 వత్సరాలు దొర్లిపోయాయి. ప్రపంచ తెలుగు మహాసభలలో ఒక భాగంగా మన సంఘ రజతోత్సవాలను జరుపుకుంటున్నాము. గతాన్ని మనం తలంచుకుంటే తెలుగు భాష, సంస్కృత, సాహిత్యాల అభివృద్ధికి, తెలుగువారి మనుగడకు ఈ దేశంలో సంఘము ప్రత్యక్షంగాను పరోక్షంగాను ఎంత సాధన చేసినది, సాధించినది తెలియుచున్నది. నవయౌవన ప్రాయములో అడుగిడిన మన సంఘమునకు ఉజ్జ్వలమయిన భవిష్యత్తు ఉన్నదన్నది ఎవరూ కాదనలేరు. తప్పటడుగులతో చిరుత ప్రాయములో నడక నవలంబించిన మన సంఘము ఈనాడు నిండుగా నిలిచి నడవగలుగుచున్నది.

ఇదీ మన సంఘ గతము. ఇరవై అయిదు సంవత్సరాల గాథ.

మన సంఘ కథను వ్రాయుటలో నే నెంతగా కృతకృత్యుడ నయితినో తెలియదు గాని, నాకు తెలిసిన, లభించిన ఆధారాలను బట్టి ఈ సుదీర్ఘమయిన గాథను వ్రాయపూనుకున్నాను. ఎందరో మహానుభావులు మన సంఘ పురోభివృద్ధికి పాటుపడ్డారు. వీరూ అని వారి పేర్లను గుర్తించలేకపోయనప్పటికి వారి కందఱకూ మా వందనంబులను ఈ శుభసమయములో అర్పించుకొనుచున్నాము.

సస్యశ్యామల మయిన దేశంలో మనం నివసిస్తున్నాము. కలతలు లేక కలసికట్టుగా పయనించిన ప్రగతిపథంలోకి పరుగు లిడగలం. మన మనుగడతో బాటు మనజాతి ఔన్నత్యమును, భాషా మాధుర్యమును కాపాడుకొనగలం.

# మలేసియా ఆంధ్ర సంఘాన్ని స్థాపించుటలో మేము ఎదుర్కొన్న సమస్యలు

శ్రీ మదిని సోమనాయుడు
గౌరవ ప్రధాన కార్యదర్శి, మలేసియా ఆంధ్ర సంఘము

ఆనాడు తుంగభద్రా నదీ తీరమున వెలసిన విద్యా నగరమే తుదకు విజయనగరమై జగత్ ప్రఖ్యాతిగాంచి తెలుగు జెండాను ప్రపంచమంతా ఎగురవేసింది. అందువలన ఆ నది పేరు ఈ లోకములో తెలుగు జాతి ఉన్నంత కాలం చిరస్థాయిగా నిలిచిపోతుంది.

అట్లే 1955 జూలై 17-వ తారీఖున సింపాంగ్ అంపాట్‌లో వెలసిన "దక్షిణ పేరా ఆంధ్ర సంఘమే" తుదకు "మలేసియా ఆంధ్ర సంఘమై తెలుగు జాతికి మేల్కొల్పులు పాడి, ఈ 1981వ యేట ప్రపంచ తెలుగు జాతి అభ్యుదయానికి ప్రబోధ గీతం పాడుతుంది. అందువలన బాగాన్ డత్తోకు 17 మైళ్ళ దూరంలో ఉన్న సింపాంగ్ అంపాట్ అన్న పట్టణం పేరు ప్రపంచ తెలుగువారి చరిత్రలో నిరంతరంగా నిలిచి పోతుంది.

ఈ సింపాంగ్ అంపాంట్ పట్టణంలోనే తెలుగు ఏడవ తరగతి వారాని కొకసారి జరుగుచూ ఉండేది. ఆ తరగతికి గణిత ఉపాధ్యాయునిగా 1955 ప్రారంభంలో ఉద్యోగంలో చేరాను. శ్రీయుతులు నేతేటి దుర్గయ్య, అల్లూరి కన్నయ్యానాయుడు, త్రిమూర్తి అను ముమ్మూర్తులూ అప్పటికే ఆ తరగతి ఉపాధ్యాయులుగా ఉండేవారు. శ్రీ కన్నయ్యానాయుడుగారు ఈపో నుండీ, శ్రీ త్రిమూర్తిగారు ఉలుబెర్నం నుండీ వస్తున్నందున, వారివారి పాఠాలు బోధించిన వెంటనే యిల్లు చేరుకొను అవస్థలో వా రేమీ చేయుటకు పీలుపడ లేదు.

నేనూ శ్రీ నేతేటి దుర్గయ్యగారు తెలుగు జాతి, తెలుగు భాష అభివృద్ధికి ఏమి చేస్తే మంచిది అని ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ ఉండేవారం. మన చుట్టుపట్ల ఉన్న యితర సమూహాను అభివృద్ధి చెందుతూ ఉంటే మనము అభివృద్ధి జెందాలి అన్న దృఢాభిప్రాయం మాలో వెలసింది.

## తెలుగు బంతాట జట్టు

ఆట అంటే ఆశపడనివా రెవరూ ఉండరు. అందులో బంతాట అంటే యువకులకు బలే ఆశగా ఉండేది. ఆ తరగతిలో చక్కగ బంతాట ఆడగల యువకులు చాల మంది యుండేవారు. అందువలన "తెలుగు ఏడవ తరగతి బంతాట జట్టు" అన్న పేరుతో పందెం వేసి ఆడాము. అలనాడు తెలుగు చక్రవర్తి శ్రీకృష్ణదేవ రాయలు ఎట్లు దండెత్తిన దేశాలన్నిటినీ గెలుచుకున్నాడో, అట్లే ఈ తెలుగు జట్టు ఆడిన ఆటలన్నిటిలోనూ జయం తప్ప మరేమీ ఎరుగదు.

ఈ తెలుగు జట్టును జిల్లా, రాష్ట్ర, దేశ స్థాయిలో పోటీలలో ఆడించి తెలుగు జెండాను నలుమూలలూ ఎగురవేయిద్దామన్న లక్ష్యంతో ఒక శనివారం నాడు తెలుగు తరగతి బోధన ముగించిన తర్వాత విద్యార్థులందరినీ ఒక్కచోట కూర్చోబెట్టి "తెలుగు ఏడవ తరగతి బంతాట జట్టు" అను పేరిట ఒక సంఘాన్ని ప్రారంభించుకుందాము, మీకందరికీ సమ్మతమేనా? అన్న ప్రశ్న వేశాము. సరి, అన్న జవాబు తప్ప

మరే జవాబూ మా చెవిలో పడలేదు. ఆ ఏకగ్రీవ తీర్మానానికి నిజరూపం కల్పించి, ప్రాణంపోసి నడిపిద్దాము అని నేనూ, శ్రీ నేతేటిగారూ దీక్ష పూనాం.

## పోలీసు ఉద్యోగి ప్రవేశం

ప్రతిశనివారం ఆతరగతి కరుగుచుండుట అలవాట యినా, ప్రభుత్వ పరీక్షలు దగ్గరగునప్పుడు అభిమానం గల ఆ తెలుగు ఉపాధ్యాయులు ఆదివారంగూడా అదనంగాను, ఉచితంగాను బోధించేవారు. శనివారం సభ ముగించుకొని యిల్లు చేరుకున్న మేము, మరుసటి దినం అనగా ఆదివారం మామూలుగా బోధించుదకు సింపాంగ్ అంపాట్‌లోని భారతి తమిళ్ పాఠశాలకు వచ్చాము.

"మీ రిద్దరూ ఈ గదిలోనికి రండి" అన్న శబ్దం విన్న మేము ఉలిక్కిపడి ఆ ధ్వని వచ్చినవైపు తలెత్తి చూశాము. ఇంకేముంది, మాకు ముందే పరిచయంగల ఒక పోలీసు ఉద్యోగి మా కగుపించారు. మేమూ ఆయనతోబాటు ఆ విశేషగదిలోనికి ధైర్యంగానే దూరాము. "మీరు నిన్న ఒక సమావేశం జరపడం నిజమేనా? అని అడిగా రా పోలీసు స్పెషల్ బ్రాంచి ఉద్యోగి. ఆయన అంతరాత్మను అర్థంచేసుకున్న మేము, 'అబ్బే సమావేశ మేమీ జరపలేదు. మా విద్యార్థులతో యిష్టాగోష్ఠి జరిపి ఒక బంతాట సంఘాన్ని ప్రారంభించుకుందాం అని మాట్లాడుకున్నాము" అని మేకపోతు గాంభీర్యంగా జవాబిచ్చాము. మమ్ము అర్థం చేసుకున్న ఆ గూఢచారి, "ఇకపై ఇటువంటి సభలూ సమావేశాలూ పోలీసు అనుమతి పొందకుండ జరపరాదు సుమా!" అని హెచ్చరించి వెళ్ళిపోయారు. ఆ తర్వాత మేం తెలుసుకున్నాము, ఎవడో దుర్మార్గుడు ఈ విషయాన్ని పోలీసుకు తెల్పాడని.

## సంఘ స్థాపనకు సమావేశం

కమ్యూనిస్టు భయంకరశక్తులు ప్రభుత్వాన్ని ఎదిరించే కాలం అది. ఉఁ అన్నా, ఆఁ అన్నా దర్యాప్తు ఏమీ చేయకుండానే జైలులో మూసివేసే కాలం అది. తెలుగు తల్లి కృపవలన మా చేతులకు బేడీలు తగిలించి జైలుకు తీసుకవెళ్ళే అవస్థఏమీ లేకుండా పోయినందుకు లోలోన సంతోషపడ్డాము.

"కుక్కకాటుకు చెప్పు దెబ్బ" అన్నట్లు ఎలాగైనా ఈ బంతాట సంఘాన్ని స్థాపించాలి అన్న దృఢ సంకల్పంతో ఆ వేళ బోధన ముగించుకొని యిల్లు చేరుకున్నాము. ఆ సంఘాన్ని ప్రారంభించుటకు ఒక సమావేశం చేయుటకు అనుమతికై పోలీసుకు దరఖాస్తు పెట్టుటకు పూనుకున్న నాకు, ఒక మారు ఆలోచన వచ్చింది. ''ఆంధ్ర సంఘము" అన్న ఒక దాన్ని ప్రారంభిస్తే అందులో ఈ బంతాట ఒక విభాగంగా ఉండి పోతుంది. ఈ సంఘం ద్వారా ఈ ఆటలు మాత్రమేగాకుండ, తెలుగు భాష, కళలు పెంచుటకు గూడ అవకాశం లభిస్తుంది గదా! అని నాలో నేనే తీర్మానించుకొని మరువారం యథాప్రకారం తెలుగు తరగతికి వెళ్ళాను. శ్రీ దుర్గయ్యగారిని కలుసుకొని ఈ విషయాన్ని తెల్పాను. "ఒక్క రాయితో ఒక్క డజను పండ్లు రాల్చుకోవచ్చును నాయుడు" అట్లే చేసుకుందాం అని నాతో ఏకీభవించా రాయన.

1955 జూన్ నెల 28-వ తేదినాడు నా తొలి ఉత్తరాన్ని వ్రాసి తెలుక్కాన్సను పట్టణంలోని పోలీసు అధికారికి పంపించాను. తెలుగువార మందరము ఒక సంఘాన్ని స్థాపించుకుందామా అని మాట్లాడుకొనుటకు ఒక సభను సింపాంగ్ అంపాట్‌లో జరుపుటకు అనుమతించాలి అని ఆ ఉత్తరంలో పేర్కొన్నాను. నే నొక్కడనే అడిగితే ఔ నంటారో కాదంటారో, మరికొందరి సంతకాలు తీసిపంపితే మన జాబుకు బలం కలుగుతుందని తలంచి, అప్పుడు నా దగ్గర చదువుతున్న ఇల్లపు బాబునాయుడు, గండమల్ల బిచ్చాలు, పిన్నింటి కన్నయ్య మొదలగువారి సంతకాలూ అ ఉత్తరంలో వేయించి పంపాను. నా ఉత్తరానికే క్రింది ఉత్తరం జవాబుగా వచ్చింది ;

Ref No. 11

DISTRICT POLICE HEAD QUARTERS,
TELUK ANSON.
4th July, 1955.

Mr. M.D. Somunaidu,
Strathmashie Estate,
BAGAN DATOH.

With reference to your letter dated 28th June, 1955 will you please call at this office early and obtain a licence on payment of the requisite fees in order to enable you to convene a public meeting.

(D.W. BEEDEN)
O.C.P.D.,
Teluk Anson

### పోలీసు స్టేషనుకు సంఘ నాయకులు

దానిని అందుకొని మరు శనివారం సింపాంగ్ అంపాట్‌కు వెళ్ళాను. దానిని శ్రీ నేతేటిగారికి చూపాను. ఆ సమయాన్నే అక్కడికి వచ్చిన శ్రీ ఆత్రి సింహాద్రిగారు కూడ చూశారు. తరగతి బోధన పూర్తయిన తర్వాత ముగ్గురం పోలీసు స్టేషనుకు వెళ్ళాం. పోలీసు అధికారి మాకు ఉచితాసనాలిచ్చి, ''మీ సభలో ఎందరు కలుసుకుంటారని అంచనా వేశారు" అని అడిగారు. అంధకారంలో మునిగియున్న ఆంధ్రులలో మరేమి అధికంగా ఎవరూ కలుసుకోరని తలంచి 'దాదాపు వందమంది' అన్నాము. అయితే పది వెండీలు ($ 10-00) రుసుము చెల్లిస్తే లైసెన్సు యిస్తాము అన్నారా పోలీసు ఉద్యోగి.

అసలు సంఘమే లేదు, చందా వసూలన్న మాటే లేదు. మాకేమో అభిమానం ఒకంత ఉందిగాని డబ్బు మాత్రం లేదు. ఆ క్లిష్ట సమయాన ఎవరిని అడిగేది? ఇప్పుడు డబ్బు లేదు, తర్వాత యిచ్చి పర్మిటు తీసుకుంటాము అంటే ఆ యధికారి మమ్మలను చిన్నగా చూస్తాడేమో అని ఒకరి ముఖం ఒకరం చూచుకున్నాము. చివరకు నా జేబులో యుండిన పది వెండీ కాగితాన్ని పోలీసు అధికారి కిచ్చి, పర్మిటు పట్టుకొని ఎవరింటికి, వారము వెళ్ళిపోయాము.

### తొలి సమావేశంలో కలుసుకొండన్న ప్రకటన

1955 జూలై 17వ తారీఖున సింపాంగ్ అంపాట్ పట్టణంలోని భారతి తమిళ్ పాఠశాలలో తెలుగు వారికై ఒక సంఘాన్ని ప్రారంభిద్దాం రండి'' అన్న ప్రకటన దేశంలోని తమిళ పత్రికలకు పంపాను. అది 1955 జూలై 16 న పత్రికలలో పడింది. దానిని చూచి నూతనోత్సాహం జెందిన తెలుగువారు ఆ శుభ దినం కొరకు వేయి కళ్ళతో చూస్తూయుండేవారు.

సమావేశం జరగవలసిన దినం యింకా తెల్లగా తెల్లవారలేదు. ''సార్, సార్'' అన్న శబ్దంతో ఎవరో నన్ను పిలుస్తున్నట్లు వినిపించింది. ఈ యడవి ప్రాంతంలో ఉన్న స్ట్రాత్ మాషి తోటలోని నా యింటికి ఈ జామున వచ్చినది ఎవరో అని కిటికీ తెరచి చూశాను. శ్రీ మురిపిండి వీరునాయుడు (అనుకుంటాను) నా కగుపడి, మీ దగ్గరున్న పోలీసు పర్మిటును పట్టుక రమ్మని శ్రీ దుర్గయ్యగారు నన్ను పంపించారు అని తెల్పాడా వీర యువకుడు.

ఎందువలన యింత అవసరంగా యిది కావలసి వచ్చింది అని అడిగాను. "మీరు వేసిన ప్రకటన నిన్న తమిళ పత్రికలో పడింది. దానిని చూచి ఆ భారతి

తమిళ పాఠశాల అధికారులు శ్రీయుతులు అరుల్ ప్రకాశంగారూ, నాయరుగారూ శ్రీ దుర్గయ్యగారిని నానామాట్లాడి, వారి అనుమతి లేకుండ పోలీసు పర్మిటు తీయడం, ప్రకటన వేయడం పొరపాటు, అందువలన సభను ఆ భవనంలో జరుపుటకు వీలుపడదు అంటు న్నారట" అన్నా డా యువకుడు, ఇది మా పొరపాటే అని ఒప్పుకొని పర్మిటు చేతి కిచ్చి, ఎలాగైనా సభను జరుపుటకు అనుమతి పొందమని శ్రీ నేతేటి గారితో చెప్పమని కబురంపాను. అట్లే అనుమతి లభించింది.

## కే. వి. స్వామిగారు సభాధ్యక్షులు

ఆవేళ సభ సాయంత్రం 2 గంటలకు జరుగుతుంది కాబట్టి అందరం ఆ భవనం దగ్గర ఆ సమయానికి చేరుకున్నాము. కాని, భవనం గట్టిగా మూయ బడి యుంది అచ్చటి అధికారిని 'భవనంతలుపు, తెరవండి' అని కోరాము. 'వీల్లేదు, తాళపుచెవి జెంద్రడాటా స్వామి గారి దగ్గరుంది-ఆయన వచ్చి తెరచేవరకు అందరూ బయటే ఉండండి అన్నా రా యధికారి-శ్రీ స్వామిగారు అప్పుడు ఆ పాఠశాలను జరుపు భారతీయ సన్మార్గ సంఘానికి కా ర్య ద ర్శి. ఆయన రాకకై అందరం త్రోవను చూచుకొని యున్నాము. గంట రెండింటిని దాటి పోయినా ఆయన రాలేదు, వెంటనే ఒకయువకుని జెంద్రడాటా ఎస్టేటుకు పంపించాము. మరికొంత సేప టికి శ్రీ స్వామిగారు వచ్చారు.

తలుపు తెరచుటకు ముందుగా, "సరిగ్గా ఈ సభ పోలీసు పర్మిటు ప్రకారం సాయంత్రం నాలుగున్నరకు ముగించిపోవాలి. అటుపై ఒక్కనిమిషంగూడ భవనంలో ఎవరూ ఉండుటకు వీల్లేదు. తలుపు మూసివేయా లన్నది నా కొసంగిన ఆనతి" అని తెల్పారు. "గతి లేనమ్మకు గంజే పానకం" అన్నట్లు మరేం అనలేక సరే నని ఒప్పుకొని లోనికి ప్రవేశించాము.

శ్రీ స్వామిగారు తెలుగువారు; తెలుగు అభిమాని. అప్పటికే పలు సంఘాలలో పదవులు వహించి సేవలు చేసిన యోధుడు. అందువలన ఆ సభకు అధ్యక్షత వహించవలసిందిగా కోరాము. మా కోరికను ఒప్పుకున్న ఆయన "మనం అందరం ఇండియావారము, మనకు ప్రత్యేకంగా ఒక సంఘం వద్దు; అందరూ ఇండియా సంఘంలో చేరుకొనుట మంచిది" అని తన అధ్యక్షోప న్యాసంలో తెల్పారు.

ఆయన ఆలోచనను మొట్టమొదట ఆక్షేపించాను నేను, తెలుగువారు పలు ఇండియా సంఘాలలో ఇప్ప టికే ఉన్నారు. కాని, ఆ సంఘాలలో తెలుగువారికి, తెలుగు భాష, కళాచారాలకు ఏమీ న్యాయం జరగలేదు న్యాయాన్ని ఎవరైనా అడిగితే వారికి చీవాట్లే మిగులు చున్నవి. కాబట్టి తప్పక తెలుగువారి కొక సంఘం కావాలి. అదీ ఈనాడే తేలిపోవాలి అని తెల్పాను. నాకు తర్వాత శ్రీయుతులు పోతల మారయ్య, అడారి అప్పల నాయుడు, కుండా సిద్దయ్య, ఆత్రి (జ్యోతి) సింహాద్రి మొదలగువారు మాట్లాడి నా ప్రతిపాదనను ఏకగ్రీవంగా బలపరిచారు. చివరకు అందరూ తెలుగువారికి ఒక సంఘం అవశ్యం అన్న ఏకగ్రీవ తీర్మానం చేశారు.

## సంఘానికి ఏమి పేరు పెడదాం?

ఈ సంఘానికి "మలాయా ఆంధ్ర సంఘం" అను పేరు పెడదాం అని నేను ప్రతిపాదించాను, వీల్లేదు. ఇక్కడ మలాయా అంతటి నుంచి వచ్చినవారు లేరు, ఒక్క దక్షిణ పేరాప్రాంతం తెలుగువారే ఉన్నారు. కాబట్టి "మలాయా" అన్న పదం వాడుటకు మనకు హక్కు లేదు అని సభాధ్యక్షులు శ్రీ స్వా మి గా రు తెల్పారు. అప్పటికి అధిక అనుభవం లేనివార మయి నందున ఔనంటే ఔనని "దక్షిణ పేరా ఆంధ్రసంఘం" అన్న పేరు పెట్టుకున్నాము. ఆ సభ అనంతరం బెస్టం ఎస్టేటు జట్టుతో మన తెలుగు ఏడవ తరగతి జట్టు ఆడి జయం పొంది తెలుగువారికి తేజాన్ని చేకూర్చింది.

తెలుగు సంఘం ప్రారంభ మగుటకుకారణ మయిన ఈ బంతాట జట్టు దక్షిణ పేరా ఆంధ్ర సంఘంలో ఒక విభాగమై తన ఆటలను కొనసాగిస్తూ ఉండేది.

## తొలి నిర్వాహక వర్గము

దక్షిణ పేరా ఆంధ్ర సంఘాన్ని నమోదు చేయుట కును, ముందుండి నడుపుటకును శ్రీ కుండా సిద్దయ్య గారు అధ్యక్షులుగాను, (శ్రీమదిని సోమనాయుడు)

నేను గౌరవ కార్యదర్శిగాను, శ్రీయుతులు సేతేటి దుర్గయ్య, పోతల మారయ్య, ఆడారి అప్పలనాయుడు, ఆకుల సింహాచలము, తరిని వరహాలు కార్యవర్గ సభ్యులు గాను ఏకగ్రీవంగా ఎన్నుకోబడిరి.

## నిబంధనావళి తయారు చేయుట

సంఘాన్ని ప్రభుత్వంతో నమోదు చేయడం ఈ తొలి నిర్వాహంయొక్క తొలిపని. మున్ముందు యిటువంటి పనులు చేసిన అనుభవం లేనందున, ఒకనాడు నేనూ శ్రీ నేతేటిగారూ టెలుక్కాన్సనులోని లోవర్ పేరా ఇండియన్ అసోసియేషనుకు వెళ్ళి ఆ సంఘ కార్యదర్శియయిన శ్రీ రామచంద్రన్‌గారిని కలుసుకొని మా పనిని వివరించి, ఆ సంఘ నిబంధనావళి పుస్తకాన్నొకదానిని ఇవ్వాలని కోరాము. మేము కోరినట్లే యిచ్చి, ఏమేమి చేయాలి అన్న ఆలోచనలు గూడ తెల్పారా తమిళ సోదరుడు.

తమిళములో, ఆంగ్లములో ఉన్న ఆ చట్టదిట్టాలను తెలుగులోనికి తర్జుమా చేయాలి; మాకు ఈ సంఘాన్ని గూర్చిన పనులెన్నో ఉన్నవి. ఈ తర్జుమా పనిచేయుటకు వ్యవధి లేకపోయింది. తగిన వ్యక్తి ఎవరున్నారు? అని ఆలోచించాము. తుదకు శ్రీ జ్యోతి సింహాద్రిగారు మా ఆలోచనలో కొచ్చారు. కారణం ఆయనకు తెలుగు, అరవ భాషలు తెలుసు. ఇంతకు పూర్వం ఇతర సంఘాలలో ఉండి పొందిన అనుభవం వేరు ఉంది. మరియు ఆ సమయమున ఆయన నిరుద్యోగి, మాకు దగ్గరలోనే నివసించుచున్నారు. అందువలన మేమ్దరము శ్రీజ్యోతిగారిని ఈ తర్జుమా పనిచేసి సహాయపడమని కోరాము. ఆయన ఆపని చేశారు.

## క్రొత్తపల్లి రంగారావు చౌదరి పరిచయము

ఒకనాడు సాయంత్రం సింపాంగ్ అంపాటుకు దగ్గరలోనున్న హూతాన్ మెలింతాంగ్ పట్టణంలోని మైదానములో టెలుక్ బూలో ఎస్టేటు జట్టుకు మన తెలుగు ఏడవ తరగతి జట్టుకు బంతాట జరుగుచుండినది. 'తన్ను, తన్ను' అను నినాదాలు మారుమ్రోగుచున్నవి. ఆ దారిన వస్తూ పోతున్నవారు నిలిచి ఆశ్చర్యంగా ఆటను చూస్తున్నారు- అలా చూస్తూ వచ్చిన శ్రీ ఆడారి అప్పల నాయుడుగారు నన్నూ, శ్రీ దుర్గయ్యగారినీ చూచి ఎవరివి ఈ జట్టులు, తెలుగు శబ్దం వినబడుచున్నదే అని అడిగారు. నిజం తెల్పాము. ఇదివరకు అటువంటి ఒక తెలుగు జట్టును ఆయన జన్మలో చూడలేదట- అమితానందం జెందిన ఆయనతో మన దక్షిణపేరా ఆంధ్ర సంఘాన్ని గూర్చి గూడా ముచ్చటించాము. "సరే మీరు తయారుచేసిన చట్టదిట్టాలను నా కివ్వండి. నేను చంకాట్ ఆసా ఎస్టేటులో ఉన్న శ్రీ చౌదరిగారి కిచ్చి, ఈపోలోని రిజిష్ట్రారుకు సమర్పించమంటాను" అన్నారు.

శ్రీ చౌదరిగారు ఆ తోటకు పెద్ద గుమస్తా. శ్రీ ఆడారి అప్పలనాయుడుగారు చిన్న గుమస్తా శ్రీ చౌదరి గారు అప్పటికే కార్మిక నాయకుడుగా యుండి, దేశ ఎన్నికలలో పాల్గొన్న వ్యక్తి, మంచి అనుభవశాలి, అన్న వివరాలు శ్రీ నాయుడుగారి ద్వారా తెలుసుకొని మేము తయారుచేసిన దక్షిణపేరా ఆంధ్రసంఘ నిబంధనావళిని ఆయన కిచ్చాము. మరునాడు-దానిని చూచి, ఆనాడు తాను చూచిన బంతాట ముచ్చటను శ్రీ నాయుడు గారు తెల్పగా విన్న చౌదరిగారికి అటువంటి తెలుగు నాయకులను, ఆటగాండ్రను చూడాలన్న గాఢప్రేమ ఏర్పడింది. దానిని వివరించి నాకూ, శ్రీ నేతేటి, శ్రీ కుండాగారికి ఉత్తరాలు వ్రాశారా యిర్వురూ. మరో సమావేశం ఏర్పాటు చేయండి. అందులో కలుసుకొని మీతో సంప్రదించాలి అని ఆ ఉత్తరాలలో ఉంది. అటువంటి కోరికను నెరవేర్చుట మా కర్తవ్యం అని తలంచి ఒప్పుకున్నాము.

## రెండవ తెలుగు సమావేశము

తొలి సభ జరిగిన అదే చోటున 1955 సెప్టెంబరు 25వ తేదీనాడు రెండవ సమావేశము ఏర్పాటు చేశాము. అందు కలుసుకొని ఆవేశపూరితమైన ఉపన్యాసంచేశారు. "దక్షిణ పేరా ఆంధ్ర సంఘం" అన్న పేరుంటే మేమంతా చేరలేము కాబట్టి సంఘం పేరును "మలాయా ఆంధ్ర సంఘం"గా మార్చాలి అని కోరారు. అసలు తొలి కోరిక మాది ఆ పేరేగా? కిక్కురు మనకుండా ఆ పేరును మరోసారి ఏకగ్రీవంగా ఒప్పుకున్నాము.

## రెండవ నిర్వాహక వర్గము

ఆనాటి సభలో శ్రీ చౌదరిగారితో ఆయనను పరిచయం చేసిన శ్రీ ఎన్.ఎ. నాయుడుగారు గూడ వచ్చి కలుసుకొనిరి. శ్రీయుతులు కుండా సిద్దయ్యగారు, డేవిడ్‌గారు, నేతేటి దుర్గయ్యగారు, జ్యోతి సింహాద్రి గారు, నేనూ మాట్లాడాము. మా పాఠశాలలలో (స్టాత్ మాషి ఎస్టేటు) చదువుచుండిన గండపల్ల బిచ్చాలు, వీ. పుల్లమ్మ, గాజుల సారిమ్మ మొదలగువారు యింపైన తెలుగు పాటలు పాడిరి.

తొలి నిర్వాహ వర్గానికి సహాయంగా మరికొందరు చేర్చబడిరి. ఈ రెండవ నిర్వాహానికి శ్రీయుతులు కుండా సిద్దయ్యగారు అధ్యక్షులు, మదిని సోము నాయుడుగారు గౌరవ కార్యదర్శి, నేతేటి దుర్గయ్యగారు గౌరవ కోశాధికారి, పాలకవర్గ సభ్యులుగా శ్రీయుతులు పోతల మారయ్య, అడారి అప్పలనాయుడు, తరిని వరహాలు, ఆకుల సింహాచలము, ఆడారి గంగు నాయుడు, వేములపల్లి కృష్ణకుమారి ఏకగ్రీవంగా ఏన్నుకోబడ్డారు.

## రిజిష్ట్రారుకు చట్టదిట్టములు సమర్పించుట

దక్షిణ పేరా ఆంధ్ర సంఘాని కని తయారుచేసిన చట్టదిట్టములలో మలాయా ఆంధ్ర సంఘమునకని మరి కొన్ని మార్పులుచేసి శ్రీయుతులు చౌదరి, ఎన్. ఎ. నాయుడుగార్లు రిజిష్ట్రారుకు సమర్పించిరి. 1955 సెప్టెంబరు 25వ తేదీన తొలిసారిగా కలుసుకున్న శ్రీ చౌదరిగారు, 1955 డిశంబరు 10వ తేదీనాడు బాగాన్ డత్తో బొంబాయి రెస్టారెంటులో రెండవసారి మనకని పించినారు. ఈయన కలకత్తాలో జరుగు కార్మిక నాయకత్వ తరగతిలో కలుసుకొనుటకు వెళ్ళుచున్నందున ఆ వేళ ఒక తేనీటివిందును ఒసంగితిమి. ఆనాడు కనిపించిన ఆ క్రొత్తపల్లి రంగారావు చౌదరిగారు ఈ నాటివరకూ మనకనిపించలేదు. కారణం ఆయన 1956 జనవరి నెలలో గుండెపోటువలన కలకత్తాలోనే మరణించారు.

## ఎన్. ఎ. నాయుడుగారు మరణం

ఒక సోదరుని గోల్పోయా మని దుఃఖసాగరంలో మునిగి యున్న సమయమున ''తగిలిన కాలికే తగులు తుంది, చెడిన కుటుంబమే చెడుతుంది" అన్నట్లు మరో సోదరుడగు శ్రీ ఏన్.ఏ. నాయుడుగారు కూడా మోటారు ప్రమాదానికి గురియై అమరుడయ్యాడు.

## సంఘం రిజిష్ట్రారుకు చిరునామా

గుండె ధైర్యాన్ని వదులుకోకుండా సంఘాన్ని రిజిష్టరు చేయుపనిని కొనసాగించాము. అడపాదడపా నిబంధనావళికి మార్పులూ చేర్పులూ వస్తూ ఉండేవి. తగిన సమాధానాలు యిస్తూ యుండేవారము.

సంఘం అడ్రసు "బాగానే డత్తో ఎస్టేటు" అని యిచ్చాము. అది వీలుపడదు. ఒక భవనం అడ్రసు యివ్వాలి అని రిజిష్ట్రారు అడిగారు. అప్పటికి తెలుగువా రెవరికీ దుకాణాలో, భవనాలో లేవు. అందువలన తెలుగు ఏడవ తరగతి జరుపుచున్న ఆ చిరునామా యిద్దామని ఇండియా సన్మార్గ సంఘనాయకుల అనుమతిని కోరాము. వారు మమ్ము వారి కార్యవర్గ సమావేశానికి వచ్చి అనుమతి కోరమన్నారు. అట్లే వారి సభలో కలుసుకొన్నాము. కాని, వారు ''ఒక పొయ్యిలో రెండు కుండలతో వంటచేయుటకు వీలుపడదు" అని నిర్మొగమాటంగా చెప్పేశారు. ఆశాభంగం కలిగినందులకు విచారపడి ఏవో రెండు మాటలు తమిళంలో అన్నారు తెలుగు వీరుడు శ్రీ తరిని వరహాలుగారు. నిజంగా వరహాలుగారికి అంతగా తమిళం రాదు. అందువలన కోపావేశం జెందిన ఆ సన్మార్గ సంఘంవారు— ''తెలుగువారు మనలను తిడుతున్నారు; ఇంత కొంత సేపుంటే కొడతారు" అని చెబుతూ సభనుండి అందరూ లేచి వెళ్ళిపోయారు.

## మురిపిండి అప్పలనాయుడుగారి దుకాణం

సంఘాన్ని ఎలాగైనా నమోదు చేయించాలి. మనకు ఆఫీసు అక్కరలేదు. కార్యదర్శి యిల్లే ఆఫీసుగా ఉంచుకుందాం. కాని, రిజిష్ట్రారు చేయుటకు ఎవరి భవనం అడ్రసు యివ్వడం అని ఆలోచించాము. బాగాన్ డత్తో ప్రాంతములోని 25వ మైలు కోలాపేరా ఎస్టేటులో శ్రీ మురిపిండి వెంకటస్వామి తండేలుగారు కొంత పచ్చగా ఉండేవారు. వారికి ఒక చిన్న కాఫీకొట్టు

అక్కడే ఉండేది. ఎలుకలకు ఆటకొట్టుగా నుండిన అది శ్రీమురిపిండి అప్పలనాయుడుగారి ఆధీనంలో ఉండేది.

శ్రీ మురిపిండి అప్పలనాయుడు మంచి తెలుగు అభిమాని. సంఘం ప్రారంభమైంది మొదలు నిన్న మొన్నటివరకు చౌక అద్దెకు తమ కారును తోలుకొని మన సంఘాభివృద్ధికి తన్నుతాను దోహదం చేసుకున్న తెలుగు పుత్రుడు. ఆయనను అ భవనం అడ్రసును ఉపయోగించుకొనుటకు అనుమతి అడిగాము. ఆ క్షణమే సరి అన్నారు. "25వమైలు, 41వ అంకె, బాగాన్ దత్తో రోడ్డు, బాగాన్ దత్తో" చిరునామాను ప్రభుత్వానికి పంపించాము.

## ఆఫీసు భవనం చూచుటకు రిజిష్ట్రారు

మనం యిచ్చిన చిరునామాను అందుకున్న రిజిష్ట్రారుగారు ఆ భవనం నిజంగా ఉందా? ఆఫీసు జరుపుటకు తగినదా? అని చూచుటకు ఫలానా తారీఖున యిన్ని గంటలకు వస్తాను. మీరు తయారుగా ఉండండి అన్న ఉత్తరం మే మిచ్చిన చిరునామాకే వచ్చింది. దానిని చదువుకొని, "తమాషాకి తగిలించుకొని, తన్నుకుంటే బిగుసుకుంది" అన్నట్లు పేరు మాత్రానికై ఆ ఎలుకల దుకాణం చిరునామా యిస్తే, చూడటానికి ప్రభుత్వ అధికారి వస్తే, నిజంగా సంఘం నమోదుకు భంగం కలుగుతుందని విచారపడ్డాము. మరి "చల్లకు వెళ్ళి ముంతదాచుట యేల" అన్నట్లు జరిగింది, జరుగుతుందని ఆ గుర్తించిన దినాన్ని ఆ భవనం దగ్గర కాక ఆ భవనాన్ని కెళ్ళే రస్తాదగ్గర ఉండి ఆయన కారు రాగానే దానిని మళ్ళించుకొని వేరొకచోట అయనకు సకల మర్యాదలూ చేసి మన కొరతలను, భవనాన్ని గూర్చి సవినయంగా విన్నవించుకున్నాము. శ్రీపెరైరా అన్న ఆ మళయాళ సోదరుడు మనకు అభయమిచ్చాడు.

## స్ట్రాథ్ మాషి తోట దొరతో ఉత్తరాల గొడవ

రిజిష్ట్రారుకేమో భవనం అడ్రసు యిచ్చాముగాని, సంఘం ఉత్తరాలన్నీ నేనుండే స్ట్రాత్‌మాషి ఎస్టేటుకే వస్తుండేవి. ప్రతిదినం ఎస్టేటు పోస్టు బంట్రోతు బాగాన్ దత్తోకు వెళ్ళి ఎస్టేటు ఉత్తరాలు పట్టుక వస్తూ ఉండేవారు-అ ఎస్టేటుకు, దొరకు వచ్చే ఉత్తరాలన్నిటి కన్నా నా పేరుకు వచ్చే ఉత్తరాలే రోజూ అధికంగా ఉండేవి.

ఒకనాడు అ ఎస్టేటు మానేజరుగారు నన్ను ఆఫీసుకు పిలిపించారు. "ఈ తోటలోని పోస్టు బంట్రోతును నా ఉత్తరాలు తెచ్చుటకు జీతం యిచ్చి పెట్టుకున్నాను. నీ సంఘం ఉత్తరాలకు గాదు. ఇకపై సంఘం ఉత్తరాలు ఈ ఎస్టేటు చిరునామాకు రారాదు సుమా" అని ఆజ్ఞాపించారు.

మలాయా దేశం అప్పటికి స్వాతంత్ర్యం పొందలేదు. బ్రిటీషు పరిపాలన వారికి అధికారము, గర్వము ఆ కాలంలో అధికంగా ఉండేవి. అదే ఎస్టేటులో ఉపాధ్యాయులుగా ఉన్నందున అధికంగా ఏమి చెప్పలేక పోయానుగాని, ఉత్తరాలు పంపటానికి స్టాంపులు అన్న పేరిట ప్రభుత్వానికి రుసుము చెల్లిస్తున్నాము. ఉత్తరాలు వస్తున్నాయి. మీరు పట్టుకరాకపోతే నేను ప్రభుత్వానికి వ్రాసి వారినే పట్టుకరమ్మంటాను. మీకు సమ్మతమయితే చెప్పండి" అని అడిగాను. నిజంగా సరి అంటే ప్రభుత్వం ఆ దొరపై చర్య తీస్తుందని తెలిసి, నా కిచ్చిన ఆజ్ఞను అంతగా పట్టుచేయలేదు. సరి "ఆంధ్ర సంఘము"అన్న పేరు కవరుపై వ్రాయవద్దని మీ సభ్యులకు చెప్పుము. సోమునాయుడు అని మాత్రం వ్రాయమనుము అని తన ఆవేశమైన ఆజ్ఞను ఉపసంహరించుకొన్నారు. ఈ అల్లరికి కారణం సంఘంపై అసూయజెందిన ఒక మళయాళ గుమస్తా యగును. చూశారా! ఒకచోట ఒక మళయాళ సోదరుడు సహాయపడ్డాడు. మరో చోట మరో మళయాళ సోదరుడు చెడుపు చేశాడు!

## మలాయా ఆంధ్ర సంఘం రిజిష్టరు అయింది

పడవలసిన శ్రమలు ఇలా పడుచూ సంఘం రిజిష్టరు అయింది అన్న ఉత్తరం ఎప్పుడు వస్తుందా అని అందరం ఎదురుతెన్నులు చూస్తూ ఉండేవారము. తెలుగు తల్లి కృపవలన 1956 ఫిబ్రవరి 17వ తేదీన "మలాయా ఆంధ్ర సంఘం" నమోదు చేయబడింది. నమోదు అంటె



శ్రీ యం. వి. కృష్ణారావు బృందం మలేషియాకు విజయంచేసిన సందర్భంలో
తెలుగు ప్రముఖులలో కొందరు.



మలేషియాలో బ్రహ్మాండంగా తయారవుతున్న శ్రీరామ దేవాలయంలో శ్రీ యం.వి. కృష్ణారావు అతనితో దేవాలయ కార్యనిర్వాహకులు, ఆంధ్రప్రముఖులు కలసియున్నారు. ఈ దేవాలయం కూర్పు తూర్పు ఆసియాలో బ్రహ్మాండమయిన దేవాలయంగా పరిణమిస్తున్నది.



ప్రధాన అధ్యక్షులు డాక్టర్ అప్పారావు గారితో దేశ గృహనిర్మాణ మంత్రి
డాక్టర్ న్యూయీ పాన్ సంప్రదింపు.



మలేషియా తెలుగువారి 'చిఱతలు' పోటీలలో పాల్గొన్న యువతీ యువకులు.



డా॥ దాశరథి, డా॥ సి. నారాయణరెడ్డిగారలను సన్మానిస్తున్న
మలేసియా ఆంధ్ర సంఘ అధ్యక్షులు డా॥ సి. అప్పారావుగారు.



విందులో పాల్గొన్న డా॥ దాశరథి, డా॥ సి. నారాయణరెడ్డి గారలు.



సుబాంగ్ విమానాశ్రయములో తెలుగు సినిమారంగానికి చెందిన నిర్మాత శ్రీ డి. రామానాయుడు
చలనచిత్ర నటుడు శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావు, వ్యాపారవేత్తయు, వినియోగస్తులునగు
శ్రీ గోపాలరావు గార్లతో సిలాంగూర్ శాఖ ఆంధ్రులు కొందరు.



సినిమా నటులు శ్రీ గుమ్మడి గారు తమ గౌరవార్థ విందులో ఉపన్యసిస్తున్నారు. ఎడమ నుండి
కుడికి—శాఖ అధ్యక్షులు శ్రీ యం. యస్. శర్మ, కార్యదర్శి శ్రీ బాశెట్టి నూకయ్య
కుడిప్రక్క—శ్రీ గోపాలరావుగారు, నిర్మాత శ్రీ డి. రామానాయుడుగారు.



అక్కినేని నాగేశ్వరరావు దంపతులు మలేషియాకు విజయంచేసిన సందర్భంలో స్వాగతం



నెగ్రి సెంబిలాన్ ముఖ్యమంత్రి డత్తో డాక్టర్ మహమద్ సైద్ గారికి శ్రీ అక్కినేని నాగేశ్వరరావుగారు పరిచయము చేయబడుచున్నారు. కుడివైపున శాఖ అధ్యక్షులు శ్రీ N.M.K. రాజు P.J K. గారున్నారు – నాగేశ్వరరావుగారికి వెనుక ప్రక్కన వారి సతీమణి శ్రీమతి అన్నపూర్ణగారు ఉన్నారు.



సినీ గాయకుడు శ్రీ యస్. పి. బాలసుబ్రహ్మణ్యాం
సిలాంగూర్ శాఖ ఆహ్వాన విందులో పలుకుట.



మలేషియాకు తొలిసారిగా విజయంచేసిన ఆంధ్రదేశం పంపిన తెలుగు పండితులగు
శ్రీ వై. మాధవాచారిగారికి విమానాశ్రయములో వీడ్కోలు.



సంవత్సరాంతపు మహాసభలలో కలుసుకున్న ఆంధ్ర సంఘ ప్రతినిధులు.



మలేసియా ఆంధ్ర సంఘ సమావేశాల్లో పాల్గొన్న తెలుగు సోదర సోదరీమణులు.

మలేసియా ఆంధ్ర సంఘ సమావేశాల్లో పాల్గొన్న తెలుగు సోదర సోదరీమణులు.







శ్రీ నేతేటి దుర్గయ్య
PPN, PPM



శ్రీ మదిని సోమునాయుడు
గౌరవ ప్రధాన కార్యదర్శి



శ్రీ ఎలగా మునియాండి



శ్రీ వేమూరి కామేశ్వరశర్మ

మలేసియా ఆంధ్ర సంఘ సమావేశాల్లో పాల్గొన్న తెలుగు సోదర సోదరీమణులు.





631 అన్న ఉత్తరం అందింది. దానిని చూచి అందరం ఆనందసాగరంలో మునిగాము.

దేశం పేరు మారినందున సంఘము పేరు, "సమిష్టి మలాయా ఆంధ్ర సంఘం, మలేసియా ఆంధ్రసంఘం" అని మార్చబడింది. ఇన్ని శ్రమల మధ్య జనించిన ఈ సంఘం, "ప్రపంచ తెలుగు మహాసభను జరిపించండి" అని ఆంధ్ర ప్రభుత్వాన్ని కోరి 1975లో మొదటి ప్రపంచ తెలుగు మహాసభలు హైదరాబాదులో జరుపునట్లు చేసింది. నేడు, 1981లో రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు మలేసియాలోనే జరుపుతున్నది.

ఇంతటి మహాకార్యాన్ని జరుపుటకు [illegible] నిచ్చిన తెలుగుతల్లికి వే మా [illegible]:

మలాయాలో ఒక తెలుగు [illegible] అని చెప్పడంతో మాత్రం [illegible], [illegible] స్థాపించి, దానికి దాదాపు పాతికేళ్ళు [illegible] త్సరాల కాలం గౌరవ ప్రధాన [illegible] సంఘాభివృద్ధికీ, తెలుగు జాతి, తెలుగు [illegible], [illegible] సంస్కృతి అభివృద్ధికీ సాయ[illegible] సకల శక్తులూ ప్రసాదించిన నా తెలుగు తల్లికి [illegible] అర్పిస్తున్నాను.

"దేశాభిమానం నాకు కద్దని
వట్టి గొప్పలు చెప్పుకోకోయ్
కూర్చి ఏదేని ఒక మేల్
కూర్చి జనులకు చూపవోయ్."

— గురజాడ.

# తెలుగు తల్లి!

ఎల్లపు కృష్ణమూర్తి, A. M. N. P. J. K.

వందనం వందనం మాతెలుగు తల్లీ !
వందనం వందనం మా వెలుగు తల్లీ !
మా ఆంధ్రమాతకు మామల్లెదండ
మాతెలుగు తల్లికి మంగళారతులు !
మాలేసాంద్రను ఒకటిగా చేర్చి
మా ఆంధ్ర సంతతిని రక్షించుమమ్మా !
దీవించు దీవించు తేనెలొలికేతల్లి !
దీవించి మమ్మేలు మాఆంధ్ర మాత !
వందనం వందనం మాతెలుగు తల్లీ !
వందనం వందనం మావెలుగు తల్లీ !

[మెట్టు : మాతెలుగు తల్లికి మల్లెపూదండ]

# మలేసియా - మలేసీయులు

## పులమరసెట్టి లక్ష్మణ

మనము మలేసీయులము. మలేసియాలో జన్మించి నందున, మలేసియాలో జీవించుచున్నందువలన ఈ దేశము మన తల్లిదేశము అగును.

పలు జాతులవారు ఈ దేశములో జీవించుచున్నారు. మలాయివారిని చూడవచ్చును, చీనాయివారిని చూడ వచ్చును, హిందువులను చూడవచ్చును, ఐరోపావారు ఇంకా సబా, సర్‌వాక్ రాష్ట్రములద్వారా కడజాన్‌వారు, బాకో, మురుట్, ఇబాన్ జాతులవారిని చూడవచ్చును. కాబట్టి మలేసియా పలుభాషలు గల దేశము అయినది. ఇన్ని వేరుపాట్లులోను మనము మనదేశమును ప్రేమించు చున్నాము. ఉన్నతమైన దేశముగా పాటించుచున్నాము.

మలేసీయుల మయిన మనకు పలువిధులు ఉన్నవి. ఆ విధులను అక్కఱతో, బాధ్యతతో నిర్వహించ వలయును. ప్రభుత్వవిధులను సక్రమమైన బాధ్యతతో నిర్వహించవలెను. ప్రభుత్వ విధులను గ్రహించి కట్టు బడి ప్రవర్తించవలయును.

మనదేశమునకు ఒకరారాజు ఉన్నారు. అతనిని దేశీయ భాషలో డూలీయంగ్ మహా మూలియా శ్రీ పాదుకాబహిందాయాంగ్‌డిపెర్తునాన్ అగోంగ్ అనె దరు. రారాజుగారికి భక్తివిశ్వాసములు చూపించ వలయును.

మనదేశమును నడిపించుటకు పలువురు అధ్యక్షులు ఉన్నారు మంత్రులున్నారు. మంత్రులకు అధ్యక్షులుగా ఉంటున్నారు ప్రధానిమంత్రిగారు. మనదేశము ప్రధాన మంత్రిపేరు మాన్యశ్రీ డత్తోహూసేన్‌వోన్. ఆయన చాల దయగలవారు. సమర్ధులు. కడు సమర్ధతతో మన దేశమును నిర్వహించుచున్నారు.

మన దేశీయభాష మలాయి అగును, మలేసీయు లందఱకు ఈభాష తెలిసియుండుట అవసరమగును. ఈ భాషద్వారా మలేషీయులు తమతమ పనులను జయప్రదంగా నిర్వహించుచున్నారు. అన్నదమ్ములవలె ఒకరినొకరు అర్థము చేసుకుంటున్నారు. ప్రేమతో కష్టసుఖములందు కలుసుకుంటున్నారు.

మనదేశములో ఇస్లాం, హిందూ, క్రైస్తవ, బౌద్ధ మతములు గలవు. జాతీయమతం ఇస్లాం అయినప్ప టికిని తక్కిన మతములు స్వతంత్రముగా వ్యవహ రించుటకు వీలున్నది.

మలేసియా పంచశీలం అనబడు రుకునెగారాలో మొదటివాక్యము భగవంతుని విశ్వసించుము అన్నదే. హరిరాయాపువసా, హరిరాయాహాజి, నబిజన్మదినము ఇవి ఇస్లాం పండుగ దినములు. దీపావళి సంక్రాంతి ఉగాది మొదలయినవి హిందూపండుగలు. క్రిస్తుమస్ పెద్దశుక్రవారము ఈస్టరుదినము క్రొత్తసంవత్సరము క్రైస్తవపండుగలు. విశ్వాదినము, చైనీస్‌క్రొత్త సంవత్సరము బౌద్ధులపండుగలు ఇంకా తూర్పు మలే సియాలో తాము పెసార్ గావాయ్‌డయాక్ మొద లయిన పండుగలను చేయుచున్నారు.

మలేసియాలో ఈ పండుగలు కొన్నిజాతీయ స్థాయిలో జరుగును. ఒకరియిండ్లకు మరొకరు విజయము చేయుదురు. శుభాకాంక్షలు తెలుపుదురు. పరస్పరము విందు ఆరగించెదరు.

ఎఱ్ఱందిపువ్వు జాతీయ పుష్పమగును. మన దేశ ములో పురాతన పుష్పము కాబట్టి జాతీయపుష్పంగా ఎన్నుకోబడినది. ఈ పూవును మలేసియాలో అన్ని చోట్లందును చూడవచ్చును.

జాతీయ జ్ఞాపకార్థచిహ్నము జాతీయమసీదు ప్రజా ప్రతినిధుల సభ భవనము (Parliament House) మెర్డెకా క్రీడా మైదానము సందర్శించవలసిన ముఖ్యమైన చోట్లు. చరిత్ర ప్రసిద్ధి చెందిన మలాక్కా కోటలు. పెనాంగ్ కోమరన్‌కొండ ప్రేసర్‌కొండ కనుల పండుగ దృశ్యములు. పోర్టిక్షన్, మలాక్కా, మెర్సింగ్ కోటాతింగి జలపాతములు బత్తుకోల్ గుహలు, ఇంకా నదులు వాగులు కొండలు ఇంపైన సొగసైన మలే సియా ఆనందరాజ్యము భగవంతుని కృపతో అనుభ విద్దాము మనదేశ వరప్రసాదములను.

# మలేసియాలో ఆంధ్రుల భాష - కళాచారములు
# ఆనాడు - ఈనాడు - రేపు

ఎల్లపు కృష్ణమూర్తి, AMN. PJK.
అధ్యక్షులు
దక్షిణ పేరా, మ. ఆం. సం. శాఖ

మలేసియాదేశము, భారతదేశమునకు, 'ఆగ్నేయ' దిక్కున దాదాపు 1800 మైళ్ళకు అవల గలదు. సుమారు ఒక కోటి, పదిలక్షల జనాభాగల నేటి 'మలేసియా' పూర్వము బ్రిటిషువారి పరిపాలనలో ఉండేది. తేది 31-8-1947 నాడు స్వాతంత్ర్యము పొందినది.

మలేసియాలో మాట్లాడబడు భాష 'మలాయాభాష' ఆ భాషనే జాతీయ భాషగా వాడబడుచున్నది. మలేసియా, పలుజాతులు, పలుమతములు, పలుభాషలు మాట్లాడే ఒక 'అంతర్జాతీయ' దేశమనే చెప్పాలి. మలేసియాలో మలాయావారు, చీనావారు, ఇండియావారు, ఇతరులు నివసించుచున్నారు. మలేసియా దేశమును బారీసాన్ నేషనల్ అనే పార్టీయొక్క పరిపాలనలో వున్నది. (అమ్నో) అనే మలయావారి పార్టీ, (MCA) అనే చీనావారి సంఘము, (MIC) ఇండియావారి సంఘము, అంటే ఈ మూడు జాతులచే నిర్మింపబడినదే, బారీసాన్ అనే పార్టీ.

మలేసియాలో చీనావారు, అన్ని విధముల చాల అభివృద్ధిలో వున్నారు. చెప్పాలంటే, మలేసియాదేశము యొక్క 'ఆర్థికమే' వారి చేతులలో ఉన్నదని చెప్పాలి. ఇండియావారిలో తమిళులు, తెలుగువారు, మళయాళీయులు, పంజాబువారు (శిక్కులు), ఇతరులు కలరు. తమిళులే ఎక్కువ సంఖ్యలో వున్నారు. పదిలక్షల ఇండియావారిలో, తమిళులే ఎక్కువగా యున్నారు. 2వ వారు తెలుగువారు. తక్కినవారికంటె, తెలుగు వారు మలేసియాలో చాల వెనుకబడియున్నారు. అన్ని విధముల మన తెలుగువారు అభివృద్ధి యవనేలేదని చెప్పాలి.

కారణము, పూర్వకాలములో అంటే 100 సంవత్సరములకు పూర్వము వచ్చిన ఆంధ్రులు చాల అమాయకులు, నిరక్షరాస్యులు అనే చెప్పాలి. అందువలన వారు వారి యభివృద్ధికి, వారి భాషాభివృద్ధికి వారి సంతతాభివృద్ధికి, వారు కించిత్తైన పాటుపడలేదు. కాని ఆనాడు వారి అమాయకత్వము, చాలమంది తెలుగు వారిని, తమిళులుగా మార్చివేసినది. అధిక సంఖ్యలో నివసించుచున్న, కొన్ని ప్రాంతములలో మాత్రము మనవారు మనభాషా, కళాచారములు మర్చిపోకుండా, ఆంధ్రులు అనిపించుతూ,తమ పిల్లలకు తెలుగు నేర్పిస్తూ వచ్చిరి. అటువంటి ప్రాంతములలోనే తెలుగు పాఠశాలలు ఉండెడివి. తెలుగువారికి దేవాలయములు ఉండెడివి.

వారే, తెలుగు, కళాచారములను, పోషించుకుంటూ వచ్చిరి. ఆనాడు, వారు అనుసరించిన, కళలనే, ఈనాడు కొన్ని అనుసరింపబడుచున్నవి.

## దేవాలయములలో పూజలు

ప్రతి శనివారము, దేవాలయములలో భజనల్ను చేసెడివారు. ఆ భజనను కాళ్లకు గజ్జెలుకట్టి, వాయించు తాళములు, బట్టి, దీప స్తంభము చుట్టు ఉండి, పాడుతూ ఆడుతూ భజనలు చేసెడివారు. కొన్ని వేళలలో కూర్చుండి, భజన, పాటలు, పాడేవారు. ఆనాడు

వారు, ప్రతి కుటుంబము, ఒక్కొక్క శనివారము, వారివారి వాటా చొప్పున భజన చేయించి, దానికగు ప్రసాదము కగు ఖర్చు పెట్టుకొనేవారు.

అలాగునే కోలాటము ఒక్కొక్క వారము, వారు నిర్ణయించినట్లు చిఱతలు పట్టి ఆడేవారు. వీటికని తాళములు, గజ్జెలు (మువ్వలు) ఆంధ్రదేశమునుండి, తెప్పించెడివారు.

నాటకములు, అచ్చటచ్చట, గల ఆనాటి యువకులు, వీధి భాగవతముల లాంటివి, స్టేజి నాటకములు, నేర్చి పండుగలకు, నటించెడివారు. ఇవి, దీపావళి పండుగలకు ఎక్కువగా జరిగేవి. కారణము, ఆనాడే వారికి, అప్పుడు రెండు దినములు శలవులు దొరికేవి. నాటకములు, ముఖ్యముగా, పాదుకా పట్టాభిషేకము, కృష్ణలీల, హరిశ్చంద్ర, నలదమయంతి, ఎక్కువ, భారత రామాయణములలోని భాగములు నటించేవారు.

## జముకుల పాట

ఈ జముకులపాట, రాత్రులు, ఎక్కువగా, ఒకరు వాయించుతూ పాడుతుంటే, యిద్దరు వెనుకయుండి, పాడేవారు చాల బాగుండేది. వారుగూడ, ఈ భారత రామాయణములలోవే, పాటలు, వరుసగా, 2/3రాత్రులు పాడించేవారు. ఆనాడు వారికి చందాలు వసూలించి యిచ్చేవారు. కొంతమంది ఆ సమయములో డబ్బు యిచ్చి తమ పేరును, పొడిగించుకొనేవారు. ఎవరు ఎక్కువ డబ్బు యిస్తే వారిని ఎక్కువగా పొగిడేవారు.

## హరికథలు - పురాణకాలక్షేపములు

హరికథలు గూడ యీ రీతిగానే పాడించేవారు. రాత్రులు భారతము 18 పర్వములు రామాయణము పూర్తి ఒకరు చదువుచుంటే యింకొకరు అర్థములు చెప్పేవారు. ఇవి ఒక దగ్గర ముగియగానే మరియొక స్థలములో ప్రారంభించెడివారు (ఒక రైతు యిండ్లవరుస)

## చందమామ—గొబ్బిలు

స్త్రీలు ప్రత్యేకముగా ఈ చందమామ గొబ్బిలు పాడుతూ చుట్టుతిరుగుతూ ఉండే ఒక అందమయిన ఆట, పాట చూడ ముచ్చటగా హాయిగా యింపుగా ఉండేది.

## స్త్రీల కాలక్షేపము

స్త్రీలంతా కలసి కామమ్మ, చిన్నమ్మ, లక్ష్మమ్మ, బాలనాగమ్మ, సన్యాసమ్మ యింకా యెన్నో స్త్రీలకు సంబంధించిన కథలు చదివించెడివారు.

## ఆటలు - మగవారు

సాయింకాలము వేళలలో చెడుగుడి, ఉప్పు-పట్టిబిళ్ళ ఆటలు, వ్యాయామములు గరిడి (సాము) మల్లయుద్ధము లాంటి (దండిపట్లుపట్టుట) మొదలగు ఆటలు ఆడేవారు.

## పండుగలు

ఉగాది, శ్రీరామనవమి, సంక్రాంతి, కృష్ణజయంతి, నూకాలమ్మ పండుగ, భూలోకమ్మ పండుగ, దీపావళి లాంటివి చేసెడివారు. స్త్రీలు ప్రత్యేకముగా కొన్ని వ్రతములు చేసెడివారు. సత్యనారాయణవ్రతము, త్రిమూర్తుల వారి వ్రతము, గౌరీ లక్ష్మి నోములు యిలాంటి పండుగలు చేసెడివారు.

## వివాహములు (పెండ్లిండ్లు)

ఆనాటి పెండ్లి - పెండ్లికుమారుని తల్లి తండ్రులు, పెండ్లి కుమార్తె తల్లి తండ్రులు, పెద్దలు చూచి, చేసివేయుదురు. పెండ్లి రాత్రియనగా ఉదయం 10-00 గంటలకు పెండ్లి కుమారుడు పెండ్లి కుమార్తెకు కాళ్ళ గోళ్ళు తీయు (సంబ్రమణి)ట అనే సాంప్రదాయమును చేసి, తలంటి స్నానాదులు చేయించుదురు. పురోహితుని ద్వారా పెండ్లి జరుపుదురు. (పురోహితులు తమిళులే). ఆనాటి పెండ్లి కార్యక్రమములో ఎక్కువ పగవేషలలో డప్పుల వాయిద్యములు ఉపయోగించెడివారు. రాత్రులు పెండ్లి జరిగేటప్పుడు మేళవాయిద్యములు ఉపయోగిం

చెడివారు. పెండ్లి అయిన మూడవదినమందు (యానాలు) పెండ్లి కుమార్తె తల్లి తండ్రి యింటికి (అత్తవారింటికి) అల్లుడు తరలి వెళ్ళే ఉత్సవము విందులు వినోదములు పండుగులాగు చేసెడివారు. పసుపునీళ్ళాటలు మొదలగునవి ఉండేవి.

## పండుగ దినములలో

పండుగ దినములలో స్త్రీలకే ఎక్కువ బాధ్యత యని చెప్పాలి. తొలి రోజుననే ఇల్లు, వాకిలి, శుభ్రముగా కడిగి ఉంచెడివారు. ఇంటి ముందు మామిడాకు తోరణములతో అలంకరించెడి వారు ఇంటి ముందు (ముగ్గులు) మురిపించేటటువంటి తెలుగు తల్లుల కళానైపుణ్యమును, అందమైన అలంకారములతో, చుక్కలు పెట్టి ఆ చుక్కల మధ్య ఉంచి, రేఖలతోను ఎడబాటు లేకుండా, కూర్పబడినదే బిందుజ మనబడు, మన స్త్రీలు అలంకరించు పోత ముగ్గులు. ఈ ముగ్గులు వేయుటలో మన ఆంధ్ర మాతలు అందెవేచిన చేతు లని చెప్పనక్కఱలేదు. సూర్యు డుదయించక మునుపే, యింటిలోగల అందరు, అభ్యంగన స్నానాలుచేసి. మంచి పిండి వంటలు, పూవులు, పండ్లు, సుగంధ పూజా ద్రవ్యములచే, ధూప దీప మంగళారతులతో పూజలుచేసి, అందఱకు ఆనాడు ప్రసాదము పంచెడివారు.

అయా పండుగుల పూజా విధానములను అనుసరించి ఏ పండుగ ఎలాగున చేయవలయునో వారికి తెలిసిన రీతిని చేసెడివారు. ఆనాటి ఆంధ్రులు ఆచారలను ఆచరించిరి కాని, వారియొక్క భావికాల సంతతిని గూర్చి తమ ఆర్థికాభివృద్ధినిగూర్చి మలేసియాలో స్థిర పడాలనిగాని వారు కించిత్తు అయినా వూహించలేక పోయిరి. తమతో మద్రాసు రేవులో ఓడ నెక్కి ఒకే సారి వచ్చిన ఆంధ్రేతరులను, చూచి అయినా నేర్చుకొనలేకపోయిరి. అప్పటి వారి ధ్యాస సంపాదించి ఆంధ్ర దేశములో ఉన్న తమ దాయాదులకు డబ్బు పంపించి ఆంధ్రలో స్థిరపడాలి యని తలంచి తప్పుడు ఆలోచనల వలన తల క్రిందులయిరి.

అప్పటికి వారికి దాయకత్వము వహించి జ్ఞానబోధ చేసి వారి బుద్ధిని మార్చే ప్రబుద్ధులు లేకపోయిరి. అందువలన ఆంధ్రులు అభివృద్ధి కాలేకపోయిరి.

## ఆనాడు తెలుగు భాష

తెలుగువారు విద్యకు ఎక్కువ మక్కువ చూపి తమ బిడ్డలను చదివించలేరు. మన దేశము నుండి బ్రతకడానికి వచ్చితిమి. కాని, బలపడుటకు రాలేదు. కష్టపడి పనిచేసే కార్మికులుగా వచ్చితిమి గాని కలిమి బలిమి గలిగిన భావి సంతతిని సంపన్నులుగాను, విద్యావంతులుగాను, తయారు చేయాలన్న తలంపే లేక పోయినది.

ఆనాడు ఎస్టేట్ల యజమానులచే నిర్మింపబడిన బడులలో తమ బాలురను యేదో నూటి 5/6 గురు తమ బిడ్డలను చదివించెడివారు. ఆనాడు ఎస్టేట్లలో శుక్రాల, గేంగ్ అనే పేరుతో 10-12 వయస్సు గల పిల్లవాళ్లకు, తక్కువ జీతములో పని యిచ్చెడివారు నూటికి 95 మంది పిల్లవారిని పనలకు పంపించేవారు. కొన్ని ఎస్టేట్లలో సాయంత్రము 2-00 గంటల నుండి 5-00 వఱకు పాఠశాలలు జరిపించేవారు. అందులో కొంతమంది తెలుగుతేజము గల తల్లి దండ్రులు చదివించిన బిడ్డలే చదివి ఉపాధ్యాయులయి, మలేసియాలో తెలుగు పాఠశాలల అభివృద్ధికి నిర్మాణమునకు తోడ్పడిన తెలుగు తనయులని చెప్పవలసి యున్నది. వారిని మలేసియాంధ్రులు మర్చిపోలేరు.

ఆనాడు వారు ఆర్థికాభివృద్ధికి, భాషా కళాచారముల అభివృద్ధికి పాటు పడకపోయినా, తమ భాషను ఆచారములను కళలను మర్చిపోకుండా వాటిని వారికి తెలియునట్లుగా పోషించుకుంటూ మర్చిపోకుండా పాటించుకుంటూ వచ్చినందున మన తెలుగు భాషా కళాచారములు పూర్తిగా క్షీణించకుండా మలేసియాలో తెలుగుదనము ఆంధ్రత్వము అడుగంటకుండా కొంత సజీవముగా నిలచియున్నది యని చెప్పవలసి యున్నది.

ఆనాటి స్త్రీలు కుడిపైటను ఉపయోగించెడివారు. కారణము ? ఏమూలనున్నా వారిని తెలుగువారే యని వెంటనే గుర్తించగలిగిరి. ఇప్పటికీ మలేసియాంధ్ర మాతలు కుడిపైటను వేయుచున్నారు. ఈనాడు ఆ పైట ఎడమపైటగా మారిపోవుచున్నది. కారణము కుడిపైట చీరలు దొరకడం లేదు. ఆనాటి మగవాడు చిలకకట్టు కట్టేవారు. ఈనాడు చెరాయిలుగా మారినవి.

## ఈనాడు భాష కళాచారములు

రెండవప్రపంచయుద్ధము తర్వాతను ఆంధ్రదేశము నకు మలేసియాకు చాలవఱకు స్వతంత్రముగా వచ్చే రాకపోకలు తగ్గిపోయినవి. అందువలను సాధారణ గాయకులు గాని యితర కళాకారులు గాని 1942 సంవత్సరము 1945 సంవత్సరముల మధ్యకాలమున అనగా, జపానువారి పరిపాలనలో తిండి బట్ట లేక కఱవు బాధకు తట్టుకోలేక కొందరు క్రొత్తగా సయాం దేశమునుండి బర్మాదేశమునకు అడవులు కొట్టి మార్గ ములువేయుటకు జపాను తీసుకెళ్ళినవారిలో చాల మంది తెలుగుకుటుంబములు వేనకు వేలుగా చని పోయినందున మలేసియాలో తెలుగు కళాకారులకు కఱవైనదనే చెప్ప వలసియున్నది.

ఆంధ్రదేశమునుండి ఎవరు రాలేకపోయిరి. 1946–1955 ఈ మధ్యకాలములో మన తెలుగు భాష కళా చారములు చాలవఱకు క్షీణించిపోయినవి. ఆనాటిభజనలు, జముకుల పాటలు, హరికథలు, పురాణకాలక్షేపములు, నాటకములు, కోలాటములు,చందమామగొబ్బిలు, ఆటలు వ్యాయామాములు యించు మించు అన్నీ చాలవఱకు క్షీణించిన వనీ చెప్పాలి.

ఇందువలన మనతెలుగువారిపై ఆంధ్రేతరుల ప్రభా వము పడినది. వారి కళాచారములు భాష బాగుగా మన వారికి అలవడినవి. కొంతమంది అనాయక ఆంధ్రులకు ఆంధ్రేతరభాష(అనగా తమిళము)పై మక్కువ మమకా రము ఎక్కువగుటకు ఈ క్రిందకారణములనే చెప్పవలసి యున్నది. 1. సినిమాచిత్రములు 2. రేడియో 3. పత్రికలు 4. వారిపాఠశాలలు 5. కార్మికసంఘము లాంటి ముఖ్యసంఘములలో వారి భాష వారి నాయక త్వమువలన తమిళమే అన్నిటికి ముఖ్యము అనితలంచి తెలుగువారికి మాతృభాషయొక్క మాధుర్యమునుమఱచి స్వభాషమీదను మనకళల పైనను మోజు తగ్గుతూ తమ పిల్లలను, తమిళ పాఠశాలలో చదివించుతూ క్రమేణా వారు తమిళులుగా మారిపోయిరి. వారు తెలుగంటే తక్కువ భాష యని గౌరవములేని భాష యని ఆంధ్రే తరుల అభిప్రాయములకు దాసులైపోయిరి.

తెలుగువారు అభివృద్ధి కాకపోవుటకు ఈ దిగువ కారణములనే చెప్పాలి.

1. మలేసియాంధ్రులను ఐక్యపర్చే మన భాషాభి వృద్ధిని జాతభివృద్ధిని తెలుగు సంస్కృతిని మన కళాచారములను వారికి ఎత్తిచెప్పే నాయ కులు లేకపోవడము.
2. తెలుగు సినిమాలు రేడియోలు పత్రికలు నాట కములు ఆటలు పాటలు లేకపోవటము.
3. తక్కిన సమూహములను చూచి అయిన మనలను గూర్చి మనవారు ఆలోచించక లేకపోవటము.
4. ఆంధ్రేతరుల ప్రభావము, వారి ప్రాబల్యము, మన వారిపై అధికార ప్రభావము, వారి ఉప దేశము వేదవాక్యములు మనమంతా ఒకటేయని చెప్పినందున, సొంత బుద్ధి సొంత ఆలోచన పోవటము.
5. తెలుగు విద్యావంతులు లేకపోవటము, ధన వంతులు అసలే లేని కారణము, కార్మికులు గ్రామములు, ఎస్టేట్లలో నివసించుచున్నందున, నాగరికత, మన సంస్కృతితో సంబంధము లేకుండా యుండిరి.
6. ఏదో అచ్చటచ్చట కొద్దిగా చదువుకున్నవారు న్నను, వారు స్వలాభపరులుగాను, ఇతరభాషలకే సేవచేసెడివారుగను, ఎవరైన మన భాషను గూర్చి మాట్లాడినచో వారిని భయపెట్టి, హేళనచేసి, పిరికివారుగను, మనవారికి నాయ కత్వము వహించలేని భాషాభిమానములేని అడుగులకు మడుగులొత్తే తొత్తులుగను మాత్రమే తయారుచేయుచు ఉండిరి.

అందువలన మన సమూహము భాష, కళాచార ములు, ఈ కాలములో యభివృద్ధి చెందలేదు.

## మలేసియాంధ్ర సంఘము—ఆంధ్రుల అభివృద్ధి

ఈ నాడు మలేసియాలో పలు జాతులు, పలు మత ములు, పలు భాషలు మాట్లాడే ప్రజలు గలరు. అందఱు

ఆయా జాతి, కళాచారములను అర్థము చేసుకొని వాటికి గౌరవము యిస్తూ, ఐక్యముతో ఆయా జాతి, భాషా, కళాచార సంఘములను స్థాపించుకొని, ఒకరి నొకరు గౌరవించుకుంటూ జీవించుచున్నారు.

కాని, ఆంధ్రులకు మాత్రమే ఏ సంఘముగాని, నాయకులుగాని లేక అనాథ ఆంధ్రులై యుండిపోయిరి. తెలుగువారి దీనత్వమును, ఆంధ్రుల అమాయకత్వ మును గుర్తించిన కొంతమంది ఆంధ్రనాయకులు ఆనాటి తెలుగు 7వతరగతి చదువుచున్న తెలుగు విద్యార్థులతో వారికి విద్య బోధించుచున్న తెలుగు ఉపాధ్యాయులు, శ్రీ నేతేటి దుర్గయ్య PPN, శ్రీ మదిని సోమునాయుడు PPN. PJK. PPT., కుండా సిద్దయ్య, K. V. స్వామి, పోతల మారయ్య, ఆడారి అప్పలనాయుడు, కన్నయ్య నాయుడు, తరణి వరహాలు, చౌదరిగార్లతో కూడిన నాయకత్వముతో సంఘమును స్థాపించిరి.

ఈ ఆంధ్ర సంఘము 1956 సంవత్సరములో స్థాపించిన తర్వాత, మలేసియాంధ్రుల చరిత్రయే పూర్తిగా మారిపోయినది. సంఘ నాయకులు రాత్రి పగలనకుండా ఎస్టేట్లు, గ్రామాలు పట్టణములు ఎచ్చ టెచ్చట ఆంధ్రులు గలరో ఆయాప్రాంతములలో నిద్రా హారములు మాని ప్రచారముచేసి, ఆంధ్ర సంఘములో ఆంధ్రులను చేర్చిరి. మలేసియాంధ్రులకు ఈ క్రింది విధముగా బోధించిరి.

1. తెలుగు పిల్లలను విద్యావంతులుగా చేయాలి.
2. తెలుగు పాఠశాలలు పెంచాలి.
3. మలేసియా రేడియోలో తెలుగు పాటలు, తెలుగు కార్యక్రమములు జరగాలి.
4. తెలుగు సినిమాలు చూపించాలి.
5. తెలుగు పత్రికలు ప్రచురించాలి.
6. తెలుగు కళాచారములను భజనలు, చిఱుతలు, గొబ్బిలు, నాటకములు, నాట్యములు, బుర్ర కథలు తిరిగి మన కళలను పునరుద్ధరించాలి.
7. తెలుగువారు కార్మికులుగా మాత్రమే ఉండరాదు. ఉద్యోగస్థులుగను భూస్వాములుగాను రాజ కీయముగాను ఆర్థికముగాను తెలుగుజాతి బల పడాలి.
8. ఆంధ్రులంతా మలేసియా పౌరులుగా ఉండాలి.
9. అన్ని రంగములలోను అన్ని సహకార కార్మిక తదితర ప్రభుత్వ శాఖలలోను ఆంధ్రులు సభ్యులు గాను, నాయకులుగాను ఉండాలి.
10. ప్రభుత్వము అభివృద్ధిచేసే, కార్యక్రమములలో మనవారు సభ్యులుగానుండి, దేశోద్ధరణకు పాటు పడాలి.

1956 సంవత్సరమునాటి కోర్కెలలో, ఈనాడు 1981వ సంవత్సరమునాటికి చాలకోర్కెలు నెరవేరినవి. మిగిలినవి నెరవేరుటకు ప్రయత్నములు చేయుచున్నారు.

ఎంతోమంది డాక్టర్లు, ఇంజనీర్లు, లాయర్లు, చాటర్డు ఎక్కౌంటెన్టులు, గుమస్తాలు ఉన్నతవిద్యా వంతులు (గ్రాడ్యువేట్సు), ఉపాధ్యాయులు, నర్సులు, సివిల్ సర్వంట్సు, పోలీసుశాఖ రాణువశాఖలో– అన్ని రంగములలోను ఈనాడు ఆంధ్రులను చూడవచ్చును. వ్యాపారస్థులు భూస్వాములు స్వతంత్రముగా జీవించే వారుగా, మనవారు ఇంతత్వరలో అన్నిరంగముల లోను ఆర్థికముగాను అభివృద్ధి అయివారంటే యిది అంత ఆంధ్రసంఘం సేవ యనియే చెప్పాలి.

ఈనాడు తెలుగు సినిమాలు చూడగలుగుచున్నారు. మలేసియాంధ్రులచే మూడు ఫిల్మ్సంస్థలు నడుపబడు చున్నవి. మలేసియాలో తెలుగుఅచ్చుయంత్రములు గలవు. మలేసియా సింగపూరు రేడియోలలో తెలుగు పాటలు కర్ణాటక సంగీతమువినగలుగుచున్నాము (T.V) టెలివిజను మలేసియాలో ప్రతి యేట ఉగాదిపండుగకు తెలుగు సినిమా చూడగలుగుచున్నాము.

మలేసియాలో తెలుగు డాక్టర్ల క్లినిక్‌లు చూడ గలుగుచున్నాము.

భజనలు, చిరుతలు, గొబ్బిలు, నాట్యములు, బుర్ర కథలు లాంటి హాస్యములు కొద్దిగా తిరిగి యభివృద్ధి యగుచున్నవి. ఇంకను మనకళలను చాల పెంచు కోవలసియున్నది.

ఈనాటి పండుగలు

భోగి పండుగ, సంక్రాంతి, కనుమపండుగలు చాల విమర్శగా చేయుచున్నారు. భోగి మంటలు వేసి స్నానము తర్వాతను చలికాచుకొందురు.

సంక్రాంతికి పితృదేవతల పేర్లను క్రొత్తబట్టలు చీరలుకొని పెట్టుదురు. కలకూర (6 కాయగూరలు) చేర్చినకూర పిండి వంటలతో పలువిధములగు వంటలు చేసి పండుగ చేయుచున్నారు. ఆడవారు ముత్తైదువలకు పసుపు కుంకుమలు పంచిపెట్టుదురు.

కనుమపండుగ నాడు ఆవులను కడిగి పసుపు కుంకుమ పూసి పూజ చేయుదురు.

ఉగాది మలేసియాంధ్రులకు ప్రత్యేకమైన ఆంధ్ర జాతి జాతీయ పండుగ. కారణము దీనికి మతముతో సంబంధములేకుండా హిందువులు (తెలుగు) క్రైస్తవులు (తెలుగు) ముస్లీములు (తెలుగు) కలసి వారి వారి దేవాలయములలో ఇండ్లలో పూజలు చేసి ఉగాది మహోత్సవమును ఆటల పాటల నాటకముల పోటీలతో బహుమానములతో నాయకులఉపన్యాసములతో వరుసగా 2/3 మాసములవరకు ప్రాంతీయ పద్ధతిలో ఇతర సమూహముల వారిని పిలచి చక్కగా చేయుచున్న గొప్ప తెలుగువారి పండగ.

గ్రామదేవతల పండుగలు

నూకాలమ్మ, భూలోకమ్మ, శ్రీరామనవమి, కృష్ణ జయంతి, దీపావళి లాంటి పండుగలు చేయుచున్నారు. తెలుగు క్రైస్తవులు క్రీస్తుపండుగలు తెలుగు ముస్లిములు ముస్లీము పండుగలు చేసి తక్కిన తెలుగు వారిని పిలిచి కొనియాడుచున్నారు. ఆయామతములవారు తక్కిన మతముల వారిని వారి వారి పండుగులకు ఆహ్వానించి ఐక్యముతో కలసి మెలసి యున్నారు.

ఈనాడు ఆనాటి ఆంధ్రుల కళాచార భాషాభివృద్ధులను తిరిగి పునరుద్ధరించి పెంచుటకు ప్రతి ఆంధ్రుడు ఆంధ్రమాత కంకణము కట్టుకొని వాటిని యభివృద్ధి చేయుటకు పాటుపడే మీతల్లి సంఘ మగు ఆంధ్ర సంఘాభివృద్ధికి పాటు పడాలి.

రేపు

మలేసియాలో తెలుగు పాఠశాలలు క్రమముగా తగ్గుతూవస్తున్నవి. 1981 నాటికి చాలతగ్గినవనేచెప్పాలి. కారణములు చాలమంది ఆంధ్రులు ఆంధ్రదేశమునకు పోవడము, తెలుగు పాఠ్యగ్రంథములు సరిగా లేకపోవటము, ఆంధ్రులు తక్కువగాఉన్న ఎస్టేట్లలో తెలుగు పాఠశాలలు మూసివేయుట, యిలాంటి పలు కారణముల వలన మన పాఠశాలల సంఖ్య తగ్గుతూనే వున్నది.

కాబట్టి మలేసియాంధ్రులు ఇది గమనించి వారి పిల్లలు యేయే పాఠశాలలు, మలేపాఠశాలలు (మలాయ) ప్రారంభ, మాధ్యమిక, పాఠశాలలలో ఎక్కువగా మన తెలుగు పిల్లలు ఉంటే, తమ మాతృభాషను బోధించమని, ఆయా పాఠశాలల ప్రధానోపాధ్యాయులద్వారా విన్నవించవలయును. లేనిచో కాలక్రమేణా మన భాష క్షీణించే పరిస్థితి యేర్పడును. మలాయా సామెత ప్రకారము "Bhasa Hilang, Bangsa Hil ang" భాష పోయినచో, జాతి పోవు ననే సామెత మన తెలుగు వారికి రాకుండా చూచుకొనవలయును. జాతికి భాష గుండెలాంటిది. మనమే మనభాషను చేతులారా నిర్మూలించుకున్నప్పుడు, మన జాతికి మిగిలేది శూన్యము.

ఆంధ్రదేశము, ఆంధ్రప్రభుత్వము ఆంధ్రభాషకు తల్లి, జీవనాడి. విదేశాలలో అంతర్జాతీయ రీతిలో ఆంధ్ర భాష పెరగాలంటే ఆంధ్ర ప్రభుత్వము ఆంధ్ర సంస్కృతి స్థాయిని పెంచాలి. తెలుగువారిని ఐక్యము చేసి ఒకటే తెలుగు, ఒకటే వెలుగు, ఒకే బాట, ఒకే మాట యని ప్రపంచ తెలుగువారిని ఒకటిగా చేర్చగల శక్తి ఒక తెలుగు భాషకే గలదు. కాబట్టి అట్టి ఘనమైన కార్యము చేయగలిగే శక్తి ఆంధ్ర దేశ నాయకులకు, ప్రభుత్వమునకు కవులకు గాయకులకు పండితులకు కళాకారులకే గలదు. దీనికి ఈ ప్రపంచ తెలుగు మహాసభలు తోడ్పడగల వని ఆశించుదాము.

చేయెత్తి జైకొట్టు తెలుగోడ!

జగమంత ఘన కీర్తి గలవాడా!

# మలేసియా ఆంధ్రులకు ఆంధ్ర సంఘం అత్యావసరము

ఎలగ మునియాండి

మలేసియా ఆంధ్రసంఘము 1955 సం॥న కీ.శే. శ్రీయుతులు నేతేటి దుర్గయ్య, సిద్దయ్య శ్రీమదని సోము నాయుడు ఇంకా పలువురు సంఘాభిమానులచే స్థాపించ బడి అధిక ప్రచారము పొంది పలు శాఖలతో మలేసియాంధ్రులజీవితపు ముందంజకు నూతన బాటను చూపుతూ ఆంధ్రులకు పలు మంచి కార్యములు చేసి యున్నదని చెప్పుటకు ముదమొందుచున్నాను.

నేడు మలేసియాలో తెలుగువారు తెలుగులో సరళంగా మాట్లాడుచున్నారంటే దీనికి కొంత కారణము సంఘమని కూడ చెప్పవచ్చును. ఆంధ్రసంఘము ప్రారంభించుటకు మునుపు ఆంధ్రులు తెలుగు భాషతో కొన్ని పదములు అరవము మిళితముచేసుకొని మాట్లాడే వారు. సంఘము వెలసిన పిమ్మట నేడు మలేసియాలో తెలుగువారు తెలుగు భాషను అచ్చ తెలుగులో మాట్లాడే వారు కూడ ఉన్నారని చెప్పుటకు సంతోషించు చున్నాను.

సంఘము ఉదయించి ఈ 25 సం॥లలో నెరవేర్చి యున్న మహత్తర కార్యములను ఈ క్రింద పొందు పరుచుచున్నాను.

మలేసియా తెలుగువారు కొనియాడే పండుగలు సంక్రాంతి, దీపావళి, శ్రీరామనవమి, ఉగాది లాంటివి. ఈ ఉగాది పండుగ ఆంధ్రుల పండుగని మునుపు ఎవరికి తెలియదు. మారిషస్ ఆంధ్రుడు శ్రీ గున్నయ్య వుట్టూగారి ఆంధ్రప్రదేశ్ పర్యటనద్వారా ఇది ఆంధ్రుల పండుగని గమనింపబడినది. అప్పుడు మారిషస్ ఆంధ్ర సంఘమునకు ఉత్తర ప్రత్యుత్తరములు జరుగుచుండెడివి. దానిద్వారా మనము తెలుసుకోగల్గాము. ఈ పుణ్యము సంఘమునకే దక్కుతుంది.

1960 సం॥నకు మునుపు ఈ దేశములో విద్యారంగములో తెలువారు చాల వెనుకబడియుండిరి. "చదువుకోరా ఓ న మః లు, తెలుసుకోరా తెలుగు సంస్కృతి" అనే మాటలను సంఘ సభలలోను ఉగాది లాంటి పండుగ సమావేశాలలో నాయకులు పలికిన పలుకులు విని ముందడుగు వేసిన నాటి పాపలు నేడు డాక్టర్లుగాను, లాయర్లుగాను, ఇంజనీయర్లుగాను రాణించారు. ఆ పలుకులను పెడచెవిని బెట్టి ఆకతాయిగా తిరిగే నాటి పాపలు తోటలలో కూలినాలి పనులు చేసుకొనుచు కష్టాల పాలైనారు. దీనినిబట్టి మన కొక నిజం స్పష్టమగుచున్నది- 'పెద్దలమాట చద్దిమూట' అన్నది.

1963వ సం॥లో మలేసియా ప్రభుత్వము తెలుగు బీద విద్యార్థులకు విద్యారంగములో మాన్యము నిచ్చుట నిలిపివేసినది. ఇది వినిన సంఘ నాయకులు ప్రభుత్వముతో వాదోపవాదములు జరిపిరి. మరియు అది తెలుగు విద్యార్థులకు లభించేటట్లు చేసిరి. ఇది సంఘము కట్టుకున్న పుణ్యమే.

ఆనాడు కోకిల కంఠమును మించిన తెలుగు గీతములు విశ్వశ్రవణిలో వినుటకు చెవులు కోసుకొనే ఆంధ్రులు నేడు కొన్ని నిమిషములైన వినుటకు సాధ్యమౌతుందంటే ఇదియు ఆంధ్ర సంఘ కృషియే. చీకటిలో అలమటించే మలేసియాంధ్రులను వెల్తురులోకి తీసుకొని వచ్చి జ్ఞానాభివృద్ధి పొందుటకై కొందరి అభిమానులచే 1963వ సం॥వ విదేశాంధ్ర అను పేరుతో ఒక పక్షపత్రిక స్థాపింపబడినది. ఈ పత్రిక వెలువడిన పిదప ఆంధ్రులలో ఒక చైతన్యం ప్రారంభమైనది. 15దినముల కొక తడవ ప్రచురింపబడినపత్రికశృంగారాక్షరములతోఅభిమానము గల ఆంధ్రుల కరములలో దివ్యజ్యోతివలె ఎచటచూచిన

తెలుగు మయముగ ఉండెడిది. ఈ పత్రికలో అప్పు డప్పుడు సంఘవార్తలున్నూ తెలుగుభాషకు సంబంధించిన వార్తలున్నూ లోక విజ్ఞానవార్తలున్నూ ప్రచురించే వారు. ఇట్లు కొన్నాళ్లు తెలుగువారి చేతులలో జీవింపగలిగింది. పిదప 30 కాసులు చెల్లించి చదివే పాఠకులు మనలో చాల తక్కువగా ఉండెడిచేత ఈ పత్రిక ఒకటిన్నర సం॥ తరువాత మూతపడ్డది. ఈ పత్రిక స్థాపనకు ఆంధ్ర సంఘ ప్రోత్సాహమే కారణము. విదేశాంధ్ర పత్రిక మూయబడిన పిదప సంఘ బలము కూడ కొంత తగ్గిందనే చెప్పవచ్చును.

1967సం॥వ ఎన్నో సంవత్సరముల ఆంధ్రసంఘపు కోరిక మేరకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వముచే పంపించిన పండితుడు ఎర్రోజు మాధవాచార్యులు మలేసియాకు విజయము చేసిరి. అతను మలేసియా అన్ని ప్రాంతాలలో పయనించి తేనె లొలికే తెలుగు సాహిత్యోపన్యాసములను వినే భాగ్యము మనకు లభించినది. అతను మలేసియా పర్యటనకు పిదప మలేసియా తెలుగువారి మధ్య ఒక క్రొత్త వేగము ప్రబలింది. శ్రీ ఎర్రోజు మాధవాచార్యులు వద్ద ఆంధ్ర సంఘము ఒక మెమొరాండమును సమర్పించినది. అది ఏమనగా మలేసియాలో తెలివిగల బీద విద్యార్థులకు ఆంధ్ర ప్రభుత్వము వివిధ కళాశాలలో కొన్ని సీట్లు కేటాయించవలెననియు ఆకాశవాణి ద్వారా ఉదయము డిల్లీ నుండి ప్రసారమయ్యే కార్యక్రమములలో విదేశాలలో నివసించుచున్న ఆంధ్రుల కని ప్రత్యేకంగా కొన్ని నిమిషములైన ఒసంగవలయుననియు, విజయవాడ రేడియో కేంద్రము శక్తిమంతము చేసి తెలుగు పాటలు, కథలు ప్రచారము చేయవలయుననియు, విదేశములలో నివసించు తెలుగువా రందరిని ఒక్క వేదికపైన నిలిపి పరిచయము చేసుకొని అడుగంటిపోవుచుండిన తెలుగు భాష, చరిత్ర, సంస్కృతిని పునరుద్ధరించుటకై అంతర్జాతీయ ఆంధ్రుల మహాసభలను జరుపా లనియు వేడుకొన్నది. దానికి ఫలితమే ఎన్నో వ్యయ ప్రయాసలకు ఓర్చి 1975సం॥ ఏప్రిల్ 12వ తేదీన ప్రపంచ ఆంధ్రుల మహాసభలు జరుపబడినవి. ఇది ప్రపంచ ఆంధ్రుల పరిచయ సభలుగానే ముగిసినది. ఇటుపైన జరిగే సభలు తెలుగు భాషను, చరిత్రను, సంస్కృతిని పరిశీలింపగలవని ఎదురు చూద్దాం.

నాట్య శిరోమణి ఉమా భారతిని ఆంధ్ర ప్రభుత్వము మలేసియాకు పంపించి ఆమె ద్వారా కూచిపూడి నాట్యమును ప్రదర్శింపచేయగా చూచి ఆనంద కడలిలో తేలియాడాము. మరియు జంటకవులగు డాక్టర్ దాశరథి నారాయణరెడ్డి గార్లచే

పంచదారకన్న
పనస తొనలకన్న
తీపితేనెకన్న
తెలుగు మిన్న

అనే తెలుగు ఉపన్యాసములను విని ఆనందించాము. ఇట్లు తెలుగు గడ్డపైన పుట్టిన రాజపుత్రులు మలేసియాకు విజయము చేసినచో వారిని రండి రండని ఆహ్వానిస్తూ గౌరవించి పంపించేది ఆంధ్ర సంఘం. ఇట్లు ఆంధ్ర సంఘము ఇటు సమాజమునకు, అటు భాషకున్నూ ఎన్నో మంచి కార్యములు చేసి యున్నదని చెప్పుటకు సందేహము లేదు. తొలి ప్రపంచ మహాసభలు ముగించిన పిదప రెండవ ప్రపంచ మహాసభలు మలేసియాలో జరుపాలని అచ్చటి నాయకుల కోర్కె. ఆ కోరికను మన్నించి 8-4-78నాడు మలేసియాలో జరుపుటకు సన్నాహాలు జరిగినవి. దురదృష్టవశాత్తు 1977నవంబర్ మాసములో ఆంధ్రప్రదేశ్‌లో తుఫాను నిమిత్తమై మహాసభలు త్రోసివేయవలసి వచ్చినది. అట్లు మహాసభలు జరుపాలంటే ఎచ్చట ఏ భవనములో జరుపాలి చీనావారి క్లబ్బులో జరుపవలయునా? లేక దేవాన్ ఓరాంగ్ రామాయ్‌లో జరుపవలయునా అన్నది గుర్తించిన సంఘ నాయకులు దీర్ఘముగ యోచించి చివరకు ఆంధ్రులకు ఒక భవనము కావాలి, అది కట్టాలి, అది ఎట్లు? ఒక్కరిచే జరుగవలసిన కార్యమా? పది మంది ఒకటిగా చేరి చేయవలసిన కార్యము గదా! మలేసియా ఆంధ్రుల చరిత్రలో ఇది ముఖ్య ఘట్టము. పట్టుదల ఉంటే పరమేశ్వరునినే జయించవచ్చు నని తెలుగు సామెత ఈ దేశములో లక్ష యాభై వేల ఆంధ్రులున్నూ ఒక్కొక్క వ్యక్తి రెండు వెండీలు చొప్పున చెల్లించినట్లైతే చాల సులభంగా అందాల ఆంధ్ర భవనము కట్టగలము.

ఉద్రేకము గల ఆంధ్రులు చెల్లిస్తూ వచ్చిన డబ్బుతో కౌలాలంపూర్‌లో కట్టబడుచున్నది స్వదేశములో గల తెలుగువారినే కాక విదేశములో గల తెలుగువారిని కూడ ఆహ్వానించే రోజులు అతి చేరువలో నున్నదని చెప్పుటకు మకరందము పొందుచున్నాను.

మలేసియాకు ఆంధ్రసంఘం వేసిన పునాది నిమిత్తమై 15-4-81 నాడు రెండవ ప్రపంచ మహాసభలు మలేసియా ముఖ్యపట్టణమగు కౌలాలంపూర్‌లో జరుగనున్నవి. ప్రపంచంలో అన్ని దేశాలనుండి అభిమానం గల తెలుగు సోదరులు మలేసియా ద్వీపకల్పమును అలంకరించెదరు. కాబట్టి ఈ సభలు జయప్రదము గావింప తెలుగు తేజమును, గౌరవమును నిలబెట్టుకొనుటకై మలేసియా అన్ని ప్రాంతాలతో నివసించు తెలుగువారు వచ్చి సభలలో కలుసుకోవా లని అతివినయముతో కోరుకొంటున్నాను. మలేసియా ఆంధ్రసంఘము ఆంధ్రులకు ఎన్నో ఘనకార్యములు చేసియున్న దని చెప్పుటకు సంతోషించుచున్నాను. ఏది ఏలాగైనా ఆంధ్రులకని ఆంధ్రసంఘము అత్యావసరమని చెబుతూ నా వ్యాసమును ముగించుకొనుచున్నాను.

'మంచినీరు పోయ - మల్లెపూచును గాని
ఫలిత మొసరుబెట్టు - పని జొరమిని
వంట చేయు కెట్లు - వంటక మబ్బును ?
విశ్వదాభిరామ - వినురవేమ.'

# ముద్దుల మలేసియా

## కర్రి అచ్యుతరామయ్య

ముద్దయిన మలేసియా - మురిపెముల మలేసియా
రాగాల మలేసియా - రతనాల మలేసియా ॥ముద్దయిన॥

ఒక కోటి మానవుల - ఒకటి చేయు మలేసియా
సోదర భావాల - నందించే మలేసియా
పవిత్ర ఆశయాలు - పంచుకునే మలేసియా ॥ముద్దయిన॥

మాయని తొలి మమతల - ప్రేమసీమ మలేసియా
ప్రపంచ ప్రజల శాంతి - పాటించే మలేసియా
తరుగని పెన్నిధిరా - ఆనంద మలేసియా ॥ముద్దయిన॥

తీయని కోరికలే - చిలికేటి మలేసియా
శాశ్వత భోగాల - శాంతియుతం మలేసియా
భూతల స్వర్గమందు - బ్రహ్మాండ మలేసియా ॥ముద్దయిన॥

# నాడూ - నేడు

## అల్లు సింహాచలరావు కెడా

ఈ రజతోత్సవము జరుపుటకు పూర్వం, అంటే పాతికేళ్ళకు, మనం వెనుదిరిగి చూస్తే, ఆనాటి ఆంధ్రు లకు, ఈనాటి ఆంధ్రులకు మధ్య ఎన్ని తేడాలు ఉన్నవో ఇట్టే గ్రహించగలము ఈనాడు మలేషియా ఆంధ్ర సంఘం సరి, ఆంధ్రజాతి సరి, అన్ని రంగా లలో, అభివృద్ధి చెందింది అంటే, దాని వెనుక ఎందరి ఆదరాభిమానాలు, ఎందరి శ్రమ ఫలితం, మరెందరిదో అపారదీక్ష, ఇవన్నీ గూడుకట్టుకొని ఉన్నాయంటే, నా మాట సత్యదూరం కాదనుకుంటాను. సంఘం పాతి కేళ్ళకు పెరిగింది. నవయౌవనాన్ని అందుకుంది. అనుకున్నది సాధించగల శక్తిని పుంజుకుంది. ఈనాడు ప్రపంచ తెలుగు మహాసభలను, మలేసియాలో జరుప గలశక్తి ఆంధ్ర సంఘానికి ఉందంటే, ఆ సంఘాభి వృద్ధికి వెనుక ఎలాంటి కృషి, సేవ చేయబడి ఉంటుందో మనం గ్రహించగలం.

ఆనాడు-అంటే అది పందొమ్మిది వందల ఏభై సంవ త్సర సమయంలో, ఆంధ్రుల స్థితి అయోమయంగా ఉండేది. తెలుగుజాతిని ఒక మాటపైకి, ఒక బాట పైకి, నడిపించే నాథుడు లేకపోయాడు. చుక్కాని లేని నావలాగున, ఆంధ్రులు అంధకారంలో నివసించారు. ఎవరికి వారే యమునాతీరే అన్నట్టు, ఎవరెవరు ఎలా జీవించాలనుకున్నారో, అలా అలా జీవించారు. ఉన్నదే ఊరు, మానిందే మందన్నట్లు. ఆంధ్రేతరులతో చేరి వారి దేశ భాషలకు బానిసలై, తెలుగుతల్లి, తెలుగు భాష కళ ఆచారాలు అన్నిటిని విడిచి మన తాత తలి దండ్రుల దేశం నుంచి వచ్చిన పొరుగు రాష్ట్ర ప్రజ లను అనుకరించారు. ఇంకా చెప్పాలంటే, అసలు మేము తెలుగువారమే కాదు అని చెప్పేవారు. మలేషియాలోని తెలుగువారు ఇలా మారడానికి ఎవరు కారకులు? ఈ నింద ఎవరిపై మోపాలి?? తెలుగుజాతిని మంచి అడుగు జాడల్లో, నడిపించ ఆనాడు విద్యావంతులైన తెలుగు వారు ఒక్కరు గూడ ముందుకు రాలేదు. వారు ఆంధ్రే తరులకు బానిసలై, తెలుగుజాతిని తలంచకపోవడం, తెలుగుజాతికే వారు గొడ్డలిపెట్టు అయినారు. నిరక్ష రాస్యులు ఆంధ్రాభిమానం గలిగిఉన్నా, ఏదీ చేయలేని అసమర్థులుగా, జీవితాలను సాగించారు. ఆనాడు తెలుగు జాతికి గ్రహణం పట్టిన రోజులనే చెప్పాలి. చీకటిలో చిందులాడే తెలుగుజాతి మేలుకొనే దెప్పుడు? ఆంధ్రాభి మానాన్ని దాచుకోలేని కొన్ని తెలుగు హృదయాలు ఆవేదన పడ్డాయి, ఘోషించాయి.

“మలేయాలోని తెలుగు వారు ముందుకోవాలి. తెలుగుజాతి ఐక్యపడాలి. మలేయా రేడియోలో తెలుగు పాటలు ప్రసారం కావాలి” అన్న నినాదాలు నేటి తమిళ్‌నేసన్, తమిళ్ మురసు పత్రికల ద్వారా చేసిన వారు ఎవరో కాదు. అతనే ఈనాటి మలేసియా ఆంధ్ర సంఘ కార్యదర్శి శ్రీ మదిని సోమునాయుడుగారు. అతనిని అనుసరించి, శ్రీ దాడి శ్రీరాములు, శ్రీ బి. ఆర్. సింహాచలం, శ్రీ కొరువాడ సుబ్రమణ్యం, కౌలాలంపూర్ నుండి, శ్రీ ఎ. జాన్‌లాలయ్య, శ్రీ తిరు పాల్, కెడా రాష్ట్రం నుండి శ్రీ జి.వి. సుబ్రమణ్యం, ఆంధ్రరావు చిన్నయ్య, అల్లు సింహాచలరావు లాంటి వారు. తెలుగు సోదరులతో ఉత్తర ప్రత్యుత్తరాలుజరిపి ఐక్యతను పెంపుచేసుకోసాగారు. ఈ సోదరులు వ్రాసే ఉత్తరాలలో ముందుమాట “జై ఆంధ్ర” అని వాడే వారు. అప్పటికి తెలుగువారి కని ఒకతెలుగుపత్రిక లేదు. అందువల్ల తమ తమ భావాలు, తమిళ పత్రి కల్లో వ్రాస్తూ, తెలుగు జాబులు మిత్రులకు వ్రాసే వారు. పేరాక్ రాష్ట్రం వాళ్ళే, ఆంధ్ర సంఘానికి

పునాది వేసినవారు. ఏడవ తరగతి తెలుగు విద్యార్థులు, వారి ఉపాధ్యాయులు, శ్రీ నేతేటి దుర్గయ్య, శ్రీ ఏ. కన్నయ్యనాయుడు, శ్రీ మదిని సోమునాయుడు లాంటి వారి అపార కృషి ఫలితం 1955 లో పెరాక్ ఆంధ్ర సంఘం స్థాపింపబడి, పిదప మలేసియా ఆంధ్ర సంఘం అయింది. ఈ సంఘం ఆరంభించడానికి మరెందరో పాటుపడ్డారు. వారి అందరి పేర్లు ఉదాహరించనందుకు క్షమించవలయును.

ఆంధ్రసంఘం ఆరంభించబడి, దానిద్వారా తెలుగు అభిమానులు ఒకటైనారు. స్వర్గీయ శ్రీ కౌరువాడ సుబ్రమణ్యం చందమామలాంటి పత్రికలు రప్పించి, తెలుగు పిల్లలు తెలుగు చదివేటట్టు చేశారు. కౌలా లంపూరు నుండి స్వర్గీయ శ్రీ ఎ. జాన్‌లాలయ్య జ్యోతి అనే తెలుగు కరపత్రిక వెలువడించారు. కెడా రాష్టంకు చెందిన శ్రీ స్వర్గీయ జి. వి. సుబ్రమణ్యంగారు, స్వాతంత్ర్యం అను పేరుతో తెలుగు ముద్రణాలయము స్థాపించి తెలుగు పెండ్లి పత్రికలు ముద్రించేవారు. శ్రీ స్వర్గీయ బి.ఆర్. సింహాచలంగారు ఉద్యోగధర్మమైన ప్పటికీ, సంఘమణి అను తెలుగు కరపత్రిక వ్రాసి, తెలుగువారందరకూ పంపేవారు. ఈ నలుగురు గూడ ఈ రజతోత్సవ సమయంలో మనలో లేరు. ఈ నలుగురూ స్వర్గీయు లగుట తెలుగు జాతికి తీరని లోటు. కాని, వీరు ఎన్నటికి మలేసియా తెలుగువారికి చిరస్మరణీయులే. వీరి తెలుగు సేవ చాల గొప్పది. వీరిని ఆంధ్రసంఘము ఏ నాటికి మరచిపోదు. ఆంధ్రసంఘ చరిత్రలో వీరిని లిఖించాలి. ఆంధ్రసంఘం ఆరంభించిన పిదప, ఆంధ్రసంఘ సభలు ఎస్టేటులందు జరిపేటందుకు కొన్ని అడ్డంకులు వచ్చేవి. హిందువుల ఐక్యత పాడుచేయడానికి. ఆంధ్రసంఘం ప్రయత్నిస్తుంది అన్నవారు నేడూ ఉన్నారు. మరికొందరేమో మొలకలోనే త్రుంచి పారవేయా లన్నవారు ఉన్నారు. కొన్ని స్థలములందు సభలు జరుప అనుమతి ఇవ్వని కొన్ని ఎస్టేటుల యజమానుల ఉన్నారు. ఎంద రెన్ని అడ్డంకులు తెచ్చినా, వాటిని లక్ష్యంపెట్టకుండా, ఆంధ్ర జాతి ఐక్యము, దాని అభివృద్ధియే ముఖ్యమని, ఎన్నో ఇక్కట్టులను దాటి, నేడు మలేసియా ఆంధ్రసంఘం రజతోత్సవం జరుపుకుంటోందంటే, ఆ ఘనత దాని వెనుక పాటుబడిన, ఎందరో తెలుగు అభిమానుల కృషి ఫలితమే అనాలి.

నేడు తెలుగుజాతి మేల్కొన్నది. ఆంధ్రసంఘపు అడుగు జాడలలో పయనిస్తుంది. శ్రీ సి. అప్పారావుగారి అధ్యక్షత తెలుగుజాతికే ఒక దక్షత అయింది. ఆంధ్రుల్లో విద్యావంతులు పెరిగారు. ఆర్థికంగా ముందు కొస్తున్నారు. అన్ని రంగాలలో ఆంధ్రుల అభివృద్ధి చెందాలన్న అభిలాషలు పెరుగుతున్నాయి. రోజులు మారుతున్నకొద్దీ, తెలుగుజాతికి మంచిరోజులు వస్తున్నాయి అన్న నమ్మకాలు గోచరిస్తున్నాయి. సంఘానికి స్థిరాస్థిగా పదిహేను ఎకరాల భూమి, ఐదు అంతస్తుల భవనం కలిగి ఉండుట, ప్రతి తెలుగువాడు గర్వపడవలసిన విషయం. సంఘం మనకు ఏమి చేస్తుంది? అని ప్రశ్నించకముందు మనం సంఘ అభివృద్ధికి ఏమిటి చేస్తున్నాము? అని మనలను మనమే ప్రశ్నించుకుంటే మనం అన్ని రంగాలలో అభివృద్ధి చెందగలము.

సంఘాభిమానం నాకు గల దని
వట్టి మాటలు చెప్పబోకోయ్!
తెలుగుజాతికి సేవలెన్నో
చేసి తెలుగును చాటవోయ్!!

# దక్షిణ పేరా శాఖయొక్క చరిత్రము

బి. కె. సింహాచలము
దక్షిణ పేరా శాఖ కార్యదర్శి

1956లో సింపాంగ్ అంపాట్ భారతి పాఠశాలలో చదువుచున్న తెలుగు ఏడవ తరగతి విద్యార్థులకును టెలుక్కాన్సులో చదువుచున్న తమిల్ 7వ తరగతి విద్యార్థులకును మధ్య బంతాట పోటీ ఒకటి జరిగినది. ఈ పోటీలో తెలుగు ఏడవ తరగతి జట్టు అపారమైన జయము పొందినది. ఇది మొదలు పై జట్టువారు పలు తావులలో ఆడి తెలుగు వారియొక్క గట్టితనాన్ని బయట చూపిరి. మలేసియాలో ఉన్న ఇతర భాషల వారి కందరికిని ప్రత్యేకమైన సంఘాలు ఉన్నవి అదే ప్రకారము తెలుగు వారమగు మనకును ఒక సంఘము ఉంటే ఆ సంఘము మూలముగా మనము మన తెలుగు భాషా సంస్కృతి, కళలను పెంచుకొనవచ్చునని తెలుగు 7వ తరగతి విద్యార్థులు పలు విధాలుగా ఆలోచించి 1956 లో 7వ తరగతికి విద్య బోధించుచున్న ఉపాధ్యాయులగు శ్రీ నేతేటి దుర్గయ్య, శ్రీ మదిని సోమునాయుడు, శ్రీ అల్లు కన్నయ్య నాయుడు, శ్రీ తిమోది మొదలగు వారితో కలిసి మాట్లాడిరి. అందులకు పైన గుర్తించబడిన అధ్యాపకు లందరును మంచి ఆలోచనలు ఇచ్చి తెలుగు వారు అధికముగా నివసించు చున్న బాగన్ డత్తో ప్రాంతములో ఉన్న తదితర నాయకులు అనగా శ్రీ పోతల మారయ్య, శ్రీ కొరువాడ వెంకప్ప, శ్రీ బి. యస్. సముద్రము, శ్రీ ద్వారపూడి సోమునాయుడు, శ్రీ ఆడారి అప్పల నాయుడు. శ్రీ కోరుబిల్లి అప్పలనాయుడు, శ్రీ కే.ఆర్. రాజు, శ్రీ కాశీన రమణయ్య, శ్రీ తరిణి వరహాలు, కొరువాడ సుబ్రమణ్యము, శ్రీ అడ్డూరి జువ్వాలు మొదలగు వారందఱు కలసి మాట్లాడి 1956 లో "దక్షిణ పేరా ఆంధ్ర సంఘము" అను నామకరణముతో సంఘము స్థాపించిరి. ఈ స్థాపనము స్థాపించుటకు ఎక్కువగా సహకరించిన వారు శ్రీ నేతేటి దుర్గయ్య, శ్రీ మదిని సోమునాయుడు గార్లని చెప్పవచ్చును.

మొదట ఈ సంఘములో ఉన్న సభ్యులు చాల వఱకు బాగన్‌డత్తో ప్రాంతమువారే నని చెప్పవచ్చును. కాలక్రమమున టెలుక్కాన్సన్ తంజమాలియం వఱకు విస్తరింపబడినది. పైన గుర్తించిన నాయకులు మలాయా అంతటను పర్యటించి సంఘమునకు సభ్యులను చేర్చిరి మలాయా నలుమూలలు మన సంఘమునకు ఎక్కువ సభ్యు లున్నందువలన దక్షణ **పేరా**, ఆంధ్ర సంఘమన్న నామమును మలేసియా ఆంధ్ర సంఘము అని మార్చబడినది. మలాయా ఆంధ్ర సంఘ అభివృద్ధి కొఱకును, తెలుగు భాషాభివృద్ధి కొఱకును శ్రమలను ఇక్కట్లను లెక్కసేయక తమ సాయ శక్తులతో ఎక్కువ పాటుపడినవారు దక్షిణ పేరా శాఖ నాయకులే అన్నది ఎవరును మరువరాని విషయము.

ఇప్పుడు ఈ సంఘమునకు మలాయా అంతటను ఎక్కువ సభ్యు లున్నందువలన మలాయాలో అక్కడక్కడ ప్రత్యేక ఆంధ్ర సంఘశాఖలు వెలసినవి. ఇప్పటికి ఈ సంఘమునకు మలాయా మొత్తాన్ని 14 శాఖలు ఉన్నవి. అందులో దక్షిణ పేరా శాఖ ఒకటి. ఆంధ్ర సంఘమును మొట్ట మొదట ఆరంభించినపుడు దక్షిణ పేరా ఆంధ్ర సంఘము అను పేరు పెట్టబడినది. అదే పేరుతో దక్షిణ పేరాలో అనగా బాగన్ డత్తో ప్రాంతములో నివసించుచున్న ఆంధ్రులు "దక్షిణ పేరా శాఖ" అను పేరుతో 28-5-1961లో అప్పుడున్న మ. ఆ. సంఘ అధ్యక్షులు శ్రీ కె. వి. స్వామి

గారి అధ్యక్షతతో దక్షిణ పేరా శాఖ ఉదయమయింది. ఈ సభకు 76 మంది సభ్యులు వచ్చిరి. పై సభ బొంబాయి రెస్టారెంటులో జడిగినది. ఆ సభలో ద. పే. శాఖ ఈ క్రిందనున్న నిర్వాహమును ఎంచుకొన్నది.

అధ్యక్షులు : శ్రీ అల్లు కన్నయ్యనాయుడు.
ఉపఅధ్యక్షులు : శ్రీ అడారి అప్పలనాయుడు.
కార్యదర్శి ; శ్రీ కాశీన రమణయ్య.
కోశాధికారి : ద్వారపూడి సోమునాయుడు.
కార్య నిర్వాహకులు : శ్రీ మదిని సముద్రము, శ్రీ పాలమసెట్టి మల్లునాయుడు, శ్రీ కర్రి అచ్యుత రామయ్య, శ్రీ డి. వై. దేవరాజు రత్నము, శ్రీ కొరువాడ వెంకప్ప.

ద. పేరా శాఖ ప్రత్యేకముగా స్థాపించినప్పటికిని శాఖలో ఉన్న నాయకులగు శ్రీ వై. కృష్ణమూర్తి, శ్రీ డి. వి. శ్రీరాములు, శ్రీ మండె లక్ష్మణ, శ్రీ తరిణి వరహాలు, శ్రీ కాశీన రమణయ్య మొదలగువారు మ.ఆ. సంఘ నాయకులతో కలసి మలాయాలో తెలుగు వారున్న ప్రాంతములకు వెళ్ళి పలు ఉపన్యాసములు ఇచ్చి తెలుగు సంస్కృతి, తెలుగు కళలు, తెలుగు పాఠశాలలు ప్రగతి కొఱకు చాల పాటు పడిరి. నిజముగా చెప్పబోతే మలేసియా ఆంధ్ర సంఘమునకు పుట్టినిల్లు ద. పే. శాఖ యని చెప్పవచ్చును. ఈ సంగతి ఎవరు మరువరానిది.

## శాఖ అభివృద్ధి

శాఖ ఏటేట ఉగాది ఉత్సవములను, భూలోకమ్మ, నూకాలమ్మ, శ్రీరామనవమి, సంక్రాంతి మొదలగు పండుగలను కొనియాడి, తెలుగుభాష సంస్కృతి కళలను పోషించుకొని వచ్చినది. పండుగలు, పర్వములు మొదలగు విశేషదినములలో ఆటలు, పాటలు, గొబ్బిలు, కోలాటములు, నాటకములు, నాట్యములు, చందమామ పాటలు మొదలగు ఆంధ్రభాషాజ్ఞాన సంస్కృతి సంబంధమైన తెలుగు కళాజ్ఞానమును కాపాడుకొని వచ్చుచున్నది.

ప్రఖ్యాతి గాంచిన తెలుగు సినీమానటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు తన సతీసమేతుడై 21-6-1964 లో బాగన్‌డత్తో ప్రాంతమునకు విజయముచేసినప్పుడు ద. పే. శాఖ శ్రీ నాగేశ్వరరావు దంపతులను ఘనముగా ఆహ్వానించి విందు ఉపచారములతో గౌరవించినది.

27-11-1966లో ఆదివారం ఉదయం 10గం॥లకు బాగన్ పసీర్ సమూహ భవనములో యువతీయువకులకైన విశేష తర్ఫీతు సభయొకటి జరిగినది. ఆ సభలో ఆంధ్ర సంఘమునుగూర్చియు, ఆంధ్ర సాహిత్య చరిత్రలనుగూర్చియు, సభల నిర్వాహమునుగూర్చియు, ఆర్థికాభివృద్ధినిగూర్చియు తర్ఫీదు ఇవ్వబడినది ఈ సభకు ముఖ్యముగా దిగువ పేరా, జిల్లా పోలీసు అధికారి తరపున ఇన్‌స్పెక్టర్ ఆరిపిన్ గారును, ఆంధ్ర సంఘ ప్రధాన నిర్వాహకులను ముఖ్యులుగా ఉండిరి.

ఆంధ్రపండితులగు శ్రీ యర్రోజ మాధవాచార్యులు గారి మలేసియా పర్యటనలో ఒక దినము అనగా 15-10-1967 ఆదివారమునాడు సెలెకో్ దేశీయ మాధ్యమిక పాఠశాలలో తెలుగు భాషా సాహిత్య సంస్కృతములపై సాహిత్యోపన్యాసమును ఒసంగి తెలుగు ప్రజల మెప్పులను పొందిరి. అతగార్కి శాఖ బంగారు పతక మొకటి బహుమతిగా ఇచ్చి గౌరవించినది. 29-4-1969 లో శ్రీ వి. పి. రాఘవాచారి MLC గారును, 3-7-1976లో ప్రఖ్యాతి గాంచిన తెలుగు కవులయిన డా॥ దాశరథిగారును, డా॥ నారాయణరెడ్డిగారును ద. పే. శాఖ సభలలో కలుసుకొని మధురాతి మధురంగా తేనె లొలుకు తెలుగులో తేట తెనుగు భాషలో మంచి ఉపన్యాసములు ఇచ్చి తెలుగు వారిని ఆనందసాగరములో ముంచిరి. పై గుర్తించబడిన తెలుగు భాషాజ్ఞానులందరిని శాఖ విందు ఉపచారములతో సత్కరించినది.

మలేసియా ఆంధ్ర సంఘము సింపాంగ్ అంపాట్‌లో కొనిన సుమారు 15 ఎకరముల నేలకును, బాగన్ పసీర్‌లో కొనిన 4 ఎకరముల నేలకును ద.పే. శాఖ తన పూర్తి సహకారములతో ఎక్కువ విరాళములను వసూలించి ఇచ్చినది. ప్రస్తుతం కోలాలంపూరులో ఉన్న మ.ఆ. సంఘ భవనము కొఱకు కేంద్ర

ముచే వెలువడింపబడిన టీ చెట్లలో ఎక్కువ టీ చెట్లను అమ్మిన శాఖ ద.పే. శాఖని చెప్పవచ్చును. అంతే కాకుండ పైగుర్తించిన భవనమునకు మ. ఆ. సంఘములోగల 14 శాఖలలో ద. పేరా శాఖయే ఎక్కువ భవన విరాళమును వసూలించి ఇచ్చియు, ఇక్కట్లయిన స్థితిలో మన భవనమును కాపాడుటకు దయాళుహృదయుల దగ్గర నుండి వడ్డీలేని ఋణము సేకరించి కేంద్రమునకు తోడ్పడుటలో అగ్రస్థాన మొందినది. 1968 లో ఆంధ్ర దేశములో వరదలు వలన ఏర్పడిన ప్రాణ ధనరాసుల నష్టమునకు కేంద్రము కొంత డబ్బు దుఃఖ సహాయనిధిగా ఆంధ్ర దేశమునకు పంపినది. అప్పుడుకూడ ద. పే. శాఖ ఆంధ్రాభిమానులయొద్దనుండి సుమారు $ 380 ని దుఃఖనిధిగా వసూలించి కేంద్రమునకు సహాయపడింది. ఇట్లు ఎన్నో విధములుగా మన శాఖ మ. ఆ. సంఘముతో చేదోడువాదోడుగా ఉండి సహాయపడుచున్నదన్నది మీ కందరికిని తెలిసిన విషయమే.

సెంకండరీ పాఠశాలలో L.C.E. చదివే తెలుగు క్లాసులను శాఖ తన తరఫున ప్రారంభించి ఉచితముగా విద్య బోధింపబడినది. తమ శ్రమలను పాటించక శ్రీ డి వి. శ్రీరాములు, శ్రీ ఎల్లపు కృష్ణమూర్తి, శ్రీ కోరుబిల్లి అప్పలనాయుడు మొదలయిన వారు తెలుగు భాషాభివృద్ధికొఱకు తెలుగు పాఠములను పై గుర్తింపబడిన తరగతికి ఉచితముగా బోధించిరి.

సినీమాలు మూలముగా తెలుగు భాషను కళలను పెంచవచ్చునని శాఖ నిర్వాహకులు తలంచి 1976 లో శ్రీలక్ష్మి పిల్మ్ అను పేరుతో శాఖలో ఉన్న కొంత మంది ఆంధ్రాభిమానులు ఒక పిల్మ్ కంపెనీ ఆరంభించిరి. వీరు మొట్టమొదట 'తాత మనుమడు' అను తెలుగు సినీమాను ప్రదర్శించి జయము పొందిరి. ఇప్పుడు ద. పే. శాఖలో శ్రీలక్ష్మి పిల్మ్, శ్రీమహాలక్ష్మి పిల్మ్ సబాక్ బెర్నం శాఖలో శ్రీరామ ఫిల్మ్ అను మూడు తెలుగు ఫిల్మ్ కంపెనీవారు తెలుగు ఫిల్ములను రప్పించి మలేసియా అంతటను ప్రదర్శించుచున్నారు. తెలుగు సినీమాలు రాకకు మూల కారణము ద. పేరా శాఖని తెలియపర్చుచున్నాను.

11-8-1969లో ద.పే. శాఖ ఏర్పాటుతో దక్షిణ పేరా జిల్లా స్థాయిగా ఆంధ్ర యువజన బృందము బాగన్ పసీర్ సమూహ భవనములో మ. ఆ. మాజీ అధ్యక్షులు శ్రీ కె. వి స్వామిగారిచే ప్రారంభోత్సవము చేయబడినది. ఈ సభకు పలు శాఖల నుండి 300కు పైగా యువతీ యువకులు కలుసుకొనిరి.

ఉపకార వేతనము

ఆంధ్రుల అభివృద్ధియే తన ఏకైక లక్ష్యముగా గొన్న మన సంఘము కొందరు బీద విద్యార్థులకు సహాయము చేయనెంచి ఉపకార వేతనమును ప్రవేశ పెట్టినది. ప్రతి సంవత్సరము ఒకరిద్దరు బీద విద్యార్థులకు బడిజీతము లేక పరీక్ష కట్నము ఇచ్చి శాఖ సహాయపడుచున్నది.

11-12-68లో నవయుగ మహాకవి శ్రీ వేంకట అప్పారావు (గురజాడ) యొక్క స్మారక దినోత్సవమును సింపాంగ్ అంపాట్‌లోను, 8-12-69 లో శ్రీ కాశీనాథుని నాగేశ్వరావు యొక్క 101వ స్మారక దినోత్సవమును టెలుక్కాన్సనులోను సబాక్ బెర్నం, సింపాంగ్ అంపాట్, టెలుక్కాన్సన్ శాఖలతో దక్షిణ పేరా శాఖ కూడ చేరి, పై ఉత్సవములను చాల వేడుకగా కొనియాడినది. 10-8-1970 లో సెంట్ అంతోని పాఠశాల మండపములో ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన వైణిక శిఖామణి శ్రీ చిట్టిబాబుయొక్క మృదు మధురమైన వీణగానము విని ద.పే. ఆంధ్రులు చాల ఆనందపడిరి. అతనికి టెలుక్కాన్సనులో ఒక విందు కూడ ఏర్పాటుచేసిరి. 1978లో కుమారి ఉమాభారతి నాట్యమును కేంద్రము టెలుక్కాన్సలో ఏర్పాటు చేసి చేసినప్పుడు శాఖ అన్నివిధాల సహాయపడి నాట్య ప్రదర్శనలు జయప్రదముగాంచుటకు చాల తోడ్పడింది.

శ్రీ మండలి కృష్ణారావు బృందము ది. పే. శాఖ, సి. అ. శాఖ, స. బె. శాఖ, టెలుక్కాన్సన్ శాఖ పై నాలుగు శాఖలు ఉమ్మడి ప్రయత్నముచే సింపాంగ్ అంపాటులో 11-9-1979లో ఆహ్వాన సభ ఒకటి ఏర్పాటు చేసినవి. ఈ సభ జయకరం గావించుటకు శాఖలు చాల పాడుపడినవి. మరుసటి దినము అనగా

12-9-79లో శ్రీ మండలి కృష్ణారావు బృందమును ద. పే. శాఖలో తెలుగువారు అధికముగా నివసించుచున్న తోటలకు తీసుకవెళ్ళి తెలుగువారితో పరిచయము కల్పించినది. ఇట్లు ఎన్నో విధాలుగా ఆంధ్రదేశము నుండి మలేసియాకు వచ్చిన ప్రతీ తెలుగు కవులను, నాట్యతారలను, గాయకులను, పండితులను, ఆంధ్రదేశ నాయకులను కేంద్రముతోపాటు శాఖకూడ వచ్చిన అతిథులను గౌరవించి పంపుచున్నది.

1980వ సంవత్సరములో ద. పే. శాఖలో ఉన్న పది మంది ఆంధ్రులు అనగా శ్రీ నూకునాయుడు, శ్రీ D. V. శ్రీరాములు, శ్రీ B. K. సింహాచలము, శ్రీ M. P. అప్పలనాయుడు, శ్రీ A. అప్పలనాయుడు, శ్రీ M. E. సుబ్రమణ్యము, శ్రీ స్టీఫన్ రాములు, శ్రీ K.సోమునాయుడు, శ్రీ K.కృష్ణమ్మ, శ్రీ ఆడారి రాములు మొదలగువారు చేరి టెలుక్ బారులో ఒకపిసరు నేలనుకొని ద. పే. శాఖకు దానముగా ఒసంగిరి. వారికి శాఖ కృతజ్ఞతలు తెల్పుకొనుచున్నది. దానముగా శాఖకు ఒసంగబడిన నేలలో శ్రీ నూకు నాయుడు యొక్క నాయకత్వముతో పలువురి దగ్గఱ విరాళములను వసూలించి సుమారు ఒక లక్ష వెండితో శ్రీ వేంకటేశ్వరాలయము నిర్మించబడుచున్నది. పై ప్రయత్నము జయం పొందుటకు శాఖ అన్ని విధాల తోడ్పడునని తెల్పుచున్నాను.

ఇప్పుడు ద. పే. శాఖలో సుమారు 10 మంది జీవిత చందా సభ్యులుగా ఉన్నారు. వారు వరుసగా, 1. శ్రీ M.D. సోమునాయుడు దంపతులు, 2. శ్రీ ఎల్లపు కృష్ణమూర్తి దంపతులు, 3. శ్రీ D. V. శ్రీరాములు, 4. శ్రీ K.R. రాజు, 5. శ్రీ నేతేటి దుర్గయ్య, 6. బీసెట్టి అప్పలనాయుడు, 7. శ్రీ మండే లక్ష్మణ, 8. శ్రీ ఆడారి అప్పల నాయుడు దంపతులు 9. అడ్డూరి జువ్వాలు, 10. శ్రీ బి. కె. సింహాచలము, 11. శ్రీ G. V. సోములు, 12. శ్రీ ఎల్లపు సాంబమూర్తి, 13. శ్రీ D. A. సుబ్రమణ్యము, 14 శ్రీ P. ముత్యాలు దంపతులు మొదలగు వారగుదురు. భవిష్యత్‌లో శాఖలో ఉన్న సభ్యులందఱను జీవిత సభ్యులుగా ఉంటారని శాఖ ఎదురుచూచుచున్నది.

పలుత్రోవలలో కేంద్రముతోడను, సహోదర శాఖలతోడను, ఐక్యముగా ఉండి ఆంధ్రుల ఐక్యము అభివృద్ధుల కొఱకు తన వలన చేతనైనంత వఱకు ద. పే. శాఖ సహాయపడుచున్నది. భవిష్యత్తులో ఆంధ్రుల ముందడుగునకు కావలసిన పలు మంచి కార్యములు చేయ కేంద్రముతో సహకరించు నని ద. పే. శాఖ తరపున తెలియజేయుచున్నాను.

## మలేసియా ఆంధ్ర సంఘము దక్షిణ. పేరా శాఖలో 1962 నుండి 1981 వఱకు ఉన్న ప్రధాన నిర్వాహము.

| | అధ్యక్షులు | ఉపాధ్యక్షులు | కార్యదర్శి | సహాయ కార్యదర్శి | గౌ॥ కోశాధికారి |
|---|---|---|---|---|---|
| 1962 | శ్రీ అల్లూరి కన్నయ్య నాయుడు | శ్రీ పోతుల మారయ్య | శ్రీ కాశీన రమణయ్య | కొరువాడ వెంకప్ప | ద్వారపూడి సోమునాయుడు |
| 1963 | ,, | ,, | శ్రీ D. V. శ్రీరాములు | శ్రీ కాశీన రమణయ్య | ,, |
| 1964 | శ్రీ ఎల్లపు కృష్ణమూర్తి PJK | శ్రీ K. R. రాజ PJR, PPN | ,, | శ్రీ మండే లక్ష్మణ | శ్రీ ఎల్లపు సాంబమూర్తి |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1965 | శ్రీ ఎల్లపు కృష్ణమూర్తి | శ్రీ K.R. రాజ PJR, PPN | శ్రీ డి.వి. | శ్రీరాములు | శ్రీ మండే లక్ష్మణ | శ్రీ కోరిబలి అప్పల నాయుడు |
| 1966 | ,, | శ్రీ బొడ్డి సముద్రము | ,, | | శ్రీ కాశీన రమణయ్య | ,, |
| 1967 | ,, | ,, | ,, | | ,, | ,, |
| 1968 | ,, | ,, | ,, | | ,, | ,, |
| 1969-70 | ,, | ,, | ,, | | శ్రీ బి. కె. సింహాచలము | ,, |
| 1971 | ,, | శ్రీ మండే లక్ష్మణ | ,, | | ,, | ,, |
| 1972 | ,, | ,, | ,, | | ,, | ,, |
| 1973 | ,, | ,, | ,, | | శ్రీ సుబ్రమణ్యము | శ్రీ బి. కె. సింహాచలము |
| 1974 | ,, | ,, | ,, | | శ్రీ S. మణియం | ,, |
| 1975-76 | ,, | శ్రీ కాశీన రమణయ్య | ,, | | శ్రీ అ. అప్పల నాయుడు | ,, |
| 1977 | ,, | శ్రీ A. E. జువ్వాలు PJK | శ్రీ B. K. సింహాచలము | | శ్రీ A. అప్పల నాయుడు | శ్రీ G. V. సోములు |
| 1978-81 | ,, | ,, | ,, | | ,, | శ్రీ గుమ్మడి సుబ్రమణ్యము |

# 'దేశ భాషలందు తెలుగు లెస్స'

## శ్రీనాథ మహాకవి

జనని సంస్కృతంబు సకల భాషలకును
దేశ భాషలందు తెలుగు లెస్స
జగతి తల్లికంటె సౌభాగ్య సంపద
మెచ్చు టాడుబిడ్డ మేలుగాదె!

# తంజోంగ్ మాలిమ్ ఆంధ్ర సంఘ శాఖ చరిత్రము

## అక్కిరెడ్డి అచ్చన్ననాయుడు

1956 సంవత్సరము ఆరంభముగా తంజోంగ్ మాలిమ్ ఆంధ్రులు ప్రాంతీయ సంఘముగా ప్రారంభించి 1965 సంవత్సరమున మలేషియా ఆంధ్ర సంఘ తంజోంగ్ మాలిమ్ శాఖగా మారినది. నేటివరకు ఈశాఖ పలుమార్పుల పిమ్మట క్రమముగా తన కర్తవ్యము నేరవేర్చుచు వచ్చుచున్నది.

1956 సంవత్సరము మొదలు 1965 సంవత్సరము వరకు ప్రాంతీయ సంఘ నిర్వాహకుల వివరము.

అధ్యక్షులు : శ్రీ G. రామచంద్రన్‌గారు.

కార్యదర్శి : శ్రీ అక్కిరెడ్డి అచ్చన్ననాయుడు P.P.N. గారు

ముఖ్య సహాయకులు : శ్రీ. బ. లక్ష్మణ, శ్రీ.M.A. సీతారామయ్య, శ్రీ గిలకలసుబ్రమణి, శ్రీ అడారి మాణిక్యము, శ్రీరామస్వామి. శ్రీ అక్కిరెడ్డి వీరన్న మొదలైనవారు.

ముఖ్య కర్తవ్యము

ఈ ప్రాంతములో జీవించుచున్న ఆంధ్ర సోదరి సోదరులయొద్ద సంఘమునకు చందాలు వసూలు చేసి, ప్రతిమాసము కేంద్రమునకు పంపించుట, ప్రతి ఏడాది ఉగాది ఉత్సవమును సక్రమముగా జరుపించుట. ఈ ఉగాది సందర్భమున పలుపోటీలు అనగా బంతి యాట దీనికి ఉగాదిసీల్డు బహూకరించబడినది. ఈ బంతి యాట పోటీలో పలు ప్రాంతముల జట్టులు కలుసుకొనుటకు అనుకూలముగా సందర్భములు గలిగింపబడినది. ఉగాదివిందులలో పలుసమూహప్రముఖులను ఆహ్వానించి ఆ సందర్భమున మన యొక్క ఆంధ్రుల కళాచారములు, చరిత్రము వంటివి వారికి పరిచయము చేయబడినవి. ఈ ఉగాది విందులకు ముఖ్యముగా మన ప్రధాన కార్యదర్శి శ్రీమదిని సోమునాయుడు గారు ఎక్కువ తోడ్పడిరి. ఈ ఉగాదికాలములో శ్రీమాధవాచార్యులు, శ్రీ అక్కినేని నాగేశ్వరరావు వంటి వారు కలుసుకొని ఈ ప్రాంతము వారిని మిక్కిలి ఆనందింపజేసిరి.

1965 సంవత్సరమున తంజోంగ్ మాలిమ్ ఆంధ్రసంఘము ఏర్పడినది :

నిర్వాహకులు – వారి వివరములు

అధ్యక్షులు : శ్రీ A. పోతురాజు
కార్యదర్శి : శ్రీ A. ధనబాలన్
ఆలోచన పరుడు : శ్రీ అక్కిరెడ్డి అచ్చన్ననాయుడు P.P.N.

1966-1974 సంవత్సరములకు నిర్వాహకులు : వివరములు

అధ్యక్షులు : శ్రీ దాడి కృష్ణమూర్తి
కార్యదర్శి : శ్రీ రామదాసు/శ్రీ A. ధనబాలన్
ధనాధికారి : శ్రీ R. సత్యరాజు

కార్యకమిటీ : శ్రీ R. నాగయ్య, శ్రీ D. S. సోమునాయుడు, శ్రీ A. రామనాయుడు, శ్రీ ఎ. కృష్ణన్ శ్రీ సీతా అప్పలస్వామి, శ్రీ E. అప్పన్న, శ్రీ B. ధర్మరాజు

1974/1975

అధ్యక్షులు : శ్రీ R. నాగయ్య
కార్యదర్శి : శ్రీ K. R. రామదాసు
ధనాధికారి : శ్రీ R. సత్యరాజు
కార్యకమిటీ: శ్రీ B. ధర్మరాజు, శ్రీ సీతా అప్పలస్వామి, శ్రీ A. రాము, శ్రీ R. S. రామునాయుడు, శ్రీ E. అప్పన్న, శ్రీ D.S. సోమునాయుడు, శ్రీ A. జగన్నాదన్ శ్రీ B.M. సోమునాయుడు

1975/1976

అధ్యక్షులు : శ్రీ అక్కిరెడ్డి అచ్చన్ననాయుడు P.P.N
కార్యదర్శి : శ్రీ D. S. సోమునాయుడు
ధనాధికారి : శ్రీ R. A. కృష్ణన్
కార్యకమిటీ: శ్రీ S. R. రామునాయుడు, శ్రీ. నాగేశ్వరరావు, శ్రీ మదిని చెల్లయ్య, శ్రీ వెంకటరమణ, శ్రీ S. రాములు, శ్రీ సూర్యనారాయణ, శ్రీ రాములు, శ్రీ రామన్, శ్రీ దాడి కృష్ణమూర్తి, శ్రీ B. ధర్మరాజు, శ్రీ R. నారాయణ, శ్రీ A. వరదరాజు, శ్రీ E. అప్పన్న, శ్రీ A. సుబ్రమణి (కిరాణి)

1976/1977/1978/1979

అధ్యక్షులు : శ్రీ మదిని రామునాయుడు
కార్యదర్శి : శ్రీ అక్కిరెడ్డి అచ్చన్ననాయుడు P.P.N
ధనాధికారి : శ్రీ R. నాగయ్య
కార్యనిర్వాహము : శ్రీ S. R. రామునాయుడు, శ్రీ నాగేశ్వరరావు, శ్రీ R. నారాయణ. శ్రీ S. ఆది నారాయణ, శ్రీ B. రామునాయుడు, శ్రీ R A. కృష్ణ, శ్రీ P. జగన్నాథన్, శ్రీ E.అప్పన్న, శ్రీ వెంకటరమణ, శ్రీ E. V. సముద్రము, శ్రీ K. సోమయ్య, శ్రీ మదిని సిమ్మాద్రి, శ్రీ సీతా అప్పలస్వామి.

1976వ సంవత్సరమున ఉగాది ఉభయము శ్రీ దండాయుత కోవెలలో విశేషము జరుపబడినది. అదే ఏడాదిలో ఈ శాఖకు డా॥ శ్రీ దాశరధి డా॥ నారాయణరెడ్డిగార్లను ఆహ్వానింపబడిరి. ఆ సమయమున వారిని సన్మానించుటకు ఒక సభను తేనీటి విందుతో జరిపించబడెను.

1980/1981

అధ్యక్షులు : శ్రీ R. విశ్వనాథమ్
కార్యదర్శి : శ్రీ అక్కిరెడ్డి అచ్చన్న నాయుడు P.P.N
ధనాధికారి : శ్రీ దాడి కృష్ణమూర్తి
కార్యనిర్వాహము : శ్రీ R. నాగయ్య, శ్రీ S. వీరాస్వామి, శ్రీ M. సుబ్రమణి, శ్రీ మదిని చెల్లయ్య, శ్రీ B. రామునాయుడు, శ్రీ E. అప్పన్న, శ్రీ ధర్మరాజు, శ్రీ ఆదినారాయణ, శ్రీ R. వెంకటస్వామి, శ్రీ E.V. సముద్రము, శ్రీ S. సిమ్మాద్రి, శ్రీ R A. కృష్ణ, శ్రీ జగన్నాథన్, శ్రీ నాగేశ్వరరావు, శ్రీ R. నారాయణ, శ్రీ K. సోమయ్య.

# మలేసియా ఆంధ్ర సంఘము సింపాంగ్ అంపాట్ శాఖ

## గుమ్మడి అప్పలనాయుడు

పిట్ట కొంచెము కూత ఘనము అన్నట్లు ఈ శాఖ చిన్నదైనను కార్యములు చేయుటకు ఇతర శాఖలకు ఏ వంకను తీసిపోదు. మలేసియా ఆంధ్ర సంఘమును స్థాపించిన అదే ఇండియన్ సన్మాన సంఘ భవన ఆవరణలోనే 1965వ సంవత్సరము శ్రీ యం. యస్. మణియం, శ్రీ కె. సూర్యనారాయణ, శ్రీ చంద్ర సుబ్రమణ్యం, శ్రీ కె. ఎస్. అప్పలనాయుడు, శ్రీ మాడిచి కృష్ణ, శ్రీ ఎల్లపు రమణ, శ్రీ గుమ్మడి అప్పల నాయుడు వంటి వీరు యువకులచే ఆనాడు ఈ శాఖను స్థాపించిరి.

ఈ శాఖ ప్రారంభించిన కొలది కాలమునకే మలేసియా తెలుగు వాళ్ళలో గొప్ప విప్లవము ఏర్పరచాలనే ఉద్దేశ్యముతో విప్లవ కవియైన గురజాడ అప్పారావుగారి వర్ధంతిని పలు సాహిత్య పోటీలతో చాలా గొప్పగా జరిపి శభాష్ సింపాంగ్ అంపాట్ శాఖవా రనిపించు కొనిరి. వీరియొక్క ముఖ్య ఉద్దేశ్యము తెలుగుకవు లందరిని మలేసియాంధ్రులకు పరిచయం చేయాలన్నది. వారీఆశయముతో మరి కొంతకాలమునకు కాశీనాధ నాగేశ్వరరావుగారి వర్ధంతిని పలు సాహిత్య పోటీలతో అతి విమర్శగా కొనియాడిరి.

పిట్టకైన గూడు కలదు. ఐతే ఈ ప్రాంతములో నివసించు ఆంధ్రులు సొంత ఇండ్లు సొంత భూములు లేకుండా బికారులుగా తిరుగుచున్నారని ఈ శాఖ నాయకులు గ్రహించితిరి. తెలుగువారు కష్టజీవులు, సంపాదించిన ధనము చక్కగా పొదుపుచేసే శక్తి గలదు. ఐతే ఆ డబ్బును బెట్టి తానెట్లు ముందుకు రావడము అనేది తెలియదు. శాఖ నాయకులు సింపాంగ్ అంపాట్ ప్రాంతమున చౌకగా అమ్మే భూములను కొనమని ఆంధ్రులను ఉత్సాహపఱచి భూస్వాములు చేసిరి. నాడు ఎకరము వెయ్యి వెండీలకు కొనిన భూములు నేడు ఎకరము అరవై వేల వెండీలవరకు విలువ చేయుచున్నవి. ఈ ప్రాంతములో గల ఆంధ్రులు ఇతరుల కంటెను పచ్చగా తెలియుచున్నారు. అమ్మో ఆంధ్రులా వారు తలచిన ఏ కార్యమైన చేయగలరని ఇతరులు చెప్పు కొనుచున్నారు.

ఈ శాఖకు మొదటి అధ్యక్షులుగా శ్రీ K.S. మణియంగారును, గౌ॥ కార్యదర్శిగా శ్రీ గుమ్మడి అప్పల నాయుడుగారును ఎన్నుకొనిరి.

### శాఖకు విచ్చేసిన గౌరవనీయులు

శ్రీ యర్రోజు మాధవాచార్యులు-ఆంధ్రప్రదేశ్ కళా మూర్తిగా విచ్చేసిన యీయనను శాఖవారు ఘనంగా ఆహ్వానించి బహిరంగ సభ ఏర్పాటుచేసి విందు పెట్టి సన్మానాలు ఒసంగి గౌరవించిరి. ఆటు తరువాత డాక్టరు దాశరధి, డాక్టరు నారాయణరెడ్డిగారును పై శాఖకు విచ్చేసిరి. ఆయనగార్లను శాఖవారు గొప్పగా ఆహ్వానించిరి. వారి ఉపన్యాసములు ఆలకించిన తర్వాత ఈప్రాంత తెలుగువారికి నూతన ఉద్రేకము ఏర్పడినది. ఆటుపిమ్మట కొంతకాలమునకు మాజీ ఆంధ్ర ప్రదేశ్ విద్యామంత్రియు, ఇరవై యవ శతాబ్దపు శ్రీకృష్ణదేవ రాయలును తెలుగుత్యాగియునగు శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారును, మిమిక్రి శ్రీ నేరెళ్ళ వేణుమాధవ్ గారును ఈ శాఖకు విచ్చేసిరి. తెలుగు రత్నము శ్రీ మండలిగారిని చూడటము ఆయన మాటలు వినటము ఈ ప్రాంతపు ఆంధ్రులకు నిజంగా అదృష్టవంతులుగానుండు.

ఈ శాఖకు గొప్పతనము

తెలుగు ప్రపంచ మహాసభలు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమును జరపమని కోరాలను తీర్మానమును మలేసియా ఆంధ్రసంఘమునకు సమర్పించినది ఈ శాఖయే యగును. ఆనాడు ఈ తీర్మానమును కొందరు ఎగతాళి చేసినప్పటికిని ఈ శుభకార్యము నేడు జరగడము శాఖ వారికి గొప్పగా కనిపించుచున్నది.

ఈమధ్య మలేసియన్ ఇండియన్ కాంగ్రెస్ జాతీయ అధ్యక్షులును మలేసియా కాబినెట్ మంత్రియును అగు ఘనత వహించిన దత్తో శ్రీ సామివేలుగారిని ఈ శాఖ వర్షాంతర సభకు రప్పించి ఆయన స్థాపించిన సహకార సంఘమునకు వాటాలు సమర్పించి ఆయనగారికి గొప్ప విందుచేసి మలేసియా ఆంధ్రుల కొరతలను మేమోరాండముగా సమర్పించితిమి.

భవిష్యత్‌లో ఈ శాఖ తెలుగువారికి ఉపయోగమైన మంచి కార్యములు చేయుటకు ప్రణాళికలు తయారించుచున్నది.

## మల్లెదండ

పాలక్రొమ్మిగడల్ పచ్చి వెన్నయి విచ్చి
తీయని నునుపూస లాయెనేమొ!

కమ్మని మకరంద కణములు స్నేహించి
చిన్నారి పలుకులై చిక్కెనేమొ!

పూలలావణ్యంబు పొంగి చక్కదనాల
పిందెలై రుచులెక్కి పెరిగెనేమొ!

సెలయేటియొయ్యాల కులుకు టొయ్యారముల్
ముద్దుముచ్చట లయి ముదిరెనేమొ!

పాటకును పద్యమునకు నమ్రముగ నొదిగి
చవికి చాతుర్యమునకు సాజముగ సాగి
పోరునకు పొత్తునకు చాలి పొంది పొసగు
మా తెనుగు తల్లిమెడ కిదె మల్లెదండ!

—శ్రీ రాయప్రోలు

# మలేసియా ఆంధ్ర సంఘము నెగ్రి సెంబిలాన్ శాఖ చరిత్రము

పి. ఎస్. రామునాయుడు
గౌ. కార్యదర్శి

శ్రీ P.S. రామానాయుడు, శ్రీ N.M.K. రాజు మరియు శ్రీ T.C.G. రామకృష్ణ నాయుడుగార్ల కృషివలన మలేసియా ఆంధ్ర సంఘ నెగ్రి సెంబిలాన్ శాఖ ప్రారంభోత్సవము 15-2-1964 నాడు సెరంబానులోనున్న భారతీయుల సంఘ కట్టడములో జరిగినది. మలేసియా ఆంధ్ర సంఘము అప్పటి అధ్యక్షులు స్వ. శ్రీ K.V. స్వామిగారు, గౌ॥ప్ర॥ కార్యదర్శి శ్రీమదిని సోమునాయుడుగారు అప్పటి సహాయ ప్ర॥ కార్యదర్శి శ్రీ C.A. అప్పారావుగారు ఆ సభకు విచ్చేసిరి.

నెగ్రిశాఖ అధ్యక్షులుగ శ్రీ N M.K. రాజు P.J.K. గారున్ను, గౌ॥ కార్యదర్శిగ శ్రీ P.S. రామానాయుడుగారున్ను, గౌ॥ ధనాధికారిగ శ్రీ R.R. నాయుడుగారున్ను ఎన్నుకోబడిరి.

అప్పుడు నెగ్రిసెంబిలాన్‌శాఖలో సెరంబాన్ మొదలు వెషింగ్‌టన్ (రెంగం) వరకు సుమారు 1000 మంది సభ్యులుండిరి. 1964లో ప్రఖ్యాత సినీనటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావుగారు తమ సతీమణితో మలేసియా ఆంధ్ర సంఘము ఆహ్వానమును అందుకొని మలేసియాకు విజయం చేసిరి. వారు సెరంబానులో అతి వైభవముతో ఆహ్వానింపబడిరి. సెరంబాన్ నగర మండపములో ఒక పెద్ద తేనీటి విందు వారి గౌరవార్థమై జరపబడినది. రాత్రి వివేకానందా హాల్లో అక్కినేని దంపతుల గౌరవార్థమై జరిగిన విందులో నెగ్రి సెంబిలాన్ ప్రముఖులున్ను, ముఖ్యమంత్రి డత్తో డాక్టర్ సైయద్ ముహమద్ గారును కలుసుకొనిరి.

1965వ సంవత్సరములో నెగ్రి సెంబిలాన్ శాఖ తొలి మహాసభ అతివైభవముగ సెరంబానులో జరిగినది. ఆనాడు జొహూర్ ప్రాంత ఆంధ్రులు శ్రీ P.B. వెంకటరమణగారి అధ్యక్షత క్రింద ఒక మంచి "తెలుగుతల్లి" అను నాటకమును జరిపిరి. 1966వ సంవత్సర శాఖ మహాసభనాడు "శాంతి" అను తెలుగు సినిమాను తొలిసారిగ ఈశాఖ ప్రదర్శించుకున్నది.

మలేసియా ఆంధ్ర సంఘము ఆహ్వానమును అందుకొని ఆంధ్ర ప్రభుత్వము శ్రీయ్మరోజు మాధవాచార్యులు M A. గారిని 1967లో మలేసియాకు పంపినది. నెగ్రి సెంబిలాన్‌లో యున్న బహావ్, సెరంబాన్ మొదలగు పట్నములందు 7-10-67 నాడు ఆయన గౌరవార్థమై విందులు, సభలు జరిగినవి. ఆ సంవత్సర మహాసభలో శ్రీ P.S. సుబ్రమణ్యముగారు శాఖ అధ్యక్షులుగ ఎన్నుకోబడిరి.

1968వ సంవత్సరములో నెగ్రి సెంబిలాన్ శాఖలో తొలి జీవిత సభ్యులుగ డాక్టర్ A. సూర్యన్‌గారు చేరారు. శాఖ సహాయ అధ్యక్షులుగాను ఆ సంవత్సరములో ఆయన ఎన్నికయిరి. అప్పుడు డాక్టర్ సూర్యన్ గారు మలేసియా పార్లమెంటు సభ్యులవుదురు.

1969వ సంవత్సరము మొదలు తెలుగు సినిమాలను రప్పించి ఈ నెగ్రి సెంబిలాన్-జొహూర్ ప్రాంతములలో ఆంధ్రులు అధికముగ ఉన్నచోట్లలో ప్రదర్శించుటకు శాఖ పూచీతీసుకున్నది.

ఆదినాలలో పెండ్లి కార్యాలు జరుపుటకు, భూములు కొనుటకు, వ్యాపారాలు చేయుటకు సొమ్ము చాలక చాల ఇబ్బందులు పడుచున్న మన తెలుగువారికి సహాయపడుటకై మన ఆంధ్ర నెగ్రి సెంబిలాన్ శాఖ నాయకులు ఆలోచించి 1974లో "బహావ్ సహకార

సంఘము" అను సంఘాన్ని ప్రారంభించారు. సభ్యు లకు సంవత్సరమునకు 8% చొప్పున వడ్డీకు అప్పు లిచ్చి తోడుపడు చున్నారు. 1977వ సంవత్సరములో ఒక భవనము కొనుటకు ఈ సహకార సంఘము పూనుకున్నది.

1976వ సంవత్సరములో ప్రఖ్యాత కవులు, రచయితలు అగు డాక్టర్ సి. నారాయణ రెడ్డిగారిని అమోఘముగ ఆహ్వానించి ఒక పెద్ద సభను బహావ్ ప్రాంతమున ఈ శాఖ ఏర్పాటు చేసినది. ఆయన మాట లను, కవితలను విని యిచ్చటి ఆంధ్రులు ఆనం దించిరి.

1977వ సంవత్సరము అక్టోబరు మాసములో కుమారి ఉమాభారతి నాట్య ప్రదర్శనలకు బహావ్ శాఖ ఏర్పాట్లు చేసినది. ఆ మంచి నాట్యాన్ని పలు వందలమంది చూసి ఆనందించిరి. ఆ సంవత్సరము నవంబరు మాసములో జరిగిన శాఖ మహాసభకు కార్మికశాఖ సహాయమంత్రి శ్రీ పద్మనాభన్ కె. యమ్. ఎస్. గారు ప్రారంభోత్సవము జరిపిరి. ఆ సభలో శ్రీ వై. ఆర్. నారాయణరావుగారు నూతన అధ్య క్షులుగ ఎన్నుకోబడిరి. 1967 మొదలు శాఖ అధ్య క్షులుగ నుండి పనిచేసిన శ్రీ పి. యస్. సుబ్రమణ్యము గారికి శాఖ కృతజ్ఞతలు తెలుపుకున్నది. ఆసభలో తెలుగుబడి పిల్లలకు తెలుగు వాచకములు శాఖ ఉచిత ముగ ఒసంగినది.

1977వ సంవత్సరములో ఆంధ్ర దేశములో జరిగిన తుపానువలన బాధింపబడిన వారికి సహాయ పడుటకై ఈ శాఖ సుమారు $700 లు వసూలించి ఇచ్చి సహాయపడినది.

1978, 1979వ సంవత్సరములలో సంఘనాయ కులు ఈ ప్రాంతపు పలుచోట్లకు వెళ్ళి వందలు కొలది నూతన సభ్యులను సంఘములో చేర్చుటకు పాటుపడిరి. సంఘ ఆర్థిక పరిస్థితిని బలపరచిరి.

1980వ సంవత్సరములో బహావ్ సహకార సంఘము కొనిన రెండు అంతస్తుల కట్టడము పూర్తిగ కట్టి ముగింపబడినది. కట్టడ తాళపుచెవి సంఘ నాయకులకు ఇవ్వబడినది. ఆ కట్టడములో పలుసరకు వ్యాపారమును ఈ సహకార సంఘము జరుపనున్నది.

ఇదివరకు నెగ్రి సెబిలాన్ శాఖ సుమారు డెబ్బది బడిపిల్లలకు ఉచిత విద్యా విరాళములు ఒసంగి యున్నది. ఈ విద్యా విరాళములు పొందిన వారిలో పలువురు ప్రస్తుతము ఉన్నతఉద్యోగములలో ఉన్నారు. వీరికి పలుసమూహ సేవలున్ను ఈ శాఖ చేస్తూ వున్నది.

ప్రతి సంవత్సరము తెలుగు నాటక పోటీలు, పాటల పోటీలు తెలుగు రచన పోటీలు, మరియు ఇతర పోటీలను ఈ శాఖ జరుపుతూ వస్తున్నది.

కేంద్రము జరుపుచున్న సభలు, లాటరీలు, కళాచార సభలు మొదలగు వాటికి నెగ్రి సెంబిలాన్‌శాఖ మంచి ఆదరవు ఇస్తూ వస్తున్నది. సమీపములో విద్యా విరాళ ములు వసూలించుటకు కేంద్రము జరిపిన లాటరీలకు నెగ్రి సెంబిలాన్ శాఖ $ 9000 లకు పైగా టిక్కట్లు అమ్మి కేంద్రమునకు తోడుపడినది.

పై పనులన్నియు చక్కగ జరుపుచున్న నెగ్రి సెంబిలాన్ శాఖ నిర్వాహకులు వీరే :—

| | | |
|---|---|---|
| అధ్యక్షులు | : | శ్రీ Y. R. నారాయణరావు |
| ఉపాధ్యక్షులు | : | డాక్టర్ A. సూర్యన్ |
| గౌ॥ కార్యదర్శి | : | శ్రీ P. S. రామునాయుడు |
| స॥ కార్యదర్శి | : | శ్రీ R. అప్పలనాయుడు |
| ధనాధికారి | : | శ్రీ A. సోమునాయుడు |

నిర్వాహక సభ్యులు : శ్రీ G. S. అప్పలనాయుడు
శ్రీ N. వెంకటేశము
శ్రీ T.C.G. రామకృష్ణనాయుడు
శ్రీ B. దేముడు
శ్రీ N. శ్రీరాములు
శ్రీ P. అప్పలనాయుడు
శ్రీ A. అప్పుడు గారు
శ్రీ A. అప్పలనాయుడు
శ్రీ R. అప్పన్న
శ్రీ S. ముత్యాలు
గౌ॥ ఆలోచనపరులు : శ్రీ P. S. సుబ్రమణ్యము

ఆంధ్ర సంఘ నెగ్రిసెంబిలాన్ శాఖ వర్ధిల్లు గాక ! సంఘ బలమే మన బలము.

# ఆంధ్ర భవనము కట్టాలి!!

## కాశీన రమణయ్య

ఆంధ్ర భవనము కట్టాలీ - అది ఆంధ్రుల సొత్తయి యుండాలి
పట్టిన పట్టు నెగ్గాలీ - అది యెట్టకేలకే కట్టాలి,
కట్టిన భవనము గట్టిగ కట్టి - తరతరాలుగా నిల్వాలీ
ప్రతీ ఆంధ్రుడు ప్రతిజ్ఞ పలికి - ప్రతిభను నిల్పుట కోరాలి ॥ఆంధ్ర॥

శాఖల సాయము పొందాలి - దాతల ధర్మం కలగాలి
సరళ మనసులు కలగాలి - సాహస హృదయం నిల్పాలి
జగతికి జాతిని చాటాలీ - జాతి పేరును నిల్పాలి
ప్రపంచ సభను జరపాలి - పరపతి మనకే కలగాలి
లక్షలు రెండు చేరాలి - మన లక్షణంబులు చూపాలి
చెప్పిన వాక్కులు నెగ్గాలి - నెపమును బూని నడవాలి ॥ఆంధ్ర॥

"ఆంధ్ర భవన"

# మలేసియా ఆంధ్ర సంఘ చరిత్రలో సిలాంగూర్ శాఖ

ఆర్. పైడి నాయుడు

సహాయ అధ్యక్షులు, మలేసియా ఆంధ్ర సంఘం, సిలాంగూర్ శాఖ.

1963వ సంవత్సరము మలాయా దేశమనే పేరు నుండి మలేసియాగా మారిన రోజులు చాల దూరములో లేని కాలపరిమాణం అది. ఆపుడు మలాయా దేశానికి తూర్పున సబాసర్‌వాక్‌ను, దక్షిణమున సింగపూర్ దేశమును మలాయా దేశముతో కలసిపోయి కడపటికి అది మలేసియా దేశంగా పరిణమించెను. అంతేకాక అప్పట్లో స్వాతంత్ర్యము లభించెనని సంబరాల రోజులవి. కాని, మలేసియా దేశ మని ప్రపంచమంతటా వ్యాపించి ఘనత పొందిన ఘట్టాలవి. యీ దేశ చరిత్రలో అవన్నియు చారిత్రక రూపంగా యీనాటికిని పరవశంగా ఉంటున్నాయి. అలాంటి వాతావరణ లేమో అప్పటి రోజుల్లో మలేసియా ఆంధ్ర సంఘం పేరును దేశమంతట అన్ని సమూహాలవారికి విశేషంగా ఆంధ్ర జాతికి పైనామకరణం వ్యాపించడం అయింది. "చెట్టుకు కొమ్మలు వ్యాపించి నీడయిచ్చే చెట్టుగా పరిణమించే" టట్లు సంఘానికి శాఖలు ప్రారంభమవడం మరి అవి క్రమంగా పెరగడం జరుగుతుండే కాలపరిణామం అది.

దేశ రాజధాని కౌలాలంపూరు నగరంలో తెలుగు వారి సంఖ్య ఎంతని తెలియకపోయినను తెలుగుభాషను ఆంధ్ర సంఘాన్ని పెంచాలన్న ధోరణి దాదాపు అందరి తెలుగువారి హృదయాల్లో ఇమిడియుండేవి. దీనికి అనుగుణంగా అప్పట్లో తెలుగు కళాకారులు ఆంధ్రదేశము నుండి వచ్చేవారు. ఈ తరుణంలోనే తెలుగు సంస్కృతి, సాహిత్యం పెరిగించాలని ఏకాభిప్రాయంగా తెలుగువారిలో కొందరు తెలుపుకున్నారు. దానికి ప్రతిఫలంగా తెలుగువారికి జ్యోతి ప్రెస్ ముద్రణాలయం వాటాల దిట్టాలలో అమర్చి యీదేశపు తెలుగు వారి చరిత్రను రూపొందించినట్లు జ్యోతి ముద్రణాలయం ప్రారంభింపబడెను. ఇది 1963 సం॥లో జరిగిన చారిత్రక ఘట్టమని జ్ఞప్తిపరచుకొంటున్నాను. ఈ ప్రచురణాలయములో తెలుగు భాషను తేజరించాలనే లక్ష్యాలకు ఫలంగా ఆనాడు యీ దేశములో తొలి తెలుగు సువర్ణ అక్షరాలతో పక్షపత్రికగా "విదేశాంధ్ర" వెలువడయ్యేను. కొంతకాలముపాటు పత్రిక వెలువడయ్యే నప్పటికి, ఈ దేశ ఆంధ్రులలో సాహిత్య రంగం ఎంతగానో రాణించింది. ఈ నిజాన్ని తెలుగు అభిమానులు, రచయితలు, భాషాభిమానులు యింకను ఎందరో దీనిని కాదన లేరు. ఇదియును తెలుగు సమూహానికి తెలుపవలయునని ఊహతో దీంట్లో గుర్తించడం అయింది. యీ కృషి, దూరదృష్టి అప్పటి కౌలాలంపూరు నివాసులను విశేషంగా శ్రీ ఎస్. బి. రెడ్డిగారు, శ్రీ కె. సి. ఐ. రెడ్డిగారు (అప్పటి) మాజిస్ట్రేట్ శ్రీ కొరునాడ సుబ్రమనియం, శ్రీ జి. వి. సుబ్రమనియం, శ్రీ బి. ఆర్. సింహాచలం వారికే ఆ పత్రిక సంకల్పన పేరు, ప్రతిష్ఠ, గిట్టుతుంది. వీరిలో ఇప్పుడు శ్రీ కొరువాడ సుబ్రమనియం, శ్రీ జి.వి. సుబ్రమనియం, శ్రీ బి. ఆర్. సింహాచలం, ప్రపంచమునలేక దిగవంతులైరి. కాని, పై మహత్తర కార్యము కౌలాలంపూరులోనే జరిగిం దని తెలుపుటకు ఆశిస్తున్నాను.

అది 1964 వ సంవత్సరం జూన్ నెల 17 వ తారీఖు మరపురాని దినమయ్యేను. ఈ దినము మలేసియాంధ్రులందరిలో మరువరాని దినమయ్యేను. ఆనాడు కొందరు తెలుగాభిమానులు, భాషాభిమానులు విదేశాంధ్ర పత్రికలో నున్న తెలుగువారును అగ్రశ్రేణి నటుడగు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు గారికి ఒసంగిన ఘనమైన సన్మాన విందు; యిది అప్పట్లో కౌలా

లంపూరులో పేరగాంచిన ఈస్టరన్ **హోటల్**లో సుమారు 700.లకు పైగా కలుసుకొని, తెలుగు పలుకులు వినిన ఘనమైన గుంపు. ఆనాడు సభకు అధ్యక్షత వహించిన శ్రీ ఎస్. బి. రెడ్డిగారు మధురమైన తెలుగు భాషలో మాట్లాడి తెలుగువారు కానివారినికూడ విశేషంగా అమెరికా రాయబారితో సహా తేనె తెలుగు మాటలను వినిపించారు. ఇంతేకాక మొట్టమొదటిసారిగా టెలివిజన్ మలేషియాలో శ్రీ అక్కినేని నాగేశ్వరరావు గారితో శ్రీ కె. సి. ఇ. రెడ్డి గారు మాట్లాడిన దేశతెలుగువారి చరిత్రలో తొలి సందర్భాన్ని అదే సంవత్సరములో జరిగిందని జ్ఞాపక పరచుతున్నాను. శ్రీ అక్కినేని నాగేశ్వరరావు గారి రాకలో ఆనాడే ఎందరో తెలుగాభిమానులు, కళాభిమానులు. భాషాభిమానులను చూసుకోగల భాగ్య మేర్పడింది.

అతనేకాక ఆసమయాలలో పలు కళాకారులు, సినీ నటులు రాజధానికి వస్తుండేవారు. ఆ సందర్భాలలో "నర్తనశాల" చిత్ర ఫిలింపోటీ ఇండోనేషియాలో ముగించికొనిమలేసియాకు కొందరుచిత్రకారులు విజయం చేశారు. వారిలో శ్రీ ఎస్. వి. రంగారావు గారు, శ్రీ రేలంగి గారు, వారితోబాటు సినీతార శ్రీమతి సావిత్రి గారు పర్యటన చేశారన్నది, వారిని విదేశాంధ్ర విలేఖరులుగా ఆనాడు శ్రీ వి.ఎస్. సుబ్రమనియా, శ్రీ ఎం.ఇ. బత్తుమల, శ్రీ అర్. పైడినాయుడు శ్రీ. ఆర్.పి. నాయుడు, శ్రీ. పి.యస్. రామారావు కలుసుకొని మాటలు జరిపారన్న విషయం ముఖ్యం కాలేక పోయినప్పటికిని చేసిన ముఖ్యమైన కార్యమని తలచి యింతలో గుర్తించాను. ఇవన్నియు సిలాంగుర్ శాఖ ప్రారంభోత్సవానికి ముందుగా జరిగిన కార్యాలని తెలుపుకొంటున్నాను.

తెలుగు వాతావరణం కౌలాలంపూరు నగరములోనేకాక సిలాంగూర్ మాగాణమంతా దాని మాధుర్యంతో ప్రాబల్యమయ్యేను. అలాంటి వాతావరణములలో మనకని ఆంధ్ర సంఘ శాఖ ఉండడం ఎంతయో ముఖ్యమని మొరపెట్టిరి.

ఆనాడు ఆదివారం శుభ సమయం కాబోలు! వివేకం గల వివేకానందా ఆశ్రయము బ్రిక్‌ఫిల్డ్స్ రోడ్డులో 2-8-1964వ నాడు సిలాంగూర్ తెలుగువాసులకై ఆంధ్ర సంఘ జంటలో మరొకటి కౌలాలంపూరులో పడినది. ఇది యీ దేశ ఆంధ్ర సంఘ చరిత్రలో మరొక మైలు రాయన్నట్లు. ఆ రోజుల్లో సేవపురుషులు ఆంధ్ర సంఘాభిమానులు, భాషాభిమానులు తీవ్ర కృషి చూపడం వలనను, దానికి తోడు బాధ్యతలను తీసుకున్నందువలనను పైన గుర్తించినట్లు అదే సంవత్సరంలో సిలాంగూర్ శాఖ పేరుతో సంఘానికి మరొక శాఖ ఉద్భవమైంది. ఆనాటి శాఖ ప్రారంభోత్సవ సభలో మొదట శాఖ అధ్యక్షులుగా శ్రీ ఎస్. బి. రెడ్డిగారు, ఉపాధ్యక్షులుగా శ్రీ కొరువాడ సుబ్రమనియం, గౌరవ కార్యదర్శిగా శ్రీ పి. జగన్నాథం, గౌరవ సహాయ కార్యదర్శిగా శ్రీ అర్ రామునాయుడు గౌరవ కోశాధికారిగా శ్రీ డి. ఎ. నాయుడు, వీరితోబాటు తొలి కార్యవర్గ సభ్యులుగా శ్రీయుతులు బి.ఎస్. రాములు, ఎస్. అప్పలస్వామి, ఎం. ఎస్. శర్మ, ఎస్. అప్పల నాయుడు, టి. ఎం. రామునాయుడు, కె. అప్పలస్వామి, వి రామునాయుడుగార్లు, వీరితోబాటు లెక్కలపరిశోధకులుగా శ్రీయుతులు వి. జి. వి. నాయుడు శ్రీ టి. వరహాలు గార్లును ఎన్నుకోబడిరి; వీరే సిలాంగూర్‌శాఖకు స్థాపక నిర్వాహకులు అనే గుర్తించడం తప్పలేదు. క్రొత్తగా ఎన్నుకోబడ్డ పై నిర్వాహకులు యీ దేశ తెలుగువారు చరిత్రను అగ్రస్థానములో రూపొందించినట్లు అతిథులను గౌరవించడం జరుగుతూ ఆ మధ్యలో భారత హై కమీషనర్‌ని సంప్రదించి యీదేశ తెలుగువారి ఆశయాలు వెలిబుచ్చి సంఘానికి సహాయపడమని కోరింది. ఇంతేకాకుండ, విద్యలకు సంబంధించిన విద్యార్థులకు ఉపకార వేతనము ఏర్పాట్లు చేయడం, తెలుగు వారు ఎచ్చటి నుండి వచ్చినను వారికి పడక మొదలగునవి ఏర్పాట్లు ఇమ్మిగ్రేషన్లు విషయాల్లో తోడ్పడం, పౌరసత్వం తీసి పెట్టడం వంటి ఘనమయిన సహాయాలు చేస్తుండేవారు. ఇంతేకాక కౌలాలంపూర్ మహానగరంలో మొట్టమొదటి సారిగా తెలుగువారికని ఆశ్రయాన్ని ఏర్పరచి చదువుకునేటందుకు వచ్చే విద్యార్థులకు ఒక ఆశ్రయ మనిపించారు. దీనికి శాఖ అధ్యక్షులు శ్రీ ఎస్. బి. రెడ్డిగారు, పూర్తి బాధ్యత తీసుకొని పై ఆశ్రయాన్ని అద్దెకు తీసి దాదాపు 15 మంది విద్యార్థులకు వసతులను ఏర్పాట్లు

చేయించారంటే యీ దేశపు తెలుగువారిలో మొట్టమొదట తెలుగభిమాని పూనుకొని చేసిన మహత్తర కార్యమని స్మరించడం ముఖ్యమని తలంచి వ్రాశాను. అప్పట్లో ఆశ్రయానికి 'నిర్మలా' యనే పేరు యుండెడిది. ఎంత సేవలు జేసియున్నను సంప్రదాయాలను విడలేక పోతున్నాం కదా. అట్టి సంప్రదాయ సమయములో శాఖ నిర్వాహకము వరుసక్రమంగా యేడాది సాలుసరి సమావేశాలు జరుపుతుండేవారు. అందులో కొన్ని సమయాల్లో నిర్వాహకులును ఎన్నుకోబడినారు.

అది 8-8-1965వ సంవత్సరం ఆదివారమే కాబోలు సిలాంగూరు శాఖకు రెండవ సాలుసరి సమావేశము జరిగింది. ఈ సమావేశములో క్రింద గుర్తించిన వారు క్రొత్త నిర్వాహకులుగా ఎన్నికయారు.

అధ్యక్షులు : శ్రీ వి.జి.నాయుడు
ఉపఅధ్యక్షులు : శ్రీ కోరువాడ సుబ్రమణియం
గౌ॥ సహాయ కార్యదర్శి : శ్రీ ఆర్. రామునాయుడు
గౌ॥ కోశాధికారి : శ్రీ ఎం.ఇ. బత్తుమరై.

అప్పటికి క్రొత్తగా యెన్నుకోబడ్డ శాఖ నిర్వాహకులలో కూడ ముఖ్యంగా గుర్తించవలసిన ఘట్టాలు చాలనే యున్నవి. అందులో సిలాంగూర్ మాగాణంలోగల తెలుగు బడులను సర్వే చేయాలన్న తీర్మానాన్ని చేయబడింది. దానితోపాటు తెలుగు చదువుచున్న ప్రతి తెలుగు విద్యార్థులకు తెలుగు పుస్తకాలు కొనిపెట్టి సరఫరా చేసింది. ఆ మధ్యలో ఎందరో రాజకీయవేత్తలు ఆంధ్రదేశమునుండి వచ్చి, ఈ దేశానికి వచ్చి పర్యటన చేశారు. అందరిని తెలుసుకొనేభాగ్యం ఏర్పడకపోయినను ఆసమయములో ఆచార్య శ్రీ రంగాగారు రాజధానిలో అడుగుపెట్టగా, వారున్న హోటలుకు వెళ్ళినసంఘ కార్యవర్గీయులలో శ్రీ టి.ఎ. వరహాలు అతనిని సంప్రదించి తెలుగు భాషను గూర్చి, ఆంధ్రసంఘం గూర్చి విశదపర్చారు. అతనికి ఈదేశములో వెలువడిన విదేశాంధ్ర పత్రిక యిచ్చిరి. అప్పట్లో ఈదేశ భారతీయ నాయకుడుగా అపుడు డత్తో, వి టి. సంబందన్‌గారు శ్రీ రంగాగారికి విందును ఏర్పాటుజేశారు. ఆ విందులో శాఖ అధ్యక్షులు శ్రీ వి.జి.వి. నాయుడు, శ్రీ కొరువాడ సుబ్రమణియం, శ్రీ ఎం.ఎస్. శర్మగారు, మరియు శ్రీ టి. ఎ. వరహాలుగారు కలుసుకొని మొత్తానికి తెలుగువారి ఆశయాలను అతనితో మొరపెట్టుకున్నారు.

అపుడు కౌలాలంపూర్ నివాసులలో ఉన్నతవిద్య చదివి ప్రభుత్వములో (మాజిస్ట్రేట్) న్యాయాధిపతి ఉద్యోగాన్ని వహించి వచ్చిన ఆంధ్రుడు శ్రీ K.C.I. రెడ్డిగారినిగూర్చి వ్రాయడము తప్పక ఏర్పడుతుంది. ఏమంటే ఆనాడు జ్యోతిప్రెస్ తెలుగువారి సంస్థ వారికి మొదట నిర్వాహ అధ్యక్షులు పదవి వహించి, తదితర ఆంధ్రసంఘ సిలాంగూర్ శాఖకు తాను జేసిన సేవను జ్ఞాపకంలో నుంచి, ఆయన ఉద్యోగరీత్యా సరవాక్ ప్రాంతాలకు మార్చబడి నూతన సిలాంగూర్ శాఖ పాయలు ఏర్పాటు జేసి గౌరవించడం అయింది

ఆ మధ్యలో కొందరు శాఖ నిర్వాహకులు కొందరు ఏదోవిధంగా మారవలసిన పరిస్థితులు ఏర్పడినాయని 1965వ సంవత్సరం మధ్యలో శ్రీ ఎం.ఇ. బత్తుముల తన ఉద్యోగ సంబంధమై పనులు అధికమైనందున అతను నిర్వహించిన ధనాధికారి నిర్వాహాన్ని శ్రీ ఆర్. పైడినాయుడు, (ఆర్.పి. నాయుడు) బాధ్యత తీసుకున్నది గుర్తించడం అవశ్యము కదా ! ఇలా వరుసక్రమంగా అపుడపుడు శాఖ నిర్వాహకులు మారుతుండే రోజుల్లో 1966వసంవత్సరం శ్రీ జి.వి. సుబ్రమనియం గారును ఉద్యోగరీత్యా కెడా ప్రాంతాలకు మారిరి. ఆయన బదిలీగా శ్రీ. ఎ.ఎల్. మారయ్యారావు గారు తాత్కాలిక కార్యదర్శిగా యెన్నుకొనడం అయింది. యీ కాలములో శాఖ సభ్యత్వపు సంఖ్య అధికరించాలని దాదాపు సిలాంగూర్ మాగాణమంత పర్యటనజేసి వందలాది సభ్యులను చేర్పించి దీనికి అప్పటిశాఖ అధ్యక్షులు శ్రీ వి.జి.వి. నాయుడుగారు శ్రమలను పాటింపక సొంతకారు తెచ్చి అన్ని చోట్లకును వెల్లడం జరిగింది.

1966వ సంవత్సరం మరల సాలుసరి సమావేశము జరిగింది. ఆ సభలో క్రింద పేర్కొనినవారు కార్య నిర్వాహకులుగా ఎన్నుకోబడ్డారు.

అధ్యక్షులు : శ్రీ ఎం.యస్. శర్మ
ఉపఅధ్యక్షులు : శ్రీ పి. జగన్నాథం
గౌ॥ కార్యదర్శి : శ్రీ జి.వి. సుబ్రమనియం

గౌ॥ సహాయకార్యదర్శి : శ్రీ డి.పి.అప్పలనాయుడు

గౌరవ ధనాధికారి : శ్రీ ఆర్. పైడినాయుడు శ్రీ ఆర్.పి. నాయుడు మరియు కార్యవర్గ సభ్యులను ఎన్నుకొన్నారు

ఆ సమయమున శాఖ పనులు చక్కగా జరుపుకొనుటకై రైల్వే డిపార్ట్‌మెంటు కార్మిక సంఘం కార్యాలయం సిలాంగూర్ ఆంధ్ర సంఘశాఖకు అన్ని విధాల తోడ్పడి శాఖకు వారి కార్యాలయమేవీరి కార్యాలయముగా ఉపయోగించడం అయింది. దానికి మూలకర్తలు శ్రీ. వి. బరతాన్‌గార్ని యీ సమయంలో పొగడవలసి వస్తుంది.

ఈ కాలములో శాఖ ఘనమయిన కార్యాలు చేయలేకపోయినప్పటికిని విదేశములనుండివచ్చి పర్యటిస్తున్న ప్రతి ఆంధ్ర అతిథులను వీలైనంతవరకు కలుసుకొని తగిన యేర్పాట్లు చేస్తుయుండేవారు; ఇంతేకాక సంఘ అభివృద్ధికి సభ్యులే మూల స్తంభము యనిమదిలో యుంచి ప్రతి శనివారం ఆదివారాల్లో శాఖ అధ్యక్షులు శ్రీ. ఎ. ఎస్. శర్మాగారు కారుతోబాటు అన్ని ప్రాంతాలకు విజయం జేసి వారి బాగోగులను తెలుసుకొని క్రమంగా సభ్యత్వము పెంచడం సాగింపజేశారు అప్పటి ప్రతి సంవత్సరాంతపుసభలలో వందలాది సభ్యులు పాల్గొని తేజోవంతం గావించేవారు.

ఈ కాలపరిణామములో వరసగా శాఖ నిర్వాహము మారుతుండే సమస్య ఒకప్రక్క యున్నప్పటికిని సంఘాభివృద్ధికి కొంత నూతనంగా యుండేది. క్రింద గుర్తించినశాఖ నిర్వాహకులు అంటే సంఘం ప్రారంభమునుండి 1964 నుండి 1974వ సం॥ వరకు శాఖ నిర్వాహపట్టీలు గుర్తిస్తున్నారు. బాట 1980/1981కిని నిర్వాహకులు కూడ గుర్తించడమైంది.

### 1967/68 సంవత్సరం రవాంగ్ ప్రాంతంలో 16-4-1967న జరిగిన సభలో

| | |
|---|---|
| అధ్యక్షులు | : శ్రీ. ఎం. ఎస్. శర్మా |
| ఉపఅధ్యక్షులు | : శ్రీ. వి. జి. వి. నాయుడు |
| గౌ॥ కార్యదర్శి | : శ్రీ. ఆడారి మారయ్యారావు |
| గౌ॥ సహాయకార్యదర్శి | : శ్రీ. ఎస్. మార్కండన్ |
| గౌ॥ ధనాధికారి | శ్రీ. ఆర్. పైడినాయుడు |

శ్రీ. ఆర్. పి. నాయుడు కార్యవర్గీయులును యెన్నోకో బడ్డారు.

### 1980-1981వ సంవత్సరాలకైన నిర్వాహకులు.

| | |
|---|---|
| అధ్యక్షులు | శ్రీ డాక్టరు ఆడారి క్రిష్ణమూర్తి |
| ఉపాధ్యక్షులు | శ్రీ రామనాయుడు |
| సహాయ అధ్య. | శ్రీ ఆర్. పైడినాయుడు/ |
| | శ్రీ ఆర్.పి. నాయుడు |
| | శ్రీ సూర్యనారాయణ |
| | శ్రీ బాల |
| గౌ॥ కార్యదర్శి | శ్రీ బీసెట్టి నూకయ్య |
| గౌ॥ సహాయకార్య. | శ్రీ ఎన్ బి. లక్ష్మణ |
| గౌ॥ కోశాధికారి | శ్రీ ఎ. దాలినాయుడు |
| | శ్రీ నాయుడు మరియు కార్యవర్గం. |

పై గుర్తించబడిన వారుఒకొక్క సాలుసరి సమావేశాలలో సంఘ సంప్రదాయ ప్రకారంగా ఎన్నుకోబడిన వారు అని తెలియజేసుకొంటున్నాను.

కుటుంబములతో నిర్ణియమైన ఎందరో సంఘనాయకులు సంఘానికిని సేవజేయాలనే దీక్షతో ఆ రోజుల్లో కుటుంబ పరిస్థితులను గమనించుకొంటూ అధికకాలాన్ని సంఘంపై చూపేవారిలో గుర్తుగా శ్రీ ఎం.ఎస్. శర్మ గారి జ్ఞాపకం వస్తుంది. ఇతను వరసగా ఎన్నో సంవత్సరాలు అధ్యక్ష పదవి నలంకరించి సంఘానికి ఎనలేని సేవచేశారు. వీరితోబాటు ఆనాటి కార్యవర్గం రాత్రింబవళ్లు పాటుపడ్డారు.

అప్పుడు 1967వ సంవత్సరం యీ దేశములోగల ప్రతీ ఆంధ్రుడును మరవలేని మధురమైన దినములు. సిలాంగూరు శాఖలో చక్కని నిర్వాహకులు ఉమ్మడిగా యున్నందున ఎటువంటి కార్యాలయినా శ్రమలనక చమత్కారంగా ముగించేసేవారు. యీ సంవత్సరం సిలాంగూర్ శాఖ చరిత్రకు మహాన్‌మైలు అంటే యీ దేశ ఆంధ్ర సంఘ శాఖల సాహిత్యం లాగా పెంపొందాలని కృషిచేసేవారు. అట్టి సందర్భాలలో దిగువుపేరా శాఖ యీ దేశము తొలి "ఉగాది" యనే పత్రిక పుస్తకరూపంగా తయారించి వెలువడించారు. ఈ

వాతావరణం సిలాంగూర్ ప్రాంతానికి వ్యాపించడం అయిందో లేక మొట్టమొదట సువర్ణ అక్షరాలతో విదేశాంధ్ర పత్రిక కౌలాలంపూర్‌లోనే ఉద్భవించిన కారణమో అర్థం కావలేదు. కాని, ఆంధ్రసంఘ చరిత్రలో ద్వితీయ తెలుగు పత్రిక పుస్తక రూపాన్ని "మురిపించే మువ్వలు"అనేపేరుతో ముత్యాల తెలుగులో ప్రచురించుటకు సిలాంగూర్ శాఖ తీసుకున్నది ఘనమైన బాధ్యత. ఈ పుస్తకం అతిత్వరలో కావాలని అప్పటి నిరుద్యోగిగాయున్న బీసెట్టి నూకయ్య రాత్రిం బవళ్ళు కష్టపడిరి. ఆయన సంకల్పంతో వెలువడయ్యేనప్పటికిని, ఆ పుస్తకానికి ఎలాంటి అడ్డంకులు వచ్చినా వాటికి ఎదురుగా నిలబడి పుస్తకాన్ని వెలువడించాలని కంకణం కట్టిన శాఖ అధ్యక్షులు శ్రీ. ఎం. ఎస్. శర్మా, శ్రీ. ఎ. ఎల్. మారయ్యారావు శ్రీ. ఆర్. పైడినాయుడుగారును-మొత్తానికి ఆ ఘనత సిలాంగూర్ శాఖకు జెందును కాబోలు!

అది శుభ సమయమో? లేక సిలాంగూర్ శాఖ చేసుకున్న భాగ్యమో తెలియదు. ఆ సమయాలలో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం మలేషియా దేశానికి తెలుగు పండితుల పంపిన మధురమైనను కాలం; అతనిని ఆహ్వానించాలని సిలాంగూర్ ప్రాంతాలలో నున్న ఆంధ్రు లందరు పూలహారములతో సుబాంగ్ అంతర్జాతీయ విమానాశ్రయములో ఘనస్వాగతంతో ఆహ్వానించటం సిలాంగూర్ శాఖ చేసిన మరో ఘట్టం. ఇతనిని కౌలాలంపూర్‌లోనున్న ముఖ్యస్థలాలకు మంత్రి కార్యాలయాలకు తీసుకవెళ్లి సకల విధముల సహాయపడినది. సిలాంగూర్‌శాఖ ప్రారంభమై దాదాపు అప్పటికి మూడు ఏండ్లు వయస్సు: యీశాఖ తన సొంతపనులే కాక కేంద్ర కార్యవర్గ పనులన్నిటిలోను పాల్గొనినది. మొత్తానికి మలేసియా ఆంధ్ర సంఘానికి ఘనతను పెంపొందించాలంటే ఎవరు ఏమరుపలకు తెలుప రనుకొంన్నాను. 1967వ సంవత్సరం శుభ సంవత్సరమేమో కాని అదే సంవత్సరంలో పండితుడు యర్రోజు మాధవాచార్యులచే ముత్యాల మురిపించే మువ్వల పుస్తకానికి ప్రారంభోత్సవం చేయడం జరిగిన మరొక ఘట్టం.

దేశ విదేశీయులైన అతిథులను గౌరవించి, వారికి విందుల యేర్పాట్లు సిలాంగూర్ శాఖ చాల కృషితో చేసేకాలం. కాలం మారింది, రోజులు మారాయి కాని ఆంధ్ర సంఘ ఘనత యీభువిలో సదా పురోగమిస్తున్నందున తెలుగువారిలో సంఘాన్ని ఏదో విధంగా ఆర్థికంగా బలపర్చాలనే భావాలు దాదాపు అందరి తెలుగువారి హృదయాల్లో నున్న మరో ఘట్టం. కాల చక్రం వేగంగా పరుగిడింది కాని సంఘంమాత్రం చాల నిదానంగా రమ్యంగా తన పనులను చేస్తూ వచ్చింది.

దాదాపు 1966-65. సంవత్సరం కేంద్ర వర్షాంత మహాసభ కౌలాలంపూర్‌లో కళామండపంలో జరపడం ఆసభకు అప్పటి రేడియో, టెలివిజన్ ప్రచారశాఖ మంత్రి శ్రీ సెనూచిన్ అబ్దుల్ రహమన్‌ను పిలిపించి సిలాంగూర్‌శాఖ రేడియో కార్యక్రమాల్లో తెలుగుకు కాలం అధికరించాలని మహజరు ప్రత్యేకంగా సమర్పించి ఆసభను శభాష్‌అని జరిపించింది సిలాంగూర్ శాఖగా గుర్తించడంలో తప్పులేదుకదా! ఇది అందరు ఎరిగిన విషయమైనప్పటికిని ముఖ్యమయిన ఘట్టంకదా! అందుకే తెలియజేశాను.

ఇంతలో శాఖ నిర్వాహకులలో కొందరు అనివారణమైన కారణాలవలన తమ పదవులను వదలి మారుతున్న మరోఘట్టం బాధాకరంగా ఉండేదికాని మారుతున్నారనే భయం ఏర్పడలేదు.

సూర్యుడు, చంద్రుడు ప్రతిరోజు మారుతున్నది ఒక పనే కదా ! అట్లే సంవత్సరానికి ఒకసారి సంఘానికి నిర్వాహకులును, వరుసక్రమంగా మారిపోయారు. కొందరు ఉన్నవారే వుండి సేవచేశారు. అట్టి సందర్భాలలో సుమారు 1970వ సంవత్సరం తరువాత కార్యదర్శిగా ఇంచుమించు శ్రీ బీసెట్టి నూకయ్యగారు ఉండేవారు. శ్రీ ఎం.ఎస్. శర్మగారు 5 సంవత్సరాలు అధ్యక్షులుగా ఉండేవారు.

ఇందులో వ్రాసినట్లు ఆర్థికంగా సంఘాన్ని పెంచాలన్న భావాలు పెద్దవారికి, యువతరంవారికి భావాల్లోయిమిడిపోయినందుననేమో ? లేకసంఘానికి ఉన్నత చదువులుగలవారు పట్టభద్రులుగా రావాలని సంఘం చేసిన ఉత్సాహానికి ఫలితంగా అప్పట్లో కొందరు

పట్టభద్రులు తయారవుతుండేవారు. అలాంటి పట్టభద్రులలో శ్రీ A. C. అప్పారావు పేరును గుర్తించడంలో తప్పేమీ ఉండ దని నా భావన. అప్పుడు సంఘ నాయకులు 'భాష పెరిగిందంటే సమూహము పెరుగుతుంది, దానిద్వారా సంఘము పెరుగును' అనే చెప్పుతూ యుండేవారు. దానికి అనుగుణంగా చదివిన పట్టభద్రులు సమూహ సేవ చేయుటకు కలుసుకొనడం వలన సమూహస్థాయితో బాటు సంఘగౌరవం పెరగడం ముఖ్యమైంది. ఈ నిజం నేటి నవనాగరిక ప్రపంచానికి కొంతవరకైనా ఋజువు అయిందని తెలుపుకొంటున్నాను.

ఇలాంటి వాతావరణంలో సిలాంగూర్ శాఖకు యువతరాలు మారగా సేవకులు పెరిగినందున వారెంతో కార్యాలను బానికాల ఆంధ్రులకై కొన్ని ఉద్దేశ్యాలు, లక్ష్యాలు వెలిబుచ్చారు. ఇంతేకాక యువకులు, ప్రజా సేవకులు, ఉన్నత ఉద్యోగులు, పట్టభద్రులు మొదలగు వారిని పరస్పరం సంఘంలో ఎదిగినందున నోటిమాటలే కాక, వ్రాతలతోకాక కనీసం కార్యరూపంలో పనులు జరిపించాలన్న భావాలు అందరిలో చెదిరాయి. దానికి ప్రతిఫలంగా మొట్టమొదటిసారిగా లాట్రీడాలు చేయడం ప్రారంభము జేశారు. ఇందుద్వారా శాఖకు కొన్నివేల డబ్బులు పోగుచేసుకోవడం అయింది. ఇంతేకాక క్రొత్త నిర్వాహకులు నూతన దిట్టాలు అమర్చినంతన మరొక త్రోవ ఏర్పాటుజేసి సినీమాలు విశేషంగా తెలుగు సినిమాలు చూపించి భాష, కళ, సాహిత్యం, నృత్యం, గానం మొదలగునవి తెలుగువారికి వ్యాపించాలన్న ఉద్దేశ్యాలు ఉండడం ఒక ప్రక్కనైనా మరోప్రక్క అందరిని గుంపుచేసి దాని ద్వారా శాఖకు డబ్బును సేకరించడం జరిగినదని తెలుపుటలో సంశయమేమీ లేదు. దీని వాత్సల్యమేమో ? "కళావాహిని" యనే మధురమైన పేరుతో కౌలాలంపూర్ సుంగైనే యువకులు మధుర గానాలు అందరికి వినిపించేవారు. అంతేకాక సంఘ సభల్లోను, గృహకార్యకలాపాలలోను మొదలగు వాటిలో పాల్గొని భజనలు, గానములు చెవులకింపుగా పాడేవారన్న విషయం మలేసియాంధ్రు లందరికి తెలుపుట ముఖ్యం కదా !

వరుసగా సిలాంగూర్ శాఖ ఆంధ్రులు, కార్యనిర్వాహకులు పూనుకొని ఎన్నో ఘనకార్యాలు చేసియున్నప్పటికిని మరొక ముఖ్యమైన విషయాన్ని చక్కగ సానుబట్టినట్లు మొత్తానికి మలేసియాంధ్రుల ఆర్థికాభివృద్ధిని పెంపొందించుటకై సహకార సంఘం ప్రాముఖ్యత తలంచిన తలంపులు ఆ రోజుల్లో అందరిలో చెదిరియున్నప్పటికిని, కొందరు అభిమానులు ఆ కార్యాన్ని కార్యరూపంగా చేయాలని కంకణం కట్టిన వారిలో కొందరు గుర్తించడం తప్పలేదు.

అది 1975వ సంవత్సరం మరొక శుభ కార్యంగా తొలి సహకార సంఘం 'సుజనా' యనే నామముతో ప్రారంభించడం అయింది. ఆ సహకార సంఘానికి మూలకర్తలు శ్రీ బొయిడి దేముడు శ్రీ ఆర్. ఆర్. చంద్రన్ వారైనప్పటికిని వీరికి సకల విధముల సహాయంగా మొట్టమొదటిసారిగా కార్యవర్గసభ పెట్టడం ఆ సభలో క్రింద గుర్తించినవారు కార్యనిర్వాహకులుగా ఎన్నుకోబడ్డారు.

President : Sri Dr. A.C. Appa Rao
Secretary : Sri B.A. Deimudu
Treasurer : Sri R.R. Chandran

కార్యనిర్వాహక సభ్యులు :

Sri K. Subramaniam
Sri P. Jaganathan
Sri B.A. Naidu
Sri Boopalan
Sri T.A. Varahalu
Sri Paul Naidu
Sri R. Soorianarayanan
Sri D P. Naidu
Sri R.P. Naidu / R. Paidi Naidu
Sri K. Appannah
Sri V. Bardan
Sri R. Subramaniam

ఇందులో గుర్తించినవారు ఆ సుజనా సహకార సంఘానికి స్థాపక డైరక్టర్లని గుర్తించడంలో తప్పేమి ఉండదని నా అభిప్రాయం. దీనికి ఉద్దేశ్యం అన్ని జాతులు చేరి ఉండాలని. కాని, తెలుగువారు బాధ్యతతో

యున్నందున తెలుగు వారికి సేవజేయ సకల వసతులను ఏర్పాట్లు చేసియుంది. ఈ కార్యం సిలాంగూర్ శాఖలో జరిగింది. ఇప్పటికీ కొందరు పట్టభద్రులు బయలుదేరి ప్రజాసేవ జేయ ముందుకు వచ్చారన్నది తెలుపుటలో సిలాంగూర్ చరిత్రకు గొప్ప ఘనతకదా!

ఈ శుభ సందర్భాలలో తెలుగు సాహిత్యం, సంస్కృతి యింకా ఏవేవో అప్పుడపుడు చెప్పడం సర్వసాధరణ విషయమైంది. కాని, అది ఎలాంటి వారివల్లన ఆరంభమవుతుందని తెలుసుకోవడంలో మహత్త్వం గలదుకదూ! ఈ బంగారు తరుణం మలేసియా తెలుగు వారికి గిట్టుతోందా యని సంశయం. కాని, ఈ కళకు విచ్చలవిడై కాలచక్రం మలేషియా ప్రక్కకు తిరిగింది కాబోలు!

అపుడు 1976 వ సంవత్సరం జూలై నెల మలేసియా ఆంధ్ర సంఘ సిలాంగూర్ శాఖకు మరొక చరిత్ర రూపం మెరుగుదిద్దినట్లు తెలుగు కవులు, రచయితలు, తెలుగుభాష పండితులుగా ప్రకాశిస్తున్న శ్రీ డాక్టర్ సి. నారాయణరెడ్డి, శ్రీ డాక్టర్ దాశరథి రాజధానిలో కాలు పెట్టడం జరిగింది. వీరి రాక నిజంగా ఈ దేశ తెలుగు వారైన మేము చేసుకొన్న మరో భాగ్యమని తెలుపుట ముఖ్యమవుతుంది. వీరితో బాటు కొందరు కళాకారులు ముఖ్యంగా శ్రీ గుమ్మడి, నిర్మాత, డి. రామానాయుడు యింకా ఎందరో సినీనటులు పర్యటించేవారు. వీ రందరికిని సిలాంగూర్ శాఖ అధ్యక్షులు, కార్యదర్శులతోబాటు శాఖనిర్మాతలు బ్రహ్మాండమైన విందులు ఏర్పాట్లు చేయక పోయినను తగిన విందులు ఏర్పాట్లు జేసి మర్యాద చేసినారంటే సిలాంగూర్ శాఖ చరిత్రానికి సకలం గౌరవమున్నది కదా!

ఇంతేకాక సిలాంగూర్ శాఖను కాలక్రమేణ సుంగైవే ప్రాంతపు యువకులు, యువతులు అండదండలుగా నిలిచి చక్కని పనులు చేసిరి. ఈ కాలపరిమాణంలో యింకాకొన్ని ముఖ్యమయిన ఘట్టాలు తెలుపుట ముఖ్యముకదా !

అనుకున్నట్లు, ఆలోచించినట్లు ఆంధ్రసంఘ సిలాంగూర్ శాఖకు ఉన్నత ఉద్యోగులు సంఘంలో జేరడం మొదలుపెట్టారు. తెలుగువారి కష్టసుఖాల్లో పాల్గొని పాటుపడిన పెక్కువారు గలరు. ఈ కాలములో వేలకొలది తెలుగు డాక్టర్లు ఆంధ్రదేశమునుండి రాజధానికి పర్యటించేది కాక ప్రత్యేక పరీక్షలు తీయడానికి వచ్చేవారు. వారినందగిని సంప్రదించి వారికి అవసరపడిన కార్యకలాపాలలో సంఘ నిర్వాహకులు పాల్గొని విందులు, తదితర సదుపాయాలు చేసిపెట్టిందని యీ సందర్భంలో తెలుపుట ఆవశ్యకత కదా! ఇట్లా సిలాంగూర్ శాఖ వరుసక్రమంగా అలుపనక అన్ని విషయాలలో మొరాయించకుండా సేవచేసింది. ఎవరును లేదనలేరు, యిదే వేళలో శ్రీ B. దేముంజ పూచీ తీసుకొని సుజనా సహకార సంఘాన్ని ప్రారంభించడం అయిందిగూడ అని తెలుపుట ముఖ్యం.

పై వాతావరణా లేమో అపుడు సిలాంగూర్ శాఖకు క్రొత్తగా యెన్నుకోబడిన అధ్యక్షులు శ్రీ డాక్టర్ ఆడారి క్రిష్ణమూర్తి సిలాంగూర్ తెలుగువారికి "ఉచిత వైద్యం", మందులు, సలహాలు యిచ్చి ఎందరోన్ని జబ్బులనుండి రక్షించారన్నది పొగడవలసిన విషయమైనప్పటికిని యీ ఘనత సిలాంగూర్ శాఖకే జెందుతుందికదా ! కాని, యితని సేవ గొప్పసేవ. తానొక డాక్టరు ఉద్యోగంలో ఉండి, ప్రజలకు, విశేషంగా తెలుగువారికి ముందుకువచ్చి సేవజేయటం ఏనాడో సిలాంగూర్ శాఖ ఆంధ్రులు చేసుకున్న భాగ్యం అనే నా భావన. గతంలో చేసిన సేవ మరువలేనప్పటికిని యీ యుగంలో ఉన్నత చదువులున్నవారు, డాక్టర్లు, లాయర్లు, ఇంజనీయర్లు, అకౌంటెంట్లు, ఏదోవిధంగా చదివి పెద్ద ఉద్యోగాలు జేస్తున్నవారు. సంఘములో జేరుతున్న భాగ్యమేమో ! శాఖ ద్వారా విద్యార్థులకు వీలైనంత సహాయాలు చేసేవారు, చదువులకు డబ్బు యిచ్చి సహాయపడినా రన్నది గుర్తించవలసిన విషయం. ఇంతటితో పూర్తికాకుండా కౌలాలంపూర్‌లో మరొక డాక్టరు శ్రీ జియారామన్ గారున్న శాఖ నిర్వాహకులలో లేనప్పటికిని తన శాయశక్తులా శాఖకు ఏదోవిధంగా డబ్బు యిచ్చి సహాయపడుతుండేవాడన్నది తెలుపుట ముఖ్యము కదా ! మనమందరం ఎన్నడో చెప్పినమాటకో ప్రతిఫల మేమి ?

ఆ మధ్యలో తెలుగుభాష పెంపొందించాలన్న ఉద్దేశం సదా ఉండిపోయినందున గ్రంథాలయములు

ఏర్పాటుచేసి భాషను అభివృద్ధి జేస్తున్నట్లుగా గ్రంథా యాన్ని సిలాంగూర్ శాఖ చేసిన మరో ఘట్టం. ఈ గ్రంథాలయానికి ఆంధ్ర దేశ డాక్టర్లు కొందరు పూనీ తీసుకొని వందలాది తెలుగు పుస్తకాలు పంపడం వల్ల పై గ్రంథాలయానికి ఉపయోగపడినవని ఈ సందర్భం ఆ డాక్టర్లకు ముఖ్యత యివ్వడం ఘనతేకదా! ఇంత కృషికి శాఖ అభివృద్ధికి శ్రీ బీశెట్టి నూకయ్య పేరు ప్రత్యేకంగా వ్రాయటం తప్పుండదు కదా!

గతంలో జరిగిన ఘట్టాలు మరువలేనివిగా పరిణ మించినను భావికాలాన్ని తలంచేటపుడు ఆలోచనలు, అందరి హృదయాల్లో అలనాటయ్యేవి. సంఘం పెరిగిం దని దృష్టియో? సంఘంలోనున్న నాయకులు ప్రపంచ సభలలో పాల్గొన్న, తరుణమో? లేక సిలాంగూర్ శాఖ రాజధానిలో నున్న గొప్పో? అర్థంకాకపోయినప్పటికి కేంద్ర సంఘానికి, సిలాంగూర్ శాఖకు భవనాలుండటం ప్రధానమని అందరిలో యున్న భావాలు దీని ప్రతి ఫలంగా కొందరి అభిలాష, తీవ్రకృషివలన రాజధాని కౌలాలంపూర్ దాదాపు 5 అంతస్థుల భవన మొకటి ప్రధాన కార్యాలయానికి కొనడమైంది. దీనికి శ్రీ ఆడారి అప్పన్న శ్రీ అడారి కృష్ణమూర్తి శ్రీ బీశెట్టి నూకయ్య మొదలగు వారి ఎనలేని కృషియే ఆభవన సంకల్పం. అంతేకాక వారి తీవ్ర ప్రయత్నమే సిలాంగూర్ శాఖ కును ఒక అంతస్థుగల భవనాన్ని అందించడం అయింది. ఈ కాలవాతావరణం ఏమో అపుడు ప్రపంచ తెలుగు సభలు ఆంధ్రలో జరగడం ఆసభల్లో మలే సియా ప్రతినిధులు డాక్టర్ అప్పారావు అధ్యక్షతన కలుసుకోవడం జరిగాయి. అపుడే జేసిన ఏకాభి ప్రాయ మేమో రెండవ ప్రపంచ మహాసభలు మలే సియా రాజధాని కౌలాలంపూరులో జరుపాలని తీర్మా నం అయింది. ఇంతటితో తెలుగు కీర్తి ప్రపంచమంతా వ్యాపించడమేకాక మలేసియా తెలుగు వారిలో ప్రత్యేక ఉత్సాహాలు ఉద్భవించాయి. ఈ మహత్తరమైన మహా సభలు మలేసియాలో జరుగతాయని ఏ తెలుగు వారు తలచ లేదేమో?

రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు అనుకున్నట్లు 1977లో జరగవలసింది. కాని, అనివారణ కారణముల వలనను, ఆంధ్రలో ఎనలేని తుఫాను వలనను ఆనాడు ప్రపంచసభలు జరగలేదని తెలియవచ్చింది. కాని ఆ సందర్భంలో రెండవ ప్రపంచ సభలలో కొన్ని కట్ బనీనులుపై అందమైన తెలుగు అక్షరాలు ముద్రించి అఖిల మలేసియా అంతట అమ్మబడినవారికి. జ్ఞాపకాన్ని వెలిబుచ్చుతూ ఈ మహత్తర కార్యానికి. సిలాంగూర్ శాఖ కార్యవర్గసభ్యుడైన శ్రీ A. అప్పన్న పూర్తి బాధ్యత తీసుకొని ఈ శాఖకు కొన్ని వేల వెండీ. లను సంపాదించి పెట్టారన్న ప్రత్యేక విషయాన్ని గుర్తించడం చాల ముఖ్యం కదా! ఇతను ఆ సమయ మున ప్రధాన కార్యాలయం సహాయ కార్యదర్శిగా ఉండేవారు.

మొత్తానికి సిలాంగూర్ శాఖ కౌలాలంపూరులో ఉండటం ఘనమైన కార్యాలు జయప్రదం గావించడంతో బాటు రవాంగ్, కిట్లాన్ ప్రాంతాలకు ఆంధ్రసంఘ నామాన్ని వ్యాపించడం సిలాంగూర్ శాఖకే కదా ఆ ప్రత్యేకత ఘనత జెందుచున్నది.

అవన్నియు అలా ఒకప్రక్క ఉంచటమైనప్పటికి. ఈనాటికి మలేసియా రాజధానిలో ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభలు జరగడం దానికి సిలాంగూరు శాఖ. పరిపూర్ణ బాధ్యతతో చక్కని పనులు సాగించడం సిలాంగూర్ ఆంధ్రులందరికీ ఘనత కదా! ఈ భాగ్యం. గత యుగంలో ఈనాటి ఆంధ్రులు జేసిన పుణ్యమే. యని నా భావన.

ఆనాడు అనుకున్నంత మాటలకు ఋజువుగా ఈ ప్రపంచ సభలు సిలాంగూర్‌లోనే జరగడం మరొక మహత్తర కార్యం కదా! ఈ ఘనత, ఖ్యాతి, ప్రతిష్ఠ యిప్పటి శాఖ నిర్వాహకులకు జెందుతున్నదని తెలుపు తున్ననాడే ఈ దేశ దేశ ఆంధ్రులందరు నాతో ఏకీ భవిస్తారనుకుంటున్నాను.

ఈ నాటికి సిలాంగూర్ శాఖ చరిత్ర అందరికి మేలనిపించి, రాబోవు ద్వితీయ ప్రపంచ తెలుగు మహా సభలలోను 'శబాష్' అనిపించుకోవా లనేది . నా ఆశ నా ప్రార్థన.

జై తెలుగు మాత!
ఖ్యాతి గావింపు సిలాంగూర్ ఘనత!!

సిలాంగూర్ శాఖ నిర్వాహకుల పట్టి

శాఖ ప్రారంభం 1964 వ సంవత్సరం నుండి 1974 వరకు

| పదవి | 1964-65 | 1965-66 | 1966-67 | 1967-68 | 1968-69 | 1969-70 | 1970-71 | 1971-72 | 1972-73 | 1973-74 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సభలు జరిపిన చోట్లు | కౌలాలంపూర్ వివేకానందాలో 2-8-1964 | నిర్మలాకింటర్ గార్డన్ K.L. 8-8-1965 | K.L. | రవాంగ్ ప్రాంతం | రవాంగ్ పట్టణం | N.U.P.W. P. Jaya | N.U.P.W. P. Jaya | N.U.P.W. P. Jaya | N.U.P.W. P. Jaya | N.U.P.W P. Jaya |
| అధ్యక్షులు | శ్రీ S.B.రెడ్డి | శ్రీ V.G.V. నాయుడు | శ్రీ M.S.శర్మ | శ్రీ M.S శర్మ | శ్రీ M.S.శర్మ | శ్రీ M.S.శర్మ | శ్రీ M.S శర్మ | శ్రీ సి. క్రిష్ణ సామినాయుడు | శ్రీ సీతా రామయ్య | శ్రీ సీతా రామయ్య |
| ఉపఅధ్యక్షులు | శ్రీ కొరువాడ సుబ్రమనియం | శ్రీ K. సుబ్రమనియం | శ్రీ పి జగన్నాథం | శ్రీ V.G.V. నాయుడు | శ్రీ టి. రామనాథన్ | శ్రీ సి. కృష్ణ సామినాయుడు | శ్రీ R. అప్పారావు | శ్రీ వి. భరథన్ | శ్రీ T.A. వరహాలు | శ్రీ A. క్రిష్ణమూర్తి |
| గౌ॥ కార్యదర్శి | శ్రీ పి. జగన్నాథం | శ్రీ G.V. సుబ్రమనియం | శ్రీ G V. సుబ్రమనియం | శ్రీ A.L. మారయ్యరావ్ | శ్రీ R.P. నాయుడు | శ్రీ బీశెట్టి నూకయ్య | శ్రీ బీశెట్టి నూకయ్య | శ్రీ బీశెట్టి నూకయ్య | శ్రీ బీశెట్టి నూకయ్య | శ్రీ బీశెట్టి నూకయ్య |
| గౌ॥ సహాయ కార్యదర్శి | శ్రీ R. రాము నాయుడు | శ్రీ R. రాము నాయుడు | శ్రీ D.P.A. నాయుడు | శ్రీ మార్కండన్ | శ్రీ R. రాము నాయుడు | శ్రీ B.R. సిమాచలం | శ్రీ B.A. దేముడు | శ్రీ A. క్రిష్ణమూర్తి | శ్రీ A. క్రిష్ణమూర్తి | శ్రీ I. క్రిష్ణా |
| గౌ॥ధనాధిపతి | శ్రీ D.A. నాయుడు | శ్రీ M.E. బత్తుమలై | శ్రీ R P. నాయుడు | శ్రీ R.P. నాయుడు | శ్రీ A. క్రిష్ణమూర్తి | శ్రీ M. రామక్రిష్ణ | శ్రీ M. రామక్రిష్ణ | శ్రీ S. రాము నాయుడు | శ్రీ T.M. అప్పలసామి | శ్రీ B.R. సిమాచలం |

# సిలాంగూర్ శాఖ

1975 వ సంవత్సరం మొదలు 1981 వ సంవత్సరం వరకు గల కార్యనిర్వాహకుల పట్టి

| పదవి | 1974-1975 | 1975-1976 | 1976-1977 | 1977-1978 | 1978-1979 | 1979-1980 | 1980-1981 |
| --- | --- | --- | --- | --- | --- | --- | --- |
| సభలు జరిపినచోట్లు | రవాంగ్ పట్టణం | K. Lumpur | K.Lumpur | K.Lumpur | K.Lumpur | K.Lumpur | K.Lumpur |
| అధ్యక్షులు | శ్రీ సీతా రామయ్య | శ్రీ M.S. శర్మ | శ్రీ P. జగన్నాథం A.M.N. | శ్రీ పి. జగన్నాథం | శ్రీ D R.A. క్రిష్ణమూర్తి | శ్రీ D.R.A. క్రిష్ణమూర్తి | శ్రీ D.R.A. క్రిష్ణమూర్తి |
| ఉప అధ్యక్షులు | శ్రీ A. కృష్ణమూర్తి | శ్రీ T.A. వరహాలు | శ్రీ T.S. వరహాలు | శ్రీ A. క్రిష్ణా | శ్రీ T.M. అప్పారావు | శ్రీ T.M అప్పారావు | శ్రీ రాము నాయుడు |
| సహాయ అధ్యక్షులు | — | — | — | శ్రీ S. క్రిష్ణమూర్తి | శ్రీ B.A. దేముడు | శ్రీ S. క్రిష్ణమూర్తి | శ్రీ ఆర్.పి. నాయుడు |
| సహాయ అధ్యక్షులు | — | — | — | శ్రీ D.R.A. క్రిష్ణమూర్తి | — | శ్రీ S. మునుసామి | శ్రీ సూర్య నారాయణ |
| సహాయ అధ్యక్షులు | — | — | — | శ్రీమతి సర్వలక్ష్మి | — | శ్రీ సూర్య నారాయణ | శ్రీ బాల |
| గౌరవ కార్యదర్శి | శ్రీ బీశెట్టి నూకయ్య | శ్రీ బీశెట్టి నూకయ్య | శ్రీ బీశెట్టి నూకయ్య | శ్రీ బీశెట్టి నూకయ్య | శ్రీ K.A. రామునాయుడు | శ్రీ బీశెట్టి నూకయ్య | శ్రీ బీశెట్టి నూకయ్య |
| గౌరవ సహాయ కార్యదర్శి | శ్రీ I. క్రిష్ణా | శ్రీ ఎస్. అప్పలనాయుడు | శ్రీ K.J. అచ్యుతరామయ్య | శ్రీ K.J. అచ్యుతరామయ్య | శ్రీ N.B. లక్ష్మణ | శ్రీ K.A. రామునాయుడు | శ్రీ N.B. లక్ష్మణ |
| — | — | — | — | — | — | శ్రీ N.B. లక్ష్మణ | — |
| — | — | — | — | — | — | — | — |
| గౌరవధనాధిపతి | శ్రీ బి.ఆర్. సింహచలం | శ్రీ P. జగన్నాథం A.M.N. | శ్రీ T.M. అప్పలసామి | శ్రీ T.M. అప్పలసామి | శ్రీ T.M. అప్పలసామి | శ్రీ అప్పల నాయుడు | శ్రీ దాలి నాయుడు |

# బుఱ్ఱ కథ

## ఎల్లపు కృష్ణమూర్తి, A.M.N.P.J.K.

వినరా, ఆంధ్ర వీర కుమారా, మలేసియాంధ్ర గాథ
వినరా, నీ తెలుగు జాతియొక్క విషాదమైన గాథ
దక్షిణ భారత దేశ మందున, ఉన్నది ఒక దేశం
దాని పేరే, ఆంధ్ర దేశ మని అందురు అందరును. ॥వినరా॥

వచనం: ఏమిటోయి రామన్నా! – మనవాడు మలేసియాంధ్ర గాథ పాడుతా నని, యేదో దక్షిణ భారత దేశ మట, ఆంధ్ర దేశ మట, యితని కేమయిన మతి పోలేదు గదా? లేక మన మర్యాద తీయవలచాడా?

లేదోయి సోమన్నా! సరిగా వినవోయి, ఆంధ్రులు మలేసియాకు యెలాగు, మన పూర్వీకులు వచ్చిరో వారి, పూర్వగాథ, చెప్పబోతారోయి.

(రామన్న) అర్గదీ సంగతి, అర్థమైంది.

పందొమ్మిదవ శతాబ్దపు తొలి రోజు లవీ (వెనుక పాడువారు)
ఆంగ్లేయులే అధికారులై ఉన్న రోజు లవీ తందానతాన తందానాన
వీరులు, త్యాగులు, తాండవించే తెలుగు దేశ మదీ (వరుస పాడాలి)
కవులు, గాయకులు, ఘనత చెందిన గౌరవ దేశ మదీ
పుణ్యపురుషులు, పుణ్యనదులు పుట్టిన దేశ మదీ
అమర శ్రీరాములు ఆహుతి అయిన, ఆంధ్ర దేశ మదీ ॥వినరా॥

వచనం: సోమన్న! ఇంకా యెలాంటి దేశమోయి.
రామన్న: చెప్పుతారు, వినవోయి, తెలివిలేని తెలుగోడ!

(వెనుక పాడేవారు సై సై అని పాడాలి)
పాడిపంటలకు కొదువ లేదురా సై సై
పంట భూములకు కొదువ లేదురా ,, ,,
అన్న వస్త్రములకు, ఆటంకమే లేదురా ,, ,,
దరిద్రమునకు దారే లేదురా ,, ,, ॥వినరా॥

వచనం: సోమన్న! మరెందుకోయి, ఈ మలేసియా కొచ్చినారు.

రామన్న: కొన్ని వెనుకబడిన జిల్లాల వారే పోయి వచ్చినారు. విశాఖ జిల్లా, చిత్తూరు జిల్లాల వారు.

(భళీ భళీ అని వెనుకవారు పాడాలి.)

మలేసియాను ఆంగ్లేయులు పట్టిన రోజు లవీ  భళీ భళీ
ఆంగ్లేయులే యధికారులై యున్న రోజు లవీ  ,, ,,
రబ్బరు, కొబ్బరి, తే తోటలే తెఱచిన రోజు లవీ  ,, ,,
తెరచిరి వారు, తెరచిరి వారు, తే తోటలన్నీ  ॥వినరా॥

వచనం: సోమన్న : వారు తెరిస్తే మనకేమయ్యా ? రామన్న : తెల్లవారు ఆ తోటల పనులకు మనవారిని ఆంధ్రదేశమునుండి తీసుకొనివచ్చిరి. సోమన్న : మన వారు ఎలాగు వచ్చిరి.

అయ్యో, అయ్యో, యేమి చెప్పుదునయ్యో
మూట, ముల్లే కట్టిరి, అయ్య  అయ్యో, అయ్యయ్యయ్యో !
ముసలివారే ఏడ్చిరీ అయ్య  ,, ,,
గోడు గోడున దుఃఖించి రయ్య  ,, ,,
మెడ్రాసు వో డెక్కిరిఅయ్య  ,, ,,
మలేసియాకే వా రొచ్చిరయ్య  ,, ,,

సోమన్న : వా రొచ్చి యేమి చేసిరోయి రామన్నా! రామన్న! కొంత మంది, కొబ్బరి తోటలలోను, కొంత మంది, రబ్బరు తోటలలోను, పనిచేయుటకు, తీసుకెళ్లిరి.

(సై సై అనే మెట్టు)
నరికిరి, నరికిరి అడవులు  సై సై
వేసిరి వేసిరి తోటలు  ,, ,,
సస్యశ్యామలమే చేసిరి  ,, ,,
సంపదలనే, చేర్చిచ్చిరి  ,, ,,
పాటుపడి, బాగుచేసిరి  ,, ,,
ఈ భాగ్యదేశమును చేసిరి  ॥వినరా ఆంధ్ర వీరకుమారా॥

వచ్చినవారు ఎలాగున్నా రంటే
అయ్యయ్యో అయ్యో
మాతృభాషనే వారు మర్చిరి  అయ్యయ్యో
తనజాతినే వారు మర్చిరి  ,, ,,
కళాచారమునే వారు మర్చిరి  ,, ,,
కన్నతల్లినే వారు మర్చిరి  ,, ,,
అన్నియును, మర్చినా రయ్యోయ్యో  ,, ,,
అమాయకులయినారయ్యోయ్యో (రెండుసార్లు)  ,, ,,  ॥వినరా॥

విద్య లేదు వారి కన్నా అమ్మమ్మమ్మో
తెలివి లేదు వారి కన్నా " "
బడులు లేవు వారి కన్నా " "
నీడ లేదు వారి కన్నా " "
తల్లీ, లేదు వారి కన్నా " "
నీచ మైన బ్రతుకన్నా " "
వారు బ్రతుకుచున్నా రన్నా " " ॥వినరా॥

వచనం : సోమన్నా! మరీ ఏమైనారోయి? రామన్నా! 1955లో కొంత మంది తెలివైనవారు, తమ జాతి పరిస్థితిని, తలచి దుఃఖించిరి. తెలుగు తల్లిని పూజించగా, వారికి కలలో కన్పించి చెప్పిందట.

సోమన్నా! యేమని చెప్పిందంటే-
లేవో, లేవోయి, ఆంధ్రుడా సై సై
లేచి నిలబడవోయీ ఆంధ్రుడా " "
పదవోయి, పదవోయి, ఆంధ్రుడా "
పట్టు విడకోయి ఆంధ్రుడా "
తట్టి మేల్కొల్పవోయి ఆంధ్రుడా "
మలేసియాలో నీ భాషాంధ్రుడా "
మట్టిపా లవనీకోయి ఆంధ్రుడా "
సంఘమునే, చేర్చోయాంధ్రుడా "
సంగతీ చెప్పవోయాంధ్రుడా " ॥వినరా॥

వచనం : సోమన్నా! యేమి చేసినారోయి, నాయకులు, రామన్నా! వెంటనే ఆంధ్ర సంఘమును స్థాపించినారు రాత్రనక పగలనక ఎండనక వాననక వూరనక పేటనక ఆంధ్ర శంఖమును ఆంధ్రుల చెవిలో వూదినారయ్యా, యిక చూడవయ్యా

ఇతరులు యిది చూచిరి సై సై
అల్లరి - అడ్డులు పెట్టిరి "
బాహి - బాహిగా పోరాడిరి "
ఆంధ్ర ప్రవాహములో అహుతి అయ్యిరి "
వినరా, ఆంధ్ర వీర కుమారా, మలేసియాంధ్ర గాథ
ఆంధ్రులు అందరు అమరిరి
ఆంధ్ర సంఘమునే అమర్చిరి భళి, భళి
ఆడ, మగ, అందరు చేరి "
ఆంధ్ర సంఘమునే ఆదరించిరి "
చందాలన్ని చక్కగా చేర్చిరి " ॥వినరా॥

వచనం : తెలుగు వారికి, ఒకే జాతి, ఒకే మాట, ఒకే బాట, ఒకే సంఘము అని ప్రతి ఆంధ్రుడు ప్రతిజ్ఞ చేసిరి.

తెలుగు వారినే - తెలివైన వారిగా చేయాలన్నారు తందానతాన
డాక్టర్లు గాను - లాయర్లుగాను చదవా లన్నారు ,,
ఇంజనీర్లుగా, యినస్పెక్టర్లుగా యిమడా లన్నారు ,,
మాష్టర్లుగా - మేనేజర్లుగా మారా లన్నారు ,,
భూస్వాములుగా - భాగస్థులుగా బాగవాలన్నారు ,,
వ్యాపారులుగా వ్యవహారులుగా కావాలన్నారు ,,
తర్ఫీ దిచ్చి - తెలుగువారినే తీర్చిదిద్దినారు ,, ॥వినరా॥

వచనం : సోమన్నా! యిప్పుడెలాగున్నారోయి మలేసియాంధ్రులు- రామన్నా: మనవారు, డాక్టర్లుగా, లాయర్లుగా, ఇంజనీర్లుగా, వ్యాపారులుగా, భూస్వాములుగా, విద్యావంతులుగా, ఆఫీసర్లుగా ఎకౌంటెన్ట్సుగా యింకా పెద్ద పెద్ద చదువులు చదువుచున్నారోయి. ఇది అంతా, ఆంధ్ర సంఘ మహిమ. సేవ. ప్రపంచ మహాసభలే, మలేసియాలో జరిపించుతుంది.

పాట

మరువాకు - మరువాకు, ఆంధ్రుడా,
సంఘమునే - మరువాకు ఆంధ్రుడా
ద్రోహంబు చేయాకు - ఆంధ్రుడా
కక్షలే రేపాకు ఆంధ్రుడా
జాతి భేదంబు - లేదురా ఆంధ్రుడా
సంఘంబు లేదంటే - ఆంధ్రుడా
సాటి, గౌరవము లేదు ఆంధ్రుడా
స్వార్థంబు - విడవోయి ఆంధ్రుడా
వచ్చి సంఘములో చేరు ఆంధ్రుడా
ఐక్య పడవోయి - ఆంధ్రుడా
మంగళం - మంగళం ఆంధ్రుడా
మంగళం - మంగళం ఆంధ్రుడా ॥వినరా॥

'చేయెత్తి జైకొట్టు తెలుగోడ
గతమెంతో ఘనకీర్తిగలవోడ !'

# ఓ తెలుగు వాడా!

## కర్రి అచ్యుతరామయ్య 'అచ్యుత్'

రా రమ్మురా వేగ ఓ తెలుగువాడ!
లే లెమ్మురా యికను ఓ తెలుగురేడ!
పో పొమ్మురా అల్ల ముందడుగు జాడ!
తే తెమ్మురా జయము నీ జాతి పాడ!
మలాయా దేశములోన మరుగైన నీవు
నీజాతి వికసింప పరుగులిడరావా!
నీ పూర్వ సంతతిని మది నెంచి చూడు
ఇటుపైని నీ కికను నే జెప్పనేల?
'ఏ దేశ మేగినా ఎందు కాలిడనా
నిలుపరా నీజాతి నిండు గౌరవమన్న
జాత్యుక్తినే నీవు మరచిపోయావా?
అన్యమకారంలో మునిగిపోయావా?
ఏక ్రకమముగపుడు పాలించినావు
నీని నియతికి మెరుగు తెగ దిద్దినావు
మధ్య యుగములో నీవు మాయమైపోతే
వగవరా మున్ముందు నీ బిడ్డ లయ్యో!
మలాయాంధ్ర సంఘమున్ జేరి నా సోదరుడా!
సాగు ముందుకు యెదురు లేదురా ఆంధ్రుడా
మన భాష యెల్లెడల వ్యాపించునాడె
ముదమొందురా నిజము నిన్నుగన్న తెనుగు.
ఎదురాయె నల్ల దేమనకు శుభవేళ
మనకగా కనుపించు తొలివెల్గు జ్వాల
రా రమ్మురా వేగ ఓ తెలుగువాడ!
లే లెమ్మురా యికను ఓ తెలుగురేడ!!

# తెలుగు భాష వుంటేనే తెలుగు జాతి వుంటుంది

## బీసెట్టి నూకయ్య

తెలుగు భాష వుంటేనే - తెలుగుజాతి వుంటుంది
తెలుగువా డుంటేనే తెలుగు సంఘ ముంటుంది
తెలుగు భాషే తీయనైన 'భాష'ంటే పోతుందా?
తెలుగువారే గొప్పవారంటూ కూర్చుంటే అయిపోతుందా?
తెలుగువాడు తెలుగును నేర్వకుండా కూర్చుంటే
తెలుగు భాషకు తప్పకుండ పడుతుంది బూజు.
తెలుగువాడు తెలుగువాడితో చేరకుండా కూర్చుంటే
తెలుగు సంఘం లేదు, తెలుగుదనం లేదు.
తెలుగు సాహిత్యం పెరగా లంటాడు
తెలుగు సంఘ నాయకుడు
తెలుగు నేర్చు కొమ్మంటే - లాభ మే మంటాడు.
తెలుగున్న దంటున్నావు - తెలుగువాడి నంటున్నావు
తెలుగు నేర్చుకుంటేనే వచ్చిందా ముప్పు?
"తెలుగువాడిని కాదన్నానా, తెలుగువాడి సేవ
జేయనన్నానా
తెలుగువాడి నని చెప్పుకుంటే చాలదా?"
తెలుగుబడు లున్నాయి - తెలుగు మాష్ట ర్లున్నారు
తెలుగు భాషలో సరిపడే వాచకాలు లేవు
తెలుగు మాష్ట ర్లేమి చేస్తున్నారండి?
తెలుగు కాని భాషలను తర్జుమా చేస్తున్నారు
తెలుగు పిల్లకాయలకు తెలుగు బోధిస్తున్నారు
తెలుగువాడు లేని సంస్థలు అరుదు
తెలుగువాడివ్వని చందాలు అరుదు
తెలుగువాడి సొమ్ముతో పెరుగుతున్న సంస్థ లెన్నో
తెలుగువాడి కక్కడ చోటు మాత్రం లేదు
తెలుగువాడి తమషా దరిజేరే రో జెపుడో?

# ఆంధ్రుల సాహసాలు

ఆర్. పైడినాయుడు

సంఘ నాదము వినిపించెను
రంగ స్థలమున కనిపించెను
తెలుగు వారి తీరు తెన్నులు
ఆంధ్ర జాతి ధైర్య సాహసాలు

వికసించిన ఆంధ్రులకు
సభ్యతలు ఏర్పఱచి
విస్తరించెను దేశమంతా
జ్యోతి ముద్రణాలయమనే

సాహిత్య పురుషులుగా
సుబ్రమనియం రెడ్డిగారును
శోభించెను తెలుగు పత్రికను
శృంగార విదేశాంధ్రతో

స్వర్ణ మలేసియా ధరణిలో
సువర్ణ తెలుగు అక్షరాలతో
సంఘానికి స్థిరమైన భవన మొకటిగా
సమావేశాలలో ప్రశ్నించెను

ముమ్మూర్తులా ప్రశస్తమైన
అప్పన్న, నూకయ్య, కృష్ణమూర్తులు
మలేసియా రాజధానిలో
అంతస్థులతో సింగారమైన భవన మొకటి
నిర్మించిరి

శృంగార భవనం ఒకటని
శ్లాఘించెను మలేసియాలో
సున్నితమైన తెలుగు సమూహానిదని
దేశమంతా వ్యాపించెను

అహ్లాదతలు గల ఆంధ్రులని
అందరి సమూహ నోళ్ళలోను
అవతరించెను

అఖిల మలేసియా దేశములోను
అది ఆంధ్ర సంఘమనే నామమయ్యెను

స్వర్ణ మలేసియా భూమిని
ఆంధ్రు లందరికి ఆనందం
సువర్ణ తెలుగు పదంబులనే
ఆంధ్రు లందరికి ఆనందము.

# మలయదేశపు తెలుగువాడా!

## కుండా సిద్దయ్య

మలయ దేశపు తెలుగువాడా - తెలుగు మరచీ తిరిగే వాడా
తెలుగు భాషను తెలియక మెలిగేవా ఓ... తెలుగువాడా !
తెలివి తేటలు, విడిచి తిరిగేవా ఓ... తెలుగువాడా!
తెలివి గలిగిన మేలుకోరావా ॥మలయ॥

తెలుగు సంస్కృతి పెంపు చెంద - తెలుగువా రభివృద్ధి పొంద
అవతరించెను సంఘం విన్నావా - ఓ తెలుగువాడా
ఎవరికొఱకని తెలుసుకున్నావా - ఓ తెలుగువాడా
తెలుసుకొని యిక మేలుకోరావా ॥మలయ॥

అంధకారపుచీకటియందు సంచరించక లెమ్మురా తెలుగా
నీమ జాతికి బాటను గనరావా - ఓ... తెలుగువాడా
తెలుసుకొని యిక మేలుకోరావా... ఓ... తెలుగువాడా
తెలుగు భాషను పెంచగరావా ॥మలయ॥

ఏబదెనిమిది దినములుండి అన్నాహారా లన్ని మాని
ప్రాణ త్యాగము చేసెను విన్నావా - ఓ తెలుగువాడా !
ఎందుకొఱకని తెలుసుకున్నావా - ఓ... తెలుగువాడా
త్యాగి రాముల దీక్ష గనలేదా ॥మలయ॥

దేశమంటే మట్టి గాదని - దేశ మంటే మానవులే నని
గురజాడ కవుల రాతలు చదివావా - ఓ... తెలుగువాడా !
తెలుగు చరితలు కనుల గనలేదా - ఓ... తెలుగువాడా !
తెలుగు చరితలు కీర్తి గనలేదా ॥మలయ॥

# అంధుడైన ఆంధ్రుడా

"ఆంధ్రీత"

వినవోయి అంధుడా విదేశాంధ్రుడా
అలనాడు వచ్చావు అడవి కొట్టావు
బాటలు వేశావు తోటలు చేశావు
బాగుగా నీపైన ప్రబలమైనావా ? ॥విన॥

తెలుగు తే టన్నావు తెగమురిసి పోయావు
దేశదిమ్మరివై నీవు తిరుగుతున్నావు
నీ కిది న్యాయమా నిద్రించు ఆంధ్రుడా !
లేలెమ్మ ఇకనైన నిలుపు నీ ఖ్యాతి ॥విన॥

భాషనూ మార్చావు వేషమూ మార్చావు
బాగుగా నీపైన ప్రబలమైనావా ?
అందాల తెలు గిచట అడుగంటుతుందిరా !
ఆపవోయ్ ఆంధ్రుడా ! అణగారి పోకుండ ॥విను॥

ఇతరులకు నిచ్చెనై నీ వుంటివేగాని
నీ భాష నిచ్చట నిలదొక్కినావా ?
పలుకక ఉలుకక పరుండి పోతేను
అలనాటి ప్రతిభలు పగటి కల లవును ॥విన॥

# కోలాలంపూర్ విలయా (షిటీ) దినము

బి. అప్పలనాయుడు

కోలాలంపూరు మా మహానగరం
ముత్యాల ముగ్గు వోలె
మింట నంటు మహాహర్మ్యములు !
నీ వెదుగు మే మెదుగుతాం
నీవు లెమ్మ మేము లేస్తాం మహానగరమా ! !
విలయా (షిటీ) దినమున దీపకాంతులు వెదజల్లగ
నీ సొగసు మిన్నెగసి కీర్తి గాంచగ
మేమున్ను చేయిచ్చి అండ నిలుస్తాం
నీ కివే మా జోహార్లు !

# మేలుకొలుపు

## శంకర రెడ్డి

భాషను మరచితివా - భాగ్యము కోరితివా
తల్లి లేకనే జన్మించితివా - వేరొక తల్లికై వెదకుచున్నావా
ఎండమావులలో దప్పిక - తీర్చుకొంటా నంటావా
సెలయేటి నీళ్ళే చేదని - చెప్పుకుంటున్నావా
గూబల వెంట, రాజ - హంసలు వెళ్ళా లంటావా
కాకుల వెంబడి కోకిల - గుంపులు పోవా లంటావా
పిల్లుల వెనుక పెద్ద - పులులే నడవా లంటావా
సింహ గర్జనములే - గాడిద గాండ్రింపు లంటావా ?
ఆత్మవంచన చేయకు - అభాగ్యమునకు ఆదర్శవు కాకు
ఆంధ్రుల ప్రయత్నము వినూ - ఆంధ్ర సంఘ మున్నది చూడు
విదేశములలో నీవిలువకై వెలసిన విదేశాంధ్రను తెలుసుకో

# ఎవరో ఒకరు

## జె. యస్. లెక్లర్

ఎవరో ఒకరు సత్కార్యము చేశారు
ఎవరో ఒక స్నేహితుని అక్కరను ఋజువు చేశారు
ఎవరో ఒక మధురమయిన గీతము గానించారు
ఎవరో ఒక దినమంతయు ప్రయాణం చేశారు
ఎవరో "ప్రేమించుట మధురం" అని తలంచారు
ఎవరో "ఇచ్చుటకు నాకు సంతోషం" అని చెప్పారు
ఎవరో ఒక మంచి పోరాటము పోరాడారు
ఎవరో న్యాయము రక్షించుటకు బ్రతికారు
ఆ ఎవరో ఒకరు మీరేనా ?

## అయిదవ భాగం

# మలేసియా తెలుగు వెలుగులు



పేరు : ఎల్లపు కృష్ణమూర్తి. A.M.N., P.J.K.

పుట్టిన తేది : 6-8-1929 స్థలము : Water-fall Estate, Rawang, Kuala Lumpur.

వృత్తి : ప్రధానోపాధ్యాయులు

విద్య : S.S.L.C., L.C.E., బేసిక్ ట్రైనింగ్ (ఉపాధ్యాయ శిక్షణ)

సమూహ సేవా వివరాలు/పదవి వివరాలు : మలేషియా ఆంధ్ర సంఘ దక్షిణ పేరా శాఖ అధ్యక్షులు, Bagan Pa Sir MIC శాఖ కార్యదర్శి, మలేషియా ఆంధ్ర సంఘ ప్రధాన కార్యనిర్వాహక సభ్యులు.

బిరుదులు : A.M.N, P.J.K.

కాలక్షేపము : పత్రికలు చదువుట, సభలు, సమావేశములకు వెళ్ళుట, తెలుగు పుస్తకములు చదువుట, పాటలు, దేశ, ప్రపంచ వార్తలు వినుట. (రాజకీయ విశేషములు తెలిసికొనుట) మొదలగునవి.



పేరు : కాశీన రమణయ్య

పుట్టిన తేది : 5-6-1929 స్థలము : బాగన్ దత్తో

వృత్తి : ఉపాధ్యాయులు విద్య : C. 2

సమూహ సేవా/పదవి వివరాలు : M.I.C. బాగన్ శాఖ అధ్యక్షులు 1965 లో తరువాత శాఖ కార్యదర్శిగా ఇప్పటివరకు సేవచేయుచున్నారు. దిగువ పేరా ఆంధ్ర సంఘమునకు 1968లో అధ్యక్షులుగా యుండి తదుపరి కార్యదర్శిగా పనిచేసిరి, పాటలు, వ్యాసములు, గేయములు వ్రాసిరి.

బిరుదులు : నా సేవకు మెచ్చి సర్కారుగారు P.P.M. అను బిరుదు నొసంగిరి.

కాలక్షేపము : ఆరోగ్యము బలహీనముగా యున్నందున ఉపాధ్యాయ వృత్తితో కాలక్షేపము చేయుచున్నారు.



పేరు : బొబ్బర సముద్రము - తండ్రి పేరు : కొండయ్య

పుట్టిన తేది : 1-8-1940 స్థలము : టెలుక్కాన్షన్

వృత్తి : ఉపాధ్యాయుడు

విద్య : తెలుగు, తమిళము, ఆంగ్లము, మలాయి L.C.E. వరకు

సమూహ సేవా/పదవి వివరాలు : 1964-1969 వరకు నెగ్రి సెంబిలాన్ ఆంధ్ర సంఘ శాఖకు ధనాధికారి పదవిని వహించి పలువిధాలలో సహకరించితిని.

కాలక్షేపము : పాఠశాల పనిబాట్లు గమనించుట, తోటపని చేయుట, పత్రికలు, కథా పుస్తకములు చదువుట, రేడియో కార్యక్రమములను ఆలకించుట, టెలివిషన్ కార్యక్రమములు చూచుట.



పేరు : అప్పలనాయుడు తండ్రి పేరు : పైడయ్య

పుట్టిన తేది : 14-2-1940 స్థలము : Blenheim Est., Teluk, Aloson.

వృత్తి : ఉపాధ్యాయులు

విద్య : 7వ తరగతి, L.C.E. ఉపాధ్యాయ శిక్షణ

సమూహ సేవ : మలేషియా ఆంధ్ర సంఘ సుంగై పటాని శాఖలో గౌరవ కార్యదర్శిగాను, పిదప కార్యవర్గీయ సభ్యునిగాను, కెడా M.I.C. ఆర్వార్డు శాఖ ఉప. కార్యదర్శి, కార్యవర్గీయ సభ్యునిగాను సేవ.

కాలక్షేపము : బేడ్‌మింటను ఆడుట, పత్రికలు చదువుట, తెలుగు పాటలు వినుట, చిత్రములు చూచుట.

పేరు : పెంటకోట ఎ. ప్రకాశము



పుట్టిన తేది : 1936 (కూలిం)

వృత్తి : మేస్త్రి

సమూహసేవ, అభిరుచులు : ఆంధ్ర సంఘ కూలిం శాఖ ఉపాధ్యక్షులు, పెలాయ్ తోట తమిళం + తెలుగు పాఠశాల తలిదండ్రుల, ఉపాధ్యాయుల సంఘ అధ్యక్షులు, పెక్కాన M.I.C. శాఖ మాజీ కోశాధికారి, పెలాంతోట షాంకాట్ సర్వగుణ సంఘ అధ్యక్షులు. నాటకములలో నటించుట.



పేరు : అల్లు సింహాచలరావు

పుట్టిన తేది : 1937 స్కార్‌బరో, కెడా

వృత్తి : మేస్త్రి

సమూహసేవ, అభిరుచులు : ఆంధ్ర సంఘ సభ్యులు, ఆంధ్ర సంఘ సుంగై పటాణి శాఖ ఆలోచకులు. తెలుగు చలనచిత్రాలు కళాచారములు, ఉగాది వేడుకలు జరిపించుట.

విలాసము : Scarboro Estate : 4,
Sungei Patani, Kedah,
Malaysia.

పేరు : బి. కె. సింహాచలం



పుట్టిన తేది : 1-9-1940 ఇండియా

వృత్తి : తెలుగు ఉపాధ్యాయులు

సమూహ సేవ, అభిరుచులు : M.I.C. శాఖ అధ్యక్షులు, మలేషియా ఆంధ్ర సంఘ దిగువ పేరా శాఖ కార్యదర్శి. ఆంధ్రుల అభివృద్ధికి పాటుపడుట, బేడ్ మింటన్ ఆడుట, పత్రికలు చదువుట.

విలాసము : S.R.J.C. (Telugu)
Ladang Kuala Berajam,
Teluk Anson, Malaysia.



పేరు : గుప్పగడ్డి సుబ్రమణ్యం అచ్చిబాబు

పుట్టిన తేది : 22-7-1951 (బిడింగ్ కెడా) వృత్తి : ఉపాధ్యాయులు

విద్య : SPM/MCE

సమూహ సేవ : 1972-1973 మలేషియా ఆంధ్ర సంఘ కూలిం శాఖ ఉప కార్యదర్శి. 1975-1979 మ. ఆంధ్ర సంఘ కూలిం శాఖ కార్యదర్శి 1980 నుండి సుంగై పటాణి శాఖ కార్యదర్శి.

అభిరుచులు : ఉత్తరాలు, కాలు బంతాట, టెలివిషన్.

విలాసము : 49-C, Kg. Sg. Toh Pawang,
Bedong, Kedah, Malaysia.

పేరు : డాక్టర్ ఎ. కృష్ణమూర్తి



పుట్టిన తేది : 19-11-1946 వృత్తి : డాక్టరు.

విద్య : M.B.B.S. (Kurnool, India)

సమూహ సేవ : మలేషియా ఆంధ్ర సంఘ సిలాంగూర్ శాఖ అధ్యక్షులు, సుజనా సహకార సంఘ డైరెక్టర్, రెండవ ప్రపంచ తెలుగు మహాసభల రిసెప్షన్, వైద్య విభాగాల అధ్యక్షులు, మలేషియా మెడికల్ కౌన్సిల్ సభ్యులు. జీవిత సభ్యులు E.W.R.F.

విలాసము : 88-A, Jalanalor,
Kualalumpur, Malaysia.



పేరు : రావాడ సముద్రము

పుట్టిన తేది : 1940 ఈపో

వృత్తి : డ్రైవరు

సమూహ సేవ : ఉపాధ్యక్షులు కులువాంగ్ శాఖ, M.I.C. సహాయ అధ్యక్షులు సింపాంగ్ రంగం శాఖ.

విలాసము ; Wessyington Estate,
Rengam, Johore, Malaysia.

పేరు ; పాలమరశెట్టి రాములు

పుట్టిన తేది : 25-6-1943 బాగన్ దత్తో

వృత్తి : ఉపాధ్యాయులు

సమూహ సేవ ; ఆంధ్ర సంఘ కులుగాంగ్ శాఖ కార్యదర్శి, MIC. కంపాంగ్ గాజా శాఖ ఉపాధ్యక్షులు.

విలాసము : No. 11, Jaman Perkasa,
Kampong, Baru,
Kluang, Johore, Malaysia.





పేరు : సూరిశెట్టి సూకరాజు

పుట్టిన తేది : 22-5-1950 (క్లువాంగ్)

వృత్తి : వ్యాపారము

సమూహ సేవ : కులుమంగ్ శాఖ సభ్యులు.

కాలక్షేపము : రేడియో, బేడ్మింటన్, పుస్తక పఠనము.

విలాసము : Wessyington Estate, Rengam,
Johore, Malaysia.



పేరు : లింగాల రామునాయుడు

పుట్టిన తేది : 6-9-1943

సమూహ సేవ : ఆంధ్ర సంఘ వెషింగ్టన్ తోట ప్రతినిధి, MIC. సభ్యులు.

విలాసము : Wessyington Estate, Rengam,
Johore, Malaysia.



పేరు : బండారి మునియాండి

పుట్టిన తేది : 1940 బాగాన్ పాసీర్

వృత్తి : డ్రైవరు

సమూహ సేవ : MIC. యువజన బృంద అధ్యక్షులు. (రెంగం) క్లువాంగ్ ఆంధ్ర సంఘ శాఖ సభ్యులు.

విలాసము : Wessyington Estate, Rengam,
Johore, Malaysia.



పేరు : ఎం. అప్పన్న

పుట్టిన తేది : 1936 తండోంగ్ మాగ్

వృత్తి : ఎలక్ట్రిషియన్

సమూహ సేవ : ఆంధ్ర సంఘ సభ్యులు, MIC. సభ్యులు. ఇన్సూరెన్సు

విలాసము : 254, Sungai Besi Mining,
Sungai Besi, Kuala Lumpur,
Malaysia.

పేరు : ఎం. అంసరాజు

పుట్టిన తేది : 15-4-1945 సిరంబాగ్

వృత్తి : డాక్టరు

విద్య : M.B.,B.S. (Culcutta)

సమూహ సేవ : సెరంబాన్‌లో ప్రయివేటు క్లినిక్ జరుపుచున్నాను.

విలాసము : 36, Jalan Dato Klana,
Seramban, N. Sembilan.



పేరు : పి. ఎం. సుందరం

పుట్టిన తేది : 1946 సంవత్సరం

వృత్తి : House Developer

విద్య : B.Sc. (Andhra University)

సమూహ సేవ : కార్యదర్శి, మలేషియా. ఇండియన్ కాంగ్రెస్,
Hutanmelintan Beanch.
మలేషియాంధ్ర సంఘ : సహాయ అధ్యక్షులు.

విలాసము : 85G. Jalan Changkat Jonu
Teluk Anson, Perak, Malaysia.





పేరు : పి. ఎస్. సుబ్రమనియం

పుట్టిన తేది : 7-10-1927

వృత్తి : వ్యాపారము

సమూహ సేవ; బహాన్ సహకార సంఘ అధ్యక్షులు. దేవాలయ కార్యవర్గ సభ్యుడు, కార్యదర్శి మరియు మలేసియా అంధ్ర సంఘ నెగ్రిసెంబిలాన్ శాఖ అధ్యక్షులు, 1967-1977 వరకును.

విలాసము : P. S. Subramaniam
29, Kamporg Bahau, Ayerhitam Bahau.



పేరు : పి, యస్. రామానాయుడు

పుట్టిన తేది : 5-5-1942

వృత్తి : ఆంగ్లపాఠశాల ఉపాధ్యాయుడు

విద్యా : H. S. C., PLD.

సమూహ సేవ : గౌరవ కార్యదర్శి, మలేసియాంధ్ర సంఘ నెగ్రిసెంబిలాన్ శాఖ గౌరవ కార్యదర్శి : బహాన్ సర్వగుణ సహకార సంఘం.

విలాసము : 37, Taman Sornam
Bahau. Negrisembilan, Malaysia

పేరు : కలిగి పెంటప్పడు

వయస్సు : 41 సంవత్సరాలు

వృత్తి : మేస్త్రి

సమూహ సేవ : అధ్యక్షులు, కులువాంగ్ ఆంధ్ర సంఘ శాఖ MIC. సభ్యుడు. కార్యదర్శి, దేశాయ్‌కోట కార్మిక సంఘము.

విలాసము : Ladanc Kebun Rengan,
P. O. Box, 109.
Rengan, Johor.





పేరు : అప్పలనాయుడు S/o బంగారు

పుట్టిన తేది : 22-3-1942

వృత్తి : Land and Housing Develop

సమూహ సేవ : మలేసియా ఇండియన్ కాంగ్రెస్ సింపాంగ్ అంపాట్ శాఖకు కార్యదర్శి, సహాయ అధ్యక్షులు కాలం 1962 - 1980 వరకును: మలేసియా ఆంధ్ర సంఘ సింపాన్ అంపాట్ శాఖకు 1974 - 1976 వరకు దనాధికారి.

పేరు : పొంగలి కైలాసము

పుట్టిన తేది : 1940 వ సంవత్సరం

వృత్తి : మేస్త్రి

సమూహ సేవ : కోశాధికారి, కాలుకాంగ్ ఆంధ్ర సంఘ శాఖ, MIC. Member. అధ్యక్షులు PIBG అధ్యక్షులు లంబాక్ కోట దేవాలయానికి.

విలాసము : Lambak State, Kluang,
Johor, Malaysia.





పేరు : ఆర్, నారాయణ

పుట్టిన తేదీ : 13-5-1940 (పేరాక్)

వృత్తి : ప్రధానోపాధ్యాయుడు

విద్య : GCE, NT.,

సమూహ సేవ : నెగ్రిసెంబిరాన్ ఆంధ్ర సంఘ శాఖ అధ్యక్షులు బహౌన్ సర్వగుణ సహకార సంఘ కార్యవర్గ సభ్యులు.

విలాసము : No. 265, Taman ACBC, Bahau
N. Sembilan, Malaysia.

పేరు : పొలముసెట్టి లక్ష్మణ

పుట్టిన తేదీ : 25-6-1943 (బెలుక్కాన్స్పన్)

వృత్తి : ఉపాధ్యాయులు

విద్య : S.A.P., M.C.E.S.P.M.

సమూహ సేవ : సిగామట్ ఆంధ్ర సంఘ శాఖ కోశాధికారి. కార్యదర్శి PIBG, SRJK (T)

అభిరుచులు : చదువుట, పాటలు, భజనలు యోగాభ్యాసము,

విలాసము : Gomali State, Gemas,
N. Sembilan, Malaysia.





పేరు : పి. కుమార్

పుట్టిన తేదీ : 21-8-1960 (బోహూక్)

వృత్తి : విద్యార్థి (B.Com.)

అభిరుచి : సంఘసేవ, టెన్నీస్, చదువుట, సంగీతము, తెలుగు సినిమాలు.

విలాసము : Ladang Payalang
Batu Enam, Johore, Malaysia.



పేరు : దుప్పట్ల చిన్నయ్య

పుట్టిన తేదీ : 4-7-1938 (సిత్యవాన్)

వృత్తి : ఉపాధ్యాయులు

విద్య : L. C. E., ఉపాధ్యాయుల క్రమశిక్షణ (తెలుగు, తమిళ)

సమూహ సేవ : ఆంధ్ర సంఘ సిత్యవాన్ శాఖ కార్యదర్శి. భారతీయుల మరణ సహాయనిధి కంపోంగ్ డ్రాలిక్ - అధ్యక్షులు.

విలాసము : 81, Kampongdralik, Sitinwan,
Perak, Malaysia.



పేరు : డాక్టర్ ఎస్. నాగయ్య

పుట్టిన తేదీ : 27-7-1948 (టెలుక్కాన్స్)

వృత్తి : డాక్టరు

విద్య : M.B.B.S. (Osmania)

సమూహ సేవ : Doctor in General Hospital, Serambon, Life Member, Andhra Asson. of Malaysia.

విలాసము :- 706, Rasah Road, Seramban, N. S. Malaysia.



పేరు : ఆర్. సిమ్మాద్రిరి

పుట్టిన తేదీ : 12-1-1353 (సిత్యవాన్)

వృత్తి : MCIS. డెవలప్‌మెంట్ ఆఫీసరు, సిత్యవాన్.

విద్య : నాల్గవ ఫారం

కాలక్షేపం : బంతాట, చేపలు పట్టుట, దొడ్డి పని చేయుట.

విలాసము : 402, Kampong Bintarg
Perak, Malaysia.



పేరు : అయినిల్లి అప్పన్న

పుట్టిన తేదీ : 1930 (పేరాక్)

సమూహ సేవ : ఫెల్ క్రా ఆయర్ ఈతాం కోపేల కమిటీ బహాన్ సహతార సంఘ కార్యవర్గ సభ్యులు.

విలాసము : 20, Kampong, Bharun. Ayer Hiton,
Bahau, N. S., Malaysia.



పేరు : ఎస్. రాములు

పుట్టిన తేదీ : 18-8-1953 (సిత్యవాన్)

వృత్తి : M.C.I.S. డెవలప్‌మెంట్ ఆఫీసరు.

విద్య : M. C. E.

కాలక్షేపము : బంతాట, బాడ్మెంటన్, చేపలు పట్టుట, టెలివిషన్.

విలాసము : Ladang Pundut,
Sitiawan, Perak, Malaysia.



పేరు : ఎ. నారాయణ మూర్తి

పుట్టిన తేది/స్థలం : 7-3-1942 రవాంగ్ S.L.

విద్య : 7 వ తరగతి తెలుగు

వృత్తి : వ్యాపారము

సమూహ సేవ : రవాంగ్‌లో ఆంధ్ర సంఘ శాఖకు కోశాధికారి.

బహుమతులు : హాస్య నాటకాలు వేసి బహుమతులు అందుకున్నారు.

విలాసము : No. 7, Jalan Welman, Rawang S.L.
Sy. M.A.N.S., Lachimy Vilas.

పేరు : బుద్ధ అప్పలనాయుడు, PJK.

పుట్టిన తేది/స్థలం : 23-4-1921 ఇండియా (అనకాపల్లి)

విద్య : తెలుగు/తమిళము/ఆంగ్లము నార్మల్ ట్రైయిండు

వృత్తి : రిటైర్డు హెడ్మాస్టరు

సమూహ సేవ : దేవాలయములను, ఇండియన్ కాంగ్రెస్‌లోను, ఆంధ్ర సంఘములలోను, అనేక సంవత్సరాలుగా ఉండి, ఉన్నతస్థితికి కృషిచేయుట.

బిరుదులు : కెడా రాజ్యాధిపతి మూలముగా PJK. అను బిరుదు.

కాలక్షేపము : ఆంధ్ర ప్రజల, తెలుగు బాషాభివృద్ధికి కృషి.

విలాసము : B. M. Appala Naidu, P.J.K.
No. 18, Rumah Murah Lunas,
Lunas, Kedah.

పేరు : ఆర్. పైడి నాయుడు లేదా ఆర్. పి. నాయుడు

పుట్టిన తేది/స్థలం : 10-6-1945 పెరాక్

విద్య : తెలుగు VII, తమిళం VII, ఇంగ్లీషు 4 వ ఫారం

వృత్తి : Blueyalley Tea & Coffee Agent, వ్యాపారము.

సమూహ సేవ : ఆంధ్ర సంఘము సిలంగూర్ శాఖ ఉపాధ్యక్షులు, MTSU, NUTE కమిటీల ఉపాధ్యక్షులు.

విలాసము : 9-15, Block B, Jalan Shaw,
Kuala Lumpur, Malaysia.

పేరు : కె. ఎ. అప్పన్న

పుట్టిన తేది/స్థలం : 11-1-1956, Bagan Dalih, Perak.

విద్య : M.L.E.

వృత్తి : వ్యాపారము. కాగితం, ముద్రణ, టైప్‌రైటర్ల రిపేరింగ్.

సమూహ సేవ : రెండవ ప్రపంచ తెలుగు మహాసభల చిత్రోత్సవ కార్యదర్శి,
మలేసియా ఆంధ్ర సంఘ సెలాంగూర్ శాఖ కమిటీ సభ్యులు.

కాలక్షేపము : సినిమాలు చూడటం, పుస్తకపఠనం.

విలాసము : 198, 3¾ mile, Jalan Sungai,
Off Jalam, Gambak, Kuala Lumpur.

పేరు : డా॥ డి. దయానంద

పుట్టిన తేది/స్థలం : 23-6-1941 Teluk Anson

విద్య : M.B.B.S. (Madras) D.M.R.D. (London)

వృత్తి : డాక్టరు (రేడియాలజిస్టు)

సమూహ సేవ : PAM, సుజనా కో-ఆపరేటివ్, EWRI

విలాసము : 122, Lorong Zaaba,
Tamantun Dr. Ismail,
Damansara K. L.

పేరు : ఎ. అప్పన్న —లేదా— ఎ. ఎ. నాయుడు

పుట్టిన తేది/స్థలము : 24-5-1948 బాగన్ పంట్ ఎస్టేటు

విద్య : Bachelor of Social Sciences (Hons)

వృత్తి : మలేసియన్ అడ్మినిస్ట్రేటివ్ & డిప్లొమాటిక్ ఆఫీసరు.

సమూహసేవ/పదవులు : AAM గౌరవ సహాయ కార్యదర్శి 1979-80.
సుజన కో-ఆపరేటివ్ సొసైటీసహాయ కార్యదర్శి 1981.
ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభల నిర్వాహక కార్యదర్శి 1981.

పేరు : ఎస్. మత్తయ్య నాయుడు

పుట్టిన తేది/స్థలము : 4-5-1949 పెలమ్ ఎస్టేట్ KBPAH

విద్య : STD=SIX

విలాసము : 78, Chamang Baru Bentong,
Pahang.

పేరు : ఎన్. అప్పల స్వామి

పుట్టిన తేది/దేశం : 1926 ఇండియా

బిరుదులు : PPN

విలాసము : Meraw Estate
Kolim, Kedah.

పేరు : విజయన్ సన్నాసి

పుట్టిన తేది/స్థలము : 1-1-1941 కోల లంపూర్ ఎస్టేటు

విద్య : M.B.B.S. (Osmania) D.M.R.D. (London)

వృత్తి : డాక్టర్ (రేడియాలజిస్టు)

సమూహ సేవ : PAM ఉపాధ్యక్షులు, సుజన అధ్యక్షులు.

కాలక్షేపము : చదవటం, చేపలు పట్టటం.

విలాసము : No. 1, Jalam Enans,
Taman Seputch,
Kuala Lumpur.

పేరు : ఆర్. అలగర్

పుట్టిన తేది/స్థలము : 9-3-1951 పెరాక్

సమూహ సేవ : శ్రీ వేంకటేశ్వర దేవాలయం కమిటీ సభ్యులు.

విలాసము : Murugan Enterprises, No. 62,
Kampong Telugu Baru, Sangai Sumun,
Hutan Melintang, Perak.

పేరు : పి. యం. మరయ్య

పుట్టిన తేది/స్థలము : 16-9-1952 పెరాక్

సమూహ సేవ : శ్రీ వేంకటేశ్వర దేవాలయం కోశాధికారి.

విలాసము : Murugan Enterprises, No. 62,
Kampong Teluk Baru, Sangai Sumun,
Hutan Melintang, Perak.

## మలేషియా
## ఆంధ్రులు ఆర్థికంగా బలపడి
## ఆస్తిపాస్తులతోను
## ఇళ్ళు వాకిళ్ళతోను
## తులతూగాలని
## ఆరంభించబడినది



# సుజనా సహకార సంఘము



వివరములకు

SYARIKAT KERJASAMA SERBAGUNA SUJANA
1951 JALAN PEEL
KUALA LUMPUR, MALAYSIA

అని వ్రాయండి

UDAYA ENTERPRISES, HYDERABAD-500 004. A.P.